# శ్రీకృష్ణభారతి

– వ్యాస, పోతనల భాగవత దశమస్కంధములు
ఒక తులనాత్మక పరిశీలన –

బెనారస్ హిందూ విశ్వవిద్యాలయము నుండి
తెలుగులో "పిహెచ్. డి" డిగ్రీ పొందిన
సిద్ధాంత గ్రంథము - 1986

'తెలుగు విశ్వవిద్యాలయ ఆర్థిక సహాయంతో ప్రచురితం'

ర చ యి త
డా॥ ధూళిపాళ ప్రభాకర కృష్ణమూర్తి
ఎమ్. ఎ.; పిహెచ్. డి.

SRI KRISHNA BHARATHI.

(A COMPARATIVE STUDY OF
BHAGAVATA DASAMA SKANDHA OF
POTANA AND VYASA)

BY
DR. D. P. KRISHNA MURTHY.

Published : MAY 1989.

Copies : 1000.

Title Art : BAPU

For Copies :

Smt. D. KRISHNAVENI
W/o Dr. D. P. KRISHNA MURTHY
M A, ph.D.
Krishnunipalem
(Via) Gokavaram-533 286.
E. G. Dt. A. P.

Press :
Maheswari Printing Press
Seetampet
Rajahmundry-533 104.

Cover Page :
Easwar Offset Printers
Rajahmundry-533 101.

PRICE : Rs. 60/-

# అర్పణము



నాకు జన్మమిచ్చి నయగారమునఁ బెంచి
ఇంత వానిఁ జేసి యిహము విడచి
పుణ్యలోక మరయఁ బోయిన "లక్ష్మీకాం
తమ్మ - బుచ్చయ" లకు నర్పణంబు.

— ధూళిపాళ ప్రభాకరకృష్ణమూర్తి

# మంది లో మాట

విష్ణుపాదోద్భవమైన గంగానదీ తీరమున, కాశీవిశ్వనాథుని సన్నిధానమున, పండితమాలవీయుచే స్థాపింపబడిన హిందూ విశ్వవిద్యాలయమున, ఆచార్యవరేణ్యులు బి. వి. సూర్య నారాయణగారిచే సుప్రతిష్ఠితమైన తెలుగు విభాగమున, పరిశోధనావ్యాసంగము కొనసాగించు నవకాశము లభించుట మత్పూరాకృతసుకృతఫలము. నేను పరిశోధనచేయుట కవకాశ మును కల్పించిన బెనారస్ హిందూ విశ్వవిద్యాలయాధికారులకు కృతజ్ఞతలు.

ఉత్తర భారతదేశమున తెలుగు భాషకుసముచితమైన స్థానము లభించుటకై అహర్నిశలు కృషిసల్పుచు, నా యీపరిశోధనకు పర్యవేక్షణ నెరపిన అమృతహృదయులు, భాషాసేవకులు, ఆచార్యదేవులునైన బి. వి. సూర్యనారాయణగారి పాదారవింద ములకు అక్షరసుమార్చన గావించుచున్నాను.

నాయీ సిద్ధాంత గ్రంథమునకు పరీక్షకులుగా నుండి 'పిహెచ్. డి.' పట్టమునొసంగుట కర్హమైనదిగా నిర్ణయించుటయే గాక నాకుగల 'అర్హత' ను ప్రకటించిన ఆచార్య చల్లా రాధా కృష్ణశర్మగారికి, 'సహృదయ సమీక్ష' నందించిన ఆచార్య జోస్యుల సూర్యప్రకాశరావుగారికి కృతజ్ఞతాభివందనములు.

కన్నబిడ్డవలె నన్నాదరించి, కన్నతల్లిని మరపించిన మాతృమూర్తి శ్రీమతి డాక్టర్ బి. రత్నావళిగారికి నమస్సుమాంజలి.

నా యీ పరిశీలన గ్రంథము నవలోకించి తాము పరితోషమునంది నాకు 'పరితోషము' నందించిన కళాప్రపూర్ణ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారికి, 'శ్రీకృష్ణభారతి వివేకవతి'గా నభివర్ణించిన ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారికి,

'సమీక్ష' గావించిన ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారికి కృతజ్ఞతాక్షర సుమాంజలి.

నేను డాక్టరేట్ పట్టమునందితినని ఎఱింగి, నాడు 'అక్షరాశీస్సు' లొసంగిన కీ. శే. రావూరి వేంకటేశ్వర్లుగారికి శ్రద్ధాంజలి.

ఆర్థికసహాయము నొసంగి నా పరిశోధన గ్రంథము ప్రచురింపబడుటకు సహకరించిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి ప్రత్యేక కృతజ్ఞతాభివందనములు.

మేలు ప్రతిని తయారుచేయుటలో సహకరించిన మిత్రులు చింతలపూడి వేంకటేశ్వర్లు, జి. ఎస్. భాస్కరరావుగార్లకు గ్రంథప్రచురణకు సమూల్యసలహాల నందించిన ఆప్తమిత్రులు డా॥ అరిపిరాల నారాయణరావుగారికి కృతజ్ఞతలు.

ముఖచిత్రమును నయనానందకరముగా చిత్రించిన కళాతపస్వి 'బాపు' గారికి, గ్రంథమును చక్కగా ముద్రించిన మహేశ్వరి ప్రింటింగ్ ప్రెస్ అధినేత ఎ. వి. చలపతిరావుగారికి, కవర్ పేజీని చూడముచ్చటగా ముద్రించిన ఈశ్వర ఆఫ్‌సెట్ ప్రింటర్స్‌కు కృతజ్ఞతాభివందనములు.

పరిశోధన సమయమున చేదోడు వాదోడుగా నిలచిన కాశీవాస్తవ్యులు శ్రీ ఇ. ఆర్. కె. శాస్త్రి, డి. వేణుగోపాల్, డా॥ ఆర్.ఎస్. మిశ్రా ప్రభృతులకు, మిత్రులు బి. భాస్కరరావు చామర్తి పేరరాజు దంపతులకు, పరిశోధనకు అనుమతిని ప్రసాదించిన పశ్చిమ గోదావరి జిల్లాపరిషత్ అధికారులకు, ఇంకను ప్రత్యక్షముగ పరోక్షముగ సహకరించిన ఎందరో మహానుభావులు అందరికిని కృతజ్ఞతాభివందనములు.

— కృష్ణమూర్తి

# పరితోషము



కళాప్రపూర్ణ

**మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి**

రాజమహేంద్రవరము.

శ్రీకృష్ణభారతి - వ్యాసపోతనల భాగవత దశమ స్కంధములు : తులనాత్మక పరిశీలనము డా॥ ధూళిపాళ ప్రభాకర కృష్ణమూర్తిగారి గ్రంథము యథాశక్తి సమగ్రముగా అవలోకింపగలిగితిని.

ఇది కేవలము 'పట్ట' సంపాదనమాత్రమునకుఁ బరిమితముగాఁ జేసిన పరిశ్రమము కాదు. అనేక ఘట్టములలో కూలంకషమైన మూలానువాదసమీక్ష యీపరిశీలనగ్రంథమునకు ఒక ప్రత్యేకతను తెచ్చుచున్నది.

సర్వత్రి నా హృదయమును పరితోషపఱిచిన పరిశీలన గ్రంథమిది.

"దశమస్య విశుద్ధ్యర్థం నవానామిహ కల్పనమ్" భాగవతమునకు ఆత్మస్థానము దశమస్కంధము. పోతనగారి "రసకవిత్వసృష్టి" ఈ స్కంధమున బహురమణీయమై లోకోత్తరమైన ఆనందమును గలిగించును. తెలుఁగువారికి, పోతన పద్యములు జిహ్వాగ్రమున నర్తించునవి; ఆంధ్రుని జీవధారలో విలీనమైప్రవహించు నొకానొక అవ్యక్తమాధురి ఆ పద్యములకు ఆజానజము.

ఈ గ్రంథములో, పోతన యనువాద విధానము అమూలకములు, యథామూలములు, మూలప్రాయములు సోదాహరణ రమణీయముగాఁ బరిశీలితములైనవి. భక్తితత్త్వము, కవిత్వతత్త్వము తలస్పర్శిగా సమీక్షింపబడినవి.

సునిశితపరిశీలనముతో, చరితార్థతగడించిన డా॥ ప్రభాకర కృష్ణమూర్తిగారి ఉత్తరోత్తరాభ్యుదయమును ఆకాంక్షించుచు, హార్దమైన నా అభినందనము తెలుపుచున్నాను.

"సమానానాముత్తమశ్లోకోఽస్తు !"

(సం.) మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

రాజమహేంద్రవరము
శుక్లచైత్రశుక్ల ద్వాదశి
17-4-89



# ఆశీస్సు - అభిప్రాయము

ఆచార్య బి. వి. సూర్యనారాయణ
ఎం. ఏ (తెలుగు, సంస్కృతం, హిందీ) పిహెచ్. డి.
అధ్యక్షుడు (రిటైర్డు); తెలుగు విభాగము
కాశీ హిందూ విశ్వవిద్యాలయం
వారణాసి-221 005.

శ్రీమద్భాగవతమునందలి దశమస్కంధము ఒక విశిష్ట స్థానమును సంతరించుకొన్న భాగమగుట విద్వజ్జనులెల్లరు నెరింగిన విషయమే. విశ్వసాహిత్యక్షీరవారాశినుండి పోతనమహాకవి మనకందించిన అమృతకలశమే ఆతని ఆంధ్రమహాభాగవత గ్రంథము.

సంస్కృతమూలమును అపూర్వమగు ఆంధ్రానువాదమును చిత్తశుద్ధితో పక్షపాతరహితమును యథావద్వస్తుసందర్శన మాత్రతత్పరమును అగు గవేషణాసక్తితో తులనాత్మకముగ పరిశీలించి ఈ పరిశోధనగ్రంథమును వెలయించిన చిరంజీవి ధూళిపాళ ప్రభాకర కృష్ణమూర్తి.

భాగవతగ్రంథమునెడ భక్తశిఖామణియగు పోతనకుగల భక్తిశ్రద్ధలెట్టివో ఏతద్గ్రంథపరిశోధనకార్యమునందు ప్రభాకర కృష్ణమూర్తికిగల భక్తితాత్పర్యములట్టివి అన్నచో అతిశయోక్తి కాంజాలదు.

'విద్యా దదాతి వినయం వినయాద్యాతి పాత్రతామ్' అన్న నానుడికి చిరంజీవి కృష్ణమూర్తి జీవనసరణి చక్కని చిక్కని ఉదాహరణము.

సంస్కృత పురాణేతిహాసముల ఆంధ్రానువాదములు అనువాదమాత్రములు గాక మౌలికగ్రంథములుగ భాసించు

చుండుననియు, పోతన భాగవతానువాదము మూలాతిశాయియై యుచ్చుట గొల్పుచుండుననియు చిరకాలమునుండి పరంపరగ వచ్చుచున్న అభియుక్తోక్తులు.

ఇవే పలుకులను పదేపదే పాడిపాడి, ఉంకించి తలపంకించి ఊరకుండుటకంటె మూలమునుండి ప్రతిశ్లోకమును గ్రహించి అనువాదమును దానితో పోల్చి పై ఉక్తులకు సార్థక్యమునేగాక పుష్టినిగూడ చేకూర్చుటయే ఈపరిశోధకుని ఆశయము. ఘట్టములనే గాక ప్రత్యేక శ్లోకములనుకూడ గ్రహించుటమాత్రమే కాదు. పెక్కుతావుల శ్లోకపాదములను, కొన్నిపదములనుకూడ గ్రహించి సౌజన్యముతో నిష్పక్షబుద్ధితో నీతడు గావించిన తులనాత్మక పరిశీలనము వివరణమునందేగాక గుణమునందును మిన్నయై అభినందింపదగియున్నది.

చిరంజీవి కృష్ణమూర్తి రచించిన ఈ విమర్శగ్రంథమును పఠించుటవలన తెలుగు అనువాదముల మౌలికతయు, పోతన అనువాద వైశిష్ట్య వైభవమును వెల్లడియగుటతోబాటు వ్యాస పోతనలయందును, వారి రచనలయందును, భాగవతదశమ స్కంధమునందును సద్విమర్శనా ధోరణులయందును శ్రద్ధాసక్తులుపెంపొందింపబడి పాఠకులచిత్తవృత్తులు పరిష్కృతములును, పరమానంద రసాప్లావితములును కాగలవని నా విశ్వాసము.

సద్విమర్శన గ్రంథములను వెలయించుటలో సాఫల్యము నందినందులకు చిరంజీవి కృష్ణమూర్తిని ప్రీతిపూర్వకముగ నభినందించుచు ఆతనికింకను ఎన్నో సత్కృతులను వెలయింపగల సామర్థ్యమును, ఉత్సాహమును పుష్కలముగ ప్రసాదింపవలసినదిగా సరస్వతీమాతకు చనవుతో మనవి చేయుచున్నాను.

'ఇతి శివమ్'

వారణాసి
19-6-88

(సం.) బి. వి. సూర్యనారాయణ

# అవతారిక

ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మ
ఎం.ఏ., పిహెచ్.డి.
అధ్యక్షుడు; తెలుగు విభాగము
మధురై కామరాజ్ విశ్వవిద్యాలయం
మధురై-625 021.

భారతీయ సాహిత్యంలో ప్రతిభాసించే మణిదీపికలు రామాయణ భారత భాగవతాలు. రామాయణ భారతాలు వేదతుల్యములుగా విఖ్యాతి సముపార్జించాయి. భాగవతానికి అలాంటి విశిష్టత లేకపోయినా, అది శ్రీమన్నారాయణుని కథా విశేషాదికాన్ని అభివర్ణించే ప్రశస్త గ్రంథం.

భాగవతం వ్యాస ప్రణీతమా కాదా అన్న సంశయం పండిత లోకంలో లేకపోలేదు. అది బోపదేవ కృతమని కొందరి నమ్మకం. భాగవతం పురాణమే అయినా, అది వేదసమ్మితమనీ మిత్రసమ్మితమనీ కాంతాసమ్మితమనీ బోపదేవుడు పేర్కొనడం గమనించదగిన అంశం. ఏది ఎలాఉన్నా, సంస్కృత సాహిత్యంలో రామాయణ భారతాలకు లభించినంత ప్రచారం భాగవతానికి లభించలేదు.

అయితే తెలుగు భాగవతం ఇందుకు అపవాదం. తెలుగు వారికి బమ్మెర పోతనామాత్యుని కృతి పరమ ప్రీతిపాత్రమైన గ్రంథం. తెలుగు భారతరామాయణ భాగవతాలలో భాగవతమే రసవద్రచనమని భావించే తెలుగువారు కొందరు లేకపోలేదు. తెలుగు పాఠకలోకానికి పోతన ఆరాధ్యుడన్నా అతిశయోక్తి కాదు. ఆయనలో ఒక మహాభక్తునీ, సహజకవినీ, విశిష్టవ్యక్తినీ

మనం చూడగలుగుతున్నాము. ఏవంగుణ విశిష్టుడు కావడంవల్లనే పోతన ప్రజాకవి కాగలిగాడు.

వ్యాస, పోతనల భాగవతదశమస్కంధాలను తులనాత్మకంగా పరిశీలించే సద్గ్రంథం శ్రీకృష్ణభారతి. అయిదు అధ్యాయాల ఈ సిద్ధాంత గ్రంథంలో భాగవతపురాణ ప్రాశస్త్యం, పురాణ వాఙ్మయంలో భాగవతానికిగల స్థానం, అనువాద విధానం, పోతన వ్యాసుణ్ణి అనుసరించిన ఘట్టాలు, నవవిధభక్తులు వాటి ప్రాధాన్యం, పోతన శైలి వర్ణనలు మొదలైన పెక్కు విషయాలు అందాలు దిద్దుకున్నాయి.

తులనాత్మక పరిశీలనం మన విశ్వవిద్యాలయాలలో ఇంకా శైశవావస్థలో ఉన్నది. తులనాత్మకపరిశీలనం పర్యాప్తంగా కొనసాగినప్పుడే, ఆయా భాషలలోని ఉత్కృష్ట రచనల వైశిష్ట్యం పాఠకలోకానికి చక్కగా తెలియవస్తుంది. కాగా శ్రీకృష్ణ భారతికి మంచి ప్రచారం లభించగలదని భావిస్తున్నాను.

వ్యాసుడు తత్త్వవేత్తగా దర్శనమివ్వగా పోతన మహాకవిగా పౌరాణికుడుగా దర్శన మిస్తాడు. నారదాదేశం అనుసరించి వ్యాసుడు భాగవతరచనకు ఉపక్రమించగా, ఆనాటి మత సాంఘిక సాహిత్య పరిస్థితుల్ని పురస్కరించుకుని పోతన రచన సాగించాడు. ఆసక్తికరములైన యిలాంటి విషయాలను రచయిత ధూళిపాళ ప్రభాకర కృష్ణమూర్తిగారు తమ రచనలో తెలియజేశారు. భాగవత పురాణాన్ని తెలుగువారికి నచ్చేవిధంగా రచన చేసిన పోతన ప్రతిభాసంపత్తిని వేనోళ్ళ కొనియాడక తప్పదు.

డాక్టర్ ప్రభాకర కృష్ణమూర్తిగారు ఈ కోవకు చెందిన రచనలుచేసి తులనాత్మక సాహిత్యాన్ని పరిపుష్టం చేయగలరని నా నమ్మకం. అందుకు తగిన అర్హత ఆయనకి ఉన్నది.

మధుర (సం.) చల్లా రాధాకృష్ణశర్మ

15-2-89

# శ్రీకృష్ణభారతి వివేకవతి

ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం
ఎం. ఏ; పిహెచ్. డి.
అధ్యక్షుడు; 'తెలుగుసాహితి' (తెలుగువిభాగం)
హైదరాబాదు విశ్వవిద్యాలయం. హైదరాబాద్-500 001.

వెయ్యేళ్ళ ఆంధ్రసాహిత్యంలో ఒక్కకవిని ఎన్నుకోమని తెలుగువారిని కోరామనుకోండి. నిస్సంశయంగా బమ్మెరపోతనను ఎన్నుకొంటారు. ఎందుకు ఎన్నుకొన్నారని ప్రశ్నించామనుకోండి. శ్రీమదాంధ్రమహాభాగవతం రచించాడని తడవుకోకుండా చెపుతారు. భాగవతంలో ఒకస్కంధాన్ని వినాలని నియమంపెడితే తెలుగువారు దేనిని ఎంచుకొంటారు ? చాలమంది దశమ స్కంధాన్ని వినటానికి ముందుకు వస్తారు. కారణమేమిటని ప్రశ్నిస్తే అందులో శ్రీకృష్ణబ్రహ్మతత్వం ప్రతిపాదింపబడిందని గాని, రసరూపుడైన శ్రీకృష్ణపరబ్రహ్మ భక్తిగా ప్రవహించి పరమార్థం పఠితలకందించాడనిగాని సమాధానం చెపుతారు. భాగవతపురాణానికి అంతరాత్మ దశమస్కంధం. రామాయణ కావ్యంలో సుందరకాండఎటువంటిదో శ్రీమద్భాగవతంలోదశమ స్కంధం అటువంటిది. శ్రీకృష్ణుని బాలప్రౌఢ లీలలుగా గోచరించే దశమస్కంధ కథాగాథలు మానవజీవితంలోని ఆధ్యాత్మిక ఆత్మ శక్తుల అభివ్యక్తులుగా పఠితలకు ప్రత్యక్షమౌతాయి. వానిని మననం చేసుకొనటానికి మహనీయావకాశం లభిస్తుంది. అందువల ననే మిత్రులు డాక్టర్ ధూళిపాళ ప్రభాకర కృష్ణమూర్తి సంస్కృతాంధ్రభాగవతదశమస్కంధాల తులనాత్మక పరిశీలనాన్ని పరిశోధనాంశంగా ఎన్నుకొన్నట్లుగా కనపడుతున్నది.

వ్యాసమహర్షి తత్త్వసాగరం; బమ్మెర పోతనభక్తిప్రవాహం. సాగరజలం మేఘమై గిరిపై వర్షించి ప్రవాహంగా మారుతుంది; నీరు సాగరానిదైనా తనదైన తిపిదనంతో ఏరుగా ప్రవహించి

జీవిస్తుంది ప్రవాహం. సాగరంలోని లవణం లేదు ప్రవాహంలో. ఏరులోని జలం సాగరజల రూపాంతరం. బమ్మెరపోతన భాగవత రచనంకూడా అంతే. వ్యాసునిహృదయం; లేదా భాగవతతత్త్వం సహజకవితాప్రవాహరూపుడైన పోతనలో స్రవించింది. వ్యాస హృదయమే పోతన పరమార్థంకాని, పోతన భక్తికవితావేశమే భాగవత జీవితం. ఈ తాత్పర్యాన్ని డాక్టర్ కృష్ణమూర్తిగారు స్పష్టంగా, నిర్ద్వంద్వంగా, నిశ్చయంగా ఇలా తేల్చి చెప్పారు- "వ్యాసుడు కేవలము పౌరాణికుడు. పోతన పౌరాణికుడేకాక భావుకుడు, కవి. వ్యాసుడు ప్రధానముగ తాత్త్వికుడు. పోతన భక్తుడు. వ్యాసునిది పురాణరచన. పోతనది ప్రబంధచ్ఛాయలో సాగిన పురాణరచన... భక్తితత్త్వ ప్రతిపాదనములో మూలానువాదములు రెండును సమానమైనను, పోతనభక్తియోగి, భాగవతోత్తముడునగుటచే నతని భాగవతములోని భక్తితన్మయత ఎట్లు పరాకాష్ఠ చెందినదో సోదాహరణముగ వివరింపబడినది. పోతన భాగవతము మూలమును మించిన ప్రశస్తి పొందుటలోని మర్మమిదియే."

సాహిత్య పరిశోధనలో తులనాత్మక పరిశీలనం ఒకవిశిష్ట శాఖ. అందులోనూ అనువాదకావ్యాలపట్ల తులనాత్మక పరిశీలనం సాగించేపద్ధతి అందులోని మరొక చిన్నకొమ్మ. ఆంధ్రసాహిత్య పరిశోధనలో కడచిన పదేళ్ళుగా సాగుతున్న పరిశోధనలలో గమనింపదగిన ముఖ్యాంశం ఒకటి ఉన్నది. సాహిత్యయుగాలపై పరిశోధనలు, ప్రసిద్ధకావ్యాలపై, కవులపై, ప్రక్రియలపైజరిగే పరిశోధనలు ఈదశాబ్దంలో తక్కువ. ఏదైనా ఒక పరిమితమైన అంశంమీద గాఢంగా పరిశోధనచేసే ప్రవృత్తి బాగా వ్యాపించింది. పరిశోధన పరిణామంలో ఇది సహజం కూడా. డాక్టర్ ధూళిపాళ ప్రభాకర కృష్ణమూర్తిగారి పరిశోధన ఈపరిణామంలో ఒక భాగంగా గోచరిస్తున్నది.

డాక్టర్ ధూళిపాళ శ్రీరామమూర్తిగారు ఆంధ్ర భాగవతపురాణం మీద పరిశోధనం చేశారు. అలాగే మరికొందరు కూడా గ్రంథాలు వ్రాశారు; బృహద్వ్యాసాలు వ్రాశారు. వారెన్నో సమన్వయాలను ప్రతిపాదించారు. ఆతరం గడిచింది. మరోతరం వచ్చింది. ఈతరంలో మరలా డాక్టర్ ధూళిపాళ ప్రభాకర కృష్ణమూర్తి ప్రభృతులు పరిశోధనలు చేస్తున్నారు. డాక్టర్ కృష్ణమూర్తి భాగవతంలోని దశమస్కంధాన్నే ఎన్నుకొన్నారు; అందులోనూ వ్యాసపోతనల రచలను తులనాత్మకంగా పరిశీలించటానికే పరిశోధనాంశాన్ని పరిసీమితం చేసుకొన్నారు. అందులోనూ 'అనువాదతత్త్వము, భక్తితత్త్వము, కవిత్వతత్త్వము' అనే తత్త్వత్రయాన్ని గాఢంగా పరిశీలించటానికి యత్నించారు. అంటే ఒక గ్రంథంలోని ఒకస్కంధంలోని ఒకపార్శ్వాన్ని పరిశీలించే ఆధునిక సాహిత్యపరిశోధన ప్రవృత్తికి ఇది ప్రాతినిధ్యం వహిస్తోంది ఇది కాలప్రభావం.

సిద్ధాంతవ్యాసకర్త ప్రతిపాదింప దలచుకొన్న ప్రధానాంశాన్ని నిరూపించేదిగా ఉంటుంది (ఉండాలి) రచనాప్రణాళిక. రచనాప్రణాళికను స్థూలంగా నిర్దేశిస్తుంది విషయసూచిక. ఈ గ్రంథ విషయసూచికను గమనిస్తే రెండుమూడు విశేషాలు కనపడుతున్నాయి. అవి పోతన అనువాదవిధానంలో అమూలకాంశాల నిరూపణంవలన ఆంధ్రభాగవత దశమస్కంధ స్వరూప స్వభావాలు మూలంకంటె భిన్నంగా వ్యక్తం కాగలవనే అభిప్రాయంతో ద్వితీయాధ్యాయరచనం సాగింది. భాగవతదశమ స్కంధంలో నవవిధ, ఏకాదశభక్తి భేదాలను పోతన ఎలా పోషించాడో తులనాత్మకంగా పరిశీలించటంవలన ఆంధ్రభాగవత వైశిష్ట్యం వ్యక్తంకాగలదనే ఉద్దేశ్యంతో చతుర్థాధ్యాయ రచనం సాగింది; కవిత్వతత్త్వావిష్కారానికి పూనుకొన్న పంచమాధ్యాయం కథాకథనశిల్పాన్నీ, వర్ణనాశిల్పాన్నీ, అలంకార, రసపోషణనూ, పాత్రచిత్రణనూ, శైలీవిన్యాసాన్నీ తులనాత్మకంగా

సమీక్షించింది. ప్రథమాధ్యాయం గ్రంథానికి పూర్వరంగంలా అమరింది. ఉపసంహారం గ్రంథతాత్పర్యాన్ని స్పష్టంచేస్తున్నది. మొత్తానికి గ్రంథప్రతిపాద్యాంశం ఏమని చెప్పటానికి వీలున్నదంటే దశమస్కంధం అమూలకాంశాలు అధికంగాఉన్న అనువాదం; అందులో భక్తితత్త్వం ప్రపంచితమైనది; దాని కనువైన కవితా శైలి అందులో నిబంధింపబడింది- అని

డాక్టర్ ప్రభాకరకృష్ణమూర్తిగారి పరిశోధన ఫలితాంశా లను ఈక్రింది విధంగా పేర్కొనవచ్చు. (వారిమాటల్లోనే)

1. "పురాణానువాదమైనభాగవతముకూడప్రధానముగా కథానువాదము గావలసియున్నను, పోతన భావానువాదకు లలో సర్వోత్తముడనియు, భావుకతాదృష్టితో పరిశీలించినచో నాంధ్రకవులలో నగ్రగణ్యుడనియు చెప్పవచ్చును. పోతన భావానువాదము సహితము స్వతంత్రధోరణిలోనే సాగినదిగాని పూర్తిగా మూలానుసారముగాదు. పోతనచూపిన స్వతంత్రత మూలమును సంగ్రహించుట యందును, నవ్యథాకరించుట యందునుగాక కొలదిగా కథాంశములయొక్కయు, ప్రధానముగా రసభావములయొక్కయు స్వరూపవిస్తారములయందు మూలమున కానరాని విశిష్టతను ప్రదర్శించుటలో కాననగును." (పు. 61)

2. భాగవత ప్రతిపాదిత నవవిధభక్తులకు దశమస్కంధము వ్యాఖ్యాగ్రంథమై, లక్ష్యలక్షణగ్రంథమై యలరారు చున్నది. అందున నతివిస్తృతముగ ప్రతిపాదింపబడిన దాస్య, సఖ్య, ఆత్మ నివేదనములను మనోసంబంధ భక్తులచే భాగవతదశమస్కంధము భక్తికి ప్రతిరూపమైనది. అనువాదమున పోతనభక్తి పారవశ్య మున వ్యాసాతిశయముగ వెలువడిన దశమస్కంధము పఠితల నందరిని భౌతికబంధంబులనుండి మరల్చి యనంతభక్తిరసవాహిని నోలలాడించుచు బ్రహ్మానందమును కలిగించుచు నిత్యపారాయణ గ్రంథమై యలరారు చున్నది." (పు.278)

౩. "మూలమునం దాలంకారికమైన రచన క్వాచిత్కము, ప్రాసంగికముకాగా, అనువాదమునందు ప్రచురము, అనుపదమునై, యలరారుచున్నదని చెప్పవచ్చును. రోచకమై, స్పష్టత సారళ్యము కల్గినశైలియు పోతనరచనలో కానవచ్చుచున్నది. దీనినిబట్టి పోతన సాలంకృతమైన శైలిని ఆదరించువాడుగా మాత్రమేగాక సరళమైన శైలినిగూడ రోచకముగు రీతిని ప్రయోగించినవాడుగనే యతని భాగవతశైలినిబట్టి గుర్తింపగలము" (పు. ౩౫౯)

డాక్టర్ ప్రభాకర కృష్ణమూర్తిగారు తమ పరిశోధనాంశాన్ని ఎన్నుకొన్నప్పుడే అందులోని లోతుపాతులను గమనించి గ్రహించి ఉండిఉంటారు. తమ ఆసక్తిని, శక్తిని అంతా కలిపి కూడకట్టుకొని ఈ గ్రంథరచనను నిర్వహించారు. సంస్కృతాంధ్ర భాషా సాహిత్యాలలో వారికున్న పరిచయ పాండిత్యాలు పరిశోధనలో బాగా ఉపకరించాయి. భాగవతం మీద ఇంతకు పూర్వం పరిశోధనలుచేసి తమరచనలను ప్రకటించిన పండితుల గ్రంథాలన్నీ చదివారు. ఒక్కొక చోట కొందరి అభిప్రాయాలతో భేదించారు; కొందరి అభిప్రాయాలను సవరించారు. ఆత్మవిశ్వాసంతో రచన చేశారు. తాము చెప్పదలచుకొన్నది స్పష్టంగా, సరళంగా అస్పష్టత లేకుండా చెప్పారు. చెప్పిన ప్రతి అంశాన్ని సమర్థించుకొన్నారు. శాస్త్రపద్ధతిలో వ్రాసే సిద్ధాంత వ్యాసానికి ఇంతకంటె మరో లక్షణమైనపద్ధతి ఉండబోదని చెప్పటానికి అనువైనవిధంగా వ్రాశారు. అందుకు వారు అభినందనీయులు.

ప్రతి సిద్ధాంత వ్యాసానికీ (థీసిస్‌కీ) ఒక బాహిరమైన నిర్మాణం ఉంటుంది; ఒక ఆంతరమైన నిర్మాణం ఉంటుంది. బాహిరమైన నిర్మాణంలో విషయవిభాగం; విషయ విశ్లేషణం; గ్రంథనిర్మాణాంగాలు ప్రాధాన్యం వహిస్తాయి. వీనివలన వ్యాస నిర్మాణం శాస్త్రోక్తంగా ఉంటుంది. అయితే, ఇదియే సిద్ధాంత

వ్యాస సర్వస్వం కాదు. అంతర్నిర్మాణం దాని అంతశ్శక్తి. ఎన్నుకొన్న అంశం గురించి, అంతవరకు వెలువడిన విజ్ఞానాన్ని మథించి, ఏదో ఒక క్రొత్తదైన సమన్వయాన్నో, సాహిత్య సిద్ధాంతాన్నో సమర్థవంతంగా, తర్కసహంగా, లక్ష్యలక్షణ శుద్ధితో ప్రతిపాదించే ప్రజ్ఞ అంతర్నిర్మాణంలో గోచరమౌతుంది. పరిశోధకుని ప్రతిభ, పాండిత్యం, పరిశోధకవ్యక్తిత్వం అందులోనే ఆవిష్కృత మౌతాయి. అవియే వాటి విలువలను వివేచిస్తాయి.

డాక్టర్ ధూళిపాళ ప్రభాకర కృష్ణమూర్తిగారి సిద్ధాంత గ్రంథస్వభావం దాని అంతర్నిర్మాణశక్తిమీద ఆధారపడి ఉన్నది. తులనాత్మక పరిశీలనం ఇందులో పాటింపబడిన పరిశోధనపద్ధతి. మూలగ్రంథాన్ని, అనువాదగ్రంథాన్ని పోల్చిచూచి ఫలితాంశాలను నిర్ణయించటం ఇందులో పాటించబడిన విధానం. మొత్తం అనువాద పద్ధతిని అనుశీలించిన తరువాతనైనా పోతనగారిది అనువాదం అనిపిలిచే పద్ధతికంటె విలక్షణమైనదనో, లేదా ఇది తెలుగులో పునర్నిర్మాణం వంటిదనో పరిశోధకుడు ప్రతిపాదింపదలచుకొన్నట్లయితే ఈ సిద్ధాంతగ్రంథం మరొకరకంగా ఉండేది. నలిగిన బాటలో నడచారు డాక్టర్ కృష్ణమూర్తిగారు. అందువలన ఈసిద్ధాంతవ్యాసం విశ్లేషణ ప్రధానమే అయిపోయినది. వినూత్న సమన్వయప్రతిపాదనాత్మకం కాలేకపోయింది. అందువలననే ఎన్ని ఉదాహరణలిచ్చి, ఎన్నివిశేషాలు చెప్పినా పూర్వులు చెప్పినదానికంటె క్రొత్తగా చెప్పిన అంశాలేవి ? అన్వయాలేవి? అని పఠిత అన్వేషించుకొనవలసిన అవసరం మిగిలిపోయింది. అట్లని ఈరచనను తక్కువ అంచనావేయటంలేదు. విశ్లేషణాత్మకసిద్ధాంత వ్యాసాలలో 'శ్రీకృష్ణ భారతి' విశేషపఠి.

హైదరాబాదు
11_3_1989

(సం.) జి.వి. సుబ్రహ్మణ్యం

# సహృదయ సమీక్ష



ఆచార్య జోస్యుల సూర్యప్రకాశరావు
ఎం. ఏ. (తెలుగు, హిందీ, సంస్కృతం) పిహెచ్.డి.
తెలుగు విభాగము
కాశీ హిందూ విశ్వవిద్యాలయము
వారణాసి - 221005.

'విద్యావతాం భాగవతే పరీక్షా' అని విద్వత్సూక్తి. అనగా పండితుల ప్రతిభాపాటవముల ప్రాకట్యమునకు భాగవతము పరీక్షాస్థానము. భారతము నర్థము చేసికొనుటకు శక్తి, రామాయణ స్వారస్యమును గ్రహించుటకు రక్తి, భాగవతమును భావగతమును చేసికొనుటకు భక్తి అత్యంతావశ్యకమని విపశ్చిద్వరుల వక్కణ. 'భక్త్యాభాగవతం జ్ఞేయా నవ్యుత్పత్త్యా న టీకయా' అని కదా ! ఆర్యోక్తి.

ప్రస్తుత కృతి జ్ఞానయోగియగు వ్యాసుని భాగవతము, భక్తియోగియగు పోతన భాగవతములందలి దశమస్కంధముల తులనాత్మక పరిశీలన. 'వ్యాసోనారాయణో హరిః' అని ప్రథితిగన్నవాడు వ్యాసుడు. ప్రధానముగ పౌరాణికుడు. పోతన పరమ భాగవతోత్తముడు. కేవల పౌరాణికుడేగాక పరమభావుక పట్టభద్రుడు. సహజకవి. వ్యాసుని రచనయందు తత్త్వకథనము ప్రధానము. భక్తిదాని ననుసరించుచుండును. పోతన కృతియందు భక్తిఅగ్రేసరము. కావ్యకళ తత్త్వప్రబోధము దానిననుసరించియే యుండును.

ఈ కృతిని రచించిన సుకృతి వర్ధిష్ణువు డా॥ ధూళిపాళ ప్రభాకర కృష్ణమూర్తిగారు 'తేజస్వినాం, నవయః సమీక్ష్యతే'

అను సూక్తికి తార్కాణగా గురుకుల క్లిష్టుడై సంస్కృతాంధ్రములందు సమ్యక్ జ్ఞాన సమంచితుడయినవాడు. పిహెచ్. డి. పట్టమునకై పరిశోధన నిమిత్తము సమస్త విద్యలకు కాణాచి కాశి చేరినవాడు. పసిడికి పరిమళమబ్బినట్లు వారి పర్యవేక్షణభారమును వహించినది పంచభాషా ప్రవీణులు పండితవర్యులునగు ఆచార్య శ్రీబయ్యా వెంకట సూర్యనారాయణమూర్తి గారు. వారు బనారస్ హిందూవిశ్వవిద్యాలయముఆంధ్రశాఖకు ఆదిపీఠాధిపతులు. భీష్మాచార్య స్థానీయులు. వీరి స్వయం ప్రతిభకు తోడు వారి చకకని సారథ్యమును సహాయముకాగా స్వయంసంపూర్ణముగా వెలువడినదీసిద్ధాంత గ్రంథము. 'స్థానేషు శిష్యానివహైర్వినియుజ్యమానా విద్యాగురుంహి గుణవత్తర మాతనోతి' అని కదా సూక్తి.

శ్రీప్రభాకర కృష్ణమూర్తిగారు ఈ గ్రంథమును ప్రాభవముతో పంచాధ్యాయ పరిమితముగా ప్రపంచీకరించినారు. ప్రథమాధ్యాయమున పురాణవాఙ్మయమును కాలానుసారము వర్గీకరించి కర్తృత్వాదికమును చర్చించి పురాణమహాత్త్వమును చాటి తదంతర్గతముగ భాగవతప్రాశస్త్యమును పచరించి తత్కర్తృత్వ నిర్ణయమునకు గడంగినారు. ఇది క్లిష్టతరమైన సమస్య. దానిని సోపపత్తికముగా నిర్ణయించుటలో వారి ప్రతిభా పాటవములు, క్షోదక్షమమైన పరిశ్రమ వ్యక్తమగుచున్నవి. పోతనభాగవత రచనా సందర్భమున నాటి రాజకీయ, మత, సాంఘిక, సాహిత్య పరిస్థితుల పర్యాలోచన వారి సమీక్షా విధానమునకు సర్వాంగీణత్వమును సమకూర్చుచున్నది. ద్వితీయాధ్యాయము పోతన అనువాద విధానము - అమూలకముల వివరణమును. పోతన అనువాద విధానము ప్రధానముగా అలంకార ప్రచుర భావాత్మక శైలిలో సాగినదని వీరి నిష్కర్ష. ఆంధ్రకవులు ప్రముఖముగా రాచికులు. కావున పోతన సాలంకృతమైన శైలిని రోచకమగు రీతిని ప్రయోగించి రచన సాగించినాడనుట అస్తవము కాదు. వాస్తవమే. వీరు అమూలకములను నిర్వచించి

వానిని వింగడించిన తీరు ఆహా! యనిపించుచున్నది. తృతీయా ధ్యాయములో యథామూలములు- మూలప్రాయములు అన్నది మూలము నందలి సొబగులు, వానిని పోతన యనువదించుటలో మౌలికతకు భంగము రాకుండా నెట్లు స్వాయత్తము చేసికొన్నది నిపుణతతో తీర్చిదిద్దినారు. చతుర్థాధ్యాయము ఈకృతికి హృదయ స్థానీయమైనది. 'రతిర్దేవాది విషయా భక్తిరిత్యభిధీయతే' అన్నారు పెద్దలు. నవవిధ భక్తియని నానాపురాణనిగదితమైనప్పటికి నారద భక్తి సూత్రములనుబట్టి ఏకాదశ భక్తిరీతులు భాగవతోదా హరణలతో ప్రదర్శించిచూపి తమ పాండిత్యమును పరిశీలనా శక్తితో జోడించి ప్రశంసార్హులైనారు గ్రంథకర్త. పంచమాధ్యా యము వ్యాస పోతనల కవిత్వతత్త్వమును ప్రతిపాదించునట్టిది. తులనాత్మక విమర్శయనగానే ఇరువురి యందును గోచరమగు పోలికలను పుక్కిటబట్టి చెప్పుటమాత్రమే గాక యిరువురి మౌలికతను యిరువురి శిల్పము లందలి రమణీయతను చక్కగా ప్రదర్శించి చూపినారు సంస్కృతాంధ్రములతో పాటు హిందీ ఆంగ్ల గ్రంథములనుకూడ పెక్కింటిని శ్రమకోర్చి వారు పరిశీలించిన వైనము సూక్ష్మేక్షికతో చూచిన వెల్లడికాకమానదు. వ్యాసుని తీర్పును పోతననేర్పును చక్కగా సరళగ్రాంథిక శైలిలో యావిష్కరించిన డా॥ కృష్ణమూర్తిగారు బహుధా ప్రశంస నీయులు. భగవానుడగు హరి వీరికాయురారోగ్యైశ్వర్యము లొసంగి యిట్టి పునీత గ్రంథములింకను వీరిలేఖినినుండి వెలువరింప జేయగలరని నా శుభాశంసనము.

'పిబత భాగవతం రసమాలయం ।

ముహురహోరసికాభావిభావుకాః ॥

వారణాసి.

ఝూలికా పూర్ణిమ

22-8-89

విబుధ విధేయుడు

(సం.) జోస్యుల సూర్యప్రకాశరావు

ఆ వారాణసిలోన మేటియగు బయ్యావారి యాచార్యకం
బేవేళన్ గడురక్ష సేయ విధివద్వృత్తిన్ని పాలించి నీ
సేవన్ భాగవతంబుపైని నొకఁడౌ సిద్ధాంతమున్గూర్చినా
వాసూర్యంబును నానిశాకరము దీవ్యత్కీర్తి వర్ధిల్లుమా !

ఆంధ్రీన్స్వైరువహించి పాండితిని భవ్యంబైన శ్రీకాశి నీ
రంధ్రప్రజ్ఞుఁడవైతి నవ్యతను సర్వస్వమ్ము గైకొంటి గీ
రంధ్రాన్వేషణతత్పరుల్ మిఁణికి యేలా లాభమో కృష్ణపా
రంధ్ర ప్రాభవమొప్ప సత్ప్రజకునుల్లాసంబుఁ గల్పించితో.

కొవ్వూరు
13-11-1986

(సం.) రావూరి వేంకటేశ్వర్లు



# సమీక్ష

ఆచార్య బేతవోలు రామబ్రహ్మం
ఎం. ఏ., పిహెచ్. డి.
తెలుగు విశ్వవిద్యాలయము - సాహిత్య పీఠం
రాజమహేంద్రి.

బెనారసు హిందూవిశ్వవిద్యాలయమునుండి పిహెచ్.డి. పట్టము పొందిన సిద్ధాంతగ్రంథమిది. దీని పేరు శ్రీకృష్ణభారతి. ఇదియేమో కావ్యనామమువలె విన్పించుచున్నది. కృష్ణశబ్ద మనేకార్థకము. వ్యాసుడును శ్రీకృష్ణుడే. దీని రచయిత మరియొక కృష్ణమూర్తి. విద్యావినయశ్రీమంతుడు. వ్యాస భారతిని నుపాసించిన కృష్ణభారతి యిది.

"వ్యాస, పోతనల భాగవత దశమస్కంధములు - ఒక తులనాత్మక పరిశీలన" యని యీ గ్రంథమునకు నుపశీర్షకము. పోతన్ననుగూడ నెట్లో శ్రీకృష్ణుని జేయనవునేని "శ్రీకృష్ణభారతి" ముమ్మాటి సరిపడును.

వీరి యీ పరిశోధనకు పిహెచ్. డి. పట్టమునిచ్చిన విశ్వవిద్యాలయముజగత్ప్రసిద్ధము. విశ్వవిద్యాలయమనుమాటకు సార్థక్యము చేకూర్చునది. పర్యవేక్షకులు సుగృహీతనామధేయులు ఆచార్య బయ్యా సూర్యనారాయణగారు. వీరు నేటికాలమున "కాశీ పండితులు".

పరిశోధకులు ప్రాచ్యకళాశాలల్లో సంప్రదాయ పద్ధతిని సంస్కృతాంధ్రములు నేర్చిన విశిష్టులు. గురుకుల క్లిష్టులు. కావుననే భాగవతముపై చేయివేయ సాహసించిరి. గ్రాంథిక

శైలినాశ్రయించిరి. కాగా సమర్థముగా నిర్వహించిన ఘనత గురుశిష్యు లిరువురిదియును.

ఇందు మొత్తమయిదు ప్రకరణములున్నవి. పురాణ వాఙ్మయము-భాగవతము అనుపేర నేబది పుటలకు పైబడిన ప్రథమాధ్యాయము భూమికాప్రాయము.

పోతనగారి యనువాద విధానమును విశ్లేషించుచు అమూలకములు, యథామూలకములు, మూలప్రాయములు నని మూడు విభాగములు చేసిరి. ఇందమూలకములు ద్వితీయాధ్యాయముగా నూటయిరువది పుటలున్నది. దశమ స్కంధమునందేయే యంశములమూలకములో వీరు నిర్ధారించిరి.

భారతభాగవతాది బృహద్గ్రంథముల పరిశీలనలో నమూలకములను తేల్చుట కష్టసాధ్యము. ప్రక్షిప్తములయు పాఠాంతరములయు బెడద యట్లుండగా మరియొక యిబ్బందియు నున్నది. తెలుగు కవులు మూలగ్రంథములను ఘట్టములవరుస నాంధ్రీకరించినవారు కారు. అట్లే యొకఘట్టమునందలి శ్లోక భావమును యథావసరముగా వేరొక ఘట్టమునందు గ్రుచ్చిన తావులు ననేకములున్నవి. కావున నొక ఘట్టమునందలి యొకానొక భావము నమూలకమనవలెనన్నచో మొత్తము మూలగ్రంథము నవలోడించినగాని కుదురదు. ఇందున్న శ్రమ యింతటిది. కాగా నీ ఘట్టనకిది యమూలకమనుట ద్వితీయ పక్షము.

పరిశోధకులీ ప్రభాకరకృష్ణమూర్తిగారు పరిశ్రమించి యమూలకములను నిర్ధారించిరి. ఇది సిద్ధాంత నిబంధనమగుట నీ నిర్ధారణలను శంకింపబనిలేదనుకొందును. ఒక్కయంశమును మాత్రము ప్రస్తావింపక తీరదు. గోపికా వస్త్రాపహరణమునందు వయోభేదమున్నది. పోతనచేసినమార్పు కొందరికి చర్చనీయాంశమైనది. దానిని వీరీ యధ్యాయమున నేలకో స్పృశింపకైరి!

కాని అమూలకముల నిర్ధారణకు వీరేర్పఱచుకొన్న భూమిక ప్రశంసనీయముగా నున్నది.

యథామూలములు - మూలప్రాయములునన్నది తృతీయాధ్యాయము. ఇది కేవలము ముప్పదిపుటలు. భక్తితత్త్వము నూఱుపుటలలో కవిత్వతత్త్వము డెబ్బదిపుటలలో చతుర్థ పంచమాధ్యాయములుగా నిరూపింపబడినవి. అమూలకములు భక్తితత్త్వమునన్నవి యీ సిద్ధాంతనిబంధనకు ప్రాణస్నాయువులు. తుర్యాధ్యాయమున వీరు ప్రాతపుంతలలో క్రొత్తవింతలు చూపిరి. పంచమాధ్యాయము వీరి కావ్యశాస్త్ర పరిచితికి దర్పణము. సంస్కృతాంధ్రములలో కృష్ణమూర్తి గారికి కటిబంటి పాండిత్యమున్నదనుట నిర్వివాదాంశము. కావున నీ గ్రంథమునకు సాంద్రత పెరిగినది. తెలుగు పరిశోధన రంగమునకునిది గొప్పదీప్తిని కల్గించుననిపించుచున్నది. భవంత ఏవ ప్రమాణమ్.

రాజమహేంద్రి
22-4-1989

భవదీయుడు
(సం.) బేతవోలు రామబ్రహ్మం



# విషయసూచిక

## ఉపోద్ఘాతము

## ప్రథమాధ్యాయము

## పురాణవాఙ్మయము - భాగవతము

## ద్వితీయాధ్యాయము

### పోతన యనువాద విధానము—అమూలకములు



## తృతీయాధ్యాయము

### యథామూలములు - మూలప్రాయములు



## చతుర్థాధ్యాయము

### భక్తి తత్త్వము

# పంచమాధ్యాయము

## కవిత్వ తత్త్వము





# ఉపోద్ఘాతము



ఆంధ్రసాహిత్యము సంస్కృతానువాదముతో ప్రారంభమై ప్రబంధ యుగ మావిర్భవించువఱకు అనగా కొంచెమించుమించు 15వ శతాబ్ది చివర వఱకు అమార్గముననే పయనించినది. కావుననిది యనువాద యుగమనియు సాహిత్యచరిత్రకారులచే పిలువబడుచున్నది. ఈ కాలమున ననేక అనువాద గ్రంథములు తెలుగులో వెలసినవి. ఆదికవి నన్నయతోబాటు వీరందరును స్వేచ్ఛానువాదకులేగాని, యథామాతృకానువాదము, ప్రతిశబ్దానువాదము గావించిన వారు గారు. కావున తెలుగులో ననూదిత గ్రంథములు మౌలిక గ్రంథములవలె నలరారుచున్నవనుకీర్తిని పొందినవి. కాని పలువురు విమర్శకులీ విషయమును ప్రాసంగికముగ వక్కాణించిరేగాని మూలానువాదముల నతిసన్నిహితముగ, సమగ్రముగ పరిశీలించి, నిర్ధారింప పూనుకొనరైరి. కావున నట్టి ప్రశస్తినందిన ఆంధ్రానువాదములలో కొన్ని ప్రతినిధిరచనలను గైకొని సంస్కృతమూలముతో నతిసన్నిహితముగ తులనాత్మకపరిశీలనము గావించుట అవసరమను భావన నాలో కలిగినది.

భారతీయ సంస్కృతికి మూలములైన వేదములను వేదధర్మములను లోకమున సుప్రతిష్ఠితమొనర్చుట కేర్పడిన సులభసాధనములు పురాణములు. ఇట్టి పురాణములనేకము 15వ శతాబ్ది చివరివఱకు ఆంధ్రమున ననువదింపబడుటచే ఈకాలమును పురాణయుగమనుటయు గలదు. కావున కావ్యేతిహాసపురాణములలో తులనాత్మకపరిశీలనకై పురాణగ్రంథభాగమును గైకొనుట యుక్తమని భావించుటయు జరిగినది.

నిగమకల్ప తరోర్గళితం ఫలం
శుక ముఖాదమృతద్రవ సంయుతమ్।
పిబత భాగవతం రసమాలయం
ముహురహో రసికా భువి భావుకాః॥

అని పురాణవాఙ్మయసృష్టికర్తయగు వ్యాసుడు తన భాగవతపురాణమును వక్కాణించియున్నాడు. భాగవతమునకు భక్తిశాస్త్రమనియు పేరు గలదు. భగవంతుని యొక్కయు, భగవద్భక్తులయొక్కయు గాథలతో నిండి భక్తితత్త్వ ప్రదీపకమగు భాగవతము పురాణవాఙ్మయమున మకుటాయమానమై యలరారు చున్నదనుట యథార్థము. వేదములను వర్గీకరించినను, సప్తదశ పురాణములను రచించినను, భారతేతిహాసమును వెలయించినను మానసికశాంతి పొందలేక వ్యాకుల చిత్తుడైన వ్యాసుడు నారదప్రేరితుడై శ్రీమద్భాగవతమును వెలయించి ఆత్మోప శాంతిని పొందుటనుబట్టియు శ్రీమద్భాగవతముయొక్క ప్రాశస్త్యమెట్టిదో విదిత మగుచున్నది.

శ్రీమద్భాగవతమును తెలుగులోని కనువదించినవారిలో పోతనముఖ్యుడు. తెలుగునాట భాగవతమను పేరు వినినంతనే పోతనయే అందరి స్మృతిపథములలో మెలగుననుట సువిదితము. పోతన భాగవతమును వాగ్గేయకారులలో ముఖ్యుడగు త్యాగరాజు ప్రతినిత్యము పారాయణము చేయుచుండెడివాడనుటయేగాక తెలుగు నాట నన్నితావుల నీనాటికినది పారాయణగ్రంథమై అలరారుటనుబట్టియు దీనికెంతటి జనాదరణకలదో తెలియుచున్నది. పోతన భాగవతమునందలి యొకటి రెండుపద్యములైనను కంఠస్థముగరాని ఆంధ్రుడుండడనుట అతిశయోక్తికాదు. తెలుగున అనూదితగ్రంథములు మౌలికగ్రంథములను కీర్తిని పొందగా పోతన భాగవతము మాత్రము మూలమును మించినదను ప్రశస్తినందుటయు గమనించ వలసియున్నది.

భాగవతమునం దేకవింశత్యవతారములు వర్ణితములైనను పూర్ణావతార మగు కృష్ణావతారకథకిందు ప్రాముఖ్యమీయబడినది. కావుననే భాగవతకల్పతరువు కృష్ణమూలమని కీర్తింపబడినది. అట్టి కృష్ణావతారలీలలు సమగ్రముగ వర్ణింప బడిన భాగము దశమస్కంధము. భాగవత ప్రతిపాదితమైన భక్తిమార్గముల కన్నిటికిని లక్ష్యభూతమైన దగుటయేగాక నవవిధభక్తిమార్గములలో సర్వోత్కృష్ట మైన ఆత్మనివేదనాభక్తి దశమస్కంధమునందే వర్ణితమైనదనుటయు సర్వ విదితము. శ్రీకృష్ణలీలలతో నలరారుచు భక్తికి లక్ష్యలక్షణభూతమైన దశమ స్కంధము సంస్కృతాంధ్ర భాగవతములందు విశిష్టమైనస్థానము నాక్రమించినది. ఇంతటి విశిష్టమైన దగుటచేతనే పోతనభాగవత దశమస్కంధము మూలమగు వ్యాస భాగవత దశమస్కంధముతో నతి సన్నిహితమైన తులనాత్మక పరిశీలన జరుపుటకు నన్ను ప్రేరేపించినది. మూలానువాదముల రెంటిని పరిశీలనము గావించి పోతన యనువాదము మౌలికమై యలరారుటయేగాక సొగసులలో మూలమును మించినదని సోపపత్తికముగ నిరూపించు ప్రయత్నమే ఈసిద్ధాంత వ్యాసము. దీనివలన తెలుగులో ననువాదములు మౌలికములై యలరారుచున్న వను మాటయు నిర్ధారింపబడగలదని నా ఆకాంక్ష.

సాధారణముగ మూలానువాదములను సరిపోల్చిచూచునపు డనువాదకర్త స్వకపోలకల్పిత కథాంశముల నమూలకములనుట పరిపాటి. కాని ఈ సిద్ధాంత వ్యాసము వ్రాయునపుడమూలకములను పదమునకర్థవ్యాప్తి కలిగించి, కేవల కల్పితములనేగాక మూలభిన్నముల నన్నిటిని అమూలకములుగ పరిగణించుట జరిగినది. అనగ అనువాదకర్త గావించిన భావవిస్తృతి మూలభిన్నమైన దగుటచే అమూలకములు - విస్తృతి పరకములనియు, సంక్షేపించిన అంశములను అమూలకములు - సంక్షేపాత్మకములనియు, మార్పుగావించిన అంశములను అమూలకములు – అన్యథాకరణములనియు పరిగణించుట జరిగినది, దీని వలన మూలమునందలి అంశములను, అనువాదమునందలి అంశములను స్పష్టముగా గుర్తించుట కవకాశమేర్పడును. తద్ద్వారమున అనువాదమునందలి యేయే యంశ ములు మూలముతో నేయేతావుల నేయేవిధముగ భిన్నమైనవో తెలుసుకొనుట కవకాశమేర్పడి పోతనయనువాదము వ్యాసాతిశయమై అలరారుటకు కారణము మరింత స్పష్టము కాగలదని భావన.

ఇందుకై గోరఖ్‌పూర్ వారి వ్యాస భాగవతప్రతిని, ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ వారి పోతన భాగవత ప్రతిని ప్రధానాధారముగ గ్రహించితిని. శ్లోక, పద్య, సంఖ్యా నిర్దేశము తదనుగుణముగనే సాగినది.

ఐదధ్యాయములుగల ఈపరిశోధన వ్యాసమున పురాణవాఙ్మయమును, భాగవతప్రాశస్త్యమును, భాగవతకర్తృత్వ నిర్ణయమును, భాగవతరచనా సందర్భమును ప్రథమాధ్యాయమున పరామర్శించుట జరిగినది. పోతన అనువాద విధానము, దీని కితరులయనువాదములతోడిసామ్యభేదములు, ఇతివృత్తవిభజనములో మూలానువాదములలో కాననగు స్వల్పభేదములు, అమూలకములు, విస్తృతి పరకములైన అమూలకములు, సంక్షిప్తతాపరకములైన అమూలకములు, అన్యథాకరణ రూపముననున్న అమూలకములు, పరిత్యక్తాంశములు, శ్రీధర వ్యాఖ్యానుసరణములు ద్వితీయాధ్యాయమున చర్చింపబడినవి. యథామూలములు, మూలప్రాయములు తృతీయాధ్యాయమున వివరింపబడినవి. భక్తినిర్వచనము, భక్తిరసము, భక్తిభేదములు, నవవిధభక్తులు, ఏకాదశభక్తులు, వైరభక్తి మున్నగు వానినిగూర్చి మూలముతో సరిపోల్చుచు చతుర్థాధ్యాయమున విశ్లేషించుట జరిగినది. కథాకథనశిల్పము, వర్ణనాశిల్పము, పాత్రచిత్రణము, అలంకారయోజనను, ఛందఃప్రయోగ వైశిష్ట్యము, శైలీవిన్యాసము, రసపోషణము మున్నగునుపవిభాగములలో పోతన కవిత్వతత్త్వమునందలి విశేషములను మూలముతో సరిపోల్చుచు పంచమాధ్యాయమున విశ్లేషించితిని.



# ప్రథమాధ్యాయము

# పురాణవాఙ్మయము – భాగవతము

భారతీయులందరును మానవజాతియొక్క యమూల్య పైతృక సంపత్తిగా సంస్కృతభాషను పరిగణించుచున్నారు. సంస్కృత వాఙ్మయమునందాధ్యాత్మిక జ్ఞానము విపులముగా వివరింపబడినట్లే భౌతికవిజ్ఞానముకూడ పూర్తిగా ప్రకటింపబడినది. లౌకిక జీవనప్రవృత్తికభీప్సితములైన విషయము లన్నియునిందు కానంబడును. చతుర్విధ పురుషార్థములు సాధింపవలెనన్నను, మన ప్రాచీన సంస్కృతి యందలి ఔన్నత్యసారమును గ్రహింపవలెనన్నను, సంస్కృత వాఙ్మయ పఠనముకంటె ప్రశస్తమైన మార్గాంతరము కానరాదు. అనాదిగా భారతీయ సంస్కృతి సంప్రదాయములతోను, భాషా సాహిత్యములతోను, సంస్కృతభాష విడదీయరాని యనుబంధమును కలిగియున్నది. ఈనాడు భారతీయ భాషాసాహిత్యములపై యాంగ్లభాషా ప్రభావమధికముగా నున్నప్పటికిని, సంస్కృతభాషా సంప్రదాయములను, ప్రభావమును విడనాడ లేకపోవుట చేతనే భారతీయ భాషలకును, సంస్కృత భాషకునుగల సంబంధమెంత సన్నిహితమో, గరిష్ఠమో తెలియుచున్నది. కావుననే 'జనని సంస్కృతంబెల్ల భాషలకు' నను కీర్తిని పొందినది.

సంస్కృత వాఙ్మయమును స్థూలముగా వైదికము, లౌకికమను రెండువిధములుగా విభజింపవచ్చును. కాలమునుబట్టిగాని, విషయమునుబట్టిగాని, యీ వాఙ్మయమును విభజింపబూనినచో పెక్కుతరగతులుగా విభజింపవలసి వచ్చును. కాని వేదములను, తత్సంబంధ గ్రంథములను వైదిక వాఙ్మయమనియు, తక్కిన సకల గ్రంథములను లౌకిక వాఙ్మయమనియు విభజించుటయే యుక్తమని సంస్కృత వాఙ్మయ చరిత్రకారులనేకులంగీకరించిరి. సంహితాషడంగ బ్రాహ్మణారణ్యకోపనిషదాదులు వైదిక వాఙ్మయముగాను, తక్కిన షడ్దర్శన పురాణేతిహాస కావ్యాదులు, మత గ్రంథములు లౌకిక వాఙ్మయముగాను పరిగణింపవచ్చును. ఈ యభిప్రాయమునే శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారును, డా. రమేశ చంద్రశుక్లగారును, తదితర ప్రముఖవాఙ్మయ చరిత్రకారులును వ్యక్తీకరించిరి.

వైదిక రహస్యములపారములు, దుర్విజ్ఞేయార్థ బహుళములు, సర్వజ్ఞకల్పము లని వేయివిధముల కొనియాడబడినవి. ఇట్టి వైదికవాఙ్మయముయొక్క సారమును గ్రహించుట సర్వజన సులభసాధ్యము కాకపోవుటచేనందలి పరమార్థమును సుబోధము చేయగలిగిన లౌకిక వాఙ్మయము వెలువడినది. వివిధ శాఖోపశాఖలుగ స్వేచ్ఛగా పెరిగి జగమెల్లనావరించినట్టి లౌకికవాఙ్మయమున, వేద వేదాంగ రహస్యములను, ఉపనిషత్సారమును, పరమాత్మని తత్త్వమును, ఆధ్యాత్మిక సంపదయొక్క యౌన్నత్యమును కథలద్వారా, ఉపాఖ్యానములద్వారా సామాన్యజనులకు కూడ విదితము చేయగలిగినవి పురాణములు మాత్రమేనని నిష్కర్షగా చెప్పవచ్చును.

"వేదాః ప్రతిష్ఠితాస్సర్వే పురాణే నాత్ర సంశయః"

"ఇతిహాస పురాణాభ్యాం వేదార్థం సముపబృంహయేత్"

అను వాక్యములు పైవిషయమునే వ్యక్తీకరించుచున్నవి. పురాణవాఙ్మయము వేదవాఙ్మయముతో సమానమైనదనియు, వేదసారము పురాణరూపమున వివరింపబడిన దనియు చెప్పవచ్చును.

## పురాణ నిరుక్తి

పురాణశబ్దము వేదకాలమునాటికే ప్రాచీనమను నర్థమున వ్యాప్తినందినది. ఋగ్వేదమున పురాతన శబ్దపర్యాయమైన విశేషణముగాను, అథర్వవేదమున పూర్వగాథ లేక ప్రాచీనకథ యనునర్థమునిచ్చు విశేష్యముగాను వాడబడినది. 'పురాభవమితి పురాణం' అని శబ్దకల్పద్రుమము, 'పురా పూర్వస్మిన్ భూతమితి పురాణం' అని అమరకోశము, 'పురా నవం భవతి పురాణం' అని యాస్కనిరుక్తము, 'పురా నీయతే ఇతి పురాణం' అని వాచస్పత్యమును నిర్వచించుచున్నవి. ఈ నిర్వచనములకు పోషకములగు వాక్యములు పురాణములందును మనకు గోచరించుచున్నవనుటకు

యస్మాత్పురాహ్యనక్తీదం పురాణం తేన తత్స్మృతమ్
వాయు పురాణం I-1-200

పురా పరం పరాం వష్టి పురాణం తేన వై స్మృతమ్
పద్మపురాణం V-2-53

పురాతనస్య కల్పస్య పురాణాని విదుర్బుధాః
మత్స్యపురాణం 53-63

ఇత్యాదివాక్యములు నిదర్శనములు కాగలవు. ఉపర్యుక్త నిర్వచనము లిట్లుండగా 'పురాఽపి నవం పురాణమ్' అనునది బహుళప్రచారములోనున్నది. దీనినిబట్టి పురాతన వస్తువిశేషము లయ్యును, నవ్యములుగను, నిత్యనూతనములుగను, భాసించు చుండుటచే పురాణమనుఖ్యాతి కలిగినదని తెలియుచున్నది. స్థూలముగా విమర్శకులు, సంస్కృత చరిత్రకారులు, పలువురీ నిర్వచనమునే సమర్థించిరి. నిత్యనూతనమైన బ్రహ్మపదార్థ విజ్ఞానము పురాణములలో వివరింపబడును. కావుననివి నిత్య నూతనములుగనే భాసించు చుండును.

## పురాణ స్వరూపము

పురాణము లందలి వస్తులక్షణములను పరిశీలించిన వారందరిలో నమర సింహుడు చెప్పిన నీక్రింది లక్షణము కడుప్రసిద్ధికెక్కినది.

సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ ।
వంశాను చరితం చేతి లక్షణానాంతు పంచకమ్ ॥[1]

సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరములు, వంశాను చరితములను పంచ లక్షణములు గల్గినది పురాణమని భావము. సర్గమనగా నాదిసృష్టి. ఇందు బ్రహ్మాండో త్పత్తి చెప్పబడును. ప్రతిసర్గమనగా కల్పాంతమున జరుగు ప్రజాపతుల సృష్టి. ఇదియే కల్పానంతరము జరుగు పునస్సృష్టి యనబడును. దీనినే విసర్గమనియు నందురు. వంశమనగా దేవతలయొక్కయు, దేవర్షి బ్రహ్మర్షులయొక్కయు, గోత్రాను క్రమము. స్వాయంభువాది చతుర్దశమనువుల చరిత్ర, వారి పరిపాలనా కాలమును వర్ణించుచో మన్వంతరములనబడును. వంశాను చరితమనిన సూర్యచంద్రాది వంశ ములందు జన్మించిన చక్రవర్తుల చరిత్రము. 'వంశానుచరితమ్' అనుపదమునకు 'భూమ్యాదేః సంస్థానం' అనుపాఠ భేదముకలదు. భూమ్యాది సంస్థానమనగా ప్రపంచభౌగోళిక స్థితిగతులను గూర్చిన వర్ణనమని భావము. ఇట్టిచో వంశాను చరిత ములో రావలసిన రాజవంశముల చరిత్రలు వంశమునదానిలో సన్నివేయించుకొనవలెను. ఈ పంచలక్షణ సూత్రమునకు కొంచెమించుమించు పురాణములన్నియు కట్టుబడి యున్నవని చెప్పవచ్చును. విష్ణ్వగ్ని వాయ్వాది పురాణములు సైతమిట్లే వర్ణా ణించినవి.

ఈ పంచలక్షణ సూత్రముపపురాణములకు మాత్రమనువర్తించుననియు, మహాపురాణములు దశలక్షణ లక్షితములు కావలెననియు, శ్రీమద్భాగవతమిట్లు పేర్కొనెను.

సర్గోఽస్యాథ విసర్గశ్చ వృత్తీ రక్షాన్తరాణి చ ।
వంశో వంశానుచరితం సంస్థా హేతురపాశ్రయః॥

దశభిర్లక్షణైర్యుక్తం పురాణం తద్విదో విదుః ।
కేచిత్పంచ విధం బ్రహ్మన్ మహదల్పవ్యవస్థయా ॥

— సం. భాగ. 12–7–9, 10

సర్గము, విసర్గము, వృత్తి, రక్ష, మన్వంతరము, వంశము, వంశానుచరితము, సంస్థ, హేతువు, అపాశ్రయమనునవి దశలక్షణములు. సర్గము బ్రహ్మసృష్టి. విసర్గము ప్రజాపతులసృష్టి. భూతజీవికాసాధనము వృత్తి. అవతారాదులచే భగవంతుడు ధర్మమును రక్షించుట రక్ష. స్వాయంభువాది మనువులకాలము మన్వంతరము. దేవయోనుల, బ్రహ్మర్షుల గోత్రానుక్రమము వంశము. సూర్యచంద్రాది వంశజులగు రాజన్యుల చరిత్ర వంశానుచరితము. ప్రళయము సంస్థ. జగత్సృష్టికి కారణభూతుడైన జీవుని ప్రతిపాదించునది హేతువు. బ్రహ్మము సర్వసాక్షియై సర్వావస్థలయందు భిన్ననామముల యుండునని నిరూపించుట అపాశ్రయము. బ్రహ్మవైవర్తపురాణము కూడ పైలక్షణమునే బలపఱచుచు దశాధిక లక్షణములుండునని ఇట్లు చెప్పెను.

సర్గశ్చ ప్రతి సర్గశ్చ వంశో మన్వంతరాణిచ ।
వంశాను చరితం విప్ర! పురాణం పంచలక్షణమ్ ॥
ఏతదుప పురాణానాం లక్షణంచ విదుర్బుధాః ।
మహతాంచ పురాణానాం లక్షణం కథయామి తే ॥
సృష్టిశ్చాపి విసృష్టిశ్చ స్థితి స్తేషాంచ పాలనమ్ ।
కర్మణాం వాసనా వార్తా మనూనాంచ క్రమేణ చ ॥
వర్ణనం ప్రళయానాంచ మోక్షస్య చ నిరూపణమ్ ।
ఉత్కీర్తనం, హరేరేవ దేవానాంచ పృథక్ ।
దశాధికం లక్షణంచ మహతాం పరికీర్తితమ్ ॥

ఆధునిక విమర్శకులు 'మానవజీవిత సర్వాంశలను స్పృశించు, పురాతనవస్తువేదైనను పురాణమనబడునని' వివరించిరి.

అతివిస్తారములైన మానవజీవితాంశములను, పురుషార్థ తాత్పర్యములను తమలో నిముడ్చుకొనిన పురాణ స్వరూప లక్షణమును సమగ్రముగా నిర్వచించుట అసాధ్యమనుటలో విప్రతిపత్తిలేదు.

# పురాణ వర్గీకరణము

పురాణములు మహాపురాణములనియు, ఉపపురాణములనియు, రెండు విధములుగా విభజింపవచ్చును మహాపురాణములు పదునెనిమిది. ఉపపురాణములు పదునెనిమిది.

'మ' ద్వయం 'భ' ద్వయం చైవ 'బ్ర' త్రయం 'వ'చతుష్టయమ్।
'అ' 'నా' 'ప' 'లింగ' 'కూ' 'స్కా'ని పురాణాని పృథక్ పృథక్॥
– దేవీభాగవతం 1–3–2

అనుసూత్రప్రాయమైన శ్లోకమువలన 1 మత్స్యపురాణము 2 మార్కండేయపురాణము 3 భాగవత పురాణము 4 భవిష్యపురాణము 5 బ్రహ్మాండపురాణము 6 బ్రహ్మపురాణము 7 బ్రహ్మవైవర్తపురాణము 8 విష్ణుపురాణము 9 వాయుపురాణము 10 వరాహపురాణము 11 వామనపురాణము 12 అగ్నిపురాణము 13 నారదీయపురాణము 14 పద్మపురాణము 15 లింగపురాణము 16 గరుడపురాణము 17 కూర్మపురాణము 18 స్కాందపురాణము మొదలగునవి అష్టాదశ మహాపురాణములని చెప్పవచ్చును. ఈ విషయమును కొంచెమించుమించుగా నన్ని పురాణములు నంగీకరించుచున్నవిగాని యిందలి రెండంశములు మాత్రము వివాదగ్రస్తములైనవి. పైనవివరించినట్టి యష్టాదశ మహాపురాణములలో వాయుపురాణమును మత్స్యాగ్ని నారదీయపురాణము లంగీకరించుచుండగా, తక్కిన పురాణములు ఆస్థానమున శివపురాణమును పరిగణించుచున్నవి. అట్లే కొన్నింట భాగవతమునకు బదులు దేవీభాగవతము మహాపురాణముగా పరిగణింపబడుచున్నది. కావున నష్టాదశ మహాపురాణ పరిగణనమునకు వాయుశివపురాణములలోను, భాగవత దేవీభాగవతములలోను నేవి గ్రహింపదగినవనుచోట నభిప్రాయ భేదము లేర్పడినవి.

డా. ఎ. డి. పుసాల్కర్, డా. కిర్ఫెలు మొదలగు సుప్రసిద్ధ విమర్శకులీయంశమున పరిశోధన గావించి కడుప్రాచీనమైన వాయుపురాణమునే మహాపురాణముగా పరిగణింపవలెనని తలంచుచున్నారు. కాని మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

"యత్ర తద్వాయవీయం స్యాద్రుద్ర మాహాత్మ్య సంయుతమ్
చతుర్వింశత్సహస్రాణి పురాణం శైవముచ్యతే."

అను మత్స్యపురాణ వచనము నాధారముగాగొని వాయు శివపురాణములభేదములని నిర్ధారించినారు.[2]

కాశీనివాసియు దక్షిణాచార ప్రవర్తకుడునైన గడా కాశీనాథభట్టు 'దేవీ భాగవతమే మహాపురాణములోనిది, ప్రాచీనమైనది, భాగవతమార్షమేకాదు' అను తన వాదమును దుర్జనముఖచపేటికయను గ్రంథమున వెలయించెను. దీనిని ఖండించుచు భట్టోజీ దీక్షితుల శిష్యుడగు రామాశ్రయపండితుడు భాగవతమే ఆర్షమును, మహాపురాణములలో పరిగణింప దగినదియు నసుచు దుర్జనముఖచపేటికా ఖండనము గావించెను. ఈ వివాదము క్రమముగా దక్షిణదేశమునకూడ వ్యాపించినది. ఉత్తర దక్షిణప్రాంతముల నాక్రమించి, యీ వివాదమింతగా పెరుగుటకాయా వర్గములవారి స్వీయమతాభిమానమే ప్రధానకారణము.

శ్రీమద్భాగవతము ననుసరించియే దేవీభాగవతముదయించి యుండుననియు, రెండును మహాపురాణములనియు, సుప్రసిద్ధవిమర్శకులు శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారి యభిప్రాయము.

దేవీభాగవతము తాంత్రిక మతమును పరాశక్తిపారమ్యమును బోధించుచుండు టయు, తాంత్రికమతము వైదికమతమునకు చాలకాలము తరువాత జన్మించినదగు టయు, భాగవతమే ప్రాచీనము మహాపురాణ పరిగణన యోగ్యమునసుటకు పోషక ముగుచున్నది. పింగళి లక్ష్మీకాంతంగారును దీనినే బలపరచిరి.[3]

పురాణనామములను పేర్కొను 'మద్వయం భద్వయంచైవ...' ఇత్యాదిగా గల శ్లోకమువలన భాగవతమే ద్యోతకమగుట కవకాశము కలదుగాని దేవీభాగవతము కాదు. ప్రచారమునుబట్టి చూచినను దేవీభాగవతము కంటె శ్రీమద్భాగవతమునకే వ్యాప్తియధికమనుట నిర్వివాదము.

అష్టాదశ మహాపురాణములను సాత్త్విక, రాజస, తామసభేదములచే మూడు విధములుగా వర్గీకరింపవచ్చునని పద్మపురాణము చెప్పుచున్నది.

పైవానితోబాటు సంకీర్ణపురాణములను మరియొకవర్గము కలదని మత్స్య పురాణమిట్లు పేర్కొనుచున్నది.

"సంకీర్ణేషు సరస్వత్యాః పితౄణాంచ నిగద్యతే"

ఆధునికులలో కొందరు బ్రహ్మ, సూర్యాగ్ని, శివ, విష్ణుస్తుతి పరములుగ నైదు విధములనియు, మరికొందరు ప్రాచీన నవ్యములని రెండువర్గములుగను పేర్కొను చున్నారు. అట్లింకను పలువురు పలువిధములుగా వర్గీకరించుచున్నారు.

మహాపురాణములవలె నుపపురాణములును గలవు. ఉపపురాణముల పరిగణన విషయము వివాదాస్పదమైనను పలువురంగీకరించిన దానినిబట్టి యీక్రింది వానినుపపురాణములుగా చెప్పవచ్చును. 1. సనత్కుమారీయము 2 నారసింహము 3 నారదము 4 శివధర్మము 5 దౌర్వాసము 6 నారదీయము 7 కాపిలము 8 వామనము 9 ఔశనము 10 మానవము 11 వారుణము 12 కల్కి 13 మాహేశ్వరము 14 సాంబము 15 సౌరము 16 పారాశరము 17 మారీచకము 18 భార్గవము. ఇవిగాక పదునెనిమిది ఉపోపపురాణములుకూడ కలవు.[4]

## పురాణ కాలము

పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణా స్మృతమ్ ।
అనంతరం చ వక్త్రేభ్యో వేదాస్తస్య వినిర్గతాః ॥

— వాయుపురాణము 1–60–61

అను వాయుపురాణ వచనమునుబట్టియు, తదితర మత్స్యనారదీయ పురాణవచనములను బట్టియు పురాణము వేదములకంటె ప్రాచీనమైనదనియు అనంతరకాలమున వ్యాసుడు పురాణవాఙ్మయము నంతటిని నేటిరూపమున తీసుకొనివచ్చినాడనియు సంప్రదాయోక్తి. దీనిననుసరించియు, వ్యాసునికాలమున జరిగిన భారతకథా విశేషములను బట్టియు, వ్యాసుడు సుమారైదువేలయేండ్ల క్రిందటివాడని పూర్వవిద్వాంసులగు వృద్ధగర్గుడు, వరాహమిహిరుడు మొదలగువారు నిరూపించిరనియు, ఆధునికులగు కె. వి. అభ్యంకర్ ప్రభృతులు సైతమీసిద్ధాంతమునకే వచ్చిరనియు, క్రీ. పూ. 3102 ఫిబ్రవరి 17–18 అర్ధరాత్రి గురువారమున కలియుగారంభము జరిగినదికావున వ్యాసుడుకూడ అప్పటివాడేకాన పురాణవాఙ్మయనిర్మాణమానాడే జరిగినదని వారు నిర్ధారించిరనియు ప్రసాదరాయ కులపతిగారు నుడివినారు.[5]

అంతియేకాక తైత్తిరీయ, ఛాందోగ్య, శతపథ, బ్రాహ్మణ, బృహదారణ్యకోపనిషత్తులును పురాణములను పేర్కొనినవి. క్రీ. పూ. 4,5 శతాబ్దములనాటి ఆపస్తంబధర్మసూత్రములు పురాణముల నుండి కొన్ని శ్లోకములనుటంకించుటయేగాక భవిష్యపురాణమును పేర్కొనుటయు జరిగినది. కొంచెమించుమించుగా ఇదేకాలమునకు చెందిన గౌతమధర్మసూత్రములు రాజ్యపాలన విషయమున పురాణముల నాదర్శముగ గ్రహింపవలెననియు వక్కాణించినవి. కౌటిల్యుని 'అర్థశాస్త్రమున' పురాణ ప్రసక్తి వచ్చుటచేతను, అమరసింహుని కాలమునాటికే పురాణము పంచలక్షణమును

నిర్ధారితమగుట చేతను భాసకాళిదాసాశ్వఘోషాదులు పురాణముల నెరిగియుండినట్లు తెలియుటచేతను పురాణములు క్రీస్తుశకారంభమునకీవలివని చెప్పుటకవకాశములేదని పలువురంగీకరించుచున్నారు. ఇవియన్నియు ఏకకాలమున రచింపబడలేదనియు విభిన్నకాలములలో విభిన్నవ్యక్తులచేత విభిన్నములైన పురాణములర్వాచీనముగా రచింపబడినవనియు నవ్యులయభిప్రాయము.

బ్రాహ్మణాదులలో ప్రస్తావింపబడిన పురాణములు నశించినవనియు, ప్రస్తుతము పురాణములపేర వచ్చినవన్నియు దాదాపు జరిగిన వేయిసంవత్సరముల కాలములోనివే అని వీబర్ పండితుని యభిప్రాయము[6]

పురాణములలో కొన్నిపూర్వభాగములు క్రీ. పూ., కొన్నిభాగములు క్రీ.శ. 7వ శతాబ్దిప్రాంతములోను రచింపబడియుండుననియు గౌరీనాధశాస్త్రి యభిప్రాయపడు చున్నారు.[7] ఈవిధముగా పురాణకాలమునుగూర్చి అనేకులు భిన్నాభిప్రాయములు ప్రకటించినప్పటికి నిప్పటి పురాణములలో ననేక ప్రాచీనభాగములు కలసియున్నవని విమర్శకులనేకులంగీకరించిరి. పురాణ కాలమును గూర్చి యిదమిత్థముగా నిర్ణయించుట సాధ్యము కాదు.

## పురాణ కర్తృత్వము

వేదములకంటెముందు శతకోటి ప్రవిస్తరమైన పురాణము బ్రహ్మచే నిర్మింప బడినదనియు, లోకమింతటి బృహద్గ్రంథమును గ్రహింపజాలదని తలచి నారాయణుడే ద్వాపరయుగమున సత్యవతీ పరాశరుల పుత్రుడైన వ్యాసుడై పురాణములను నాల్గు లక్షల శ్లోకములుగ సంగ్రహించి యష్టాదశపురాణములుగా నొనర్చెననియు, పురాణము లందే విపరింపబడుచున్నది. ప్రతిద్వాపరమునందీవిధముగా చేయబడుచుండు ననియు, ఇప్పటియీ కలియుగమునకు ముందటి ద్వాపరాంతమున పరాశరనందనుడైన కృష్ణద్వైపాయనుడు 28వ వ్యాసుడై పురాణములను విభజించెననియు పురాణములు చెప్పుచున్నవి. "పురాణముల నన్నిటిని వ్యాసుడు రచింపలేదు. పరిష్కర్తయైనందున వ్యాసుడే సర్వపురాణకర్త యను జనశ్రుతి భ్రాంతి జనితమై జగమున వెలసినది. శ్రీమద్భాగవతము మాత్రము వ్యాసుడు రచించినదగును."[8] అను చదలువాడ జయరామశాస్త్రిగారి వచనములను బట్టి భాగవతముతక్క తక్కిన పురాణములు వ్యాస పరిష్కృతములేగాని వ్యాసకర్తృకములు కావనువిషయము విశదమగుచున్నది. మల్లాది వారు సైతమిదే యభిప్రాయమును వ్యక్తపరచిరి.[9] శ్రీమద్భాగవతము వ్యాసకర్తృక మగునా ? కాదా ? అనువిషయము తరువాత చర్చింపబడును.

# పురాణ మహత్త్వము

"వేదాః ప్రతిష్ఠితాస్సర్వే పురాణే నాత్ర సంశయః"

అను నారదీయ వచనమునుబట్టి వేదార్థములన్నియు పురాణములందు ప్రతిష్ఠింపబడినవని తెలియుచున్నది. భారతీయ సంస్కృతికి మూలములైన వేదములను, వేదధర్మములను లోకమున సుప్రతిష్ఠితమొనర్చుటకేర్పడిన సులభసాధనములు పురాణములని చెప్పవచ్చును. అంతియేగాక వేదనిగూఢార్థములవగతము కావలయునన్నచో పురాణజ్ఞానమత్యావశ్యకము. కావుననే పురాణములు వేదపూరకములను ప్రఖ్యాతిని సమార్జించినవి. వేదార్థములను పూరించునవి కావుననే వీనికి పురాణములనెడు నామసార్థక్యము కలిగినదని బలదేవ ఉపాధ్యాయగారు వక్కాణించియున్నారు.[10]

వేదవేదాంగ విజ్ఞానము కలిగియు పురాణ విజ్ఞానము లేనివాడు విచక్షణుడు కాలేడు. ఎందువలననగా శ్రుతిస్మృతులు పరమేశ్వరునకు నేత్రములు కాగా పురాణము హృదయము వంటిది. కావుననే దేవీభాగవతము

శ్రుతిస్మృతీ ఉభే నేత్రే పురాణం హృదయం స్మృతమ్ ।
ఏతత్త్రయోక్త ఏవ స్యాద్ధర్మో నాన్యత్ర కుత్రచిత్ ॥
- దేవీభాగవతము 11-1-21

అని కీర్తించినది. కాని వాజసనేయీ బ్రాహ్మణోపనిషత్తు

"అస్య మహతో భూతస్య నిశ్శ్వసితమేతద్యదృగ్వేదో
యజుర్వేదస్సామ వేదో౽థర్వాంగిరస ఇతిహాసః పురాణమ్"

అని వేద పురాణములభేదములై భగవంతుని ప్రాణస్థానములైన నిశ్శ్వాసములని వక్కాణించినది.

'ఋగ్వేదం భగవో౽ధ్యేమి యజుర్వేదం సామవేదమథర్వణమ్
చతుర్థమితిహాస పురాణం పంచమం వేదానాం వేదమితి'

అని ఛాందోగ్యోపనిషత్తు పురాణములకు చతుర్వేద సారమైన పంచమ వేదత్వమునంగీకరించుచున్నది. అంతియేగాక పురాణములజ్ఞుల యందును విజ్ఞుల యందును కూడ జ్ఞానధారను ప్రవహించుచున్నవి. లోకమునందలి ధర్మస్థితిని పరిపోషించుచున్నవి. ప్రజలకు నిర్మలమైన జీవనము, నీతిపూర్వకమైన సదాచారములను

ప్రసాదించుచున్నవి. పురాణములు కఠినతరములైన యాధ్యాత్మిక భౌతికతత్త్వములను లలితమైనవిధముగా, మనోజ్ఞమైనరీతిగా జనుల హృదయములందు హత్తుకొనునట్లు చేయుచున్నవి. అందువలననే భారతీయవాఙ్మయములందు పురాణవాఙ్మయమునకు ప్రత్యేకమైన గౌరవము లభించినది.

ఆధునికమైన శాస్త్రీయ తత్త్వములు సైతము పురాణములందు యథాసందర్భముగా కనబడుచుండును. కావుననే ఇ. వేదవ్యాసగారిట్లు వక్కాణించి యున్నారు.

'పురాణాలంటే ఒక సర్వశాస్త్ర సముచ్చయాన్ని, సమస్తవిజ్ఞాన సమన్వయాన్ని కలిపి వైజ్ఞానిక సూత్రాల రూపంలో అన్నిశాస్త్రాల వెనకాలవున్న 'ఏకసూత్రత'మైన ఒక మహాసత్యాన్ని తెలిపే 'సైన్సు.'[11]

పురాణములు ప్రాచీన భారతీయ చరిత్రకారులకు సాధనములగుచున్నవి. ఇందలి వంశానుచరితములు భారతీయ చరిత్రకారులకు మిక్కిలి సహకరించుచున్నవి. ఆయా స్థలపురాణములందలి విషయములనుబట్టియు, సర్గ ప్రతిసర్గలను బట్టియు అనేక భూగోళశాస్త్ర విషయములను తెలిసికొనుటకు అవకాశమేర్పడుచున్నది. వీనిలో లేని శాస్త్రము లేదు. శిల్పము, చిత్రలేఖనము, జ్యోతిషము మొ॥ అనేక విషయములు, ఆత్మశాంతిని కలిగించు అనేకమతవిషయములునిందు నిబద్ధింపబడి యుండుటచే పురాణములీనాటికిని పవిత్రగ్రంథములై ప్రతివారికిని పఠనార్హములు, ఆదరణ యోగ్యములునగుచున్నవి.

“ఆగమార్థ జలసేచనముచే భారతీయ హృదయక్షేత్రముల నార్ద్రీకరించి ఆర్షసంస్కృతిసస్యములను బండింపనేర్పరచిన రస ప్రవాహములు పురాణములు. అపార కథానిధులనుజూపి మురిపించుచు, నమూల్య శాస్త్రవిధులను జెప్పియొప్పించుచు, కవి రసిక ముముక్షు జనములయొక్క రచనా ప్రసంగ వ్యాసంగముల నుపలాలించు మాతృమూర్తులు పురాణములు.”[12]

ఇట్టినంత ప్రాశస్త్యముతో విస్తరిల్లిన పురాణవాఙ్మయమున

అష్టాదశం భాగవతం సారమాకృష్య సర్వతః ।
కృతవాన్ భగవాన్ వ్యాసః శుకమధ్యాపయత్ స్వయమ్ ॥

అను పద్మపురాణ వచనముసుబట్టి పదునేడు పురాణముల సారమునాకర్షించి వ్యాసభగవానుడు పదునెనిమిదవ పురాణముగా భాగవతమును కూర్చి తన కుమారుడైన శుకునకు నేర్పెనని తెలియుచున్నది. ఆ శుకమహర్షి దీనిని మోక్షశాస్త్రముగా భావించి ముముక్షువైన పరీక్షిత్తునకుపదేశించెను. అట్టి భాగవత ప్రాశస్త్యమునుగూర్చి ముందుగా చర్చింపబడుచున్నది.

# భాగవత ప్రాశస్త్యము

శ్రీమద్భాగవతం పురాణమమలం యద్వైష్ణవానాం ప్రియం
యస్మిన్ పారమహంస్యమేకమమలం జ్ఞానం పరం గీయతే ।
తత్ర జ్ఞాన విరాగ భక్తి సహితం నైష్కర్మ్యమావిష్కృతం
తచ్ఛృణ్వన్ విపఠన్ విచారణపరో భక్త్యా విముచ్యేన్నరః॥

— సం. భాగ. 12–13–18.

బ్రహ్మసూత్రోపనిషద్భగవద్గీతలనియెడు ప్రస్థాన త్రయముతోబాటు ప్రస్థాన చతుష్టయమునందొకటిగా ప్రశంసింపబడిన భాగవతపురాణ ప్రాశస్త్యము వర్ణనాతీతము.

శ్రీమద్భాగవతము సంసారభయనాశన ప్రవీణమును, అజ్ఞానాంధకారవిధ్వంస నిపుణమును, భక్తిశాస్త్రజీవన సర్వస్వమును, భగవత్తత్త్వపరమును, పరమానంద సుధారసమయమును, విమల వివేకసమున్మీలనమును, వాఙ్మయాభరణమునై విరాజిల్లుచున్నది. భాగవత మాహాత్మ్యము పద్మపురాణోత్తరఖండమందలి మొదటి యధ్యాయములలోను, తక్కిన స్కాందాది పురాణములందును ప్రస్తుతింపబడినది.

'భగవతః ఇదమ్ భాగవతమ్' భగవంతుని కథలు చెప్పునది భాగవతము. అనగా దుష్టశిక్షణ, శిష్టరక్షణ కొఱకు విష్ణువు ధరించిన ఏకవింశత్యవతార గాథలను వివరించునది గావున భాగవతమని పేరు.

'భగవతి భక్తాః భాగవతాః, తేషామిదం తత్త్వం భాగవతమ్'
'భాగవతానామిదం భాగవతమ్'

అను వ్యుత్పత్తులనుబట్టి ధృవుడు, ప్రహ్లాదుడు, గజేంద్రుడు మున్నగు భగవద్భక్తుల కథలను చెప్పునది కావున భాగవతమనియు చెప్పవచ్చును.

'భాగవతస్య ఇదమ్ భాగవతమ్' అను వ్యుత్పత్తినిబట్టి భగవత్స్వరూపమైన ఈజగత్తుయొక్క సృష్టిస్వరూపమును వివరించునది కావున భాగవతమనియు చెప్పవచ్చును. పై నిర్వచనములనుబట్టి భగవంతునిగూర్చియు, భగవంతుని భక్తులను గూర్చియు తెలియజేయునది భాగవతమని తెలియుచున్నది.

భగవతికి సంబంధించిన కథ భాగవతము.

'రాఘవత్వేఽభవత్సీతా రుక్మిణీకృష్ణ జన్మని।
అన్యేషుచావతారేషు విష్ణోరేషాఽనపాయనీ॥'

అనికదా విష్ణుపురాణము. భగవతియొక్కయు, భగవంతుని యొక్కయు, కథామాత్ర ప్రసంగముచేత భగవంతునకే తృప్తిలేదు. మునికియులేదు.

వైకుంఠేషు పరేలోకే శ్రియా సార్ధం జగత్పతిః।
ఆస్తే విష్ణురమేయాత్మా భక్తైర్భాగవతైస్సహ॥

అందువలన భగవంతుడు భక్తులు, పరమభాగవతులు, భగవతిలేక నివసింపలేడు. ప్రకాశింపలేడు. కావుననే భగవంతునకు సంబంధించినది భాగవతము. భగవతికి సంబంధించినది భాగవతము. భాగవతులకు సంబంధించినది భాగవతము.[13]

అని శ్రీ కోగంటి సీతారామాచార్యులవారు తమ యభిప్రాయమును వ్యక్తీకరించినారు.

శ్రీమద్భాగవత సాగరములో సర్వశాస్త్రసరిత్తులు సంగమించు చున్నవి. దార్శనిక గ్రంథములు ప్రతిపాదించు ప్రకృతి పురుషాత్మముక్తి, సృష్ట్యాది విషయములు, ఉపనిషత్తులు నిరూపించుచున్న ఆత్మతత్త్వమును, స్మృతులు గావించు ధర్మపరిశీలనమును, శ్రీమద్భాగవతమునందు పొందుపరుపబడినవి.

శ్రీమద్భాగవతము భగవంతుని వివిధ లీలలతో కూడిన అనేక ఉపాఖ్యానములను వినిపించుచు 'అహమ్' అననేమియో ఆలోచించునట్లును, ఎందులకు తాని జన్మ పొందియుంటినని విచారించునట్లును, తానుచేయదగిన ధర్మ కర్మములేవి ? అని తర్కించుకొనునట్లును, ఎందువలన వ్యాధిజరామృత్యువులు పీడించుచున్నవని

ధ్యానించునట్లును, ఎందులకు పునర్జన్మము కలుగు చున్నదని తెలిసికొనునట్లును, ఏకారణముచే తాను దరిద్రుడయ్యెనో ? ఇతరులేల ధనవంతులైరో ? అవగతము చేసుకొనునట్లును చేయుచున్నది.

భాగవతమునను భక్తిశాస్త్రమని ప్రసిద్ధియున్నది. సర్వవేదార్థము భాగవతమున నున్నదని ప్రామాణిక సూక్తి. ఋగ్యజుస్సామాథర్వణములనెడి దధిని వ్యాసుడు మథించి శ్రీమద్భాగవత నవనీతము వెలికి తీసెనని చెప్పవచ్చును. అందువలననే వ్యాసుడు

"నిగమ కల్ప తరోర్గళితం ఫలం
శుకముఖాదమృత ద్రవ సంయుతమ్ ।
పిబత భాగవతం రసమాలయం
ముహురహో రసికా భువి భావుకాః ॥

సం. భాగ. 1-1-3.

అని వక్కాణించి యున్నాడు. వేదాంతశ్రవణ, గీతాపారాయణములచే లభింపని భక్తి,జ్ఞాన, వైరాగ్యములు భాగవత శ్రవణముచే తప్పక లభించి ముక్తి మార్గమునుజూపును. అందువలననే

క. నిగమములు వేయుంజదివిన
సుగమంబులు గావు ముక్తి సుభగత్వంబుల్
సుగమంబు భాగవతమను
నిగమంబుఁ బఠింప ముక్తి నివసనము బుధా.

ఆం. భాగ. ప్రథమ. 139

అని నుడువబడినది. అంతియేగాక భాగవతము భక్తియోగమహిమను వెల్లడించి తద్వారా ఈశ్వర సాక్షాత్కారమును గావింప గలిగినదనుటకు మోక్షార్థియైన పరీక్షిత్తునకు భాగవత శ్రవణముచే ఏడు రోజులలో మోక్షము లభించునట్లు చేయుటయే ప్రబల తార్కాణము. దేవతలు భాగవతామృతమును గ్రోలుటకు తమవద్దనున్న అమృత భాండమును శుకునకీయజూపగా నతడు వారిని తిరస్కరించుటవలన భాగవతము భక్తజనైక లభ్యమనియు, అమృతాధిక ఫలప్రదమనియు తెలియుచున్నది. భాగవతమనెడి పంచాక్షరములకు 'భ = భక్తి, గ = జ్ఞానము, వ = వైరాగ్యము, త = తత్త్వము, ము = ముక్తి అను సంకేతము కలదని తెలుగునాట ప్రచారము నందున్నది.

భగవంతునిచే చెప్పబడిన భగవద్గీత లక్షణమనియు భగవంతునిగూర్చి చెప్పు భాగవతము లక్ష్యమనియు పెద్దలమాట. త్రిమతములవారికి నాధారభూతమై బ్రహ్మసూత్రములవలె జీవేశ్వర తత్త్వమావిష్కరించు పద్యగ్రంథము దీనిని బోలినది లేదనుట అతిశయోక్తికాదు. దీనికి వివిధ మతానుసారమైన దశాధిక వ్యాఖ్యలు వెలసియుండుటయే ప్రబల నిదర్శనము కాగలదు. భాగవత తత్త్వమునుగూర్చి ప్రాక్పశ్చిమ తత్త్వశాస్త్రచరిత్ర యిట్లు చెప్పుచున్నది.

"భాగవత తత్త్వము తనలో వేదాంతుల మాయాసిద్ధాంతము, సాంఖ్యుల ప్రకృతి తత్త్వము, శైవుల శక్తిమతము, మీమాంసాది శాఖల కర్మభావము, తన పురాణ మతమగు దివ్య లీలలలో సమన్వయించునదిగా నేర్పున వివేచించుట చిత్రము. లీలాతత్త్వము గ్రంథమునఆద్యంతము విస్తరించి ఉంచబడినది."[14]

భాగవతమునకు 'హయగ్రీవబ్రహ్మవిద్య' అను ప్రశస్తి కలదు. పరమేశ్వరుడు ఆత్మతత్త్వమును హయగ్రీవుడై బ్రహ్మదేవునికి చతుశ్శ్లోకములలో (సం. భాగ. ద్వితీయ - 9-33 నుండి 36) ఉపదేశించినాడు. ఈ యాత్మతత్త్వ నిరూపణమే భాగవత పరమార్థము. భాగవతమునకు సాత్త్వతసంహిత, మోక్షశాస్త్రమను పేళ్ళు గలవనుటకు క్రింది భాగవత వచనమే ప్రమాణము.

అనర్థోపశమం సాక్షాద్భక్తి యోగ మధోక్షజే ।
లోకస్యాజానతో విద్వాంశ్చక్రే సాత్త్వత సంహితామ్ ॥

ఈవిధముగా భాగవతము సర్వవేద సారభూతమును, మహాభారతతాత్పర్య నిర్ణాయకమును, బ్రహ్మసూత్రములకు భాష్యమును, ఆత్మతత్త్వ నిరూపణమునై 'విద్యావతాం భాగవతే పరీక్షా' అను అభియుక్తోక్తిని పొందినది.

భారతీయాధ్యాత్మిక జీవిత సర్వస్వము, భగవద్భక్తి ప్రతిపాదకము, ప్రవృత్తి నివృత్తి మార్గ నిరూపకమునగు భాగవతపురాణ రహస్యమును తెలుసుకొనుట కష్టసాధ్యము. కావున

శ్లో. వ్యాసో వేత్తి శుకో వేత్తి రాజాఽసౌ వేత్తివా నవా।
శ్రీధరః సకలం వేత్తి శ్రీ నృసింహ ప్రసాదతః॥

ఆ. భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు
శూలికైనఁ దమ్మి చూలికైన.

అను పలుకులుద్భవించి యుండును. భక్తికి నాదిగ్రంథము భాగవతమనియు, భక్తిరసములో భారతజాతినంతటిని ముంచెత్తి, ఆముష్మిక ధర్మమార్గమును బోధించి, తరణోపాయమును చూపించు గ్రంథము మహాభాగవతమనియు చెప్పవచ్చును. మహాభాగవతమువలన పురాణవాఙ్మయమునకు, తద్వారా లౌకిక వాఙ్మయమునకు, దానివలన సంస్కృతభాషకునొక ప్రత్యేకస్థానము లభించినదనుటలో నతిశయోక్తి యుండబోదు.

భాగవత ప్రాశస్త్యమును గూర్చియు, తన్మూలమున వ్యాసునకు చేకూరిన ఘనతను గూర్చియు డా. అర్. ఎన్. వ్యాస్‌గారిట్లు వ్రాసియున్నారు.

"The very fact that there are eighty one commentaries in Sanskrit alone on this work. Coupled with this fact that it has been translated not only practically in every language of India but even in French, Persian and English languages gives an impression to every sensible reader that Bhagavata is not only a popular work but must be of much significance too Vyasa."[15]

"శ్రీమద్భాగవతము భగవంతుని వాఙ్మయావతారమని శ్రీరామకృష్ణపరమహంస శిష్యులకు పదే పదే బోధించెడివాడు. వేదాంత గ్రంథములలో ప్రస్థానత్రయమని ప్రసిద్ధి జెందిన ఉపనిష ద్బ్రహ్మసూత్ర భగవద్గీతా గ్రంథముల తరువాత ప్రముఖ స్థానము శ్రీమద్భాగవతమునకే. శ్రీవల్లభాచార్యులవారు భాగవతమును చేర్చి ప్రస్థాన చతుష్టయమనిరి. శ్రీమద్భాగవతము ప్రస్థానత్రయము నకు విశిష్ట వ్యాఖ్యానమని శ్రీకృష్ణ చైతన్యమహాప్రభువుల యభి ప్రాయము"[16]

ఆంధ్రపురాణ వాఙ్మయమును పరిశీలించినచో తెలుగున వెలసిన మొదటి పురాణము పాల్కురికి సోమనాథుడు వీరశైవమత ప్రచారమునకు ద్విపదలో రచించిన బసవపురాణము. ఇది సంస్కృత పురాణానువాదము గాక స్వతంత్ర పురాణమై యలరారుచున్నది. దీనిని దేశిపురాణముగా పరిగణింపవచ్చును.

సంస్కృత మహాపురాణ సంప్రదాయము ననుసరించి వెలువడిన ప్రథమాంధ్ర మహాపురాణము మారన ప్రణీతమైన మార్కండేయ పురాణము. మహాపురాణానువాదో ద్యమమునకు శంఖారావమొనరించినవాడు మారన. తిక్కనసోమయాజి శిష్యుడైన మారన గురుమార్గగామియై వైదిక మతోద్ధరణమునకు, హరిహరాద్వైత ప్రచారమునకు, బలమును కూర్చుటకై సంస్కృత మార్కండేయ పురాణమును తెలుగున రచించెను. మడికి సింగన, ఎఱ్ఱాప్రెగ్గడ, శ్రీనాథుడు, వెన్నెలకంటి సూరన, నందిమల్లయ-ఘంటసింగయాద్యనేకులాంధ్రమున అనేక పురాణములను వెలయించిరి. ఉపపురాణమాంధ్రమున ప్రథమ దేవీపురాణమైనను, మార్గపురాణాను యాయియై వెలసిన మార్కండేయ పురాణము ప్రథమాంధ్ర మహాపురాణమైనను, పురాణమను పేరు వినబడగనే తెలుగువారి స్మృతిపథములందు ప్రత్యక్షమగునది ఆంధ్రమహాభాగవతము మాత్రమే.

వ్యాసకృత శ్రీమద్భాగవతమును చంపూ, ద్విపద, యక్షగాన, వచన ప్రక్రియలలో నాంధ్రీకరించినవారనేకులున్నను, ఆంధ్రభాగవతమునకొక సమగ్రతను, సార్వకాలిక ప్రయోజనమును సంతరించిపెట్టిన ఘనత పోతనకు మాత్రమే దక్కినది. భాగవతమాంధ్రుల హృదయాలలో చిరస్థాయిగా నిలిచి మూల భాగవతమును కూడ మరపింపజేసిన కీర్తి పోతనభాగవతమునకు మాత్రమే దక్కినది.

“సంస్కృత రామాయణ భాగవతానువాదములు తెలుగున మొట్టమొదట ద్విపదలో జరిగియుండుట ఒక విశేషము.” [17] అను జి. నాగయ్యగారి వచనమునుబట్టి భాగవతాంధ్రీకరణము తొలుదొల్త ద్విపద వాఙ్మయమున వెలసినదిగాన పోతన భాగవతము ప్రథమాంధ్రభాగవతము కాదని భావింపవలసియున్నది. ద్విపదలో వెలసిన మొదటి భాగవతము మడికి సింగన కృతమైన ద్విపద భాగవత దశమ స్కంధము మాత్రమే. ఇది అసంపూర్ణము, అసమగ్రము, మూలభిన్నమునై యున్నది. ఇట్టి స్కంధమొకటి రచింపబడినంత మాత్రమున తొలుదొల్త భాగవతానువాదము వెలసిన కీర్తి ద్విపద వాఙ్మయమునకు చెందుట సమంజసమురాదు. సంపూర్ణము, అనితరసాధ్యభక్తిభావసమ్మిళితశైలీవిరాజితమునై, ఆంధ్రమున వెలసిన పోతన భాగవతమే ప్రథమాంధ్ర భాగవతముగా పరిగణించుట సమర్థనీయము కాగలదు. ఈ విషయము ‘మడికి సింగన—బమ్మెర పోతనల భాగవత దశమ స్కంధములు — ఒక తులనాత్మక పరిశీలన’ మను వ్యాసమున [18] నాచే సోపపత్తికముగా నిరూపింపబడినది.

భారతీయసంస్కృతికి మూలములైన భారత భాగవత రామాయణములు సంస్కృత వాఙ్మయమున తుల్యప్రాధాన్యమును కలిగియున్నను, అనువాదకుల శక్తిసామర్థ్యములనుబట్టి ఒక్కొక్క దేశభాషయందీ మూడింటిలో నొక్కొక్క దానికి ప్రథమస్థానము లభించుచు వచ్చినది. ఉదాహరణమునకు ఉత్తరహిందూదేశమున తులసీదాసు రామాయణమునకు ప్రథమస్థానమును, కృష్ణభక్తిసాహిత్యమునకు ద్వితీయ స్థానమును లభించినవి. కాని భారతమునకంతగా ప్రాధాన్యము లభింపలేదు. దక్షిణ హిందూదేశములోని ఆంధ్రప్రాంతమున కవిత్రయకృత శ్రీమద్భారతమును, పోతనకృత శ్రీమద్భాగవతమును కొంచెమించుమించుగా తుల్యప్రశస్తినందినవి. భారత, భాగవత సరిత్తులు రెండును పోటీపడి ప్రవహించుచు ఆంధ్రకేదారముల సాహితీసస్యములు పండించినట్లుగా తదితరభాష యందెందును ఇంతటి సాహిత్యపు పంటలు పండించలేదనుట అతిశయోక్తిరాదు. తెలుగున నీరెంటికిని లభించిన కీర్తిప్రతిష్ఠలు రామాయణమునకు లభింపలేదు. సమర్థుడైన కవిచే రామాయణమను వదింపబడకుండుటయే దీనికి కారణము. కావున అనువాదకుల శక్తిసామర్థ్యములు, పాఠకుల ముందు ప్రవర్తించిన తీరు, మున్నగువానిని బట్టి ఆయా గ్రంథములకు ప్రాశస్త్యము లభించుచుండును. ఈ కారణముచేతనే అనూదితములు మూలమును మించిన సొగసులను సంతరించుకొనినవను కీర్తిని పొందుచున్నవి. అనూదిత దేశీయ భాగవతములలో భాగవతముయొక్క పరమార్థమును, భక్తితత్త్వమును, సంపూర్ణముగ, సమగ్రముగ, భారతీయులకందించిన ఘనత ఆంధ్రభాగవతమునకు, తత్కర్తయైన పోతనకు, తద్వారా ఆంధ్రులకు దక్కినది. ఏలయన ఆంధ్రభాషకు సోదరతుల్యమైన తమిళ కన్నడ భాషలలో యథాక్రమముగా కంబరామాయణమునకు, కుమారవ్యాసుని భారతమునకు లభించిన కీర్తి, వ్యాప్తి, భాగవతానువాదములకు దక్కలేదు.

"మలయాళభాషలో ఎజుతచ్ఛన్ ఆధ్యాత్మరామాయణమునకు వచ్చిన వ్యాప్తిలో కొంతయయిన నాతని భాగవతమునకురాలేదు."[19] అని నిడుదవోలు వేంకటరావుగారు వక్కాణించియున్నారు. "కేరళదేశమున మాత్రము భాగవతము ప్రజాదరమును, గౌరవమును జూరగొన్నది."[0] అని పుట్టపర్తి నారాయణాచార్యులుగారి యభిప్రాయము. మహారాష్ట్రభాషయందు మహాభక్తుడగు ఏకనాథుడు వ్రాసిన భాగవతము ప్రసిద్ధినందినదని చెప్పవచ్చును. కాని యిందు కృష్ణోద్ధవ సంవాదము మాత్రము బాగుగా పెంచి తక్కిన భాగమంతయు సంక్షిప్తము గావింపబడినది. హిందీ సాహిత్యములో తులసీదాసు రామాయణము

తరువాత సూరదాసు రచించిన 'సూరసాగర్' సముచిత స్థానమును పొంది కృష్ణభక్తి సాహిత్యమునకు మూలస్తంభమై నిలిచినది. అది మూలభాగవతమునకనువాదము కాదు. అందు దశమస్కంధమునకు మాత్రమే ప్రాధాన్యమీయబడినది. అతడు వల్లభ సంప్రదాయానుయాయిగాన శ్రీకృష్ణలీలాగానము చేయుటయే ప్రధాన లక్ష్యమైనందున దశమస్కంధమున సైతము అట్టి ఘట్టములను మాత్రము విస్తరించి రచించినాడు. పోతన మూలమునందలి కథలన్నిటికిని ప్రాధాన్యము నొసగినాడు. సూరదాసు కేవలము పుష్టిమార్గమునకే ప్రాధాన్యమిచ్చుటచే తక్కిన భక్తిమార్గములు కుంటుపడుచున్నవి. పోతన సఖ్యవాత్సల్యాది భక్తిమార్గములన్నిటికిని సమప్రాధాన్యము నొసగి మనమేవిధముగా భగవానుని భావించిన ఆ భావనలోనే తన్మయత్వము నొంది భగవత్సాక్షాత్కారమును పొందవచ్చునని అనుభవపూర్వకముగా గ్రహించి తన భాగవతమున నిరూపించిన భక్తాగ్రేసరుడు. సూరదాసు కేవలము కృష్ణభక్తికి మాత్రమే ప్రాధాన్యము నీయగా, పోతన రామకృష్ణాద్వైత, శివకేశవాద్వైత తత్త్వమునకు ప్రాధాన్యము నిచ్చినవాడు. వస్తు భావచిత్రణములను బట్టియు కవితాశిల్పమును బట్టియు, రచితరసములను బట్టియు పరిశీలించిన ముక్తకమైన సూరసాగర్ పరిపూర్ణ పురాణమైన పోతన భాగవత స్థాయికి చేరలేదని చెప్పవచ్చును. "పోతనామాత్యుడు వస్తువర్ణనతో పాటు భావ చిత్రణకు ప్రాధాన్యాన్నిస్తూ రెంటినీ సమపాళ్ళలో నడిపించాడు. సూరదాసున కట్టి నిబంధన లేదు"[21] అను సి. హెచ్. రాములుగారి పల్కులు సైతము పై యభిప్రాయమునే వ్యక్తీకరించుచున్నవి. ఈవిధముగా పర్యాలోచన చేయగా భారతీయ భాషలలోని భాగవతానువాదములలో పోతనలో కానవచ్చు పవిత్రమైన తపస్సు, కవితానిర్మాణము, భావరూప చిత్రణ మొదలగు లక్షణములితరులలో నంతగా కానము. కావుననే భారతీయభాషలలోని భాగవతములలో ఆంధ్రభాగవతము ప్రథమ స్థానము నాక్రమింపగలిగినది.

భాగవతమునందు ప్రతిపాదింపబడిన భక్తిని భారతదేశమునందంతటను విస్తారింప జేసినవారు పోతనగారని చెప్పవచ్చును. ఉత్తర హిందూదేశమున కృష్ణభక్తి మార్గమును ప్రవేశపెట్టినవాడు వల్లభాచార్యుడు. శ్రీ వల్లభులు లేనిచో ఉత్తర హిందూదేశములోను, హిందీ సాహిత్యములోను రామభక్తి సాహిత్యము తరువాత ప్రముఖమైన కృష్ణభక్తిశాఖ వేదనలలో నతిశయోక్తిలేదు. వల్లభులు శుద్ధాద్వైతపరముగా సుబోధినీవ్యాఖ్య వ్రాసి శ్రీమద్భాగవత సప్తాహ యజ్ఞములు నిర్వహించుచు,

భారతదేశమంతయు పర్యటించి తన పుష్టిమార్గమును, కృష్ణభక్తిని ప్రచారము గావించినారు.[22] అట్టి వల్లభాచార్యులు కృష్ణాజిల్లా మంగళగిరికి సమీపమునగల 'కాకరవాడ'కు చెందినవారగుట నాంధ్రులకు గర్వకారణము. వల్లభుల తండ్రి కాశీనగరమున స్థిర నివాసమేర్పరచుకొనినను, వారి మరణానంతరము వల్లభులు తమ యగ్రహారమున కొంతకాలము నివసించినట్లును, ఆ సమయమున పోతనభాగవతముచే ప్రభావితులైనట్లును, పోతనభాగవతము నందలి కృష్ణభక్తిభావముల నాకళించుకొనినారనియు తెలియుచున్నది.[23] వంగదేశమున కృష్ణభక్తిని ప్రచారముచేసిన చైతన్యుడు, ఆంధ్రదేశమున పర్యటించినట్లును, పోతన భాగవతమును గురించి యెఱింగినట్లును పలువు రంగీకరించియున్నారు.[24]

ఈ విధముగా వ్యాసభాగవతమునకు మించిన ప్రశస్తి, పోతన భాగవతమునకు లభించుట కిందు భక్తి, భావాంబరవీధిలో విస్తృతవిహారము చేయుటయే కారణము. హిందీ సాహిత్యములో తులసీరామాయణమున కంతటి ప్రశస్తి లభించుటలోని మర్మము కూడ నిదియే.

విస్తృతిని బట్టియు ప్రాముఖ్యమునుబట్టియు సంస్కృతాంధ్ర సాహిత్యోద్యాన సరోవరములందు వ్యాస, పోతనల భాగవతములు స్వర్ణకమలములై యలరారుచున్నవి. అందు పోతన స్వర్ణకమలము చక్కని తావిని కూడ సంతరించుకొని తన సువాసనల గుబాళింపుచే నాంధ్ర లోకమునే గాక యావద్భారతమును మైమఱపింప జేయుచున్నది.

ఇట్టి ప్రశస్తి నందిన సంస్కృతాంధ్ర భాగవతముల కర్తృత్వము వివాదగ్రస్తమగుట విచారకరము. ఆ విషయమొకింత పరామర్శింప వలసి యున్నది.

# భాగవత కర్తృత్వ నిర్ణయము

శ్రీమద్భాగవతము వ్యాసకృతము కాదనియు, గోపాలమహారాజమంత్రియైన హేమాద్రియను మంత్రి ప్రీతికై తదాస్థాన పండితుడైన బోపదేవుడు రచించి వ్యాసునిపేర ప్రకటించినాడని కొందఱుచెప్పుచున్నారు. మరికొందఱు శుకమహర్షియే దీనిని రచించెననియు, మరికొందఱు దీని కర్త కృష్ణద్వైపాయనవ్యాసుడు కాడనియు

వ్యాసాపరనాముడైన ఆధునికుడనియు తలంచుచున్నారు. ఈ వాదము లన్నింటిలోను బోపదేవ కృతమను, వాదమే మిక్కిలి ప్రచారము నందినది.

కాశీ నివాసియగు కాశీనాథభట్టు దేవీ భాగవతమునకు అర్హత్వమును కల్పించుచు దానికుపోద్బలకముగా భాగవతమును వ్యాసునిపేర బోపదేవుడు రచించినదే కాని వ్యాసుడు రచించినది కాదనెడు వాదమును లేవనెత్తెను. దానిని ఖండించుచు రామాశ్రయపండితుడు భాగవతము బోపదేవరచితము కాదని నిర్ణయించెను. తదనంతర కాలమున అనేక పండిత ప్రకాండులచే ఈ విషయమై వాదోపవాదములు గావింపబడినవి. పాశ్చాత్యపండితులనేకులు ఈ విషయమున వ్యక్తీకరించిన నిర్ణయములను ప్రసాదరాయ కులపతి గారు తమ పరిశోధనా గ్రంథమున పేర్కొని యున్నారు. [25]

కోల్‌బ్రూక్ అను పాశ్చాత్య విమర్శకుడు ఆరువందల సంవత్సరముల క్రింద వ్యాకరణ కర్తయగు వోపదేవునిచే భాగవతము రచింపబడినదను నభిప్రాయముతో ఏకీభవింపగా, 'కల్నల్ వాన్సుకెన్నెడీ' అను నతడు అష్టాదశ మహాపురాణములలోని భాగవతము ఆరువందల సంవత్సరముల క్రింద రచింపబడినదని అంగీకరించినచో తక్కిన పురాణముల ప్రాచీనత్వమసంగతమగును గాన పై వాదమంగీకరింపదగినది కాదని తిరస్కరించెను. అట్లే భాగవతము 12వ శతాబ్దిలోని బోపదేవుని రచనమని విల్సన్, భాగవత రచనాకాలము 13వ శతాబ్ది ప్రాంతమని 'మేక్డొనెల్', ఇది క్రీ. శ. 9వ శతాబ్దికి చెందినదని పర్గిటర్ అభిప్రాయపడగా థియోడొర్ గోల్డ్‌స్టక్కర్ భాగవతకర్త వోపదేవుడే అను విషయము నిశ్చయింప వీలులేదని వ్యక్తపఱచెను. శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు భాగవతము వ్యాసకృతమని నిర్ణయించినవారిలో ప్రసిద్ధులు. ఇట్లు ప్రాచ్య, పాశ్చాత్య పండితులు వాదోపవాదములు జరుపుకొనునపుడు చూపిన నుపపత్తులను పరిశీలింపవలసి యున్నది. శ్రీమద్భాగవత కర్త వోపదేవుడని వాదించువారు చూపిన నుపపత్తుల సారాంశమీ దిగువ విధముగా నున్నది.

క్రీ. శ. 1271 - 1309 నడుమ దేవగిరి రాజ్యమును పాలించిన యదువంశ సంజాతుడైన రామరాజునకు, కటకపుర నివాసియగు రామరాజు పుత్రుడును, స్మృతీతిహాసపురాణ వేత్తయునైన హేమాద్రి యనునతడు మహామంత్రి. అతని పండితమిత్రుడు వోపదేవుడు. ఇతడు వ్యాకరణ వైద్య సాహిత్య జ్యోతిర్విషయకము లైన బహుగ్రంథములను రచించిన మహాకవి. అతడు తన 'హిమాద్రి' గ్రంథమున

'హిమాద్రేః సచివస్యార్థే సూచనా క్రియతేఽధునా।
స్కంధాధ్యాయ కథానాంచ యత్ప్రమాణం సమాసతః॥
శ్రీమద్భాగవతం నామ పురాణంచ మయేరితమ్।
విదుషా బోపదేవేన శ్రీకృష్ణస్య యశోన్వితమ్॥.

అని వర్ణించియున్నందున వైష్ణవమత ప్రాబల్యసాధనకై హేమాద్రి ప్రేరేపణచే నాతడు విష్ణుభాగవతమును రచించి వ్యాసప్రణీతమని ప్రచారముచేసె ననియు, నందువలననే శ్రీధరుడు 'భాగవతం నామాన్యదిత్యపి నశంకనీయమ్ (సం. భాగ 1-1-1 వ్యాఖ్య)' అని వ్రాసినారని వీరివాదము.

ఆనందతీర్థాచార్యుని వరకు భాగవతమును శాస్త్రకర్తలెవ్వరును తమ గ్రంథములలో నుదాహరింపలేదు. క్రీ. శ. 8వ శతాబ్దినాటి శంకరాచార్యులును, తరువాతివారును విష్ణ్వగ్ని కూర్మాది పురాణములనుండి యుదాహరణములు గ్రహించిరేగాని భాగవతమునుండి గ్రహింపలేదు. భాగవత మాధ్వవ్యాఖ్యలో హనుమదాదులు రచించిన ఎనిమిది వ్యాఖ్యానములు చూడబడినవనియు వానిలో శంకరుని వ్యాఖ్యయొకటి కలదు కదా! కావున భాగవతము శంకరునకు పూర్వకాల కృతమనుటకు హనుమంతుడు వ్యాఖ్యానము వ్రాసెననుట లోనే మాధ్వ వ్యాఖ్య యందలి యప్రమాణత గోచరించుచున్నది. కావున శంకరుడు భాగవతవ్యాఖ్యానము వ్రాయలేదనియు, భాగవతము శంకరాచార్యులకు పూర్వము లేదనియు వీరివాదన.

మహాభారతము వ్యాసకర్తృక మనుటలో విప్రతిపత్తిలేదు గదా! కావున భారత భాగవతములను పోల్చిచూచినచో రెంటికిని సామ్యమెందును కానరాదు. భారతమున సరళమగుశైలి, అనుష్టుప్ఛందము, కథాకథనాత్మకపద్ధతి, ద్రాక్షాపాకకైశికీవృత్తులు, నిబద్ధింపబడగా భాగవతమున ప్రౌఢమైనశైలి, ఛందోవైవిధ్యము, వర్ణనాత్మకమార్గము, నారికేళపాకము, ఆరభటీవృత్త్యాదులు, అనుసరింపబడినవి. కాన భాగవతకర్త, భారతకర్తయైన వ్యాసుడు కాడని వీరిమతము.

యత్రాధికృత్య గాయత్రీం వర్ణ్యతే ధర్మవిస్తరః।
వృత్రాసుర వధోపేతం తద్భాగవత మిష్యతే॥
లిఖిత్వా తచ్చ యో దద్యాత్ హేమసింహ సమన్వితం।
ప్రోష్ఠపద్యాం పౌర్ణమాస్యాం స యాతి పరమం పదం॥

అను మత్స్యపురాణ వచనము ననుసరించి ప్రోష్ఠపదా నక్షత్రయుత పూర్ణిమ

యందు స్వర్ణసింహముపై భాగవత లిఖితప్రతినుంచి దానముచేసినచో వానికి పరమపదము లభించునని కలదు. సింహము దేవీ వాహనము కావున నిక్కడ వాసవస్తువు దేవీభాగవతమే. కాన మత్స్యపురాణోక్తి దేవీభాగవతమును గూర్చియేగాని విష్ణుభాగవతమునకు సంబంధించినది కాదు.

హయగ్రీవ బ్రహ్మవిద్యా యత్ర వృత్ర వధ స్తథా।
గాయత్ర్యా చ సమారంభః తద్వై భాగవతం విదుః॥

అను స్కాందపురాణవచనము ననుసరించి భాగవతము హయగ్రీవబ్రహ్మవిద్య యనుట ప్రసిద్ధము. ఈ హయగ్రీవావతారకథ దేవీభాగవతముననే కలదు. వినష్ట నిఖిల శ్రీవిద్యోద్ధరణమే దేవీప్రసాదమున జనించిన ఈయవతారముయొక్క యేకైక ప్రయోజనము. ఆ విద్యను హయగ్రీవుడు అగస్త్యున కుపదేశించెను. ఆ విద్యయే హయగ్రీవబ్రహ్మవిద్య యని శాక్తేయుల మతము. కావున స్కాందపురాణోక్తి దేవీభాగవతపరమే. పైనచూపిన నుపపత్తులనుబట్టి స్కాంద మత్స్య పురాణములలో వివరింపబడిన భాగవతము దేవీభాగవతమనియు, అదియే ప్రాచీనమనియు, విష్ణుభాగవతకర్త వ్యాసుడు కాడనియు, శంకరాచార్యులకంటె నర్వాచీనుడైన వోపదేవుడో, తదన్యుడో యనియు వీరివాదము.

శ్రీమద్భాగవతకర్త వ్యాసుడేయని నిర్ణయించువారు పైవానికొసగిన సమాధానములు, ప్రతివాదములు నీదిగువ విధముగా నున్నవి.

ఈ మహాపండితుడు భాగవతస్కంధములన్నింటిలోని విష్ణులక్షణ, విష్ణుభక్తి, విష్ణుతత్త్వ ప్రతిపాదకములైన పద్యముల నుద్ధరించి 'ముక్తాఫల' మను పద్యాత్మక గ్రంథమును, దానికిఁ గైవల్యదీపిక యను వ్యాఖ్యానమును రచియించి హేమాద్రి పేరుపెట్టెను. ఈవిషయము మూల, వ్యాఖ్యలలోని యీక్రింది మాటలవలన స్పష్టమగుచున్నది.

విద్వద్ధనేన శిష్యేణ భిషక్కేశవ సూనునా
హేమాద్రి ర్బోపదేవేన ముక్తాఫల మచీకరత్
చతురేణ చతుర్వర్గ చింతామణి వణిజ్యయా
హేమాద్రిణార్జితం ముక్తాఫలం పశ్యతు కౌతుకాత్
తేన ముక్తాఫలం తేనేయల్లోక మను గృహ్ణతా
తత్ర టీకాంయథా బుద్ధి కుర్వే కైవల్య దీపికామ్

ఇహాచస్వకర్తృకే౽పియదురాజ మహామంత్రిణా౽భ్యర్చితఆచార్యః (వోపదేవః)తత్కర్తృకత్వం (హేమాద్రికర్తృకత్వం) ఖ్యాపితవాన్.

ఇతి శ్రీవోపదేవ కృతా ముక్తాఫల టీకా సమాప్తా

ఇతి శ్రీహేమాద్రి కృతా ముక్తాఫల టీకా కైవల్యదీపికా సమాప్తా

ఇట్టిద్దరి పేర్లను రెండు గ్రంథములు కనబడుచున్నను రెంటి కర్త వోపదేవు డనుట స్పష్టము. దీనినిబట్టి భాగవతములో వోపదేవునికిగల సంబంధమందలి పద్యములుద్ధరించి వానితో ముక్తాఫల ప్రకరణము రచియించుట తప్ప వేరేమియు లేదని విదితమగుచున్నను ఈతడే భాగవతముకూడ రచియించి వ్యాసుని పేరు పెట్టెననెడి వాదము లేవనెత్తుట యెట్టిదో యూహింపవలసినదే. ఇతరుల పేర గ్రంథములు రచియించు స్వభావము వోపదేవునికి గలదుగదా యనియు, నీతని కేదియో కొంతభాగముతో సంబంధము కలదుగదా యనియు నూహించి భాగవతమును గాదని దేవీభాగవతమునకు మాత్రమే యార్షత్వము దృఢపరుప నిది శాక్తేయులెత్తిన యెత్తుగాక యిందేమయిన నౌచిత్యమున్నదా? శ్రీమల్లాది సూర్యనారాయణశాస్త్రిగారును ఈయభిప్రాయమునే వ్యక్తపఱచిరి[26] దీనివలన హేమాద్రిమంత్రి తుష్టికొఱకు భాగవతపురాణ విషయ పరములైన 'ముక్తాఫలము' 'హరిలీలామృతము' అను రచనలు వోపదేవునిచే గావింపబడినవనియు, భాగవతము రచింపబడలేదనియు తెలియుచున్నది. హరిలీలామృతములో భాగవతముయొక్క స్కంధము లందలి, అధ్యాయములందలి విశేషములు సూచింపబడినవి. అందువలననే దీనికి 'భాగవతానుక్రమణి' యను నామాంతరమును కలదు. 'ముక్తాఫలము' భాగవతము నందలి వివిధ రసాత్మక కమనీయ పద్యసంకలనము మాత్రమే. ఈతడే దీనికి కైవల్య దీపిక యను వ్యాఖ్యానమును వ్రాసి హేమాద్రి పేరు పెట్టెను. ఈ గ్రంథాంతమున శ్రీమద్భాగవతము ద్వావింశతివార మధీతమైనదని పలికి తన్మాహాత్మ్య వర్ణన పూర్వకముగా వేదవ్యాస స్తుతిని ఈతడు గావించినాడు. కావున శ్రీమద్భాగవతము వ్యాసోపదిష్టమే గాని వోపదేవకృతము గాదని తెలియుచున్నది. అంతియే గాక హేమాద్రి తన 'చతుర్వర్గ చింతామణి' లో భాగవతము నందలి కొన్ని శ్లోకములను ప్రమాణముగా గ్రహించెను. వోపదేవుడే భాగవత కర్త యైనచో నిది సమంజసము గాదుగదా! భాగవత సారము నంతను 'ముక్తాఫలము' నందు వివరింపబడినందున 'శ్రీమద్భాగవతం నామ పురాణం చ మయేరితమ్' అని చెప్పబడినదే గాని పూర్తిగా వ్రాయుట వలన కాదు. ఏలనన భాగవతము పూర్తిగా వ్రాయబడినపుడు

ముక్తాఫలమును సంపుటి వ్రాయనవసరము లేదుగదా! పై సమాధానములను బట్టి శ్రీమద్భాగవత కర్త బోపదేవుడు కాడనియు, వ్యాసుడే యనియు తెలియుచున్నది.

శంకరభగవత్పాదులును, తరువాతివారును విష్ణ్వగ్ని కూర్మాది పురాణముల నుండి ఉదాహరణములను గ్రహించిరేగాని శ్రీమద్భాగవతమునుండి గ్రహింప లేదనుటయు పొసగదు. ఏలయన శంకరభగవత్పాదులు భాగవతమునకు వ్యాఖ్యానము వ్రాసినట్లు దీనికి ద్వైతవ్యాఖ్య వ్రాసిన విజయధ్వజాచార్యులు చెప్పుచుండెను. క్రీ.శ 1199వ సంవత్సరమున జన్మించిన ద్వైతమత సంస్థాపకులైన మధ్వాచార్యులవారు భాగవత మూలతాత్పర్యములను పరిష్కరింపనెంచి 'భాగవతతాత్పర్యనిర్ణయ' మను గ్రంథమును రచించెను. 11వ శతాబ్దికి చెందిన రామానుజాచార్యులవారు తన వేదాంత తత్త్వసారములో భాగవత దశమస్కంధోత్తర భాగమందలి 87వ అధ్యాయములోని వేదస్తుతియందలి యనేక శ్లోకముల నుదాహరించిరి. 10వ శతాబ్దికి చెందిన అభినవగుప్తునిచే తన 'గీతాటీక'లో భాగవతమునందలి ద్వితీయ, ఏకాదశస్కంధముల నుండి కొన్నిశ్లోకములు క్రోడీకరింపబడినవి. శంకరాచార్యులచే, తన 'గోవిందాష్టకము' మరియు "ప్రబోధసుధాకరము" లలో శ్రీకృష్ణుని స్తుతించుచు నేయే ఘట్టము లుల్లేఖింపబడినవో యవి యన్నియు భాగవతమునందుపలబ్ధమగుచున్నవి. శంకర భగవత్పాదుల గురువర్యులు, ఏడవశతాబ్దికి చెందిన గౌడపాదులవారు "పంచీకరణ వ్యాఖ్య"లో

జగృహే పౌరుషం రూపం భగవాన్ మహదాదిభిః।
సంభూతం షోడశ కలమాదౌ లోక సిసృక్షయా॥

—సం. భాగ. 1-3-1

అను శ్లోకమును, అట్లే ఉత్తరగీతా వ్యాఖ్యయందు

శ్రేయః స్రుతిం భక్తిముదస్య తే విభో
క్లిశ్యన్తి యే కేవల బోధలబ్ధయే।
తేషామసౌ క్లేశల ఏవ శిష్యతే
నాన్యద్యథా స్థూల తుషావఘాతినామ్॥

—సం. భాగ 10-14-4

అను మరియొక భాగవత శ్లోకమును పేర్కొనినారు. వీరికాలము ఆధునికుల లెక్కప్రకారము చూచినను ఎనిమిదవ శతాబ్దముకంటె నర్వాచీనముకాదు. అంతియే గాక శంకరభగవత్పాదులచే రచింపబడిన భాగవత వ్యాఖ్య నష్టమగుటకు ననేక

కారణములుండవచ్చును. అంతమాత్రమున వ్రాయలేదను వాదము సమంజసమైనది కాదు. వ్యాఖ్య వ్రాయనంతమాత్రముననను, అందలి శ్లోకములు ఉదహరింపబడనంత మాత్రముననను, తద్గ్రంథ మా వ్యక్తికంటెముందు లేదనుట సమంజసము కాదు. పైన వివరింపబడిన విషయములను పరిశీలించినచో భాగవతమర్వాచీనుడగు వోపదేవ కృతమనుట పొసగదనియు, ఆరవశతాబ్దికంటె మిక్కిలి ప్రాచీనమైనదనియు విశద మగుచున్నది.

భారతభాగవతములందలి శైలీభేదమునుబట్టి భాగవతకర్త వ్యాసుడుకాదని నిర్ణయించుటయు నసంగతమే. శైలియనునది తద్గ్రంథస్థ విషయమునుబట్టి సాగు చుండును.

"యత్రాధికృత్య గాయత్రీ ........." ఇత్యాది మత్స్యపురాణోక్తి దేవీ భాగవతమును గూర్చియేగాని విష్ణుభాగవతమునకు సంబంధించినది కాదనుటయు యుక్తముగా తోచుటలేదు. ఏలయన సింహము గౌరవార్థమును, బంగారము దక్షిణార్థము గ్రహింపబడినది. అనగా గౌరవపూర్వకమైన దక్షిణతోబాటు దీనిని దానమీయవలె నని తెలియజేయుటకు మాత్రమే యట్లు కీర్తింపబడినది. గాయత్రీసమారంభము, వృత్రాసుర వధోపేతమునగునది భాగవతమని మత్స్యపురాణోక్తి. గాయత్రీ సమారంభము, వృత్రవధ విష్ణుభాగవతముననేగాని దేవీభాగవతమునలేవు దేవీభాగవత మున వుంభవధ గలదుగాని వృత్రవధలేదు. కానమత్స్యపురాణోక్తి విష్ణుభాగవత పరమేగాని దేవీభాగవతపరముకాదని తేటతెల్లమగుచున్నది.

గాయత్రీసమారంభము, వృత్రవధయేగాక హయగ్రీవబ్రహ్మవిద్య కూడ వర్ణింపబడినచో నది భాగవతమని స్కాందపురాణము తెల్పుచున్నది. దీనినిబట్టి దేవీప్రసాదమువలన వచ్చిన హయగ్రీవావతార చరిత్రగల దేవీభాగవతమే భాగవత మనియు తదన్యము కాదని వారివాదన. కాని హయగ్రీవావతారము విష్ణువు తనకు తానుగా ప్రళయకాలమున నష్టమైన వేదాద్యుద్ధరణకు కల్పించుకొనిన అవతారమనుటకు ఈక్రింది శ్లోకములే తార్కాణములు.

పురా సర్వాసు విద్యాసు నష్టాసు ప్రళయే మునే
నారాయణో జగత్కర్తా రమాశ్రిత భుజాంతరః
నిస్స్వాధ్యాయ వషట్కార స్వధా స్వాహా వివర్జితం
విలోక్య భువనం కృత్స్నం కిమితి వ్యాకులోఽభవత్

4)

అన్వీక్ష్య వేదశాస్త్రాణి నాపశ్యత్ కిమపిప్రభుః
హయగ్రీవ తనుం ప్రాప్య సచ్చిదానంద రూపిణీం

వ్యాస నారద సంవాదము — హయగ్రీవతంత్రము.

బ్రహ్మవిద్యయనగా వేదాది విద్యలేగాని శ్రీవిద్యగాదు. దీనినిబట్టి స్కాంద పురాణోక్తి విష్ణుభాగవతమునే వ్యక్తీకరించుచున్నది. ఈ కల్పనలన్నియు దేవీ భాగవతమున కార్షత్వము కల్పింప నెంచిన శాక్తేయుల పన్నాగమని భావింపవచ్చును.

అంతియే గాక హేమాద్రి శ్రీధరస్వామి నుటంకించి యున్నందున భాగవత వ్యాఖ్యాతలలో సుప్రసిద్ధులైన శ్రీధరస్వామి హేమాద్రి కంటె ప్రాచీనుడని విశద మగుచున్నది. దీనిని బట్టియు శ్రీమద్భాగవత రచనా కాలము వోపదేవునికంటె అతి పురాతనమైనదని స్పష్టమగుచున్నది. వారణాసిలోని 'సరస్వతీ భవనము' ను పుస్తకాలయములో 12 వ శతాబ్దమునకు చెందిన భాగవత వ్రాతప్రతి యొకటి గానవచ్చుటను బట్టియు, శ్రీమద్భాగవతమున 'రాధా' శబ్దము రానరాకుండుటను బట్టియు దీని ప్రాచీనత్వము వెల్లడియగుచున్నది. ఆంధ్రభాగవత కర్తయైన పోతన 'వ్యాసాలవాలంబునై భాగవతాఖ్య కల్పతరువుర్వీన్ సద్విజశ్రేయమై' అని వ్యాసుడే శ్రీమద్భాగవత కర్తయని కంఠోక్తిగా జెప్పినాడు. 13వ శతాబ్దిని చెందిన వోపదేవుడే దీని కర్తయైనచో రెండు దశాబ్దముల తరువాతివాడగు పోతన, భాగవతకర్తగా వోపదేవుని చెప్పియుండెడివాడు. యదార్థమును కప్పిపుచ్చియసత్యమును వచించెడి తత్త్వము కలవాడుగాడు పోతన. కావున వోపదేవుడు శ్రీమద్భాగవత కర్తకాడని విదితమగుచున్నది. అష్టాదశ పురాణాంతర్గతమైన శ్రీమద్భాగవతము వ్యాసకర్తృకమేగాని తదన్యముకాదని పోతనాది మహాకవులు, ప్రాచ్యపాశ్చాత్య పండితులనేకులు నంగీకరించుచున్నందునను, శ్రీమద్భాగవతము వ్యాసకర్తృకముగానే బహుళ ప్రచారమునందుచేతను, దీనిని వ్యాసకర్తృకమనుట సమంజసము కాగలదు.

భారతీయసంస్కృతికి మూలస్తంభములైన భారత, భాగవత, రామాయణములు మూడును, ఆంధ్రమున బహుకర్తృకములై విరాజిల్లినవి. అందు భాగవతమనగా ఆంధ్రదేశమున పోతనభాగవతమనియేగాని వేరొండుగాదని ప్రజాభిప్రాయము. లోకమున పోతనభాగవతమని ప్రచారమునొందిన శ్రీమదాంధ్ర మహాభాగవతము కేవలము పోతన విరచితముకాదు. బమ్మెరపోతన, గంగన, ఏర్చూరి సింగన, వెలిగందల నారయ మున్నగు నలుగురు కవులచే రచింపబడినది. భాస్కరాదిబహు కర్తృకమైన రామాయణము భాస్కరరామాయణమను ప్రశస్తిని పొందినట్లే పోతనాదు

లచే రచింపబడిన భాగవతము పోతనభాగవతమను ప్రశస్తిని పొందినది. తక్కిన ముగ్గురు కవులచే రచింపబడిన స్కంధములకంటె పోతన రచించిన స్కంధములు సంఖ్యలోను, రచనాశిల్పములోను, అనువాదవిధానములోను మిన్నయై యుండుటచే ఈ ప్రశస్తియేర్పడియుండునని భావించుటకెట్టి సందేహమునులేదు. కాని భగవత్సందేశానుసారము భాగవతాంధ్రీకరణమున కుపక్రమించిన పోతన యితరులకేల యిందు ప్రవేశము కల్పించెనో ? వారేయేభాగము లాంధ్రీకరించిరో ? వివాదాస్పదమైయున్నది.

ఆంధ్రభాగవతము సంపూర్ణముగా పోతనవిరచితమనియు, అది శిథిలమగుటచే నితరులు దానిని పూర్తిగావించినారనియు కొందరు విమర్శకులు, లోకులు భావించుచున్నారు. ఈ శైథిల్య గ్రంథపాతములకు కారణములైనవిగా లోకమున కొన్ని కథలు ప్రచారములోనున్నవి. ఇట్టి ప్రచారమునకు క్రీ. శ. 1740 ప్రాంతములో కూచిమంచి తిమ్మకవిచే రచింపబడిన 'లక్షణసార సంగ్రహము'న గ్రంథస్థము గావించిన విషయము కారణము కావచ్చును. అందు నీవిధముగానున్నది.

"సీ. ఘనుడు పోతనమంత్రి మును భాగవతము ర
చించి చక్రికి సమర్పించు నెడల
సర్వజ్ఞసింగయ క్ష్మాపకుండది దన
కిమ్మని వేడిన నిడక యున్న
నలిగి యా పుస్తకంబవనిఁ బాతించిన
జివికి యందొాక కొంత శిథిలమయ్యెఁ
గమ్మర నది వెలిగందల నారప
రాజును మఱి బొప్పరాజు గంగ
రాజు మొదలగు కవివరుల్ దేజమెసఁగ
జెప్పిరా గ్రంథముల యందె తప్పులొాదవెఁ
గాని పోతన కవీంద్రుని కవిత యందు
లక్షణం బెందుఁదప్పదు దక్షహరణ !

వ. పోతరాజు చెప్పినవి ప్రథమస్కంధమును ద్వితీయ స్కంధమునఁగొంతయు షష్ఠ సప్తమాష్టమ నవమ స్కంధములును దశమ స్కంధము పూర్వభాగము కొంతయున్నది. ఇందులో శేష అకార సాంకర్యము లేకుండుటకు వ్రాయు చున్నాము."[27]

దీని నాధారముగాచేసుకొని సర్వజ్ఞసింగభూపాలుడు పోతన భాగవతమును తనకంకితమీయని కారణముగా పాతించెననియు, తదనంతరకాలమున అతనికేదియో బాధకలిగినదనియు, దీనికికారణము నీభర్త భాగవతమును పాతిపెట్టించుటయేగాన దానిని వెలికి తీయించి లోకములో ప్రచారము చేయుమని శ్రీరామచంద్రుడు సింగభూపాలుని భార్యకు కలలోప్రత్యక్షమై చెప్పెననియు, ఆ సతీమణి యావిషయమును సింగభూపాలున కెఱిగించి యీ గ్రంథమును పైకితీయింపగా నందలి తాళపత్రములు కొన్నిశిథిలమై యుండెననియు, ఆ శిథిలభాగములను నారయాదులు పూరించిరనియు అనేకములైన నూహలు పండితులకు బయలుదేరినవి.

పోతనగారు భాగవతమునువ్రాసి యెవ్వరికిని విన్పింపక నిది జానపదులకు చిక్కిన పాడగునని దేవతార్చనపీఠములో దైవసన్నిధానమున నుంచి యర్పించు చుండెడివాడనియు, ననంతరము వీరికుమారులు ఆగ్రంథమును బయటకుతీసిచూడనందు కొన్నిభాగములు క్రిమిదష్టములగుట నష్టములై యున్నవనియు, శిథిలములైన నాయా భాగములను నారయాదులు పూరించిరనియు లోకమున ప్రచారములోనున్న మరియొక ప్రవాదము. ఈ ప్రవాదమునకు క్రీ. శ. 1848వ సంవత్సరమున ఆంధ్రభాగవతమును మొదట ముద్రింపించిన శ్రీపురాణం హయగ్రీవ శాస్త్రులవారు తమ పీఠికలో భాగవతగ్రంథపాతముల కీవిధమైన కారణమును ప్రతిపాదించుటయే ఆధారము.

ఈ భాగవత శైథిల్యమునకు ఆధునిక విమర్శకులు కారణాంతరములు వెలి బుచ్చుచున్నారు.

"క్రీ. శ. 1474-75 నాటికి తెలంగాణమున రాచకొండ దేవర 'ండ ప్రభువుల రాజ్యమంతరించినది. అది పూర్తిగా రెండవ మహా మ్మద్‌షా రాజ్యకాలమున అతని యధికారముక్రిందికి వచ్చినది. ఈ బహ్మనీ, రేచెర్ల వంశముల యుద్ధమున తెలంగాణమున శాంతి భద్రత లంతరించినవి. గ్రామదహనములతిశయించినవి. భాగవతమున కొన్ని భాగములుత్సన్నమగుట కప్పటి రాజకీయ సంక్షోభమే కారణము కావచ్చును."[28]

అని మల్లంపల్లి సోమశేఖరశర్మగారానాటి మత సాంఘిక రాజకీయసంక్షోభములే భాగవత శైథిల్యమునకు కారణమని వివరించియున్నారు. ఆప్లే వేటూరి ప్రభాకరశాస్త్రి గారాకాలమున ఆనగరము విప్లవముల పాలగుటచే విద్యావినోదముల కవకాశములేక

కొంతకాలము వఱకు ఆ గ్రంథము నెవ్వరును తాకకుండుటచే నందు కొంత శిథిలమై యుండుననుఁ అభిప్రాయమును వెలిబుచ్చిరి.[29]

ఏకారణము వలననైనను పోతరాజకృత భాగవతమునందలి కొన్ని భాగములు శిథిలమగుటవలననే పంచమ స్కంధమును గంగన, షష్ఠ స్కంధమును సింగన, ఏకాదశ ద్వాదశ స్కంధములను నారయ, పూరించిరని కొందరు విమర్శకులు తలంచుచున్నారు. మరికొందరు ప్రత్యేకముగా కొన్ని స్కంధములు పూర్తిగా శిథిలమగుట సమంజసముకాదు గావున ఈ స్కంధములతోబాటు 2, 3, 4 స్కంధములలోను, దశమస్కంధోత్తర భాగములోను అక్కడక్కడ శిథిలములుకాగా అన్యులాయా భాగములను పూరించిరనియు తలంచుచున్నారు. కొన్ని ప్రతులలో ద్వితీయ స్కంధమున బ్రహ్మ నారదునకు తత్త్వోపదేశముచేయు సందర్భమున

ఉ. అట్టి యనంతశక్తి జగదాత్ముని నాభిసరోజము దు నేఁ
బుట్టి యజింపగా ............

- ఆం. భాగ. ద్వితీయ. 93

అను పద్యము మొదలుకొని వెలిగందల నారయ కవిత్వమని యుండుటచేతను దశమ స్కంధోత్తర భాగమున శ్రీ కృష్ణుడు రుక్మిణీదేవివినోదార్చు సందర్భము నందలి

సీ. కాటుక నెరయంగ కన్నీరు వరదలై
కుచ కుంభయుగళ కుంకుమము తడియ

- ఆం. భాగ. దశమ. ఉ. భా 237

అను సీసపద్యము నందలి నాల్గవ పాదమునుండి నారయ కవిత్వమని యుండుట చేతను 5, 6, 11, 12 స్కంధములతోబాటు ఈ భాగములు కూడ శిథిలములై యుండునని కొందరూహించుచున్నారు. ఈ విధముగా శిథిలపూరణ వాదులు సైతమేయే భాగములు నిర్దిష్టముగా శిథిలములైనవో నిర్ణయింపలేకున్నారు. కాని శైథిల్య కారణముచేతనే భాగవతమున నన్యుల హస్తము ప్రవేశించినదని యంగీకరించుచున్నారు.

ఈ శైథిల్య వాదమిట్లుండగా "చారిత్రకముగా భాగవతగ్రంథరచనా క్రమమునుబట్టి శిథిల పూరణ, గ్రంథపాత సందర్భముల కేమాత్రము తావులేదని గ్రహించునది."[30]

అని నిడుదవోలు వేంకటరావు ప్రభృతులు భావించుచున్నారు. వీరి యుద్దేశ్యమున పరహస్తము లిందు ప్రవేశించుటకు కారణమఖయగా నాశ్వాసాంత గద్యలను బట్టియు, రచనా శైలిని బట్టియు, తదితర కారణములను బట్టియు పోతన కాలమున వారి యనుమతితోనే నారయాదు లాయా స్కంధములను రచించుట జరిగినదని భావింపవచ్చును. ఈ విషయమును పింగళి లక్ష్మీకాంతం గారును, ఖండవల్లి లక్ష్మీరంజనం గారును , ప్రసాదరాయ కులపతి గారును అంగీకరించిరి. వీరి వాదములను బట్టి చూచినచో పోతన భాగవత రచనకుపక్రమించి మొదటి నాల్గు స్కంధములు రచించిన పిదప భక్తిరసప్రధానములగు 7, 8, 9, 10 స్కంధములు తానే రచింపదలచి పంచమము గంగనకు, షష్ఠము సింగనకు ఇచ్చియుండుననియు, అంతియేగాక గంగన సింగనలు తమకు భాగవత రచనావకాశము కల్పింపుడని ప్రార్థించి యుండురనియు, కావుననే వారికి భాగవత రచనావకాశము పోతనచే కల్పింపబడె నన్నియు తెలియుచున్నది. దశమ స్కంధాంతమున కేసుసరికి పోతన వృద్ధవయస్కుడగుటచే పూర్తిగావింప నశక్తుడై యుండియుండును. కాని భాగవతమును పూర్తి గావింపనిచో మోక్షము లభింపదను భయముతో తన ప్రియశిష్యుడగు నారయను పిలచి ఏకాదశ, ద్వాదశ స్కంధములను రచింపజేసి యుండును. లేదా పోతన యనంతరము నా రెండు స్కంధములను నారయ రచించి యుండవచ్చును. ఏది యేమైనను వీరి వాదనను బట్టి 5, 6, 11, 12 స్కంధములు దక్క తక్కిన స్కంధములను పూర్తిగా పోతనయే రచించినాడని నిర్ణయింపవచ్చును. ఈ వాదన ననుసరించి పరిశీలించినను, శిథిల వాదన ననుసరించి పరిశీలించినను పంచమ, షష్ఠ, ఏకాదశ, ద్వాదశ స్కంధములు గంగనాదులచే రచింపబడినవనుటలో సందియము లేదు. పై రెండు వాదములకును రెండు స్థానములలో ఏకాభిప్రాయము కుదురుటలేదు అవి 1. ద్వితీయ స్కంధములో బ్రహ్మ నారదునకు తత్త్వోపదేశముచేయు సందర్భమునుండి స్కంధాంతమువఱకుగల భాగము. 2. దశమస్కంధోత్తర భాగములో శ్రీకృష్ణుడు రుక్మిణీదేవి నోదార్చు సందర్భము నందలి "కాటుక నెర యంగ ... ..." అను పద్యమునుండి స్కంధాంతము వఱకుగల భాగము. ఇట ద్వితీయ స్కంధ భాగ కర్తృత్వ వివాదమప్రస్తుతము. కావున దశమ స్కంధోత్తర భాగ కర్తృత్వ విషయమే చర్చింపబడుచున్నది. ముందుగా శిథిలపూరణ వాదము ననుసరించి దశమస్కంధోత్తర భాగ కర్తృత్వ నిర్ణయము చేయదలచినచో శైథిల్యమునకు కారణమరయ వలసియున్నది. శైథిల్యమునకు హేతువులుగా లోకమున ప్రచారములో నున్న పోతన దేవతార్చన పేటికలో బంధించుటచే శైథిల్యమందిన దనుట గాని, సింగభూపాలుడు పాతిపెట్టించుటవలన శిథిలమైనదనుటగాని యంగీక

రింప వీలుగాదు. మల్లంపల్లి సోమశేఖరశర్మ, వేటూరి ప్రభాకరశాస్త్రి మున్నగు విమర్శకులు చూపిన విధముగా నాటి మత, సాంఘిక, రాజకీయ సంక్షోభములే యీ దశమ స్కంధోత్తర భాగ శైథిల్యమునకు హేతువులని భావింపవచ్చును. దశమ స్కంధోత్తర భాగమందలి 237 వ పద్యము నుండి స్కంధాంతము వఱకు పూర్తిగా నారయ పూరణమా ? లేక అచ్చటచ్చట శిథిలములైన భాగములు మాత్రము నారయ పూరితములా ? అను విషయమున వివిధ విమర్శకుల యభిప్రాయములు, వారుచూపిన ఉపపత్తులు గమనింపవలసియున్నవి. దశమ స్కంధోత్తర భాగము నారయకృత మనువారీ క్రింది యుపపత్తులను చూపించు చున్నారు.

దశమస్కంధోత్తరభాగమున శ్రీకృష్ణుడు కేళీగృహమున రుక్మిణీదేవితో విరసోక్తులాడుట యను ఘట్టములో

సీ. కాటుక నెఱియంగఁ గన్నీరు వరదలై
కుచకుంభయుగళీ కుంకుమము తడియ

-ఆం. భాగ. దశమ. ఉ.భా. 237

అనుపద్యము నుండి స్కంధాంతము వఱకు నారయ పూరించెనని పూర్వపీఠికల యందు వ్రాయబడియున్నది. కాన నిచటనుండి నారయకవిత్వమని పేరివాదన.

రెండువందల తాళపత్రప్రతులను, ఇప్పటివఱకు నచ్చుపడియున్న భాగవత ప్రతులన్నిటిని సంపాదించి పరిశీలించిన అకాడమీ సంపాదకవర్గము 'కాటుకనెఱ యంగ...' అనుపద్యమున కథసూచికలో "బండిగోపాలువ్రాసిన ప్రతిలో ఈ సీసపద్యపు నాలుగవపాదము నుండి వెలిగందల నారపరాజు కవిత్వమనియున్నది"[31] అని వ్రాసినారు. దీనినిబట్టి బండిగోపాలుని వ్రాతప్రతిలో దక్క ఇతర వ్రాతప్రతులలోగాని, తాళపత్ర ప్రతులలోగాని యీవిషయము లిఖింపబడి యుండలేదను విషయము స్పష్టమగుచున్నది. కావున నొక్క ప్రతిలో నున్నదానిని మాత్రమే గ్రహించి ప్రమాణమని భావించి విద్వాంసులు తమపీఠికలలో సుద్ఘాటించి యున్నారని విశదమగుచున్నది. కేవలమొక్క ప్రతినాధారముగా జేసుకొని సిద్ధాంతీకరించుట యుక్తముకాదు. అంతియేగాక నీవాదము నంగీకరించినచో భాగవత మునందలి ప్రధానఘట్టములలో నొకటియైన కుచేలోపాఖ్యానము నారయకవిత్వము కావలసియుండును. కాని కుచేలోపాఖ్యానమును గుఱించి వివరించుచు విమర్శకు లందరును, కుచేలుని దారిద్ర్యావస్థను వర్ణించునపుడావర్ణన పోతన యనుభవపూర్వక ముగా వ్రాసినదేయని యేకగ్రీవముగా నంగీకరించి యున్నారు.

కీ. శే. తంజనగరము తేవప్పెరుమాళ్లయ్యగారిచే వ్రాయబడిన పాఠాంతరములతో శ్రీమాన్ బుక్కపట్టణము రామానుజయ్యగారిచే పరిశోధితమై క్రీ. శ. 1928 వ సంవత్సరములో వేమూరు వేంకటకృష్ణమసెట్టి అండ్ సన్సుచే ప్రచురింపబడిన శ్రీమదాంధ్రభాగవతమున

సీ. సాల్వజరాసంధ చైద్యాదిరాజులు
చెలగి నన్ వీక్షించి మలయుచుండ

-ఆం. భాగ. దశమ. ఉ.భా 235

ఆపద్యమున కథసూచికలో 'ఈపద్యము నల్గవ పాదమునుండి వెలిగందల నారయగారి కవిత్వమని, వ్రాతప్రతులలో వ్రాయబడియున్నది' అని వ్రాసినారు. దీనినిబట్టి చూచినచో 235వ పద్యమునుండియే నారయకవిత్వమని వ్రాతప్రతులనేకము లందున్నట్లు గోచరమగుచున్నది. ఒక్కప్రతియందు మాత్రముండుటచే 237 వ పద్యమునుండి నారపరాజు కవిత్వమని యంగీకరింపకున్నను, అనేకములైన వ్రాత ప్రతులలో నుండుటచే 235వ పద్యమునుండియే నారపరాజు కవిత్వమని యంగీకరింప వచ్చునుకదా ? యని వాదించవచ్చును. కాని యిదియును సమంజసముగాలేదు. ఏలయన వ్రాతప్రతులలోనేగాని, తాళపత్ర ప్రతులలో ఈవిషయమెచ్చటను గానంబడ లేదు. అట్లయిన తాళపత్ర ప్రతులలోలేని విషయ మీ వ్రాతప్రతులలోనెట్లు ప్రవేశించిన దని ప్రశ్నింపవచ్చును. కూచిమంచి తిమ్మకవి గ్రంథస్థముగావించిన కట్టుకథ నాధార ముగా చేసికొని తరవాతి వారు వ్రాతప్రతులలో దీనిని కల్పించియుందురని భావింప వచ్చును. తిమ్మకవికి పూర్వుడగు అప్పకవి యీభాగమునందలి పద్యములను పోతన కృతములుగా నుదహరించుటయే యిందులకు నిదర్శనము. కావున అప్పకవికి ముందుగానున్న తాళపత్రప్రతులలో నీభాగము నారపరాజు కవిత్వమని లిఖింపబడి యుండలేదను విషయము స్పష్టమగుచున్నది. పోతన యప్రామాణికుడను నప్పకవి వాదమును ఖండింపనెంచి తిమ్మకవి యీకట్టుకథను కల్పించినట్లు పలువురు విమర్శకు లంగీకరించుచున్నారు. కావున తిమ్మకవి కట్టుకథనాధారముగా చేసుకొని కల్పింప బడిన వ్రాతప్రతులు, వానినాధారముగా చేసుకొని నిర్ణయించిన నారయకర్తృత్వవాదము నంగీకరింపదగినది కాదని చెప్పవచ్చును.

అంతియేగాక నేకాదశస్కంధాంత గద్యంలో 'ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రియశిష్య వెలిగందల నారాయణాఖ్య ప్రణీతంబైన భాగవతంబను మహాపురాణంబునందు......' అని నిష్కర్షగా చెప్పుకొనిన

నారయ దశమస్కంధోత్తర భాగమును తానురచియించి యున్నచో స్కంధాంత గద్యమున 'ఇది శ్రీ పరమేశ్వరకరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రి పుత్రి సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీమహాభాగవతంబను మహాపురాణంబునందు......' అని యేల వక్కాణించును ? కాన నిది నారయకవిత్వముగాదని భావింపవచ్చును. ఎట్లన, నన్నయగారిపైగల భక్తిప్రపత్తులతో తత్ప్రియవనయే సనుసట్టారణ్యపర్వశేషమును పూరించినను, ఆశ్వాసాంత గద్యమును నన్నయపేర వెలయించినట్లుగనే తన్మార్గానుయాయియై గురువుగారిపైగల భక్తిప్రపత్తులతోను, భాగవతకల్పతరువునకు మూలమైన శ్రీకృష్ణుని చరిత్రగల దశమస్కంధము పోతనవంటి భాగవతోత్తముని పేర వెలయించిన లోకమున నధిక పరిగారము, ప్రఖ్యాతి లభించుననియు తలంచి యాశ్వాసాంతగద్యమును పోతనపేర నారయ వెలయించి యుండునని వాదించవచ్చును. కాని యీ వాదన పొసగదు. ఎఱ్ఱన మార్గానుయాయియైనచో ఆశ్వాసాంతగద్యము పోతనపేర వెలయించినను 'తత్ప్రచనయ కా నరణ్య పర్వశేషమును రచియింతునని' యెఱ్ఱన చెప్పుకొనినట్లు నారయయు నెందేనొకచోట ఈ విషయమును వ్యక్తీకరించి యుండెడివాడు. అంతియేగాక అంతటి గురుభక్తి కలిగినవాడైనచో ఏకాదశ ద్వాదశ స్కంధములను సైతము పోతనపేర వెలయింప వచ్చునుగదా ! సర్వవేద సారభూతమైన్న భాగవతమునకు వేదాంత విషయ ప్రధానమగు ఏకాదశ ద్వాదశ స్కంధములను పరమనైష్ఠికుడైన పోతన పేర వెలయించినచో ఆ భాగములుగూడ లోకములో మరింత ప్రచారము పొందియుండెడివి గదా ! కావున పోతనపైగల భక్తి ప్రపత్తులచేగాని, తాను రచించిన భాగ మధిక ప్రచారము పొందవలెనను కుతూహలముచేగాని, దశమ స్కంధోత్తర భాగము పోతనపేర నారయ వెలయించినాడను వాదము బలముచాలని విషయము.

అంతియేగాక నారయగాని, తక్కిన స్కంధములను రచించిన గంగనాదులు గాని, పోతన వారసులును దాక్షాయణీ పరిణయాది గ్రంథకర్తలైన కేసన మల్లనాదులు గాని దశమ స్కంధోత్తరభాగము పూర్తిగా శైథిల్యము నందుటచే నారయచే పూరింపబడినదని యెచ్చటను ప్రస్తావించి యుండలేను. కాన దశమ స్కంధోత్తరభాగము నారయ రచన కాదని చెప్పవచ్చును.

గంగనాదులు పేర్కొనకపోయినంత మాత్రమున నీ భాగము పోతన కృతమని వాదించుట పొసగదు. పోతన రచనారీతికిని, నారయరచనా రీతికిని స్పష్టమగు

భేదము కలదు. అట్టిరచనా భేదము దశమస్కంధ పూర్వోత్తరభాగములందు స్పష్టముగా కానంబడుచున్నవి. కాన దశమస్కంధోత్తరభాగము నారయకృతమని వాదింపవచ్చు. కాని యథార్థమును పరిశీలించుచో నీవాదము సత్యము కాదను విషయము స్పష్టమగుచున్నది. స్థాలీపులాకముగా కొన్ని యుదాహరణములను పరికింపుదము.

పోతనకవిత్వమున కలంకారమైన అంత్యనియమాది శబ్దాలంకారము లీ భాగమునందంతటను కన్పట్టును. ఉదాహరణమునకు కొన్ని పద్యము లీ క్రింద [illegible] నవి: ఈ యంత్యప్రాసనియమము నారయ కవిత్వమున కానరాదు.

క. కోరి విదర్భుండు కుటిల వి
హారుండై పిలిచె జూదమాడ జితారిన్
హారిన్ సన్నుతసూరిన్
సీరిన్ రైవతసుతార్ద్ర చిత్తవిహారిన్

— ఆం. భాగ. దశమ. ఉ. భా 293

సీ. కమనీయ శుభగాత్రుఁ గంజాతదళనేత్రు
వసుధాకళత్రుఁ బావనచరిత్రు
సత్యసంకల్పు నిశాచరోగ్రవికల్పు
నతపన్నగాకల్పు నాగతల్పుఁ
... ... ... ... ... ...

— ఆం. భాగ. దశమ. ఉ. భా 657

సీ. నవపద్మలోచను భవబంధమోచను
భరిత శుభాకారు దురితదూరుఁ
... ... ... ... ... ... ...

— ఆం. భాగ. దశమ. ఉ. భా 747

ఇత్యాదిగాగల పద్యములను తిలకించినచో పోతనశైలికిని, [illegible] శైలికిని ఎట్టిభేదము కానంబడకుండుటచేతను, ఇట్టిశైలి పోతన [illegible] మైన దగుటచేతను, ఈభాగమును పోతనకృతముగా సంగ్రహించుటలో [illegible] లేదు. అంతియేగాక పోతనకృతములని [illegible] దశమ పూర్వభాగ మందలి పద్యములను, ఇతరస్కంధములందలి పద్యములను బోలిన పద్యము లీ భాగము నందును కానంబడుచున్నవి.

దశమస్కంధ పూర్వభాగమున శ్రీకృష్ణుడు గోపబాలురతో వల్లులారగించుటకు సిద్ధమై, వారుగాంచిన

మ. కనియెం గృష్ణుడు సాధునీరము మహాగంభీరముం బద్మకో
కనదస్వాదువినోదమోదమదభృంగద్వంద్వఝుంకారమున్
ఘనకల్లోలలతావితానవిహారత్కాదంబ కోలాహల
స్వనవిస్ఫారము మందవాయుజకణాసారంబుఁ గాసారమున్.

—ఆం. భాగ. దశమ పూ. భా 469

అను కాసార వర్ణనమును, దశమస్కంధోత్తర భాగమున శ్రీకృష్ణుడు చూచిన యాక్రించి ద్వారకాపట్టణమును గాంచినచో పూర్వోత్తరభాగములు పోతన కృతము లని నిష్కర్షగా చెప్పవచ్చును.

మ. కనియెం గోపకుమారశేఖరుడు రంగత్ఫుల్లరాజీవకో
కనదోత్తుంగతరంగసంగతలసత్కాసారకన్ భూరిశో
భనవితోన్నత సౌఖ్యభారక నుదంచద్వైభవోదారకన్
జనసంతాపనివారకన్ సుజనభాస్వత్తారకన్ ద్వారకన్

—ఆం. భాగ. దశమ. ఉ. భా 445

అట్లే భావనలోను పూర్వభాగమునకు, నుత్తర భాగమునకు సామ్యము కనబడు చున్నది. ఉదాహరణకు భూదేవి యౌన్నత్యమును పొగడుచు నానుద్దేశించి గోపికల పలుకులు.

క. కిటియై కౌగిటఁ జేర్చెను
వటుడై వర్ధిల్లి కొలిచె వడిఁ గృష్ణుండై
యిటఁ బద చిహ్నము లిడెఁ గ్రిం
దటిబాముున నేమి నోచి తమ్మ ధరిత్రీ!

—ఆం. భాగ. దశమ పూ. భా 1017

శుద్ధాంత కాంతాజనంబులు కుచేలుని యౌన్నత్యమున కద్భుతమంది పల్కిన పలుకులు.

ఉ. ఏమి తపంబు చేసె నొకొ యీధరణీదివిజోత్తముండు దొల్
బాముున యోగివిస్ఫురదుపాస్యకుడై తనరారునిజగత్

స్వామి రమాధినాథునిజతల్పమునన్ వసియించి యున్న వా
డీమహనీయమూర్తి కెనయే మునిపుంగవు లెంతవారలున్.

—ఆం. భాగ. దశమ ఉ. భా 981

ఈ యుగమున సైతము శ్రీకృష్ణుని పాదచిహ్నములు ధరించుటకు భూదేవి యేమి తపము చేసినదో? అను పూర్వభాగములోని భావనకు. శ్రీకృష్ణుని నిజతల్పమున వసించుటకు కుచేలుడేమి తపంబు చేసెనో? అను నుత్తరభాగములోని భావనకు చక్కని సామ్యము కనబడుచున్నది. అనితరసాధ్యమైన దానిని సాధించిన వారిని చూచి వారెట్టితపము చేసినారోగదా! యనిభావించుట రెండింట సమానముగా నున్నది.

అంతియేగాక పోతనకృతములుగా సర్వజనామోదము నందిన నితరస్కంధము లందలి పద్యములకును, నారయ కృతమని భావింపబడుచున్న దశమస్కంధోత్తర భాగము నందలి పద్యములకును, భావనలోను, శైలిలోను సామ్యము కన్పట్టుచున్నది.

సీ. నీరదాగమ మేఘనిర్యత్ పయఃపాన
చాతకం బేగునే చౌటిపడెకు

—ఆం. భాగ. దశమ ఉ. భా 257

సీ. మందారమకరందమాధుర్యమునఁ దేలు
మధుపంబువోవునే మదనములకు

—ఆం, భాగ. సప్తమ 150

ఈ రెండుపద్యములరశలి భావమును, రచనారీతిని పరిశీలించినచో నేకకర్తృక ములనుటలో సందియము కానరాదు. అట్లే

ఆ. భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు
శూలి కైనఁ దమ్మిచూలి కైన

—ఆం భాగ. ప్రథమ. 17

తే. గీ. .........దద్భాలకావళి కెన్నఁదరమె
శూలి కైనను దామరచూలి కయిన

—ఆం. భాగ. దశమ ఉ.భా. 278

అనురెండు పద్యము లందలి శబ్దసామ్యము రెండును పోతన కృతములేయని చెప్పకే చెప్పుచున్నది.

చ. హరి భజియించు హస్తములు హస్తము లచ్యుతుఁ గోరి మ్రొక్కు త
    చ్ఛిరము శిరంబు..................
-ఆం. భాగ. దశమ. ఉ. భా 959

సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు
    శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
.....-ఆం. భాగ. సప్తమ 169

అనురెండును

ఆ. నిన్ను ననుసరింప నేరని కుజనులు
    పవనపూర్ణ చర్మభస్త్రసమితి
-ఆం. భాగ. దశమ. ఉ. భా 1209

సీ. కంజాక్షునకు గాని కాయంబు కాయమే
    పవనకుంభితచర్మభస్త్రిగాక
-ఆం. భాగ. సప్తమ 170

అనురెండు నత్యంత శబ్దసామ్యముతో, భావ సామ్యముతో కనంబడుచున్నవిగదా!

ఈ విధముగా పదప్రయోగము నందును, శబ్దాలంకార గుంభనమునందును, శైలీ విధానము నందును, భావనాచిత్రణము నందును పూర్వోత్తర భాగములును, పోతనకృతేతరస్కంధములును, దశమస్కంధోత్తర భాగమును, సామ్యము నంది యుండుటచే నారయకృతమని కొందరిచే భావింపబడుచున్న నీభాగము పోతనకృతమే అని చెప్పవచ్చును.

పోతన ప్రియ శిష్యుడైన నారయ గురువుగారి ననుకరించుటచే నీ సామ్యము సిద్ధించినదని భావింపవచ్చునుగదా యని వాదింపవచ్చును. కాని యీవాదనయు నంగీకార్యముకాదు. ఎందువలననగా నిట్టి సామ్యము ఏకాదశ ద్వాదశ స్కంధము లందు గానంబడకుండుటయే. అంతియేగాక ననుసరణ కొన్ని స్థలములందే సాధ్యము కాని యన్ని తావులందు నసంభవము కదా! గురువుగారి ననుసరించుట చేతనే ఈ రచనా సామ్యము సిద్ధించినదని యంగీకరించినచో ననువాద వైఖరితో నిరువురకు భేదమేల కలిగియుండును, పోతనయందు గానంబడు 'అమూలక భావవిస్తృతి'

నారయ యందు గానంబడదు. నారయ యనువాదము మూలము కంటె సంక్షిప్తముగ, కొన్ని తావులందు మూలాభిప్రాయమునకు భిన్నముగనుండును. ఈ విషయమునే నిడుదవోలు వేంకటరావుగారు "నారయ ఏకాదశ ద్వాదశస్కంధ రచనము మూలమున కంటె చాలచోట్ల న్యూనముగను, కొన్ని యెడల మూలాభిప్రాయమునకు విరుద్ధముగ నున్నది."[32] అని వివరించిరి. అట్లే నారయ యనువాదమునకును పోతన యనువాదమునకును పొంతన సంభవింపదని వేంకటరావు గారిట్లు వక్కాణించియున్నారు. "నారయ రచితమైన యేకాదశ ద్వాదశ స్కంధము లిట్లు మూలమునకు భిన్నముగా నుండి, పోతన గ్రంథముతో పొత్తు కలుగకపోవుటచేతనే, యానాటి నుండి నేటి వరకు నీరెండు స్కంధములను నయిదారుగురు కవులు కలిగింప వలసిన యావశ్యకత కలిగినది"[33] కావున దశమ స్కంధోత్తర భాగము సైతము నారయ కృతమైనచో నేకాదశ ద్వాదశ స్కంధములవలె మూలము కంటె భిన్నముగ, న్యూనముగ, సంక్షిప్తముగ ననువదింప బడియుండవలె. కాని యీభాగమున పోతన యనువాదలక్షణమైన 'అమూలకభావవిస్తృతియే' కానంబడుచున్నది గాని నారయ లక్షణము కానంబడుట లేదు. కావున దశమస్కంధోత్తరభాగము నారయకృతము కాదనియు, పోతన కృతమనియు చెప్పవచ్చును.

నారయ కృతములగు నేకాదశ ద్వాదశ స్కంధములందెందును గానంబడనట్టియు, పోతనకృతమని సర్వజనామోదమును పొందిన తక్కిన స్కంధములందును, దశమస్కంధపూర్వభాగమునందును కనబడునట్టియు లయవిభాతి, లయగ్రాహ్యాది పద్యములు దశమస్కంధోత్తర భాగమునందు కానంబడుటను బట్టియు నీ భాగము పోతన కృతమని నిర్ణయింపవచ్చును.

ఎఱుగమి నయినను భూసుర
వరులధనం బపహరింప వలవదు పతికిన్
మఱపున ననలము ముట్టిన
చఱికొని వేసఁ గాల్పకున్నె తనువెరియంగన్.

—ఆం. భాగ. దశమ. ఉ.భా. 476

ఇందు సాధు శకట రేఫలకు ప్రాసమైత్రిని కుదుర్చుట చేతను

సీ. కరుణాపయోనిధి మఱి యొక యింటిలోఁ
జెలిఁగూడి విడియము సేయుచుండు

-ఆం. భాగ. దశమ. ఉ. భా. 617

ఆ పద్యమున సాధుశకటరేఫలకు ప్రాసయతిని కూర్చుటచేతను దశమ స్కంధోత్తరభాగము పోతరాజుకృతము కాదనియు, పోతరాజకృత భాగవతభాగములలో నెచ్చటను రేఫఱకారమైత్రిలేదనియు కాన నీభాగము నారయ కృతమనియు వాదించుచున్నారు. రేఫఱకారమైత్రినిబట్టి కర్తృత్వనిర్ణయము చేయదలచినచో

క. సురసతుల విలోకనములు
సరసాలాపములు నర్మసంభోగంబుల్
మఱిగి[34] హరి మనల నొల్లఁడు
నరవరు లోయమ్మ నూతనప్రియులు గదే!

ఆం. భాగ. దశమ. పూ. భా. 1216

అనిరేఫఱకారమైత్రితో పోతరాజు చెప్పినాడని యహోబలపతి వ్రాసినవ్రాతను బట్టి భాగవత దశమస్కంధ పూర్వభాగముసైతము పోతరాజకృతముకాదని నిర్ణయింప వలసియుండును.

ఉ. బమ్మెఱ పోతరాజ కృతభాగవతంబు సలక్షణంబుగా
కిమ్మహి నేమిటం గొదువ యెంతయు నారసి చూడనందు శే
షమ్ములు ఱాలునుం గదిసి ప్రాసము లైన కతంబునం గదా!
యిమ్మగ నాది లాక్షణికు లెల్లను మానిరుదాహరింపగన్.

— అప్పకవీయము; ద్వి. ఆ. 234

అను పద్యమునుబట్టి పోతరాజుకవిత్వమునందు రేఫఱకారమైత్రి కలదని లాక్షణికులెల్లరు సంగీకరించిరని తెలియుచున్నది, కాన నీరేఫఱకార మైత్రిననుసరించి దశమస్కంధోత్తరభాగము నారయకృత మనరాదు. ఇదియు పోతనకృతమే. అయినచో నిదియలాక్షణిక ప్రయోగముకదా! పోతన యిట్టిపనిచేయునా ? అని ప్రశ్నింపవచ్చును. దీనికి తిమ్మకవి పలికిన "మహాకవులకు శేఫఱకారముల పట్ల పరిశీలనలేక పోయినది."[35] అనువాక్యమే సమాధానము కాగలదు.

"దశమస్కంధోత్తర భాగంబునం దత్త్వఘట్టముల తెనిగింపు చాలవఱకు విశిష్టాద్వైత పరముగానున్నది.

దేవాభవదీయ సంకల్పాధీనంబులైన శరీరంబులం బ్రవేశించి యున్న జీవసమూహంబు నీకు శేషభూతంబని తెలిసి కృతార్థులగుదురు.

... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...

... ... ఇట జీవ బహుత్వాణురూపత్వ శేషత్వములు, ఈశ్వరుని జగద్రూపము, చిదచిద్విశిష్టత్వము, శేషిత్వము, శరీరభూతచిద చిదాత్మకత్వము, సర్వశబ్దవాచ్యత్వము ఈశ్వరునియందు శ్రుతుల ముఖ్యవృత్తిత్వము మొదలగు విశిష్టాద్వైత సిద్ధాంతములు కాన్పించుచున్నవి."[36] అని తేవప్పెరుమాళ్ళయ్యగారు వక్కాణించియున్నారు. ఈవిధముగా విశిష్టాద్వైతపరమగు సిద్ధాంతములు దశమస్కంధోత్తర భాగములో కానంబడుటకి భాగము నారయ కృతమగుటయే కారణమని వీరి యభిప్రాయము. ఈవిషయమునే "నారయయే యాస్కంధంబులలో నుత్పన్నంబులు గాక చిక్కిన పోతన భాగంబులద్వైత పరములుగా నుండుటంజూచి నడుమ నడుమ విశిష్టాద్వైతపరముగాఁ దెనిగించుట పూర్వోత్తర వ్యాఘాతమునకుఁ బ్రసక్తి కలిగించునని తలంచి శ్రీధర వ్యాఖ్యానుసారముగా శక్తి కొలదిని దెనిగించి యుండుననియు, నైనను విశిష్టాద్వైతము వలని పక్షపాతమున నందంద తద్దర్శనానుసారముగాఁ గొంత తెనిగించి యుండుననియుఁ దోఁచెడిని. దశమోత్తరభాగమునఁ దత్త్వఘట్టముల నెల్ల నాతండొక్కరుండె తెనిగించినట్లు తోఁచుచున్నది. గాన నందుఁ బూర్వోత్తర వ్యాఘాతము ప్రసక్తింపదని తలచి దానినెల్లఁ దఱచుగా విశిష్టాద్వైత పరముగాఁ దెనిగించి యుండునని యూహింపవచ్చును."[37] అని తేవప్పెరుమాళ్ళయ్యగారు వివరించియున్నారు. కాని దశమస్కంధోత్తరభాగము నారయకృతమై యుండునను వారికిపల్కులు మిక్కిలి ప్రోద్బలకములగుచున్నవి. కాని "భాగవతములో కనుపించు విశిష్టాద్వైత పరవాక్యములనుచూచి అట్టి భాగముల్లు నారయవని పోతన వ్రాసిని వ్రాసియుండడని తేవప్పెరుమాళ్ళయ్యగారు పొరపాటుపడిరి. పోతన

రచనలుగా స్పష్టముగా వారును అంగీకరించిన భాగములలోనే అట్టి వాక్యములున్నవి. వానినెల్ల పోతనవికావని చెప్పజాలము. అది యునుగాక నారయది విశిష్టాద్వైతపరానువాదము కాదు. ఆతడును తనగురుపగు పోతన మార్గమునే అనుసరించెను. కావున మతము నాధారముగా చేసికొని గ్రంథభాగ కర్తృత్వమును నిర్ణయింప బూనిన శేషప్పరుమాళ్ళయ్యగారి వాదము అంగీకార్యము కాజాలదు. పైవిధముగా పరిశీలించిన దశమోత్తరభాగము పోతనదని నిస్సంశయ ముగా నిర్ధారణ చేయవచ్చును."[38] అని డాక్టర్ ప్రసాదరాయ కులపతిగారు దశమోత్తరభాగము పోతన కృతమని నిష్కర్షగా చెప్పియున్నారు. అయినచో శ్రీధర వ్యాఖ్యానుసారియై నద్వైతపరానువాదము గావించుచున్న పోతన రచిత భాగవత భాగములలో విశిష్టాద్వైత పరములగు వాక్యములేల చోటు చేసుకొనినవని ప్రశ్నించుచో భాగవతమును పోతన అద్వైతపరముగానే తెనిగించినను ఆ గ్రంథముయొక్క సహజ తత్త్వముచే అందచ్చటచ్చట విశిష్టాద్వైత పరవాక్యములు వచ్చినవని ప్రసాదరాయ కులపతిగారి సమాధానము. కాని "పోతనగారు శ్రీధరీయముకంటెను చిత్ర తరముగానున్న సందర్భములందుఁగూడఁ జంద్రికా వీరరాఘవీయ ములను స్వీకరింపలేదు. అద్వైత మతానుసారముగా నసిధారా వ్రతముతో నాతఁడు గ్రంథరచనమును గావించెననుట కెట్టి సందేహము లేదు. ఉభయ మత సాధారణముగా గ్రంథమును వ్రాయదలచు కొన్నచో నతఁడుభయమతముల కన్వయించు రీతిగా మూలభావము లను మలచుకొని యవిరుద్ధముగా వ్రాసియుండెడివాఁడు. అట్లుగాకఁ గొంత శ్రీధరీయము ననుసరించియు, కొంత చంద్రిక ననుసరించియు వ్రాసియుండఁడు. అట్లు వ్రాయుట నుభయమతసాధారణము కాకపోఁగా నుభయమత విరుద్ధమగును గదా!"[39] అని శ్రీరామమూర్తి గారి పలుకులను బట్టి శ్రీమద్భాగవతము విశిష్టాద్వైత సహజ లక్షణసమన్వితముకాదనియు, నట్టి విశిష్టాద్వైతమే భాగవత సహజ లక్షణమైనచో శ్రీధరీయము కంటె చిత్ర తరముగానున్న సందర్భములందు చంద్రికాదులను గ్రహించి యుండెడివాడనియు, కాని యాస్థితిలోసైతము శ్రీధరీయము ననుసరించుటచే కేవల మద్వైతపరముగా

మాత్రమే పోతన యనువదింపదలచినాడుగాని యుభయమత సాధారణముగా ననువదింప దలంచినవాడుకాడనియు విదితమగుచున్నది. కాన దశమోత్తరభాగము నందున్న విశిష్టాద్వైత రచనయంతయు నిస్సంశయముగా నారయ కృతమనియే శ్రీరామమూర్తిగారి యభిప్రాయము.

తేపప్పెరుమాళ్ళయ్య గారు ప్రతిపాదించిన విధముగా విశిష్టాద్వైత పరమగు సిద్ధాంతములీ దశమస్కంధోత్తర భాగమున నుండుట మాత్రమున నిది నారయకృతమని యంగీకరించుట కవకాశము కలదు. కాని తక్కిన నారయ కర్తృక వాదము లన్నియు పరాస్తమైనవి గదా! ఇట్టితఱి దశమస్కంధోత్తర భాగము నందలి 237వ పద్యమునుండి చివరవరకు నారయకృతమని యంగీకరింప వీలుకాదు. దశమస్కంధోత్తరభాగము తొలుదొల్త పోతనయే పూర్తిగా రచించినాడనియు, కారణాంతరములచే నందందు నుత్సన్నములు కాగా నా శిథిల భాగములను మాత్రమే నారయ పూరించినాడని భావింపవచ్చును. ఈ విషయమునే తేపప్పెరుమాళ్ళయ్య గారును ధృవపఱచుచున్నారు.[40] ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారును, శేషాద్రి రమణకవులును, వావిళ్లను సుబ్బారావు మున్నగు విమర్శకాగ్రేసరులు సైతము పైయభిప్రాయమునే వ్యక్తీకరించియున్నారు.

అలతియలతి శిథిలభాగములను పూరించినంత మాత్రమున దశమస్కంధోత్తర భాగము నారయకృతమనుట సమంజసముకాదు. లోకమున సైతమందందు శిథిల భాగములను పూరించిన వానిని తత్కర్తగా పరిగణించుటలేదు గదా! తత్కర్తృత్వ ప్రతిష్ఠ తొలుదొల్త రచించిన కవికే చెందుట పరిపాటి. కథాకథనమునగాని, పాత్రచిత్రణమునగాని, రసపోషణమునగాని, సాధారణముగా మొట్టమొదటి కవిననుసరించియే శిథిలభాగపూరణము జరుగుచుండును. అటులకాకున్నను శిథిలమైనపద్యమునో, పద్యపాదమునో పూరించునెడల రసపోషణాదులలో స్వాతంత్ర్యమును ప్రదర్శించుట కవకాశముండదు. స్వాతంత్ర్యమును చూపినచో నాభాగములు అతికినట్లుండునేగాని తొలిరచనతో పూర్తిగా సమ్మిశ్రితము కాలేవు. అట్లే దశమస్కంధోత్తరభాగమునందలి 237వ పద్యమునుండి చివరవఱకుగల భాగములో నచ్చటచ్చట నారయ చేయిపడినదనుటలో సందియములేదు. అంత మాత్రమున నారయకృతమనుట యుక్తముగాదు. కావున దశమస్కంధోత్తరభాగ రచనాప్రతిష్ఠ పోతనకు దక్కుటయే సమంజసము. కాని యందేయేభాగములలో, నేయే పద్యములపై నారయచేయిపడినదో నిదమిత్థముగా నిర్ణయించుట కవకాశములేదు. కావుననే స్థూలముగా "ఎనిమిది స్కంధములు నిస్సందేహముగా పోతన రచనలు,"[41]

అని నిడుదవోలు వేంకటరావు ప్రభృతులు నుడివియుందురని తలంపవచ్చును. కావుననే పోతన భాగవత దశమస్కంధముగా లోకములో ప్రతీతియును సంభవించి యుండును. కాన దశమస్కంధోత్తరభాగము స్థూలముగా పోతనకృతమని యంగీకరింపవచ్చును. దశమస్కంధ పూర్వోత్తరభాగములను కలసి 'పోతన భాగవత దశమస్కంధము'గా పేర్కొనవచ్చును.

# భాగవత రచనా సందర్భము.

వ్యాసమహర్షి శ్రీమద్భాగవత రచనా సందర్భము, కారణమును భాగవతారంభము లోనే చెప్పియున్నాడు. వ్యాసుడు సర్వవర్ణాశ్రమధర్మరక్షణకు వేదములను వర్గీకరించి, స్త్రీశూద్రాదులు వేదములు విననర్హులుకారని వారికై వేదార్థసారముతో భారతాఖ్యానమును రచించినను ఆత్మయు, ఆత్మలో నీశుడును, సంతసింపకున్నాడని తలచి సరస్వతీ తటమున నొంటరిగా కూర్చుండి

కిం వా భాగవతా ధర్మా న ప్రాయేణ నిరూపితాః।
ప్రియాః పరమహంసానాం త ఏవ హ్యచ్యుత ప్రియాః ॥

-సం. భాగ 1-4-31

అని విచారించు చుండగా నారదుడేతెంచి వ్యాసుని విచార హేతువునరసి

యథా ధర్మాదయశ్చార్థా మునివర్యానుకీర్తితాః।
న తథా వాసుదేవస్య మహిమా హ్యనువర్ణితః ॥

-సం. భాగ. 1-5-9

ధర్మాదులు కీర్తింపబడినట్లు వాసుదేవుని మహిమ యతనిచే కీర్తింపబడక పోవుటయే వ్యాసుని విచారమునకు హేతువని చెప్పి, హరిసేవా మహత్త్వమును, తన పూర్వ జన్మవృత్తాంతమును తెల్పి, విష్ణుగుణ వర్ణనముచేయ ప్రేరేపించి నారదుడేగగా, నారాయణ భక్తియోగము కంటె అఘోపశమనము మరియొకటి లేదని నిశ్చయించి, భువన క్షేమకరమైన భాగవతమును నిర్మించి ఆత్మశాంతిని పొందెనని భాగవతారంభమున కీర్తింపబడినది. దీనివలన భక్తితత్త్వ ప్రతిపాదనకు, తానాత్మశాంతిని పొంది పాఠకులకు ఆత్మశాంతిని కలిగించుటకు భాగవతము వ్యాసభగవానునిచే

రచింపబడినదనియు, సంస్కృత భాగవతావతరణమున కిదియే ప్రధాన హేతువనియు విశదమగుచున్నది.

ఇక శ్రీమదాంధ్రభాగవత రచనాసందర్భమునుగూర్చి యొకింతపరికింతము.

శ్రీమదాంధ్ర మహాభాగవతావతరణమునుగూర్చి పోతనగారే తమ గ్రంథమున తెలిపియున్నారు. పోతన తన పూర్వ జన్మ సహస్ర సంచిత తపః ఫలంబున శ్రీమన్నారాయణ కథాప్రపంచవిరచనా కుతూహలుండై యొక్క రాకానిశాకాలంబున సోమోపరాగంబు రాకగని యభ్రంకషశుభ్రసముత్తుంగభంగయగు గంగకుం జని క్రుంకులిడి పులినతలంబు మండప మధ్యంబున మహేశ్వర ధ్యానంబు సేయుచు కించి దున్మీలితలోచనుండై యున్న సమయమున మెఱుగుచెంగటనున్న మేఘంబుకైవడి నువిదచెంగటనుండ నొప్పు శ్రీరామచంద్రుడు ప్రత్యక్షమై 'మన్నామాంకితంబుగా శ్రీమహాభాగవతంబుఁ దెనుగుంజేయుము నీకు భవ బంధంబులు తెగునని' యానతిచ్చి తిరోహితుడయ్యె. అంతట పోతన సమున్మీలితనయనుండై

క. పలికెడిది భాగవత మట
పలికించు విభుండు రామభద్రుం డట నేఁ
బలికిన భవహర మగు నట
పలికెద వేఱొండుగాథఁ బలుకఁగ నేలా?

—ఆం. భాగ. ప్రథమ. 16

అని నిశ్చయించుకొని శ్రీమహాభాగవత పురాణ పారిజాత పాదప సమాశ్రయంబున హరికరుణా విశేషంబున కృతార్థత్వంబు సిద్ధించెనని బుద్ధినెఱింగి, కొన్ని దినములకు ఏకశిలానగరమునకు చనుదెంచి అందు గురువృద్ధబుధబంధుజనానుజ్ఞాతుండై భాగవతరచనకు పూనుకొనెను. దీనివలన పోతన జన్మసాఫల్యము నందుటకు శ్రీరామచంద్రుని యాజ్ఞానుసారము శ్రీమదాంధ్రభాగవత రచనకు పూనుకొనినట్లు విదితమగుచున్నది, ఈవిధముగా గ్రంథస్థాధారమునుబట్టి పరిశీలించినచో పోతన భాగవతావతరణ సన్నివేశమునకును, వ్యాసభాగవతావతరణ సన్నివేశమునకును, చక్కనిపోలిక కన్పట్టుచున్నది. అతిప్రసన్నమైన వాతావరణములో వ్యాస, పోతన లిరువురును, ఒకేవిధమైన మానసికస్థితి గలిగిన సందర్భములో పవిత్రనదీ తీరమున దివ్యులయాజ్ఞచే అనగా నచట నారదుని యాజ్ఞచేత, ఇచట శ్రీరాముని యాజ్ఞచేతను భాగవతరచన కుపక్రమించుట గమనించదగిన విషయము. కావున వ్యాస, పోతనల

భాగవతములు రెండు నొకే లక్ష్యముతో నసగా భక్తియోగ ప్రతిపాదన కొఱకు నవత రించినవనుట సుస్పష్టము.

పోతనకు శ్రీకైవల్యపదము చేపకొనవలెనను తలంపుకలుగుటకు, శ్రీమదాంధ్ర భాగవతరచనకు, గ్రంథస్థమైన పైకారణమేగాక నిత్యసంఘర్షణలతో సతమతమై, అపరిమిత సంకులమైన నాటి మత, సాంఘిక, రాజకీయాది పరిస్థితులు సైతము కారణమైయుండునని చెప్పవచ్చును.

పోతన భాగవతములోని 'మఱి కొన్ని దినంబులకు నేకశిలానగరమునకు వచ్చి'[42] అనువచనములోని యేకశిలానగరమను ప్రయోగమువలన వీరి నివాసము వివాదాస్పదమైనది. ఏకశిలానగరమన ఒంటిమిట్టయని వావిళ్లకొలను సుబ్బారావు ప్రభృతులు వాదింపగా పోతన ఓరుగల్లు మండలమునందలి బమ్మెరనివాసియని జయంతి రామయ్యపంతులు, మల్లంపల్లి సోమశేఖరశర్మ మున్నగువారు సిద్ధాంతీ కరించుటతో పోతన ఓరుగల్లు ప్రాంతమందలి బమ్మెరనివాసి యనుటలో నెట్టి విప్రతి పత్తియును కానరాదు.

ఇక పోతనగారి కాలమును గూర్చియు విమర్శకులలో విభిన్నాభిప్రాయములు, వాదోపవాదములున్నను క్రీ. శ. 15వ శతాబ్దికి చెందినవాడనుటలో సంశయ నేకీ భవించుచున్నారు. కావుననే "పోతన కాలము విషయమున వాదోపవాదము లున్నను అవి శతాబ్ది నిరూపణమున నేకీభవించుచునే యున్నవి."[43] అని వేంకటావధానిగారు వక్కాణించియున్నారు, కావున 15వ శతాబ్దమునాటి ఓరుగల్లుప్రాంతపు మత సాంఘిక రాజకీయాది పరిస్థితులెట్లున్నవో పరిశీలించినచో పోతన భాగవతరచనకుపక్రమించుటకు హేతుభూతమైన మరికొన్ని యంశములు స్పష్టముకాగలవు.

## రాజకీయ పరిస్థితులు

15వ శతాబ్దమునాటికి తెలుగుదేశము ముఖ్యముగ నారు రాజవంశీయుల పాలనలో నుండెడిది. కళింగప్రాంతములో నర్వాచీనగాంగులు గజపతులు, కోస్తా ఆంధ్రములో రెడ్లు, తెలంగాణములో పద్మనాయకులు బహమనీసుల్తానులు, రాయలసీమలో విజయనగర చక్రవర్తులు తమతమ రాజ్యములను స్థాపించుకొని యధికారదాహముతో పరస్పరము కలహించుకొనుకాలమది. అనాడాంధ్రదేశమున రాజకీయ పరిస్థితులు మిక్కిలి దుర్భరముగా నుండెను. ఆంధ్రులపాలిట పెన్నిధియనదగు కాకతీయ

సామ్రాజ్యమస్తమించెను. ఆంధ్రత్వమునకు సర్వస్వము ధారవోసిన ప్రతాపరుద్ర చక్రవర్తిని యవనులు బంధించి కొనిపోయిరి. చిరకాలసముపార్జితమగు ఆంధ్ర సామ్రాజ్యముతో నాంధ్రులసంపద, యుత్సాహము, కార్యదీక్షకరఁబట్టెను. గ్రంథాలయములు తగులబెట్టబడెను. దేవాలయములు నేలమట్టమయ్యెను. కనుపులోవల్ల కదలక సురక్షితముగనున్న ఆంధ్రులు కాకతీయసామ్రాజ్యవిచ్ఛిత్తితో చెల్లాచెదరైరి. మొట్టమొదట నద్దంకిని రాజధానిగా చేసుకొని ప్రారంభించిన రెడ్డిరాజులు తీరప్రాంతముల నాక్రమించి కొండవీటిని రాజధానిగా చేసుకొని పాలన సాగించిరి. 15వ శతాబ్ది మధ్యభాగమున గోదావరీ తీరముతో రెడ్డిరాజ్యము విస్తరించినది. ఇట్లే ప్రతాపరుద్రుని పరివారములోని హరిహరరాయలు, బుక్కరాయలు విద్యారణ్యులవారి యాశీస్సులతో ఇదేకాలమున విజయనగరసామ్రాజ్యమును స్థాపించిరి. విజయనగర చక్రవర్తులలో 15వ శతాబ్దమునందు ముఖ్యమైనవారు మొదటిదేవరాయలు, రెండవ దేవరాయలు, మల్లికార్జునరాయలు. వీరికాలమున బహ్మనీసుల్తానులతోను, గజపతుల తోను యుద్ధములు పెక్కు సంభవించినవి.

15వ శతాబ్దపు ప్రథమపాదమున తూర్పుగాంగవంశపు రాజుల బలము తగ్గినది. రెడ్డిరాజులు విజృంభించిరి. క్రీ.శ. 1434–35లో గాంగభానుదేవుడు జైత్రయాత్రలో నుండగా నతని మంత్రి కపిలేశ్వరుడు సింహాసనమాక్రమించి గజపతిరాజ్యస్థాపనచేసి, తదుపరి వంగ, మాళవ, బహ్మనీసుల్తానుల వెన్నుపొడిచి, రెడ్డిరాజుల మదమడచి 1458–60 నాటికి తీరస్థాంధ్రదేశము నాక్రమించినాడు. కపిలేశ్వరుని అవసాన కాలములో రాజ్యములో అల్లకల్లోలము లేర్పడినవి. కపిలేశ్వరుని యిరువురి కుమారులలో హంవీరుడు బహ్మనీసుల్తానులతో స్నేహముచేసి తండ్రిని ధిక్కరించగా, కపిలేశ్వరుడు తనరెండవకుమారుడైన పురుషోత్తముని కృష్ణాతీరమున నభిషేకించెను. హంవీరుడు బహ్మనీసుల్తానుల సహాయముతో పురుషోత్తముని రాజ్యమాక్రమించెను. బహ్మనీసుల్తానులిట్లు తాముగావించిన సహాయమునకు ప్రతిఫలముగా గజపతుల సామ్రాజ్యము నధికముగా కబళింపగా నిదియే తగిన సమయమని భావించిన సాళువ నరసింహరాయలు కృష్ణానదికి దక్షిణముననున్న గజపతుల రాజ్యము నాక్రమించి విజయనగర సామ్రాజ్యములో కలుపుకొనెను. రాజ్యమిట్లు శత్రువుల చేజిక్కగా పురుషోత్తమగజపతి హంవీరు నోడించి యధికారము స్వాధీనముచేసుకొని, బహ్మనీ సుల్తానుల ఆటకట్టించి, జైత్రయాత్ర వెడలి ఉదయగిరి రాజ్యపర్యంతము జయించి, చేజిక్కిన సాళువనరసింహునకభయమిచ్చి మరల గజపతిరాజ్యప్రతిష్ఠ గావింపగా కృష్ణదేవరాయల స్వాధీనపర్యంతము నీప్రాంతము గజపతులయధీనములోనే యుండెను.

పోతనామాత్యుని కాలమున తీరస్థాంధ్రమును ఈగజపతులలో కపిలేశ్వరుడు పరిపాలన గావించినాడు.

కృష్ణా గోదావరీ తీరప్రాంతమున రెడ్డిరాజుల ప్రతిభ యధికముగానున్న సమయమున తెలంగాణమున పద్మనాయకులు విజృంభించి దేవరకొండ, రాచకొండ రాజధానులుగా రాజ్యమేలినారు. వీరు బహ్మనీసుల్తానులను బాసటగా నిలుపుకొని రెడ్డిరాజులతోను, విజయనగర రాజులతోను వైషమ్యమును పెంచుకొని వారినోడించి తమ రాజ్యమును విస్తరించుకొనినారు. కానిరెండవ సంగమనాయకుని కుమారుడు రెండవ అనపోతనాయకుడును, పెదవేదగిరి నాయని కుమారుడు కుమార మాధవ నాయకుడును, తమ తండ్రితాతలు బహమనీసుల్తానులతో నెరపిన స్నేహధర్మమును విడనాడి విజయనగరరాజులు పానగల్లు దుర్గమును ముట్టడించినపుడు విజయనగర రాజుల పక్షము నవలంబించిరి. ఈపద్మనాయకులలో క్రీ. శ. 1425-75 మధ్య రాచకొండ రాజ్యమును పాలించిన రెండవ అనపోతనాయకుని కుమారుడు మూడవ సింగమనాయకుడును, దేవరకొండ రాజ్యమును పాలించిన కుమార మాధవనాయకుని కుమారుడు లింగమనాయుడును, పోతన సమకాలికులే. ఈ లింగమనాయుడు కొండ వీడు, రాజమహేంద్రవర రెడ్డిరాజ్యములపై ననేక పర్యాయములు దండయాత్రలు సాగించెను. ఈమూడవ సింగమనాయకుని కాలమునకు కొలది పూర్వమునుండి బీదరు రాజధానిగా పరిపాలించుచుండిన బహ్మనీసుల్తానులకును, రాచకొండ దుర్గాధిపతులకును విరోధాగ్ని ప్రజ్వరిల్లినది. అహ్మదుషా రాజ్యకాలము చివర తెలంగాణముపై మహ్మదీయులు దండెత్తి రాచకొండ రాజ్యాధిపతుల కోటలను కొన్నింటిని బట్టుకొనిరి. అహ్మదుషా యనంతరము బహ్మనీసుల్తానులకును, రాచకొండ రాజ్యాధిపతులకు ననేక యుద్ధములు జరిగినవి. రాచకొండ దుర్గాధిపతులు కటకము గజపతుల సహాయముతో మరల నోరుగల్లు, భువనగిరి మున్నగు దుర్గములను గెలుచుకొనిరి. శాశ్వతముగ నీ దుర్గములు వీరి యధికారమున్రకింప నుండలేదు. క్రీ. శ. 1474 నాటికి రాచకొండ, దేవరకొండ రాజ్యములు బహ్మనీరాజుల వశమై పోయినవి. ఈ తురకల దండయాత్రలతో గ్రామదహనములతో తెలంగాణము పీనుగుల పెంటగా మహాస్మశానముగా మారి పోయినది. శాంతిభద్రతలు కఱవయ్యెను. ఇట్టి విపత్కర పరిస్థితిలో నాపన్నివారకము లైన భక్తిగీతామృతముల నాశ్రయించుటకంటె శాంతిప్రదమైన మార్గాంతరము లేదను విషయమును గుర్తించుటచే భక్తుడగు పోతన భక్తిప్రధానమగు భాగవతమును తెలుగున వెలయించినాడని చెప్పుట కవకాశములేదు. ఇట్లు దండయాత్రలతో విసిగిన ప్రజలు భక్తిగీతామృతములతో శాంతిని పొందగలరనుటకు చరిత్రలో నుదాహరణములు

కనబడుచున్నవి. ఉత్తరాదిని సహితమిట్టి పరిస్థితులలోనే భక్తిసాహిత్యము వెల్లి విరిసినదని చరిత్రకారుల తలంపు.

"క్రీ. శ. 14వ శతాబ్దిలో నైదేశికుల దండయాత్రలతో విసివి వేసారియున్న నాటిప్రజలకు రామానంద కబీరులవంటి భక్తుల భక్తిమయ గీతములు శాంతిప్రదములై యాశ్వాసకారణములైనవి."44 అను ఖండవిల్లి సూర్యనారాయణ శాస్త్రిగారి వచనములు పై విషయమునకు ప్రమాణములు కాగలవు.

పైన వివరింపబడిన రాజకీయ పరిస్థితులనుబట్టి పోతన జీవితకాలములోనధిక భాగ మతని నివాసపుమండలమైన వరంగల్లు, తెలంగాణాప్రాంతము చాలవఱకు తురుష్కాధీనమై యనేక దండయాత్రలకులోనై రాజకీయ సంక్షోభముతో, ధర్మసంక్షోభముతో నుండినదని చెప్పవలసియున్నది. 'ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి......' అని పోతన రాజులను నిరసించుటకు అతని తత్త్వమే ప్రధానకారణమైనను, నాటి రాజకీయ సంక్షోభముతో కొట్టుమిట్టాడుచున్న రాజులపైగల నిరసన సైతము కారణము కావచ్చును.

## మత పరిస్థితులు

ఓరుగల్లును రాజధానిగా చేసుకొని యాంధ్రదేశమును పరిపాలన కావించిన కాకతీయుల కాలములో జైన, శైవ వివాదము లెక్కువగను, తీవ్రముగను సాగుచుండెనని తెలియుచున్నది. ఈకాలములోనే పాశుపత శైవమును మిక్కిలి వ్యాపింపజేసిన వారు గౌడదేశములోని గోళకీ మతమునకు చెందిన శివాచార్యులు. ఈయుగములోనే నవనాథసిద్ధోపజ్ఞమగు శైవముకూడ తెలుగుదేశములో వ్యాపించినది. అట్లే తాంత్రిక విధానముకూడ ఆంధ్రదేశములో ప్రచారములో నుండెడిదని తెలియుచున్నది. ఇట్టి విపరీత మతాచారము లాంధ్రదేశములో చోటుచేసుకొనుచున్న కాలమునందే క్రీ. శ. 1336లో విజయనగరరాజ్యస్థాపన తరువాత విద్యారణ్యస్వామి ప్రేరణతో, వారిమార్గదర్శకత్వములో వైదికమత పునరుద్ధరణమునకు, ప్రచారమునకు గొప్పప్రయత్నము జరిగినది. ఫలితముగా నాంధ్రదేశములో వీరశైవము మహోద్వేగముతో విహారము చేయుటమాని వైదికస్వభావానుగుణముగ మారినది.

12వ శతాబ్దములో రామానుజాచార్యులవారి ప్రచారఫలితముగా నాంధ్రదేశములో శైవముతో పోటీపడి ప్రజలలో వ్యాప్తిచెందనారంభించిన వైష్ణవమతము

రాజాశ్రియము లభించకపోవుటచే 14వ శతాబ్దము వఱకు మందకొడిగానున్నది. వైదికమతము పునఃప్రతిష్ఠితమైన 14వ శతాబ్దిలో ద్రావిడదేశమునుండి యనేక ప్రసిద్ధ వైష్ణవాచార్య కుటుంబము లాంధ్రదేశమునకువచ్చి, పర్యటనముచేసి, విభిన్న సంస్థానములందలి పండితులతో శాస్త్రవాదములుచేసి, వారిని జయించి, మహారాజులకు వైష్ణవమతమునిచ్చి తమ మతమును వ్యాపింపజేసిరి. "ఈవిధముగా 14వ శతాబ్దినుండి వైష్ణవమతమాంధ్రదేశమున మిక్కిలి ప్రబలము కాజొచ్చినది.

కాకతీయసామ్రాజ్యము పతనమైన తరువాత నాంధ్రదేశమున వర్ధిల్లిన రెడ్డిరాజులు శైవాచారసంపన్నులు. కాని రెడ్లలోకూడ కుమారగిరి మొదలగు వైష్ణవాచార సంపన్నులైనవారును గలరు. ఇట్లు శైవమతముతోబాటు వైష్ణవమతము నకు కూడ రెడ్డిరాజ్యమున, ఆదరణయొసగబడెను. అట్లే రాచకొండ, దేవరకొండల యందలి పద్మనాయకులు మొదట శైవమతాభిమానము కలిగియుండిరి. మొదటి సింగమనాయకుని కుమారుడగు అనపోతనాయుడు శైవమతాభిమానియై యనేక ప్రదేశములందు భైరవప్రతిష్ఠల గావించెను. కాని మరికొంత కాలమునకీ రాజులు వైష్ణవమతాభిమానులైనట్లు కానవచ్చుచున్నది. వేదాంతదేశికుని కుమారుడగు వరదా చార్యుడను పండితుడు సర్వజ్ఞసింగమనాయని యాస్థానమునకేతెంచి యచ్చటి ఆస్థాన పండితుడగు శాకల్యమల్లభట్టు నోడించి వైష్ణవమత స్థాపనము గావించి, రాజును సామంతరాజులను వైష్ణవమతానుయాయుల గావించినట్లు తెలియుచున్నది. ఈవిధ ముగా నీకాలమున శైవవైష్ణవమతములు రెండును పోటీపడినవి.

ఇంతలో నుత్తరహిందూదేశమున మిక్కిలి ప్రబలమైన యిస్లాంమతము కాకతీయరాజ్యపతనముతోను, బహమనీ రాజ్యస్థాపనతోను తెలుగుప్రాంతమున విజృం భింప నారంభించెను. ఇస్లాంమతముయొక్క ఔద్ధత్యమునకు, ఆవేశమునకు సరియైన ఆవేశౌద్ధత్యములను శైవవైష్ణవములును కనబఱచి ప్రజాబాహుళ్యము నిస్లాంమతౌద్ధత్య ముల పాలుకాకుండ రక్షించినవి. దీనితో యజ్ఞయాగాదులతోకూడిన వైదికధర్మము యొక్క ప్రాధాన్యము తగ్గినది. శైవవైష్ణవములు రెండును ప్రజలలో నధికవ్యాప్తికై పరస్పరము పోటీపడజొచ్చినవి.

పోతన కాలమునాటికీ సంకట పరిస్థితులన్నియు ప్రబలియుండుటచే శాంతి ప్రబోధకమైన, పరస్పరప్రేమ ప్రబోధకమైన వైదికమతాచారములను ప్రచారము గావించి ప్రజలలో శాంతిని నెలకొల్పవలెనను తలంపుతో పోతన, లిక్కన ప్రతిపాదిం

చిన హరిహరాద్వైత తత్త్వము ననుసరించుటకు నిశ్చయించుకొని యుండెను. ఈ విషయమునే ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు "విజయనగర సమ్రాట్టులు వైదికధర్మోద్ధరణమునకై పలువిధముల పాటుపడియుండిరి. సాయనుడు వేదములకు భాష్యము రచించి వైదికమత ప్రచారమునకు దోహదము కలిగించెను. కాని వైదికమతమును తదాచారములను దూషించు వారప్పుడు లేకపోలేదు. మహానుభావసంఘమునకు చెందిన వైష్ణవులును, వీరశైవులును, బౌద్ధజైనాదులును అందు ముఖ్యులు. పోతన వారి యావేశములను ఆపప్రలాపములను గాంచి విసిగి నిర్విణ్ణమనస్కుడై తిక్కన్నగారు ప్రతిపాదించిన హరిహరాద్వైతమే మేలుత్తరమని భావించి యుండును."[45] అని వ్యక్తీకరించినారు. కాని తిక్కన ప్రతిపాదించిన హరిహరనాథ తత్త్వమంతగా ప్రజాదరణమును పొందలేకపోయెను. అట్లు పొందలేకపోవుట కానాటి ప్రజలలో నీతత్త్వమును గూర్చిన కొన్ని సందేహములే కారణములని డా. [illegible]గార్లు వివరించిరి. "ఈ హరిహరనాథార్చన అంతగా ప్రజల ఆదరము పొందినట్లు కన్పింపదు. సామాన్యప్రజలకు శివుని పూజించినచో కైలాసమునకు పోదుమనియు, విష్ణువును పూజించినచో వైకుంఠమునకు పోదుమనియు నమ్మకము కలదు. హరిహరనాథుని పూజించినవారేలోకమునకు పోవుదురు? ఆయనలోకమేది? అదియును గాక శివ, విష్ణుమహిమలను వర్ణించు గాథలు స్వారస్యాకర్షకమైనవి నందలు వేలు గలవు. హరిహరనాథుని వర్ణించు కథాసముదాయ మేది? ఇత్యాది సందేహములప్పటి ప్రజలలో కలిగినవి."[46] కావున నద్వైతియైన పోతన యీ సందేహముల కన్నిటికిని సమాధానముగా భక్తిప్రధానమైన భాగవతము నద్వైతమతానుసారముగా నాంధ్రీకరించి, తిక్కన హరిహరనాథ తత్త్వమునకు పుష్టిని, ఆనాటి మతవైషమ్యములకు పరిష్కారమును చూపింపదలచి నాడని యూహింపవచ్చును. కావుననే డా. సి. వి. రామచంద్రరావుగారు "భారతీయ సంస్కృతికి సహజమైన సామరస్య సమన్వయ భావములను ఆంధ్రదేశచరిత్రలో సంధికాలములో ప్రజలకు గుర్తుచేసిన మనీషులు, మహాకవులు, మహానుభావులు తిక్కన పోతనలు. తిక్కన ఈ కార్యమును హరిహరాంకితమైన ఆంధ్రమహాభారత రచనచే

సాధించగా, మహేశ్వరధ్యాన నిమగ్నుడయిన భక్తపోతన, రామాంకితమైన ఆంధ్రమహాభాగవత రచనచే అదే కార్యమును సాధించినాడు"[47] అనియు "ఆంధ్రవాఙ్మయమున వెలసినకవిప్రవక్తలలో ప్రథముడు తిక్కన. రెండవవాడు పోతన"[48] అని పింగళి లక్ష్మీకాంతంగారును వక్కాణించియున్నారు. కాని కీ. శే. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు పోతనగారి భాగవతరచన కానాటి వైష్ణవమత వ్యాప్తికూడ ప్రోత్సాహకరమైయుండునని భావించిరి.[49] కాని వైష్ణవమతవ్యాప్తి కారణముగా భాగవతరచన జరిగినదనుటకంటె పోతన భాగవతరచన మూలముగానే తెలుగునాట వైష్ణవభక్తి ప్రబలినదనుట సమంజసమనిపించును. ఎందువలన ననగా వైష్ణవసిద్ధాంతము తుళువనరసింగరాయల కాలమువఱకు తెలుగుదేశమున ప్రబల ప్రచారము కాలేదను విషయము పలువురు చారిత్రకులంగీకరించిరి. తుళువనరసింగరాయలు క్రీ. శ. 1503లో విజయనగర సింహాసనమాక్రమించి క్రీ. శ. 1509న మరణించెను. అట్టితఱి శ్రీ మదాంధ్రభాగవతరచనకు వైష్ణవమతవ్యాప్తి కూడ కారణమనుట పొసగదు. తిక్కన హరిహరనాథతత్త్వమును ప్రజలలో వ్యాపింపజేసి యానాటి మతవైషమ్యములను రూపుమాపదలచెను తలంపుతో పోతన భాగవతానువాదమునకు పూనుకొని యుండునని భావించుటయే సమంజసము.

## సాంఘిక పరిస్థితులు

గుణకర్మల ప్రాతిపదికపై నేర్పాటుచేయబడిన వేదకాలమునాటి సమాజము కాలక్రమముగా మార్పుచెంది 15వ శతాబ్దినాటికి పూర్తిపరిణతి చెందినది. అందున నీ శతాబ్దములో తురకల దండయాత్రలతో సంఘవ్యవస్థ తారుమారైనది. ఈనాటి సాంఘికస్థితి స్వమతావేశపరులగు మహమ్మదీయులదుండగములచే కళంకితమగుచుండెను. ఆర్థికముగా, సాంఘికముగా, రాజకీయముగా ననేక మార్పులేర్పడినవి. సామాజికముగా దేశపరిస్థితులు కొంతకల్లోలముతో కూడుకొనినవిగా నుండెడివి. వేషభాషలలో నాచార వ్యవహారములలో ననేక మార్పులు సంభవించిన దీశతాబ్దమునందే.

"సంఘంలో నైతికవిలువలు దిగజారాయి. పాపభీతిలేని మానవుల మనస్తత్వం ఏవిధంగా ఉండేదో నాటిశాసనాలలోనిశ్లోకాలను బట్టి తెలియుచున్నది."[50] అను శ్రీ రాయప్రోలు సుబ్రహ్మణ్యంగారి పలుకులనుబట్టి నాటిసామాజిక స్థితియెట్లున్నదో నవగతము చేసుకొనవచ్చును. కావున నిట్టి సామాజికయథేచ్ఛితత్వమును, నీతిబాహ్యత్వమును రూపుమాపి, సాంఘిక

జీవనమును నిర్మలమైన, స్వచ్ఛమైన, శాంతియుతమైన, భక్తిమార్గమున నడిపింప వలెనను తలంపుతో పోతన భాగవతానువాదమునకు పూనుకొని యుండవచ్చును.

## సాహిత్య పరిస్థితులు

క్రీ. శ. 1400 - 1500 నడుమనున్న కాలమాంధ్రవాఙ్మయ చరిత్రలో ప్రబంధ పూర్వయుగమనియు, శ్రీనాధయుగమనియు, సంధియుగమనియు, వ్యవహరింపబడుచున్నది. ఈ కాలమున తెలుగుదేశమును పాలించిన నాంధ్రరాజులు సంస్కృతభాషలో ననేక కావ్యములను రచింపజేసి వారినుండి కృతులంకితము గొనినారనుటకు కోమటివేమారెడ్డి వామనభట్టను మహాకవిచే 'వేమభూపాలీయము', 'పార్వతీపరిణయ'మను రెండుసంస్కృత మహాకావ్యములను, రచియింపజేయుటయే ప్రబలసాక్షి. ఈవిధముగా ప్రభువులు సంస్కృతకృతు లంకితముగొనుటయు, నా కాలపు మహాకవులలో నొకడైన శ్రీనాథుడు ప్రభువులకుగాక నాయాప్రభువుల చెంతనున్న నుద్యోగులకే గ్రంథముల నంకితమిచ్చుటను గాంచినచో "ఆనాటి ప్రభువులకాంధ్రిపై నాదరము లేకపోవుటయే యిందులకు ప్రబల హేతువు."[51] అను పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వాదము యథార్థమైయుండు ననుభ్రాంతి కలుగుట కవకాశమున్నది. కాని నాటిరాజులు గావించిన నాంధ్రభాషా సేవను, ఆంధ్రకవులకిచ్చిన నాదరమును, శ్రీనాథుని దీనారటంకాల తీర్థమాడించుటను, కవిసార్వభౌమ బిరుదమొసంగుటను, సర్వసౌఖ్యములు కలుగజేయుటను గాంచినచో వారికి నాంధ్రిపైన సైతము అత్యంతాదరము కలదని చెప్పవచ్చును. ఈవిధముగా నాంధ్రభాషపై వారభిమానమును చూపినను, శ్రీనాథుని యుద్గ్రంథములలో కనీస మొకకృతినేని అంకితము తీసుకొనకుండుటయు, ఆంధ్రగ్రంథమునకు దేనికిని రెడ్డిరాజులలో నేయొక్కరును కృతిపతి గాకపోవుటయు శోచనీయమైన విషయము. తెలుగుగడ్డనేలు తెలుగురాజులైన రెడ్డిరాజులు తెలుగునందభిమానము చూపుచు, సంస్కృతమునందు గ్రంథరచనచేసియు, చేయించియు మిక్కుటమగు నభిమానము చూపుటవలన, సంస్కృతాంధ్రములకు సమప్రాధాన్యమునిచ్చి కవిత్వము వెలయించిన శ్రీనాథుడుదండపండితకవియని ఖ్యాతిగాంచి కవిసార్వభౌమ పీఠమునధిష్ఠించుటకు కారణమైనదని చెప్పవచ్చును. ఆనాటి ప్రజలలో సైతము సంస్కృతాంధ్రములపట్ల అభిమానము ద్యోతకమైనను, కొందఱికి సంస్కృతభాషాభిమాన మధికముగాగా, మఱికొందఱికి తెలుగుపై మక్కువ యెక్కువని తెలియుచున్నది. పోతన నాటి సాహిత్యాభిరుచి కనుగుణముగ సంస్కృతాంధ్రముల రెంటను తుల్యప్రతిభను

ప్రవర్శించవలసిన తీరున భాగవతరచన కొనసాగించి యున్నాడనునది క్రిందిపద్యము వలన సువిదితమగుచున్నది.

క. కొందఱకుఁ దెనుఁగు గుణమగుఁ
 గొందఱకును సంస్కృతంబు గుణమగు రెండున్
 గొందఱకి గుణములగు నే
 నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్

-ఆం. భాగ. ప్రథమ. 18

పురాణరచన కావ్యప్రక్రియవైపు పయనించు నీసమయమున పురాణములు కావ్యధోరణిలో రచింపబడసాగినవి. పురాణముయొక్క ఆత్మ, కావ్యముయొక్క శరీరముగలిగిన క్షేత్రమాహాత్మ్యమునకు సంబంధించిన నాటి గ్రంథములే ఇందుల కుదాహరణములు కాగలవు. కావున పోతన భాగవతరచనయు తదనుగుణముగనే సాగినది. సారస్వత పరిణామమార్గమున వీక్షించినను పోతనకాలమూ భాగవతరచనకు తగియున్నదని ప్రసాదరాయ కులపతిగారిట్లు వివరించియున్నారు.

"వేదబుక్కులవలె ప్రసన్న మహితమగు నన్నయ కవిత్వమును, ఉపనిషత్తత్త్వ మహత్వ సహితమగు తిక్కన కవిత్వమును, దర్శనశాస్త్రమహోద్దండమగు శ్రీనాధుని కవిత్వమును వచ్చినపిదప హృదయములకానందస్పందము కలిగించు ప్రాచేతస చేతస్సు మనోజ్ఞమగు లలితకవిత్వము భాగవతరూపమున నుదయించుట సముచితమే."[32]

అంతియేగాక సామాన్యప్రజలుసైతము తమరుచి కనుగుణమైన భక్తిమార్గమున పయనించి, యుత్కృష్టమైన మోక్షపదమును చేరుకొనుమార్గమును చూపునది భాగవతము. కావున నట్టిదానిని తెనిగించవలెనను తలంపుతో పోతన దీనికి పూనుకొని యుండును.

పోతన సమకాలికుడైన మడికిసింగన భాగవతదశమస్కంధమును ద్విపదలో వ్రాసియుండెను. కాని అది కథాకథనములోను, వర్ణనాచాతుర్యములోను, అలంకార యోజనలోను, అనువాద విధానములోను, రచనాశిల్పములోను, అసమగ్రముగను, అసమర్థముగను నుండుటచే దానిని గాంచిన పోతన సమగ్రముగా, సమర్థవంతముగా

సంపూర్ణముగా, పండిత పామర హృదయానురంజకముగా భాగవతరచన గావింపబడె ననుట పరిస్థితులతోకూడ భాగవతానువాదమునకు పూనుకొని యుండునని భావించుట కవకాశము కలదు. కావున పోతనభాగవతావతరణమునకు మడికిసింగన భాగవత దశమస్కంధము కొంతవరకు ప్రేరణయై యుండవచ్చును.

పై కారణములేకాక 15వ శతాబ్ది యారంభమున నుత్తర భారతదేశమున నావిర్భవించిన భక్త్యుద్యమము క్రమముగా దక్షిణ భారతదేశమున సహితము వ్యాపించుటచే నీశతాబ్దమున భక్తిప్రధానమైన సాహిత్యావిర్భావము దక్షిణభాషాసాహిత్య ములలో నధికముగా సంభవించినది. 15వ శతాబ్దమున దేశభాషలన్నింటిలో నధికముగా విష్ణుభక్తి ప్రధానములైన గ్రంథములావిర్భవించినవి. ఇట్లావిర్భవించుటకు జనాం దోళన రూపముదాల్చిన భక్త్యాందోళనమే కారణము. ఈవిషయమునే ఆచార్య బలదేవ ఉపాధ్యాయగారును వక్కాణించియున్నారు.[53]

భారతదేశము నందంతటను వ్యాపించిన భక్త్యుద్యమముచే ప్రభావితుడగుట వలనను, సమీప దక్షిణభాషాసాహిత్యముల నన్నింటను విష్ణుభక్తి ప్రధానములైన గ్రంథములావిర్భవించుటచేతను, తెలుగులో శైవభక్తి ప్రధానములేగాని విష్ణుభక్తి ప్రధానమైన గ్రంథములంతగా కానరాకుండుటచేతను, పోతన హరిహరాద్వైతభక్తి ప్రధానముగా శ్రీమద్భాగవతాను వాదమునకు పూనుకొని యుండునని భావింపవచ్చును. ఉత్తర దక్షిణ భారతీయ సాహిత్యములకైక్యతను సాధించుటకును పోతన భాగవత రచనకు పూనుకొనియుండవచ్చును.

పోతన పదునైదవశతాబ్దినాటి రాజకీయ సంక్షోభములను, మతకల్లోలములను, సాంఘికయసమానతను, సారస్వతముయొక్క అసమగ్రతను, ప్రజాయుద్యమముగా మారిన భక్త్యుద్యమమును బాగుగ గుర్తించి, పరస్పర ప్రేమభావమే మానవజాతి మనుగడకు శాంతిని చేకూర్చుననియు, ఇందులకు హరిహరాద్వైత భక్తితత్త్వమొక్క టియే శరణ్యమనియు, నీయద్వైతభక్తిని విశదీకరించునది భాగవతమొక్కటియే యనియు, దీనిద్వారా మాత్రమే సర్వమత సామరస్యమును ఘటించి రాజకీయస్థిరత్వ మును, సాంఘిక సమానత్వమును, సారస్వత సమగ్రత్వమును సాధింపగలమనియు నెరింగి శ్రీరామానుజ్ఞాతుండై విమల వ్యాసాలవాలమైన భాగవత కల్పతరువును మంజులతాశోభితముగా నాంధ్రమున వెలయించినాడని నిష్కర్షగా చెప్పవచ్చును.

# అధస్సూచికలు


1. 'వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణమ్'
'వంశ్యానుచరితం' అనునవి పాఠభేదములు
2. సంస్కృత వాఙ్మయ చరిత్ర; ద్వి. సం. పుట : 67
3. ఆంధ్ర సాహిత్య చరిత్ర; పుట : 445
4. పోతన్నగారి సహజ పాండిత్యము; పుట : 9
5. ఆంధ్ర భాగవత విమర్శ; పుట : 10
6. The History of Indian Literature; page : 190
7. A. concise history of classical Sanskrit Literature, Chap : The Puranas.
8. శ్రీమద్భాగవతము; దశమస్కంధము; పూ. భా; శ్రీమద్భాగవత ప్రశస్తి : పుట 2
9. సంస్కృత వాఙ్మయ చరిత్ర; ద్వి. సం. పుట : 63
10. సంస్కృత సాహిత్య కా ఇతిహాస్; పృష్ఠ : 80
11. భగవాన్ వేదవ్యాస; వాల్యూమ్ I పుట : 87
12. ప్రశమాంధ్ర మహాపురాణము; పుట : 3
13. పోతన భాగవత నీరాజనము; పుట : 151
14. పాశ్చాత్య తత్త్వశాస్త్ర చరిత్ర; పుట : 114
15. The Bhagavata Bhakti cult; page : 42
16. ఆంధ్రమహాభాగవతము - భక్తితత్త్వోన్మీలనము; పుట : 90
17. ద్విపదవాఙ్మయము; పుట : 158
18. నవభారతి: నవంబరు 1982; పుట : 15 నుండి 19 వరకు
19. పోతన; పుట : 8
20. ఆంధ్రమహాభాగవతోపన్యాసములు; పుట : 149
21. పోతన భాగవత నీరాజనము; పుట : 326
22. పోతన భాగవత నీరాజనము; పుట 124
23. పోతన భాగవత నీరాజనము; పుట : 322
24. వేంకటరావు నిడుదవోలు; పోతన; పుట : 12
25. ఆంధ్ర భాగవత విమర్శ; పుట : 20
26. సంస్కృత వాఙ్మయ చరిత్ర; ద్వి. సం. పుట : 69,70
27. లక్షణసార సంగ్రహము తృ. ఆ. 344, 345

28. ఆంధ్ర మహా భాగవతోపన్యాసములు; పుట : 17
29. మీగడ తఱకలు; పుట : 80
30. పోతన; పుట : 63
31. ఆం. భాగ; రెం. సం. పుట : 571 అధస్సూచిక
32. పోతన; పుట : 183
33. పోతన; పుట : 185
34. 'మరగి' అనుసాధురేఫతోకూడిన పాఠము అకాడమీప్రతిలో కానవచ్చుచున్నది.
35. లక్షణసార సంగ్రహము : తృ. ఆ. 339
36. ఆం. భాగ; ఎ. కణ్ణన్‌సెట్టి అండ్ కంపెనీవారిచే ప్రకటితము 1928 పుట : 35
37. ఆం. భాగ; ఎ. కణ్ణన్‌సెట్టి అండ్ కంపెనీవారిచే ప్రకటితము; 1928 పుట : 39
38. ఆంధ్ర భాగవత విమర్శ; పుట : 75,76
39. శ్రీమద్భాగవతానుశీలనము; పుట : 57
40. ఆం. భాగ. ఎ. కణ్ణన్‌సెట్టి అండ్ కంపెనీవారిచే ప్రకటితము, 1928 పుట 31,32,35
41. పోతన; పుట : 61
42. ఆం. భాగ. ప్రథమ 21
43. పోతన; పుట : 8
44. భక్తపోతన - మహాభాగవతరచన; పుట : 23
45. పోతన; పుట : 13
46. ఆంధ్ర భాగవత విమర్శ; పుట : 48
47. పోతన భాగవత నీరాజనము; పుట : 309,310
48. విజ్ఞానసర్వస్వము, తృ. సం. పుట : 600
49. ఆంధ్ర మహా భాగవతోపన్యాసములు; పుట : 8
50. పోతన భాగవత నీరాజనము; పుట : 25
51. భారతి, డిసెంబరు 1944; పుట : 522
52. ఆంధ్ర భాగవత విమర్శ; పుట : 57,58
53. వైష్ణవ సంప్రదాయోం కా సాహిత్య ఔర్ సిద్ధాన్త్; పుట : 242

# ద్వితీయాధ్యాయము

# పోతనయనువాద విధానము - అమూలకములు

'అనుసృత్యవదతీత్యనువాదః' అను వ్యుత్పత్తినిబట్టియు,

శ్లో. అయమపిచ గిరం నస్స్వత్ర నిబోధ ప్రయుక్తాం
అనువదతి శుకస్తే మంజువాక్పంజరస్థః

అను శ్లోకమునందలి 'అనువదతి' అను పదమునుబట్టియు, భావమునందుగాని, భాషనందుగాని. శబ్దములందుగాని యేవిధమైన మార్పులేక యథాతథముగా ననుసరించి పలుకుట యనియే యర్థమైనను సాహిత్యరంగమున ననువాద శబ్దమునకర్థమంత మాత్రమే కాజాలదు. ఒక భాషయందలి విషయమునుమాత్ర మితర భాషయందు వ్యక్తము చేయవలసివచ్చినపుడు పై యర్థము సార్థకమగుచున్నది గాని భావుకత, కళాత్మక దృష్టికలిగిన సాహిత్యరంగమున నాయర్థము మాత్రమే గ్రహింపరాదు. ఒక భాషయందలి సాహిత్యమును మరియొక భాషలోని కనువదించునపుడు చాల యిబ్బందుల నెదుర్కొనవలసియున్నది. ఏలయన నొకే భాషయందు కొన్ని ప్రత్యేక శబ్దముల సంయోజనచేనేర్పడిన లేక యభివ్యక్తమైన భావము, సౌందర్యము, కళాత్మకత, సమానార్థకమైన పర్యాయపదములను ప్రయోగించినను సాధించుట సాధ్యము కాదు. సమానార్థకములైనను, ఏ శబ్దమునకుండిన ప్రత్యేకత, యర్థస్ఫోరకశక్తి, ఆ శబ్దమునకే సంభవముగాని మరియొక శబ్దమునకు సాధ్యముగాదు. అట్టితఱి ఒక భాషనుండి మరియొక భాషలోనికి సాహిత్యము ననువదించవలసివచ్చినపుడెట్టి కష్టములు సంభవించునో యూహించుకొనవచ్చును. కాన సాహిత్యపు విలువలు ప్రధానముగాగల యితర భాషలోని గ్రంథమున కనువాదము చేయుట పూలబాట కాదు. బహు కంటకిత దుర్గమమార్గము. ప్రతిభాహీనున కనువాదము సులభమార్గముగా గన్పట్టవచ్చును. ఏలయన కథకొఱకుగాని, సన్నివేశముల కొఱకుగాని, కష్టపడనవసరము లేకయే మూలాధారముగా పయనించుటకు మార్గము లభించునుగదా! కాని ప్రతిభావంతున కనువాదము చేయుటకంటె స్వతంత్ర గ్రంథమును రచించుటయే సుకరము

కాగలదు. ఏలయన స్వీయప్రతిభా సామర్థ్యముల ననుసరించి ముందునకు పోనీయక ప్రతిక్షణము మూలగ్రంథపారతంత్ర్యము కల్పించుచు, స్వేచ్ఛ నరికట్టుచుండును. అట్లని ప్రతిభాహీనులకందఱకు ననువాదము చేయుట సులభమనిగాని, ప్రతిభావంతు లనువాద గ్రంథములు వెలయింప ననర్హులనిగాని భావింపరాదు. మూలగ్రంథము యొక్క ప్రధాన లక్షణముతోబాటు అనువాదకుని ప్రధానోద్దేశ్యము, శక్తిసామర్థ్యములు, ఆత్మీయతాభిరుచులు మున్నగువానినిబట్టి యనువాద గ్రంథములు ప్రచారమును పొందగలవు. మూలగ్రంథపు ప్రధానమైన విలువలకు భంగము కలుగకుండునట్లును, తన భాషాసాహిత్యపు విలువలు సంతరించుకొనునట్లును చేయుటలో ననువాదకుని శక్తిసామర్థ్యము అభివ్యక్తము లగుచుండును. తద్వారా మూలమున కానరాని కొన్ని క్రొత్త విలువలను సంపాదించుకొని అనూదిత గ్రంథములు మూలమును మించిన సొగసులను సంతరించుకొనినవను ప్రశస్తిని పొందుట కవకాశముండును.

ఏదైన నొకగ్రంథము నన్యభాషనుండి యనువదించునపుడు ప్రధానముగా మూడు పద్ధతుల నవలంబింపవచ్చును. అందొకటి కథానువాద పద్ధతి, రెండవది భావానువాదపద్ధతి, మూడవది పదానువాదపద్ధతి. ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారీవిధముగానే విభజించియున్నారు.[1] అనువాదకునిదృష్టి మూలగ్రంథమునందలి దేనిపై ప్రధానముగా కేంద్రీకరింపబడునో దాని ననుసరించి యీ విభాగము గావింపబడినది. ఈ మూడు విధానములందు నేదియో యొకమేరకు మూలము ననుసరించి చెప్పునదేగాని సర్వస్వతంత్రముగా చెప్పునవికావు. కావున అనువాద మను పేరుతో పరిగణించుటలో విప్రతిపత్తిలేదు. కాని యనువాదకుని దృష్టి ప్రధానముగా పద కథా భావముల మూడింటిలో నొక్కదానిపై మాత్రమే కేంద్రీకరింపబడును. అట్లని తక్కిన రెండును భ్రష్టములగుననిగాని, వికృతినొందునని గాని తలంచుట కవకాశములేదు, కాని దేనిపై దృష్టి కేంద్రీకరింపబడినదో యందలి విలువ లనువాదమున ప్రస్ఫుటమైనట్లు తక్కినవి కాకపోవచ్చును. అనువాదకుడు దృష్టి నొకదానిపై కేంద్రీకరించినపుడు తక్కిన రెండింటి విలువలు అప్రయత్నముగా ననువాదమున ప్రవేశించిన ప్రవేశింపవచ్చును గాని యా విలువల నిముడ్చింపవలెనను తలంపు అనువాదకున కుండదు. అంతియేగాక ప్రధానదృష్టి కనుగుణముగ తక్కినవి ప్రవేశించినను, వాటిపై ప్రధానముగా దృష్టి కేంద్రీకరించినపు డనువాదమున ప్రవేశించినంతటి విలువలతో నిప్పుడు ప్రవేశింపకపోవచ్చును.

కథానువాదమున ననువాదకుని దృష్టి మూలమునందలి కథపై మాత్రమే కేంద్రీకరింపబడియుండును. మూలమునందలి కథాత్మక విలువలకు భంగము

కలుగకుండ ననువదించుటకు ప్రయత్నించును. కథాత్మకవిలువలతోబాటు మూలము నందలి భావుకత్వపు విలువలు సహితమచ్చుపచ్చుట అనువాదమున నప్రయత్నముగా చోటు చేసుకొనవచ్చును. సమర్థుడైన యనువాదకు డనువదించునపు డున్నతమైన తక్కినవిలువ లనువాదమున ప్రవేశించుట కవకాశము కలదు.

మూలకర్త భావుకతను సుస్పష్టముచేయు మౌలికములైన భావములను ప్రధానముగా దృష్టిలో నిడుకొని చేయునట్టి అనువాదమును భావానువాదమందురు. కథలేకుండ భావములు వ్యక్తీకరించబడుట సాధ్యముగాదు. కావున నేదియో యొకరూపమున కథ కూడ ననుస్యూతముగ వచ్చుచుండును. కాని కథానువాదములో ప్రస్ఫుటమైనన్ని విలువలిందు ద్యోతకము కాకపోవచ్చును. అంతమాత్రమున కథాత్మకపువిలువలు కుంఠితములగుట సంభవింపదు. అనువాదకుడు సమర్థుడైనచో మౌలికములైన భావముల నంబరవీథిలో విస్తృతవిహారము చేయించి మూలకర్తను మించిన భావుకతను ప్రదర్శించును. ఈతనిదృష్టి మూలమునందలి శబ్దములందుమాత్రము లగ్నముకాదు. 'ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి' అనునట్లు భావముల ననుసరించి శాబ్దికపువిలువలు ప్రవేశింపవచ్చును.

పదానువాదమనగా మూలమునందలి ప్రతిపదమునందును దృష్టిని కేంద్రీకరించి యనువాదము సాగించుట. 'అనుసృత్యవదతి' అనువ్యుత్పత్తి పూర్తిగా నిందు సార్థకము కాగలదు. మూలమునందలి ప్రతిపదమునందును దృష్టిని నిలుపుటచే శబ్దసముదాయముతోబాటు కథ యథామూలముగానిందు ప్రవేశించునుగాన మూలానువాదములకు కథలో వ్యత్యాసములు కానరావు. మూలమునందలి కథ పదములు ననువాదమున ప్రవేశించునుగాని మూలమునందలి భావనాత్మకపు విలువలిందు ప్రవేశింపగలవని నిశ్చయముగా చెప్పలేము.

పై మూడువిధములగు ననువాద విధానములలో అనువాదకుని అభిలాషనుబట్టి యనువాదములు సాగుచుండునుగాని యిట్టి గ్రంథము లీవిధముగానే యనువదింపబడ వలెనను నియమములేదు. ఈమూడురకములైన అనువాద విధానములలో భావానువాదము సర్వోత్కృష్టమైనది. ఏలయన కవియొక్క సహజలక్షణమే భావుకత. కాన భావనాత్మకపువిలువలను దీపింపజేసినపుడు మాత్రమే ఉత్తమ కవివాచ్యుడు కాగలడు.

పురాణేతిహాసములు సాధారణముగా విషయప్రధానములు. కావున మూలము నందలి ప్రధానకథకు భంగము కలుగకుండ వర్ణించి చెప్పినవేగాని, ప్రధానముగా బోధింపదలచిన నీతి, ధర్మము సువ్యక్తమై 'రామాదివద్వర్తితవ్యం, నరావణాదివత్'

అను జ్ఞానము కలుగుటకవకాశములేదు. కావున పురాణేతిహాసములు సామాన్యముగా కథానువాద పద్ధతిలోనే సాగుచుండును. కావ్యములననువదించునపుడు మూలమునందలి కథను గ్రైకొనినను, మూలకర్తయొక్క భావనాబలమును దృష్టికోనిడుకొని యనువాదకుడు తన భావుకతచే కావ్యావిర్భావము గావించుచుండును. కాన కావ్యానువాదములు సాధారణముగా భావానువాద సంబంధులై యుండును. నాటకానువాదమున సంభాషణలలో నడుగడుగున నొక ప్రత్యేకత నిబద్ధమైయుండుటచే కథతోబాటు శబ్దములకు కూడ తగినంత ప్రాధాన్యముండుట సహజము. కావున నాటకానువాదములు సాధారణముగా పదానువాద విభాగమునకు చెందినవై యుండును.

పై విశ్లేషణము ననుసరించి ఆంధ్రవాఙ్మయమునందలి యనువాదములను పరిశీలించినచో తిక్కన మార్గము సుంతవేరైనను స్థూలముగా కవిత్రియ భారతానువాదము కథానువాదమునకు సంబంధించినదిగాను, పోతన భాగవతానువాదమును భావానువాద సంబంధిగాను, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి వంటి కొందఱియాధునికుల కొన్ని యనువాదములును, నాటకానువాదములును పదానువాద విభాగమునకు చెందినవిగాను పరిగణింపవచ్చును. ఒకవిధముగ మూడింటిపై విశేషదృష్టి మఱపినతీరు శ్రీనాథుని నైషధాంధ్రీకరణమున కాననగును.

భారతానువాదమునందు సంక్షేపించుట, విస్తరించుట మున్నగు పరివర్తనము లెడనెడ కానవచ్చుచున్నందున దీనిని కథానువాద విభాగమున చేర్చుట సమంజసమగునా ? అని ప్రశ్నింపవచ్చును. ఇయ్యది యితిహాసముగాన మూలమునందలి కథను ప్రధానముగా ననుసరించిననేగాని వారు పాఠకుల కందింపదలచిన విషయపరిజ్ఞానము, నీతిబోధలు నందించుట సాధ్యముకాదు. ఇట్టి లక్ష్యముతో సాగిన యనువాదమగుటచే కవిత్రయభారతము ప్రధానముగా కథానువాదమునకు సంబంధించినదనియే చెప్పవచ్చును. ఇందు భావుకతపేరిట స్వైరవిహారముచేయు పోకడకంటె నీతి, ధర్మప్రబోధకమైన నీతివృత్తమునకధిక ప్రాధాన్యము కానంబడును. అట్లయిన కథాసంబంధి మార్పులేల సంభవించినవని ప్రశ్నించినచో సారము నందించుటకు, పునరుక్తులను పరిహరించి వైరుధ్యములను తొలగించి దేశకాలానుగుణముగ రూపునపరించుటకు నెడనెడ నిట్టిమార్పు లవసరమైనవని సమాధానము చెప్పుకొనవచ్చును. ఈ మార్పుల వలన ప్రధానకథకు మఱింత పుష్టిచేకురునేగాని, కథాత్మకపువిలువ లామూలముగా పరివర్తితములగుటగాని, భంగపడుటగాని సంభవింపదు. మూలమునందలి ప్రధానకథకు, లక్ష్యమునకు భంజకముగాకుండ కళాత్మకదృష్టితో గావించిన మార్పులతో కూడిన పురాణేతిహాసానువాదములను కథానువాదపుకోవలో చేర్చుట అసమంజసముకాదు.

కవిత్రయభారతము పరిమితిలో సగమైనను, వికారమునొందక కళాత్మకపువిలువలతో సహృదయుల నానందింపజేయుచున్నది.

పురాణానువాదమైన భాగవతముకూడ ప్రధానముగా కథానువాదము గావలసి యున్నను, పోతన భావానువాదకులలో సర్వోత్తముడనియు, భావుకతాదృష్టితో పరిశీలించినచో నాంధ్రకవులలో నగ్రగణ్యుడనియు చెప్పవచ్చును. పోతన భావానువాదము సహితము స్వతంత్రధోరణిలోనే సాగినదిగాని పూర్తిగా మూలానుసారము గాదు. పోతన చూపిన స్వాతంత్రతత మూలమును సంగ్రహించుటయందును నన్యథాకరించుటయందునుగాక కొలదిగా కథాంశములయొక్కయు, ప్రధానముగా రసభావముల యొక్కయు స్వరూప విస్తారములందు మూలమునకానరాని విశిష్టతను ప్రదర్శించుటలో కానవచ్చును. వీరి యనువాదవిధానమునుగురించి సాహిత్యఅకాడమీ భాగవతప్రతి సంపాదక వర్గముయొక్క యభిప్రాయమీవిధముగా నున్నది. "పోతన దీని ననువదించుపట్లఁ గవిత్రయమువారి స్వతంత్రవిధానమును, సమకాలికుడైన శ్రీనాథుని భావానువాదవిధానమును ననుసరించెను. అతని స్వతంత్రత సంకోచపఱచుటయందును, అన్యథాకల్పన మొనరించుటయందును గాక మూలమును బెంపొందించుటయందుఁ గానవచ్చును........... అందుచే పోతన యనువాదము శ్రీనాథుని యనువాదమువలె మూలానుసారియయ్యు నెడనెడ కవిత్రయమువారి యనువాదమువలె స్వతంత్రమై యింపునింపుచుండును."[2]

'నోరు నొవ్వంగ హరికీర్తి నుడువడేని' యని పల్కిన పోతన భగవంతుని యొక్కయు, భగవద్భక్తులయొక్కయు కథాంశములతోకూడిన భాగవతమునందలి ఘట్టములను విడచుటకుగాని, సంగ్రహించుటకుగాని యవకాశములేదు. అవకాశము లభించినంతనే పోతన, మూలమును తన శక్తికొలది పెంచుటకుమాత్రమే ప్రయత్నించును. ఏలయన భాగవతమునందాయా యంశములకు గల ప్రాధాన్యమును, భక్తుడైన పోతనయొక్క తత్త్వము నిట్టిదగుటయే. కావున పోతన భాగవతము కవిత్రయ భారతానువాదమువలె సంగ్రహరూపమునుగాదు, శ్రీనాథుని భావానువాదమువలె పూర్తిగా మూలానుసారియుగాదు.

భగవంతునియొక్కయు, భగవద్భక్తులయొక్కయు కథాంశములతోకూడిన భాగవతము ననువదించుటలో, హరికీర్తిని, హరిభక్తులకీర్తిని విసువులేక కీర్తించు పోతనకు నొకవిధముగా కథానువాదపద్ధతి యనివార్యమైయున్నది. భక్తిపారవశ్యము

పలుతావుల పోతనను భావానువాద మార్గమును పట్టించుటయు సహజము. సరళసుందర మగు కథానువాద విధానముతోబాటు, విగళిత వేద్యాంతరస్థితికిఁ గొనిపోఁజాలిన స్వరూపవిస్తారములతోడి భావానువాద విధానము మేళవింపబడియుండుటయే పోతన భాగవతానువాదమునకింతటి యెనలేని కీర్తివచ్చుటకు ప్రధానకారణముగా గుర్తింపవలసి యుండును. పోతనయొక్క భావానువాద విధానము ఔచిత్యమును, సార్థక్యమును, ప్రసంగముతోడిపొందికను కలిగియున్నదేగాని, యనావశ్యకముగను,నతుకులబొంతగను గానవచ్చునదిగాదు. మూలములో కానరాని భావములను కొన్ని తావులందును, భావము లకు మూలములో కానరాని విస్తృతిని పలుతావులందును, చిత్రించుచు చేసిన యనువాదవిధానమే యాంధ్రకవితాకాశమున పోతన నమృతకిరణునిగా ప్రతిఫలించినది. ఈవిధమైన యమూలక భావ, విస్తృతులవలన పోతన భాగవతము మూలమును మించిన సొగసులతో స్వతంత్రరచనవలె యలరారుచున్నదని చెప్పుటలో నెట్టివిప్రతి పత్తియులేదు.

పోతన యనువాదములోని యమూలకములను సోదాహరణముగా వివరించుటకు ముందుగా, ఇతివృత్తమును విభజించుకొనుటలో వ్యాస, పోతనలనుసరించిన తీరు నొకింత పరికింతము.

వ్యాస, పోతనల భాగవత దశమస్కంధములందలి యితివృత్తవిభజనమును పరికించినచో కొన్ని సామ్యభేదములు కానంబడుచున్నవి. వ్యాసభాగవత దశమ స్కంధము పూర్వార్థమనియు ఉత్తరార్థమనియు ద్విధావిభక్తమైనట్లే పోతన భాగవత దశమస్కంధముకూడ పూర్వభాగమనియు, నుత్తరభాగమనియు విభజింపబడినది. కాని వ్యాసుడు పూర్వార్థమును శ్రీకృష్ణావతారోపక్రమముతో నారంభించి, అక్రూర ధృతరాష్ట్రసంవాదానంతరము అక్రూరుడు యదుపురమునకు తిరిగివచ్చుటతో ముగిం చగా, పోతన పూర్వభాగమును రుక్మిణీకల్యాణముతో ముగించుచున్నాడు. బలరామ కృష్ణులు జరాసంధునితో యుద్ధముచేయుటతో వ్యాసుని యుత్తరార్థము ప్రారంభము కాగా, పోతన యుత్తరభాగము ప్రద్యుమ్నోపాఖ్యానముతో నారంభింపబడుచున్నది. ఉత్తరభాగపు ముగింపు రెండింటను సమానముగానే గావింపబడినది.

పోతన గావించిన పూర్వోత్తరభాగవిభజన మూలమునకు మెరుగులు దిద్దు చున్నట్లున్నదని చెప్పవచ్చును. ఏలయన పోతన పూర్వభాగము వ్యాసుని పూర్వ భాగమువలెగాక రుక్మిణీకల్యాణముతో ముగింపబడుటచే మంగళాంతమై 'మంగళాదీని మంగళమధ్యాని, మంగళాంతాని కావ్యాని' అను నియమానుసారము ప్రత్యేక కావ్య

ప్రతిపత్తిని పొందదగియున్నది. ఇట్లు రుక్మిణీకల్యాణముతో ముగింపబడుటచే పూర్వ హరివంశమనియో, లేక శ్రీకృష్ణకల్యాణమనియో పిలువదగిన స్థాయికి పోతనపూర్వ భాగము చేరుకొనినది. అట్లే యుత్తరభాగమును శ్రీకృష్ణపుత్రుడైన ప్రద్యుమ్నుని చరిత్రతో నారంభించుటచే, వ్యాసుని యుత్తరభాగమువలె యుద్ధాదులతో ప్రారంభము గాక మంగళాదియై యలరారుచున్నది. ఇట్లు పోతన రెండుభాగములను ప్రత్యేక గ్రంథప్రతిపత్తి నంద నర్హమైనవిధముగా విభజించియుండునని భావింపవచ్చును. లోక మున జనుల జీవితములుసైతము వివాహపు పూర్వజీవితమనియు, వివాహపు టుత్తర జీవితమనియు వివాహముతోనే విభజింపబడుచున్నవి. అట్లే శ్రీకృష్ణునిజననము మొదలు రుక్మిణీకల్యాణమువఱకు పూర్వభాగముగను, ప్రద్యుమ్నాది పుత్రజననాదులనుండి యుత్తరభాగముగను విభజింపబడియుండునని యూహ. పాఠకులుసహితము మంగళ కరమైన ఘట్టమువద్ద నిలుపుటకును, మంగళకరమైన ఘట్టముతో ప్రారంభించుటకు నుత్సహింతురుగాని, కలహాదులతో ప్రారంభించుటకుగాని ముగించుటకుగాని యుత్స గింపరుగదా !

పోతన రుక్మిణీకల్యాణ కథను పూర్వభాగములో చేర్చుటకుగల కారణమును డా. ధూళిపాళ శ్రీరామమూర్తి గారిట్లూహించుచున్నారు. "పోతనగారు రుక్మిణీ కల్యాణకథ ననర్ఘశిల్పభూమిగాఁ దీర్చిదిద్దినాడు. దాని నుత్తర భాగమునందుఁ జేర్చినచో దానుజూపిన శిల్పసౌందర్యమునకు న్యాయ్యము కలుగదనుకొన్నాడు. వస్తుగతినిఁబట్టి శ్రీకృష్ణుని బాల చరితమునకు జనరంజకత యధికము. ప్రౌఢచరితమునకంత రంజకత లేదు. ఈకథను ప్రౌఢచరితములోఁ జేర్చినచో నీకథయందున్న రామ ణీయకము మఱుగుపడి పోవచ్చును. దీనినిఁ బూర్వభాగాంతమున నిల్పినచో దానికి స్థానవిశేష లాభము గలిగి రమణీయమైన బాల చరిత్రమునకుఁ గొలికి పూసయై ప్రకాశించును. పోతనగారు భావించి నట్లే దశమస్కంధ పూర్వోత్తర భాగములలోఁ బూర్వభాగమున కున్న సర్వజనీనత యుత్తరభాగమునకు రాలేదు. రుక్మిణీకల్యాణకథ యుత్తరభాగమునందున్న సర్వజనీనమయ్యెడిదిగాదని తలంపనగును."[3]

పోతనగారు రుక్మిణీకల్యాణకథ ననర్ఘశిల్పభూమిగా తీర్చిదిద్దినారను విషయ మంగీకరింపదగినదైనను, దానినుత్తరభాగమునందు జేర్చినచోఁ దానుజూపిన శిల్ప

సౌందర్యమునకు న్యాయ్యము కలుగదని పోతన తలంచి యుండుననునది యంగీకార్యము గాదు. ఏలయన 'కిమివహి మధురాణాం మండనం నాకృతీనామ్' అనునట్లు సహజ సౌందర్య విలసితమైన రుక్మిణీకల్యాణ ఘట్టము సర్వజనీన మగుటకు ఏభాగమున నిబద్ధింపవలెనా ? అని తలంపవలసిన నవసరములేదు. పూర్వోత్తర భాగములలో నెచ్చటచేర్చినను తన సహజ రామణీయకముచే గులకరాలలో రత్నమువలె, పొండు పత్రములమధ్య కిసలయమువలె ప్రకాశించుచు సహృదయుల కానందమును కలిగించుచు సర్వజనీనము కాగలదు. అంతియేగాక పోతన పరమ భాగవతోత్తముడుగాన నాతని భక్తి తన్మయత్వమున సన్నిఘట్టములు ననర్ఘశిల్పములుగా, నప్రయత్నముగనే రూపు దాల్చినవి. సామాన్యకవులవలె పోతన రామణీయకతను ప్రయత్నపూర్వకముగా కల్పించునట్టియు, ఆయా ఘట్టములకు సర్వజనీనత కల్గించుటకేయే భాగములలో చేర్చవలెనా ? అని యాలోచించునట్టియు స్వభావము కలవాడుకాడు.

వస్తుగతినిబట్టి శ్రీకృష్ణుని బాలచరితమునకు జనరంజకత యధికమనియు, పౌఢచరితమున కంత జనరంజకత లేదనుటయు శ్రీరామమూర్తిగారి భావనకావచ్చు నేమోగాని పోతనభావన మాత్రముకాదని నిష్కర్షగా చెప్పవచ్చును. వారి పూర్వోత్తర భాగములరెంటికిని సమాన ప్రతిపత్తికల్గుటయే ఇందులకు కారణము. జనరంజకత వస్తుగతినిబట్టిగాక ఆ వస్తువును ప్రదర్శించిన తీరునుబట్టియు, ప్రదర్శించిన వాని నేర్పునుబట్టియు నాధారపడియుండునని నిస్సంకోచముగా చెప్పవచ్చును. కావున వస్తుగతినిబట్టి జనరంజకతనూహించి రుక్మిణీకల్యాణ ఘట్టము నుత్తరభాగములోగాక పూర్వభాగములో పోతన నిబద్ధించినాడనుభావన సరియైనదిగా తోపదు.

దశమస్కంధ పూర్వోత్తరభాగములలో పూర్వభాగమునకున్న సర్వజనీనత ఉత్తరభాగమునకు లేదనుటయు సరియైన తలంపుగా కన్పట్టదు. పూర్వభాగము నందలి రుక్మిణీకల్యాణమెట్లు సర్వజనీనమైనదో నట్లే ఉత్తరభాగమునందలి స్యమంత కోపాఖ్యానము, నరకాసురవధ, ఉషాపరిణయము, కుచేలోపాఖ్యానమును పండిత పామరులందరిచే నాదరింపబడుచున్నవి. అంతియేగాక పోతన తన జీవనవిధాన మును ప్రతిబింబింపజేసిన ఘట్టము కుచేలోపాఖ్యానమేగదా! అది యుత్తరభాగములో నిబద్ధింపబడినదేకదా ! కావున రామాయణమునందలి సుందరకాండవలె, భాగవతము నందలి దశమస్కంధమంతయు పారాయణగ్రంథమై, సర్వకాలీనమై, సర్వజనీనమై యలరారుచున్నదను విషయము విజ్ఞులెరుంగనిదికాదు. ఈ విధముగా పర్యాలోచన చేయుగా రుక్మిణీ కళ్యాణకథ యుత్తరార్థమునందున్నచో రామణీయకత చెడి

సర్వజనీనము కాలేదను తలంపుతో పోతన పూర్వభాగమున చేర్చియుండుననియు, ఉత్తరభాగమునందున్న సర్వజనీనమయ్యెడిది కాదనియు శ్రీరామమూర్తిగారు తలంచుట యుక్తియుక్తముగా కానరాదు. పోతన గావించిన పూర్వోత్తరభాగేతివృత్త విభజన సహృదయానందకరమై, వ్యాసుని భాగవత దశమస్కంధమునకు వన్నెపెట్టు చున్నదని చెప్పవచ్చును.

వ్యాసుని దశమ స్కంధమునందలి పూర్వార్థము 49 అధ్యాయములుగాను, ఉత్తరార్థము 41 అధ్యాయములుగాను విభజింపబడి మొత్తము తొంబది యధ్యాయము లతోనలరారుచున్నది. కాని విజయధ్వజునిచే ద్వైతమతపరముగా గావింపబడిన పదరత్నావళి యను వ్యాఖ్యాన గ్రంథమునందు పూర్వార్థమునందలి 12, 13, 14 అధ్యాయములు వదలివేయబడినవి. కాని తదితర వ్యాఖ్యానకారు లెల్లరు నీయధ్యాయము లను విడవకుండుటయేగాక విస్తృత వ్యాఖ్యానములు గావించినారు. ఈ యధ్యా యములకు పోతన యనువాదము కానవచ్చుటచే నీయధ్యాయములను విడచుట పోతనకును సమ్మతము కాదనువిషయము సువ్యక్తమగుచున్నది.

వేలూరు కుప్పుస్వామి మొదలియారుచే పరిష్కరింపబడిన పోతన భాగవత ప్రతియందును, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రతియందును సంస్కృతము నందువలెనధ్యాయ విభజన గానవచ్చుచున్నది. తక్కిన ప్రతులలో కానరాదు. కావుననీయధ్యాయ విభజన పాఠకుల సౌలభ్యముకొఱకును, మూలముతో సమానముగా నుంచవలెనను సంకల్పముతోనాయా పరిష్కర్తలచే గావింపబడినదేగాని పోతన కృతము కాదను విషయము వేటతెల్లమగుచున్నది. పోతనకృత పూర్వోత్తర భాగాంత గద్యలందలి విషయవివరణమేయే యుపవిభాగములుగా విభజించుట పోతన కనుమతమో, వానికేయే శీర్షికల నుంచవలెనో సూచించుచున్నది. దీనినిబట్టి పరిష్కర్త లచే నాయాఘట్టము లాయా శీర్షికలతో విభజింపబడినవి. ఈ శీర్షికలనుబట్టి పూర్వ భాగము 65 ఉపవిభాగములుగను, ఉత్తరభాగము 53 ఉపవిభాగములుగను, మొత్తము దశమస్కంధము 118 ఉపవిభాగములు గావింపబడినట్లు తెలియుచున్నది.

సామాన్యముగానధ్యాయవిభజన పాఠకులకు సుకరముగా కథాఘట్టము లేక కథాంశము మారినదని తెలియజేయుటకు గావింపబడుచుండును. అట్టితఱినొక ఘట్టమునందలి యితివృత్తము సంపూర్ణముగానొకే యధ్యాయమున వర్ణింపబడ వలెను. అట్లుగాక ఒకేఘట్టము పలువిభాగములు గావింపబడుటయు నిలుపుదలచేయ

నవసరములేని తావులందు ప్రత్యేకముగానధ్యాయవిభజన చేయుటయు కథాగతికి భంగకర మగునేగాని రంజకము కాజాలదు.

అన్నితావులందును కాకున్నను వ్యాసుడెడనెడ నొకే కథాఘట్టమునకు నడుమ అధ్యాయములను మార్చియుండుట కానవచ్చును. ఉదాహరణమునకు బ్రహ్మ, గోవత్సములను గోపబాలురనంతర్ధానము చేయుట, బ్రహ్మమోహము నశించి తిరిగి యిచ్చుటవఱకుగల ఘట్ట మొక్కటియేగదా! దీనిని వ్యాసుడు 13, 14 అను రెండధ్యాయములుగా విభజించినాడు. అట్లే కాళియమర్దనము రెండధ్యాయములుగను, రుక్మిణీకల్యాణ ఘట్టము మూడధ్యాయములుగను విభజింపబడెను. కావుననే వ్యాసుడు గావించిన అధ్యాయ విభజనను పోతన యథాతథముగా అనుసరింపక, అవసరమైన విభజనను పూర్వోత్తరభాగాంత గద్యలలో వివరించియున్నాడు.

ప్రశ్నోత్తరరూపమైన కథాకథనము మూలముననున్నట్లే పోతనయు గావించినాడు. వ్యాసుని భాగవత దశమ స్కంధములోని పూర్వార్థమున 2013 శ్లోకములు (గోరఖ్‌పూర్ ప్రతినిబట్టి), ఉత్తరార్థమున 1933 శ్లోకములు గలవు. వ్యాస దశమ స్కంధమున మొత్తము 3946 శ్లోకములు గలవు, అందు నత్యధికముగ ననుష్టుప్పులే దర్శన మిచ్చుచున్నవి. పోతన భాగవత దశమస్కంధమునందలి పూర్వభాగమున 1768 గద్యపద్యములు, ఉత్తరభాగమున 1338 గద్యపద్యములును, స్కంధాంత గద్యలతో కలిపి మొత్తము దశమస్కంధమున 3126 గద్యపద్యములు (ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమివారి ప్రతినిబట్టి) కానంబడుచున్నవి. ఇందు సుమారు 10, 15 శ్లోకములకు సమానమగు సుదీర్ఘ వచనములు, ఐదారు శ్లోకముల నిముడ్చు కొనగలిగిన సీసములు, వృత్తములునధికముగా ప్రత్యక్షమగుచున్నవి. దీనినిబట్టి పరిశీలించినను, వ్యాస భాగవత దశమస్కంధమునకు రెండింతలు పోతన భాగవత దశమస్కంధము పెరిగినదని చెప్పుటలో నతిశయోక్తిలేదు.

ఈ విధముగ పూర్వోత్తరభాగ విభజనములోను, అధ్యాయ విభజనమందును, పోతన కొంత స్వతంత్రించుటద్వారా ఇతివృత్త విభజనములోను, కథాకథన ప్రణాళిక లోను. పోతన భాగవత దశమస్కంధము, వ్యాస దశమస్కంధమునకు వన్నెపెట్టు చున్నదని చెప్పవచ్చును.

## అ మూ ల క ము లు

సాధారణముగా ఏగ్రంథము నాధారముగాగొని యనువాదకుడు తన యనువాద మును సాగించుచుండునో యట్టి యాధారభూతమైన గ్రంథమును మూలగ్రంథ

మనుటయు, అందు లేని విషయములు అనువాదమునగాని, యనుసరణ గ్రంథమున గాని చేరినచో నట్టివానినమూలకములని పరిగణించుటయు విమర్శకలోకమున పరిపాటి. ఉదాహరణమునకు భాస్కరరామాయణమునందు కానవగు జంబుకుమారుని వృత్తాంతము, కాలనేమి వృత్తాంతము మొదలగు అవాల్మీక గాథలన్నింటిని అమూలకములుగా పరిగణించుచున్నారు, ఈ గాథలు రంగనాథ రామాయణము నుండి గ్రహింపబడినవే గాని భాస్కర రామాయణకర్త స్వతంత్ర కల్పనలుగావు. యథార్థమునకు నివి యవాల్మీకములే గాని యమూలకములు గావు.

ప్రధానాధార గ్రంథమునందు లేకున్నను తద్వ్యాఖ్యానములనుండిగాని, తదితర గ్రంథములనుండిగాని గ్రహించి యనువాద గ్రంథమునందుగాని, యనుసరణ గ్రంథమునందుగాని చేర్చిన విషయములను, భావములను అమూలకములనుట సమంజసముగా గన్పట్టదు. లిఖిత గ్రంథములందెందును గానరాక తత్కాలీన జనపదములో బహుళ ప్రచారమునందిన గాథలనుగాని, భావములనుగాని యనువాదకుడు తన గ్రంథమున చేర్చినచో వానినమూలకము లనవచ్చునా ? అను ప్రశ్నకూడ నుదయించును. పర్యాలోచనచేయగా నిట్టివానినిసహితమమూలకములనుట హేతుబద్ధము గాదు. కావుననింతవఱకు, సాహితీలోకమున అమూలకములుగా విమర్శకులచే పరిగణింపబడుచున్నవానికి ప్రధానాధార గ్రంథమునగాక తదితరములందెందేని యాధారములు లభించినచోనవి సమూలకములగునుగాని యమూలకములుగావు. ప్రధానాధారగ్రంథమునుండిగాని, తద్వ్యాఖ్యానములనుండిగాని, తదితర గ్రంథములనుండిగాని, నాటి జనపద ప్రచారమునుండిగాని గ్రహింపక కేవలము కవికల్పితములను మాత్రమమూలకములుగ పరిగణించుట సమంజసమని చెప్పుటలోనెట్టి విప్రతిపత్తియునుండబోదు. వ్యాస, పోతనల భాగవత దశమస్కంధములను తులనాత్మకముగా నధ్యయన మొనర్చుట ప్రస్తుత సిద్ధాంతవ్యాసముయొక్క ప్రధాన లక్ష్యమగుటచే వ్యాసుని దశమస్కంధములో లేని యంశములను మాత్రమీ వ్యాసమున అమూలకములుగా పరిగణించుట జరిగినది.

మూలమునందు సంక్షేపముగానున్నవానినను వాదమున విస్తరించిన తావులందలి విస్తరణమును, విస్తారముగా నున్నవానిని సంక్షేపించిన తావులందలి సంక్షిప్తతను, ఒకతీరున నున్నదాని నన్యథాకరించిన తావులందలి యన్యథాకరణమును కూడ నామేరకు నమూలకములుగా పరిగణించుటలో ననౌచిత్యము లేకపోవుటయేగాక మిక్కిలి తర్కబద్ధమై యుండగలదు. అమూలకమను పదము నిట్టి వ్యాపకమగు నర్థమున గ్రహించి ప్రస్తుత పరిశోధక వ్యాసమును కొనసాగించుట జరుగగలదు.

ఆంధ్రమున నాదికవిగా ప్రసిద్ధిగాంచిన నన్నయచే గావింపబడిన భారతాను వాదముతో ప్రారంభమై యనేకములైన అనువాదగ్రంథములాంధ్రసాహిత్యమున వెలసినవి. ఇందనేకములు నామమాత్రమున కనువాదములేగాని యాయా యనువాద కుల స్వేచ్ఛానువాదపద్ధతి కారణముగా స్వతంత్ర రచనలవలె నలరారుచున్నవి. మూలగ్రంథములను మరపించి స్వతంత్ర రచనలవలె భాసించుటకు భావనానిపుణు లైన యనువాదకుల యమూలకభావసంపద వారి యనువాద గ్రంథములలో రసాత్మ కముగా చేరుటయే ప్రధాన కారణము.

"కొందరు పండితులు భారతాది సంస్కృత వాఙ్మయము బంగారపు ముద్దయైనచో వాని తెనుగుసేతలు స్వర్ణాభరణములని ప్రశంసించి యున్నారు. ముద్దగానున్న బంగారమునాభరణములు సేయుటకు శిల్పి కరగించును. వివిధాకారములు వచ్చునట్లు దానిని పోతపోయును. చేతితో చిత్రశిల్పములు మలచును. మధ్య మధ్య, నధికతర సౌందర్యప్రకటనమునకై వజ్రవైడూర్యములను పొదుగును. ఈ వజ్రవైడూర్యములాబంగారములోనివి కావు. ఆభరణరూపముగా నున్న ఆ కాంచనమునకు ఇవి కమనీయకాంతినిచ్చును. ఈ ఆభరణ నిర్మాణమే ఆంధ్రీకరణవైఖరి. మధ్యమధ్య ఖచితరత్నములే అమూలక కల్పనలు."[4] అను ప్రసాదరాయకులపతిగారి పలుకులనువాద గ్రంథములలో అమూలకముల స్థానమెట్టిదో సువ్యక్త మొనరించుచున్నవి.

ముందుపుటలలో వివరించిన స్వరూపముతోడి యమూలకములు పోతన భాగవతములో కనబడునంతటి విస్తృతితోగాని రసతన్మయత్వముతోగాని, ఇతరాంధ్రానువాదములలో చోటుచేసుకొనుట కానము. బహుముఖమై రంజకమైన నమూలకభావములు పోతన యనువాదములో చోటుచేసుకొనుటకతడు భక్తిభావాంబర వీధి విశ్రుతవిహారుడగుటయే ప్రధానహేతువు.

మహాభక్తుడైన పోతన భగవంతునియొక్కయు, భగవద్భక్తులయొక్కయు గుణ మహిమానుగానము గావించునపుడును, తద్దివ్యమంగళరూపమును వర్ణించు నపుడును, భక్తితన్మయత్వమున మూలమునకు పరాధీనుడు కాడు. భక్తిరస సంభరి తములైన వార్షుకాభ్రముల బోలిన పోతన హృద్గతభావములతని యనువాదములో రసమును ధారాపాతముగా వర్షించుట పలుతావుల గమనింపగలము. మహోత్తుంగ

భక్తి భావతరంగ సంకుల ప్రవాహమున నెంతదూరము కొట్టుకొనిపోవునో పోతనకే తెలియదు.

ఇట్లు భక్తిరసపూరితములైన, భగవత్తత్త్వప్రబోధకములైన ఘట్టములందే గాక తదితరఘట్టములందును పోతన యమూలకభావములత్యున్నతస్థాయిలో రసాను భూతిని కలిగించుచుండును. సందర్భోచితములు, అనంతరకథకు పరిపోషకములునగు అష్టాదశవర్ణనలు సలుపునపుడును, పరిపూర్ణములు విశిష్టములునైన రూపచిత్రణములు గావించునపుడును, ఆయా పాత్రల మనస్తత్త్వములను వెలువరించునపుడును, చక్కని సంభాషణలు నడిపించునపుడును, మూలముకంటె భిన్నములైన విశేషము లెన్నియో పోతన భాగవతమున నడుగడుగున కానవచ్చును. ఆయా విశేషములకు సంబంధించిన కొన్ని యుదాహరణము లీక్రింద నీయబడుచున్నవి.

ఉ. అన్నవు నీవు చెల్లెలికి నక్కట! మాడలు చీరెలిచ్చుటో
మన్ననసేయుటో మధురమంజులభాషల నాదరించుటో
మిన్నల మోతలే నిజము మేలని చంపకుమన్న! మాని రా
వన్న! సహింపుమన్న! తగదన్న! వధింపకుమన్న! వేడెదన్.

మ. చెలియల్ కన్నియ ముద్దరాలబల నీ సేమంబె చింతించు ని
ర్మల దీనిన్ బయ లాడు మాటలకునై మర్యాదవోఁగొట్టి స
త్కులజాతుండవు పుణ్యమూర్తి వకటా! కోపంబు పాపంబు నె
చ్చెలి నోహో తెగ వ్రేయఁ బాడియగునే చింతించు భోజేశ్వరా!

—ఆం. భాగ. దశమ. పూ.భా. 26, 28

ఆకాశవాణి పల్కులు విని కంసుడు దేవకిని చంపబోవునపుడు పోతన వసుదేవునిచే పల్కించిన కరుణరసతరంగితములగు పై పల్కులకు మూలము కానరాదు.

వసుదేవు డసత్యమునకు వెఱచి తనకు దేవకియందు తొల్త జనించిన సుతుని కంసునకు సమర్పించిన సందర్భములో పోతన

క. పలికిన పలుకులు తిరుగక
సొలయక వంచనము లేక సుతుల రిపునకున్

గలగక యిచ్చిన ధీయుం
డిల వసుదేవుండు దక్క నితరుఁడు గలఁడే.

—ఆం. భాగ. దశమ. పూ.భా, 47

అని పలుకుట వసుదేవుని ధీరత్వమును, నిర్వంచనత్వమును, సత్యవాక్పాలనమును, కీర్తించుటయే. వసుదేవుని నడవడికి సంబంధించిన సమగ్రస్వరూపమును సజీవముగా చిత్రించిన ధోరణి యిందు కాననగును. ఇది మూలమున కానరాదు.

దేవకీదేవి హరిని గర్భమునందు దాల్చిన విధానమునందలి యీక్రింది భావములకు మూలము కన్పట్టదు.

క. గురుతరముగఁ దన కడుపున
సరసిజగర్భాండభాండచయములు గల యా
హరి దేవకికడుపున భూ
భరణార్థము వృద్ధిఁ బొందె బాలాకృక్రియన్.

సీ. విమతుల మొగములు వెలవెలఁబాఱంగ
విమలాస్యమోము వెల్వెలుకఁబాఱె
మలయువైరులకీర్తి మాసి నల్లన గాగ
నాతిచూచుకములు నల్లనయ్యె
దుష్టాలయంబుల ధూమరేఖలు పుట్ట
లేమయూరున రోమరేఖ మెఱసె
నరిమానసముల నాహారవాంఛలు దప్ప
వనజాక్షి కాహారవాంఛదప్పె

తే. శ్రమము సంధిల్లె రిపులకు శ్రమము గదుర
జడత వాటిల్లె శత్రులు జడనుపడగ
మన్ను రుచియయ్యెఁ బగతురు మన్ను చొరఁగ
వెలదియుదరంబులో హరి వృద్ధిఁబొంద

సీ. సలిల మా యెలనాగ జఠరాంకభునిఁ గానఁ
జనినకైవడి ఘర్మసలిల మొప్పె
నొగిఁ దేజమా యింతి యుదరడింభకుఁ గొల్వఁ
గదిసిన క్రియ దేహకాంతి మెఱసెఁ
బవను డా కొమ్మ గర్భస్థుని సేవింప
నుదయించెనో యననూర్పులమరెఁ
గుంభిని యా లేమ కుక్షిగు నర్చింపఁ
జొచ్చుభంగిని మంటిచొరన దనరె

ఆ. గగన మిందువదనకడుపులో బాలు సే
వలకు గూపు మెఱసి వచ్చినట్లు
బయలువంటినడుము బహుళమయ్యెను బంచ
భూతమయుడు లోనఁ బొదల సతికి

సీ. అతివ కాంచీగుణం బల్లన బిగియంగ
వైరివధూగుణవ్రజము వదలె
మెల్లన తన్వంగి మెయిదీగె మెఱుగెక్క
దుష్టాంగనా తనుద్యుతు లణంగె
నాతి కల్లన భూషణములు పల్వాలుకగాఁ
బరసతీభూషణపంక్తు లెడలెఁ
గలకంఠి కొయ్యన గర్భంబు వొడ్డగాఁ
బరిపంథిదారగర్భములు పగిలెఁ

తే. బొలతి కంతంత నీళ్లాడుప్రొద్దు లెదుగ
నహితవల్లభ లైదువలై తనర్చ
ప్రొద్దులన్నియుఁ గ్రమమునఁబోవఁదొణగె
నువిదకడుపున నసురారి యుంటఁ జేసి

-ఆం. భాగ. దశమ. పూ.భా. 69, 71, 73, 75.

ఈ వర్ణన చాల సహజముగా నుండుటయేగాక హరిచే జరుగబోవు దైత్య సంహారమునుగూడ వ్యంజింపజేయుచున్నది. అవతార పురుషుడైన కృష్ణుని గర్భ మందుంచుకొనిన దేవకిలో గర్భవతిలో సహజముగా కన్పట్టు శారీరకములగు మార్పులను వర్ణించునట్టి మిషతో గర్భస్థశిశువు మహత్త్వమును సూచించి, స్మరించి పోతన తృప్తిపడినాడు. ఇదిమూలమున కానరాదు.

"మనయశోద చిన్నిమగవాని గనె నట
చూచి వత్తమమ్మ సుదతులార"

అనిపలుకుచు గోపికలు నందుని యింటికిజని యశోదను, బిడ్డను చూచి స్నానము చేయించిన పిమ్మట గోపికలు పాడిన

క. జోజో కమలదళేక్షణ !
జోజో మృగరాజమధ్య ! జోజో కృష్ణా !
జోజో పల్లవకరపద !
జోజో పూర్ణేందు వదన జోజో యనుచున్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 189

అను జోలపాటయు,

క. పలుతోయంబుల జగములఁ
బలుతోయములందు ముంచి భాసిల్లెడి యా
పలుతోయగాడు పల్లవ
లలనాకరతోయములఁ జెలంగుచుఁ దడియున్.

- ఆం. భాగ. దశమ. పూ.భా 191 నుండి 194

ఇత్యాదిగా నాలుగు పద్యములలో శ్రీకృష్ణుని బాల్యస్థితిని పరమాత్మ తత్త్వ ద్యోతకముగా భావించుటయు, పోతన దశమస్కంధములోనే కాననగును. పైన వ్రాయ బడిన అమూలకమైన జోలపాట యెంత చక్కగా నున్నదో గమనించితిరిగదా ! అభ్యంగనస్నానానంతరము హరి ( శ్రీరామ ) రక్షయనుచు జలముచుట్టిరాన్ స్త్రీలు చల్లుట యీనాటికిని పలుప్రాంతములలో కానవచ్చుచున్నది. శ్రీకృష్ణుని బ్రహ్మముగా, పరమాత్మ స్వరూపముగా, త్రిమూర్త్యాత్మక స్వరూపముగా అనువాదమున చిత్రించుట తన భక్త్యతిశయముచే పరమాత్మతత్త్వ మెఱింగిన వాడగుటచే సంభవమైనది.

పూతన బాలకృష్ణునకు చనుగుడుప ప్రయత్నించు సందర్భమున నా బాలుని ముద్దాడుచున్నట్లు నటించుచు పల్కిన నీక్రింది పల్కులకు మాతృకలేదు.

క. ఆ పాపజాతి సుందరి
యా పాపనిపాన్పుఁ జేర నరిగి కరములన్
లేపి చనుంగవ శిశువున్
మోపుచు ముద్దాడి శిరము మూర్కొని పలికెన్.

క. చను నీకుఁ గుడుపఁ జాలెడి
చనువారలు లేరు నీవు చనవలె ననుచున్
చను గుడిపి మీద నిలుకడఁ
జనుదాన ననంగ వేడ్కఁజనుఁ జను గుడుపన్.

క. నా చనుఁబాలొక గ్రుక్కెడు
నో చిన్నికుమార! త్రావు మెయ్యన పిదపన్
నీ చెలువ మెఱుఁగవచ్చును
నా చెలువము సఫలమగును నళినదళాక్షా !

- ఆం. భాగ. దశమ, పూ.భా. 218,219,220

ఇందు పాలిచ్చుస్త్రీ శిశువునెట్లు లాలించునో విశదమగుటయేగాక పూతనలో సహితము భక్త్యతిశయము కానవచ్చుచున్నట్లు తెలియుచున్నది. శ్రీకృష్ణునకు పాలిచ్చు పూతన మోక్షమునందగలదనియు వ్యక్తమొనరింపబడుచున్నది. ఇట్లు పాలిచ్చి మోక్షమునందిన వారెవ్వరును లేరనియు, అట్టి యదృష్టము నాకుమాత్రమే సంభవించినదను భావము పూతనలో ద్యోతకమొనర్చుట, పోతన పూతనను విష్ణుభక్తురాలుగా కాంచుటను సువ్యక్తమొనరించుచున్నది. సామాన్యముగా కనబడు పాత్రలందు సైతము భక్తిని చూడగలిగినాడు. ఇట్టి దృష్టి వ్యాసునిలో కానరాదు. ఇదియే వ్యాసునిలోను, పోతనలోను కానవగు ప్రధానమైనభేదము. వ్యాసునిభాగవతము పురాణరూపమున రచింపబడుటచే నందు మిత్రసమ్మితములుగా మాత్రమే చెప్పిరి.

10)

పూతన ప్రాణాపహరణానంతరము మూలమున లేనట్టి యీ క్రింది పద్య-ము గమనించినచో పోతన కొంటెపాప యశోదకు లభించినను మునులకు గుణ గానమునెట్లు గావించుచుండునో వ్యక్తమగుచున్నది.

క. విషధరరిపుగమనునికిని
విషగళసఖునికిని విమలవిషశయనునకున్
విషభవభవజనకునికిని
విషకుచ చనువిషముఁ గొనుట విషమే తలపన్.

– ఆం. భాగ. దశమ. పూ. భా. 232

మాయయను పొరలు క్రమ్మిన నేత్రములతో మనుజులు చూచునప్పుడుగా కనుపట్టు శ్రీకృష్ణునకు సంబంధించిన కొన్ని ఘట్టములను, లోకోత్తరముగా వర్ణించు మనే దానితోబాటుగా నా పొరలువిచ్చిన భక్తిమయమగు జ్ఞాననేత్రములతో కనిపించు గనుపట్టు మహత్త్వమును కూడ సూచించుచు నాయా తావులందు పోతన తనపద్యమునెరిగించెను. పోతన యీవిధముగా తాను భగవానుని చూచుచు మనకు చూపగలడనుటకు పై పద్యమే ప్రబల తార్కాణము కాగలదు. ఇట్టి పద్యములనేకములీయా ఘట్టములు చివర కానవచ్చుచున్నవి. ఇది శుకుడు పరీక్షిత్తునకు చెప్పినట్లుగా చెప్పిన యీ పద్య ములలో కానవచ్చుట మరింత యుచితముగానున్నది.

నందబాలురకిరువురకును నామకరణాదులు జరిపించుటకు రావింపబడిన గర్గుని స్వరూప స్వభావములీవిధముగా చిత్రీకరింపబడినవి.

క. .............
సారగుణాచార్యమార్గు సత్సంసర్గు
న్నారాధితభర్గున్ మతి
దూరితషడ్వర్గుఁ గుజనదుర్గున్ గర్గున్.

– ఆం. భాగ. దశమ. పూ. భా. 281

మూలమున కానరాని గర్గునిపాత్రయొక్క సమగ్ర స్వరూపము నిట సిద్ధించినది. ఒక్కొకచో సంక్షిప్తముగను, కొండొకచో విస్తృతముగను, సముచితాల్పల శబ్దాలంకారములు తోడుచేసి ఆయా పాత్రల వ్యక్తిత్వమును, భావౌన్నత్యమును, ఘట్టములయొక్కయు, సమగ్ర స్వరూపమును మనోజ్ఞముగా సాక్షాత్కరింప

జేసినగాని పోతనకు తృప్తిలేదు. ఇట్టిరూపమునందుకొనువఱకు పాఠకునకును తృప్తి కలుగదు. ఇది భక్తిసంభరితమగు పోతన హృదయగతికి, సమ్మోహకమగు నతని రచనా శిల్పమునకును సంబంధించిననొకవిశేషము. 'కనులకు కట్టినట్లు వర్ణించుట' యను దానికి పైనుదహరించిన పద్యమొక సరియైననుదాహరణము. ఏలయన నిది బాహ్యములైన నేత్రములకే గాక యాంతరములైన నేత్రములకును దర్శనమిచ్చుచున్నది. ఇట్టిపద్యములు, భావములు, ఘట్టములు పోతనరచనలో లెక్కకు మిక్కిలిగా కలవు.

బలరామకృష్ణుల చపలకృత్యములను గోపికలు యశోదకు నెరిగించిన పిమ్మట నామె బాలకృష్ణుని యుపలించుచు తనయుని నడవడినిగూర్చి

సీ. బాలు డీతండని భావింతు నందునా
యే పెద్దలును నేర రీ క్రమంబు
వెఱ పెఱుంగుటకునై వెఱపింతు నందునా
కలిగి లేకొక్కఁడుగాని లేడు
వెఱపుతో నా బుద్ధి వినిపింతు నందునా
తను దానయై బుద్ధితప్పకుండు
నొండెఱుంగక యింట నుండెడి నందునా
చొచ్చిచూడని దొకచోటు లేదు

ఆ. తన్ను నెవ్వరైనఁ దలపోయఁ బాఱెడు
నోజలేదు భీతి యొకటెఱుంగఁ
జెలిమి నూరకుండఁ జేకసక్కెములనాడుఁ
బట్టి శాస్తిచేయుభంగి యెట్లు?

—ఆం. భాగ. దశమ. పూ.భా. 363

అని వితర్కించుకొనుటయు

క. లాలనమున బహుదోషము
లోలిం బ్రాపించుఁ దాడనోపాయములం
జాల గుణంబులు గలుగును
బాలురకును దాడనంబ పథ్యం బరయన్.

— ఆం. భాగ. దశమ. పూ.భా. 365

అని నిశ్చయించుకొనుటయు మూలములో కానరాదు. యశోద వితర్కించుకొను విధానము బాలునిలోనిమిడియున్న పరమేశ్వరతత్త్వమును చక్కగా వ్యక్తీకరించు చున్నది. పాఠకుని సన్నిహితునిగా చేయుటకు ముందుగా లోకసాధారణమైన విషయమును, సన్నిహితుడైనపిదప నసాధారణమైన తత్త్వవిషయముల నెరిగించుటయు పోతన కవితలో కానవగును.

శ్రీకృష్ణుడు యశోదచేతికి చిక్కినవుడు కృష్ణునిలోని మర్మంబులనెత్తి పలికిన నీక్రింది పల్కులకు మాతృకలేదు.

క. నీ రెవ్వరు శ్రీకృష్ణులు
గారా! యెన్నడును వెన్న గానరట కదా
చోరత్వం బించుకయును
నేరరట, ధరిత్రి నిట్టినియతులుఁ గలరే.

క. పట్టినఁ బట్టువడని నినుఁ
బట్టెదమని చలము గొనినఁ బట్టుట బెట్టే
పట్టువడవండ్రు పట్టీ
పట్టుకొనన్ నాకుఁగాక పరులకు వశమే.

క. ఎక్కడనైనను దిరిగెద
వొక్కయెడన్ గుణము గలిగి యుండవు నియమం
బెక్కడిది నీకు మఱచినఁ
జక్కనఁ బోయెదవు పెక్కుజాడలఁ బుత్రా!

సీ. తోయంబు లివి యని తొలగక చొచ్చెదు
తలచెదు గట్టైనఁ దరలనెత్త
మంటితో నాటలు మానవు కోరాడె
దున్నతస్తంభంబు లూపఁబోయె
దన్యుల నల్పంబు లడుగంగఁ బాఱెదు
రాచవేటలఁ జాల నవ్వ దెచ్చె
దలయవు నీళ్ళకు నడ్డంబు గట్టెదు
ముసలివై హారిస్మృత్తి మొనయఁజూచె

ఆ. డంబరంబు మొలకు నడుగవు తిరిగెద
వింకఁ గలిగి సేత లేల పుత్ర!
నిన్ను పంప వ్రాల్ప నే నేర ననియొ నీ
విట్టు క్రింద మీఁదు నెఱుగకునికి.

—ఆం. భాగ. దశమ. పూ.భా. 372 నుండి 375.

సర్వాంతర్యామియైన హరియే యీ శ్రీకృష్ణుడను మర్మము, 'తోయంబు లివియని తొలగవు' మున్నగు పద్యభాగములందు వాచ్యముగా బాలుడుచేయు దుడుకుచేష్టలు కన్పట్టుచున్నను హరిదశావతారవర్ణనమిందు ఒదిగినదను మర్మము, నెరుంగవలసియున్నది. ఈ ఘట్టముననిట్టిమర్మము కలదను విషయము సైతము పోతన స్వయముగా 'అని మర్మంబు లెత్తిపలికినట్లు' అని స్పష్టపఱచియున్నాడు. ఇట్టి ప్రధానమైన అర్థమామాటలుచ్చరింపబడిన స్వరమునుబట్టియు ప్రతీయమానమగు చున్నది. పోతన తన పాత్రచే తప్పనిసరిగా హరినింద చేయించవలసివచ్చినపుడు, పరమేశ్వర నిజతత్త్వస్ఫూర్తి కలుగునట్లు నర్మగర్భితముగానో, కాకుస్వరయుక్తముగానో, వ్యంజితమగురీతిలోనో పలికించుట భాగవతుడైన పోతనలో కానవగు విశేష లక్షణము.

యశోద శ్రీకృష్ణుని ఉలూఖలబద్ధుని గావించునపుడు తన యింటనున్న త్రాళ్ళనన్నింటిని తెచ్చికట్టిన నవియు తక్కువపడుటచూచి గోపికలాశ్చర్యము పొందుచుండ నామెయు నవ్వుచు నచ్చెరువొందెననిౕ మూలముకలదు, కాని యట్లు తక్కువగుటకుగల కారణము మూలమున కానరాదు. "జగజ్జాలములున్న బొజ్జఁ గట్టన్ వశమే"[6] అని యమూలకమైన సమర్థనతో పోతనయశోద శ్రీకృష్ణుని తత్త్వమును మరియొకమారు కీర్తించినట్లయినది. 'నోరునొవ్వంగ హరికీర్తి నుడువడేని' యని పలుకుటలో నంతరార్థమిదియే.

బకాసురవధ ఘట్టమున గోపబాలురు చూచిన బకుడీక్రింది విధముగా నొడుగు పెట్టుకొని యుండెనను వర్ణన మూలములోలేదు.

ఆ. ఎల్ల పనులుమాని యేకాగ్రచిత్తుఁడై
మౌనివృత్తి నితరమమత విడిచి
వనములోన నిలిచి వనజాక్షుపై దృష్టిఁ
జేర్చి బకుడు తపసిచెలువు దాల్చె

—ఆం. భాగ. దశమ. పూభా. 441.

ఇందు బకునకును, తపసికిని సరిపడునట్టి 'వెల్లపనులుమాని' మున్నగుపదము లుపయోగించి బకుని వనజాక్షునికొఱకు తపమొనరించు తాపసిగా భావించుటచే నాతనిలో సహితము భక్తి ప్రతిపాదన జరిగినట్లయినది. సాధారణముగా దుష్టుడుగా కనబడు బకుడు పోతనచేతిలో తాపసిగా రూపుదాల్చుట ఈతని ఉదాత్తతను వ్యక్తీక రించుచున్నది. కల్పించుకొని ప్రబంధకవులు అష్టాదశవర్ణనలు చేసినట్లే యవకాశమును కల్పించుకొని భక్తిని ప్రదర్శించుట భక్తిపరుడైన పోతన లక్షణము. ఇట్టి తావులను బట్టి దుష్టపాత్రలలో చెడును చూచుచునే గుణమును చూపించుట యితని యమూలకత లోని యొక ప్రత్యేక లక్షణమని విశదమగుచున్నది.

అఘాసురుడు మరణించినపిదప నాతనినుండి వెలికివచ్చిన నొక ప్రకాశము శ్రీకృష్ణునిలో ప్రవేశించెను. ఈ సందర్భమున అఘాసురుని శరీరమునుండి తేజము వెల్వడుటయేమి ? అది శ్రీకృష్ణుని చేరుటయేమి ? అను ప్రశ్నలుదయించును. ఈ ప్రశ్నలకు మూలమున కానరాని సమాధానము పోతన యనువాదమున కానవచ్చు చున్నది. దానిని పరికింపుడు.

క. తనరూపొక మాత్రైనను
మనమున నిడికొనినఁ బాపమంతయుఁ దనలోఁ
గొని చను హరి తను మ్రింగిన
దనుజునిఁ గొనిపోవకున్నె తనలోపలికిన్.

—ఆం. భాగ. దశమ. పూ. భా. 482.

ఈ విధముగా పాఠకులకు, భక్తులకు కలుగు సందేహములను ముందుగానే ఊహించుకొని సమాధానములొసగుట పోతనయనువాదమున పలుతావుల కానవచ్చు చుండును.

కృష్ణుని తోడిదే లోకముగా గోపబాలురు చల్దు లారగించుచుండగా వారిదూడ లడవిలోపలకు పోగా కృష్ణుడు వానిని వెదకుట నీక్రింది విధముగా వర్ణించెను.

క. ఇచ్చోఁ బచ్చిక మేసిన
విచ్చోఁ ద్రావినవి తోయ మేగిన విచ్చో
నిచ్చోట మంద గొన్నవి
యిచ్చోఁ బాసినవి జాడ యిదె యిదె యనుచున్.

—ఆం. భాగ. దశమ. పూ.భా. 502

దీనికి మూలము కన్పట్టదు. తప్పిపోయిన జంతువునుగాని, పోయిన వస్తువును గాని వెదకు మానసికస్థితికనుగుణమైన చర్యలు కనులకు కట్టినట్లుగానిందు వర్ణింప బడినవి.

విరించిచే హరింపబడిన సమస్తమైన గోవత్స, గోపబాలుర రూపములను హరి ధరించి పూర్వమువలెనే ఆయా తల్లులకు, బాలకులకు ప్రీతి కలిగించెననుచు పల్కిన ఈ క్రింది పల్కులకు మూలములేదు.

క. ఏ తల్లుల కే బాలకు
లే తెఱఁగునఁ దిరిగి ప్రీతి యొసగింతురు ము
న్నా తల్లుల కా బాలకు
లా తెఱఁగునఁ బ్రీతిసేసి రవనీనాథా!

- ఆం. భాగ. దశమ. పూ.భా. 515

ఇందు నాయాతల్లులయొక్కయు, బాలురయొక్కయు మనఃప్రీతి వర్ణితము. ఇది భగవంతుని సర్వవ్యాపకత్వమునకు సూచకము. ఒకపరిస్థితియొక్క స్పర్శచేత మానవుని హృదయతంత్రులు, ఎప్పుడెప్పుడెట్లు స్పందించి యెట్టి ధ్వనితరంగములను వెలార్చునో యను మర్మమునతిసహజముగా గుర్తించి యాకర్షముగా, ప్రభావవంత ముగా వ్యక్తముచేయుటయే రవి కాంచని దానిని సహితము కాంచగలిగిన కవినుండి సమాజమపేక్షించుచుండును.

హరియే సమస్తమైన గోప గోవత్సరూపముల ధరింపగా వానిని చూచి బ్రహ్మ తలంచిన

క. పుట్టితి బుద్ధి యెఱింగితిఁ
బుట్టించితి జగము సగము పోయెను ప్రాయం
బిట్టి వినూతన సృష్టులు
పుట్టుట లే దౌర యిట్టి బూమెలు భూమిన్.

- ఆం. భాగ. దశమ. పూ.భా 534

అను తలంపు వినూతనమని స్పష్టము. మిక్కిలి వృద్ధులైనవారేదేని వింతను చూచినపుడు పలుకు జనసామాన్య వచనములిందు చోటుచేసుకొనుట గమనింపతగిన యంశము. సృష్టికర్తకు సహితము ఇతడమేయగుణుడని చెప్పిన నీభావన, భక్తులకు

భగవానుని గుఱించి తెలిసికొనవలసినది చాలకలదను భావనను కల్గించి వారిని మఱింత మున్నతస్థితికి తీసికొనిపోవుటకు సహకరించుచున్నది.

సీ. రా పూర్ణచంద్రిక! రా గౌతమీ గంగ!
రమ్ము భగీరథరాజతనయ!
రా సుధాజలరాశి! రా మేఘమాలికా!
రమ్ము చింతామణీ! రమ్ము సురభి!
రా మనోహారిణి! రా సర్వమంగళ!
రా భారతీదేవి! రా ధరిత్రి!
రా శ్రీమహాలక్ష్మి! రా మందమారుతి!
రమ్ము మందాకిని! రా శుభాంగి!

ఆ. యనుచు మఱియుఁ గలుగు నాఖ్యలుగల గోవు
లడవిలోన దూరమందు మేయ
ఘనగభీరభాషఁ గడు నొప్పఁ జీరు నా
భీరజనులు బొగడఁ బెంపు నెగడ.

- ఆం. భాగ. దశమ. పూ.భా. 601

ఆవి గోవులను పేరుపేరున పిలచుట మూలమున కానరాదు. పోతన ఆయా గోవులకు పెట్టినపేళ్ళనుపరికించినచోనవి యాగోవులందలి పవిత్రభావమునుబట్టియు, రంగునుబట్టియు, నడకలనుబట్టియు, ఆకారములనుబట్టియు నిర్ణయించబడినవిగా కానవచ్చుచున్నవి. గోవులకు, గోపబాలురకుగల సన్నిహితత్వమునకు, సంబంధమునకు సజీవచిత్రణమే యిది. పల్లీజీవితచిత్రణములో నాధునికులైన కవులకు మార్గము చూపినవాడు పోతనయని వ్యక్తమగుచున్నది.

శ్రీకృష్ణుడు కాళియసర్పముచే పట్టుబడగా గోపికలు మిక్కిలి దుఃఖించుచు భక్తి వివశలై యతని చెయ్దములను కీర్తించినవిధము మూలమున కన్పట్టుడు. భక్తివివశతతో పోతన (గోపికల) పద్యములను గమనింపుడు.

సీ. ఎదురువచ్చినఁ జాల నెదురుగాఁ జనుదెంతు
నెదురువచ్చిన నే డదేల రావు
చూచినఁ గృపతోడఁ జూచుచుందువు నీవు
చూచినఁ గనువిచ్చి చూడ వేల
డాసిన నలిలేక డాయంగ వత్తువు
డాసిన నేటికి డాయ విచటఁ
జీరిన 'నో' యని చెలరేగి పలుకుదు
విది యేమి చీరిన నెలుఁగకుంట

ఆ. తలపు సేయునంతఁ దలపోయుచుందువు
తలపు సేయ నేడు తలప వకట!
యనుచు భక్తివివశు లాడెడి కైపడి
నేత లెల్ల నాడి వివశలైరి

- ఆం భాగ. దశమ. పూ.భా. 650

ఈపల్కులు భక్తివివశులాడెడివని పోతన పల్కుటచేతనే యిందలి పోతన (గోపికల) భక్తివివశత్వము సువ్యక్తమగుచున్నది.

కాళీయునిచే చుట్టుకొనబడిన శ్రీకృష్ణునిజూచి యశోదానందులొండొరులం బట్టుకొని

క. విషకుచయుగ యగు రక్కసి
విషకుచదుగ్ధంబు ద్రావి విష విజయుడవై
విషరుహలోచన! యద్భుత
విషయుం డగు నీకు సర్పవిష మెక్కెఁగదా!

- ఆం. భాగ. దశమ. పూ.భా. 652 నుండి 656

ఇత్యాదిగా విలపించుచు కృష్ణునితోడన మడుగు చొత్తము చత్తమనుచు కృష్ణ విరహవేదనానలధార తప్తులైరి. హృదయ విదారకము, కరుణరస ప్లావితమునగు నీయశోదానందుల దుఃఖము మూలములో కానరాదు. పన్నగము మము గఱవక

నిన్నేటికి కడచెనదుపలోను, నీతోడనె మేమును చత్తమనుకలోను, వారి వాత్సల్యభక్తి ప్రతీయమాన మగుచున్నది.

కాళియఫణిఫణామండపమును పరిపూర్ణమైన నాట్యరంగముగా పోతన చిత్రించిన తీరు గమనింపదగినది. అన్నిహంగులతో పోతన నిర్మించిన కాళియఫణిఫణానాట్య మండపమును తిలకింపుడు.

సీ. ఘనయమునానదీకల్లోలఘోషంబు
సరసమృదంగఘోషంబు గాఁగ
సాధుబృందావన చరచంచరీక గా
నంబుగాయక సుగానంబు గాఁగ
కలహంస సారస కమనీయమంజు శ
బ్దంబులు తాళశబ్దములు గాఁగ
దివినుండి వీక్షించు దివిజగంధర్వాది
జనులు సభాసీనజనులు గాఁగ

తే. బద్మరాగాదిరత్న ప్రభాసమాన
మహితకాళియఫణిఫణామంటపమున
నళినలోచన విఖ్యాత నర్తకుండు
నిత్యనైపుణ్యమునఁ బేర్చి నృత్య మాడె.

- ఆం. భాగ. దశమ. పూ.భా. 662

పోతనచే కల్పింపబడిన మృదంగఘోషముగాని, గాయకసుగానము గాని, తాళశబ్దంబులుగాని, సభాసీనజనులుగాని మూలమున కానరావు. ఇది సమగ్రమైన రూపచిత్రణమునకు చక్కని నిదర్శనముకాగలదు.

శరత్తుచే రమ్యమైన బృందావనమును బొందిన కృష్ణుడు వేణుగానము చేయగా నాలించి గోపికలు తమహృత్తు కత్తియలతో పలికిన ఈక్రింది పలుకులకు మూలము కానరాదు.

శా. రావే సుందరి! యేమె బోటి! వినవే రాజీవనేత్రుండు బృం
దావీథిన్ దగ వేణు వూదుచు లసత్సవ్యానతాస్యంబుతో

భూ౹విన్యాసము లంగుళీ౹క్రమములం బోల్పార షడ్జంబుగాఁ
గావించెన్ నటుభంగి బ్రహ్మ మగు తద్గాంధర్వ సంగీతమున్.

క. తలకెను గొబ్బునఁ జిత్తము
నళినాక్షుని మధురవేణునాదము నా వీ
నులు సోకినంతమాత్రన
చెలియా! యిక నెల్లు వెరవు చింతింపగదే.

క. నాతోడ వెలవ వలదే
నాతోడనె కొనుచుఁ బోయి నళినదళాక్షున్
నీతోడుత పలికించెద
నీతోడిజనంబు మెచ్చ నీతోడు సుమీ.

—ఆం. భాగ. దశమ. పూ.భా, 770, 771, 772

వేణుగానము మధురమైనదను విషయము 'షడ్జంబుగా'నను విశేషణముచే వ్యక్తమొనరించుచు 'బ్రహ్మమగు' ననుటచే నాసంగీతము పరమాత్మకు సంబంధించిన దని వ్యక్తీకరించినట్లయినది. ఈ సంగీతమునందట్టి మర్మము నెరిగినవాడు గావుననే పోతన గోపికలద్వారా నీవిషయమును చెప్పించుట జరిగినది. ఇందు మన స్తత్వ శాస్త్రమునకు సంబంధించిన భావనయుకలదు. అదియేమన ఏకాకిగా నానందము ననుభవించుటకంటె సామూహికముగా ననుభవించుటలో తన్మయత్వమధికముగా నుండు ననునదియే. నాభక్తి మార్గమున నిన్నుకొనిపోయి మహావిష్ణువు నీతో పలుకునట్లు చేయుదునని ప్రమాణపూర్వకముగా పోతన పాఠకునితో చెప్పుచున్నాడనుటకు, 'నాతోడనె కొనుచుఁబోయి నళినదళాక్షున్, నీతోడుత పలికించెద నీతోడుసుమీ' అని గోపికలు తమ చెలికత్తెలతో పల్కిన పలుకులే ప్రజలసాక్షులు.

క. శ్యామంతికా౹ప్రసగంచిత
సీమంతవతీకుచోష్ణజిత శీతభయా
శ్రీమంతంబై గొబ్బున
హేమంతము దోఁచె మదనుఁడేఁచె విరహులన్

—ఆం. భాగ, దశమ. పూ.భా. 796

అను పద్యమునుండి

శా. ఈహేమంతము రాకఁ జూచి రమణీహేలాపరీరంభ స
త్స్నేహాయత్తంబునఁగాని వీని గెలువన్ శక్యంబు గాదంచు దా
రూహాపోహవిధిం ద్రిమూర్తులు సతీయుక్తాంగులైనారుగా
కోహో! వార లదేమి సంతతవధూయోగంబు రాఁ గందురే.

క. ఈ హేమంతము రాకకు
శ్రీహరి యొక్కింత వణఁకి చింతింపంగా
నోహో! వెఱవకు మనుచు
న్నాహరికిని శ్రీకుచంబు లభయం బిచ్చెన్.[7]

—ఆం. భాగ. దశమ. పూ. భా. 803, 804

అను పద్యమువఱకు పోతన విస్తృతమైన హేమంతఋతువర్ణనము గావించి యున్నాడు. దీనికి మాతృకలేదు. అట్టి నితాంతమగు హేమంతంబున గోపకుమారికలు రేపకడలేచి, కాళిందీజలంబులందోగి, జలతీరంబున కాత్యాయనీ వ్రతమాచరించుట వారి లక్ష్యశుద్ధిని భక్తితత్పరతను వ్యక్తీకరించుటయే. వారు శ్రీకృష్ణుని మగనిగా జేయుమని కాత్యాయనిని ప్రార్థించుటకు నీహేమంతమువలన కలిగిన విరహవేదనయు కొంతకారణమ కావచ్చును. గోపికావస్త్రాపహరణ ఘట్టమున నిర్వస్త్రలైన గోపికలు శ్రీకృష్ణుని మాటలువిని వెనువెంటనే నీటవెల్వడి రాకుండుటకీ హేమంతమువలన కలిగిన యగ్గలంబయిన చలిని వలిగొని యుండుటయు కారణమైయున్నది. ఇట్లు సందర్భోచితమై, భావికథకు పరిపోషకమై యీ ఋతువర్ణనమొప్పుచున్నది.

గోపికల వస్త్రములనపహరించి నీపము నెక్కిన శ్రీకృష్ణుని వ్రేతలు

క. మామా వలువలు ముట్టకు
మామా కొనిపోకు పోకు మన్నింపు తగన్
మామాన మేల కొనియెదు
మా మానస హారణ మేల మానుము కృష్ణా!

—ఆం. భాగ. దశమ. పూ. భా. 818 నుండి 822 వఱకు

ఇత్యాదిగా ప్రార్థించినవిధము మూలమున కానరాదు. ఇందు గోపికల యార్తి కానవచ్చుటయేగాక మరియొకమారు పరమేశ్వరగుణగానము చేసి, పోతన (గోపికలు) తృప్తిచెందుట విశేషముగా గమనింపదగియున్నది.

గోపకులు హరిసమేతులై, గోవర్ధనగిరికిఁ బూజనోపహారంబులు సమర్పించి, గోధనంబులంబురస్కరించుకొని, భూసురాశీర్వాదవచనంబులతో

క. గుట్టముల పరువు మెచ్చని
నట్టిలఁ గట్టిన రథమ్ము నందప్రముఖుల్
కుట్టిల యార్పులు చెలఁగఁగఁ
దొట్టిలగమి వెంట నంటఁ దోలి రిభేశా !

—ఆం. భాగ. దశమ. పూ. భా. 892 నుండి 895 వఱకు

ఇత్యాదిగా ప్రదక్షిణము చేసినవిధము మూలమున కానరాదు. అత్యంత సుందరము, సమగ్రమునగు పల్లీజీవితమును కన్నులపండువుగా రూపుదిద్దుట యిందు కాననగును.

పోతన గోపికాగీతలలోని యీక్రింది భావములకు మూలము కానరాదు.

క. కట్టా ! మన్మథుకోలలు
నెట్టిన నో నాఁట బెగడి నీ పాదంబుల్
పట్టికొనగ వచ్చిన మము
నట్టడవిని డించి పోవ న్యాయమె కృష్ణా !

క. హృదయేశ్వర ! మాహృదయము
మృదుతరముగఁ జేసి తొల్లి మిక్కిలి కడ నీ
హృదయము కఠినము చేసెను
మదీయ సౌభాగ్య మిట్టిమందము గలదే.

ఉ. క్రమ్మి నిశాచరుల్ సురనికాయములన్ వడి దాఁకి వీఁక వా
లమ్ముల తెట్టెముల్ వఱప నష్టయి వచ్చి జయింతు వంద్రు నిన్
నమ్మిన ముగ్ధలన్ రహితనాథల నక్కట ! నేఁడు రెండు మూఁ
డమ్ముల యేటు కాఁ డెదుర నడ్డము రాఁదగదే కృపానిధీ !

క. తియ్యవిలుకాఁడు డీకొని
వ్రియ్యలుగాఁ దూఱనేసె వనితల మనముల్

వియ్యాన నింక నయినన్
గుయ్యాలింపం గదయ్య ! గోవింద ! హరి !

- ఆం. భాగ. దశమ. పూ.భా. 1053 నుండి 1056 వఱకు

ఆర్తుడైనట్టి భక్తుడు 'అన్యథా శరణం నాస్తి. త్వమేవ శరణం మమ' అని ప్రార్థించును. అదేవిధముగా జీవాత్మ పరమాత్మనుండి వేరుపడుటవలన కలిగిన వేదన పైపద్యములందు వ్యక్తము గావింపబడినది. ఇందు ఆర్తిభక్తి సువ్యక్తమగు చున్నది. అవకాశమును కల్పించుకొని భక్తుల మనోభావములను చిత్రించుట భక్తుడైన పోతన సహజగుణము. కావున పోతన తన యంతరంగమునందలి యార్తి నీవిధముగా వెలువరించినాడన వచ్చును. ఈపట్టున చక్కని తెలుగుతనము వెల్లివిరియు చున్నదనుటకు 'నట్టడవినిడించి పోవ న్యాయమె ?' అను సందర్భోచితమైన ప్రశ్నయే తార్కాణము. 'రాక్షసులబారినుండి దేవతలసమూహములను రక్షించిన నీవు నిను నమ్మిన యనాథలైన ముగ్ధలను రెండు మూడమ్ముల యేటువానినుండి (2 + 3=5 అనగా పంచబాణుడైన మన్మథునిబారినుండి) రక్షింపలేవా?' యనుట పోతన(గోపికల) వాక్చాతుర్యమును వ్యక్తమొనరింపుచున్నది.

ధనుర్యాగము చూచుటకను మిషతో బలరామకృష్ణులను పిలచుటకు, అక్రూరుడు కంసుని పనుపున సాయంకాలవేళకు గోకులమునుచేరెను. ఈ సందర్భమున

క. ముందటఁ గనె ఘనచందన
కుంద కుటజ తాల సాల కురవక వట మా
కందన్ నందితబలగో
విందన్ వికచారుణారవిందన్ బృందన్.

వ. కని, బృందావనంబు దరియం జొచ్చి, యందు సాయంకాలం
బున నడవికి నెఱిగల మేతల వెంబడిం దిగంబడి, రాక చిక్కిన
కుఱ్ఱకోడె పశ్చతండంబులం గానక పొద యిఱుము మిట్టు
పల్లంబులవక, తూఱి, పాఱి, వెదకి, చీరెడు గోపకుల
యాహ్వాన శబ్దంబు లాకర్ణింపుచు ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ... ... ... ... ...

- ఆం. భాగ. దశమ. పూ.భా. 1194, 1195

ఇత్యాదిగానాతడుగాంచిన ఘోషవర్ణన మతివిస్తృతముగా అనువాదమున కానవచ్చుచున్నది. దీనికి మూలము కానరాదు. పోతన తన హృదయమున ననుక్షణము బృందావనమున విహరించువాడగుటచే నింత సహజముగా నీవర్ణన చేయగలిగినాడు. బృందావనమునంతటిని భావచిత్రీకరణ గావించిన తీరును గమనించినచో పల్లీజీవిత వర్ణనమున పోతనకుగలనేర్పు సువ్యక్తమగుచున్నది. గ్రామీణజీవిత వర్ణనములు గావించు ననంతర కవులకునిట్టివి మేలుబంతులై తనరారుచున్నవనుటలో నెట్టి సందేహమునులేదు.

మధురానగర సుందరులు శ్రీకృష్ణునిచూచి తలంచిన నీకింద్రిది భావనకు మూలము కానరాదు.

సీ. వీఁడఁటే ! రక్కసి విగత జీవగఁ జన్నుఁ
బాలు ద్రావిన మేటి బాలకుండు
వీఁడఁటే ! నందుని వెలదికి జగమెల్ల
ముఖమందుఁ జూపిన ముద్దులాడు
వీఁడఁటే ! మందలో వెన్నలు దొంగిలి
దర్పించి మెక్కిన దాఁపరీఁడు
వీఁడఁటే ! యెలయించి వ్రేతల మానంబు
చూఱలాడిన లోకసుందరుండు

తే. వీఁడు లేకున్న పుర మటవీస్థలంబు
వీనిఁ బొందని జన్మంబు విగతఫలము
వీనిఁ బలుకని వచనంబు విహగరుతము
వీనిఁ జూడని చూడ్కులు వృథలు వృథలు.

—ఆం. భాగ. దశమ. పూ.భా 1248

ఇందు జీవితపరమార్థము పరమాత్మనందుటయే యని భంగ్యంతరముగా నుడువబడినది.

కాళిందీజలమున రామకృష్ణులు ప్రత్యక్షముకాగా నొక్క దండకముచే స్తోత్రము గావించిన పోతనయక్రూరుడు తృప్తిచెందక

మ. కలలం బోలెడి పుత్రమిత్ర వనితాగారాది సంయోగముల్
జలవాంఛారతి నెండమావులకు నాసల్ చేయు చందంబునన్
దలతున్ సత్యములంచు మూఢుఁడ వృథా తత్త్వజ్ఞుడన్ నాకు నీ
విలసత్ పాదయుగంబుఁ జూపి కరుణన్ వీక్షింపు లక్ష్మీపతీ!
—ఆం. భాగ. దశమ. పూ. భా. 1283

అని ప్రార్థించినాడు. ఈ ప్రార్థన అక్రూరుని పాత్రలో లీనమైన పోతన వేదనేగాని యక్రూరుని ప్రార్థన కాదని నిష్కర్షగా చెప్పవచ్చును.

రామకృష్ణులు మధురాపురంబున స్వేచ్ఛగా విహరించి విడిదలకుంజేరిరి. ఆపట్టున

మ. గగనారణ్యచరాంధకారగజమున్ గాలాహ్వయవ్యాధుఁ డ
చ్చ్చగఁ బట్టం గమకించి మచ్చిడుటకై చూతాంకురశ్రేణిచే
నొగిఁ గల్పించిన కందుకం బనగ సూర్యుం డంత వీక్షింపఁగాఁ
దగ మందప్రభతోడఁ బశ్చిమమహాధాత్రీధరేంద్రంబునన్
- ఆం. భాగ. దశమ. పూ. భా. 1287

మొదలుకొని

క. దర్పిత తారాధిప పరి
సర్పిత కిరణౌఘమిళిత సకల దిశంబై
యేర్పడి కమలభవాండము
కర్పూరపుఁ గ్రోవిభంగిఁ గనుపట్టె నృపా!
- ఆం. భాగ. దశమ. పూ. భా. 1296

వఱకు ఆమూలకమైన సూర్యాస్తమయ చంద్రోదయ వర్ణనము గానవచ్చుచున్నది. ఇది పోతన భావనానైపుణ్యమును, వర్ణనాచాతురిని విశదీకరించుచున్నది. ఈ వర్ణనలును సందర్భోచితములేగాని సందర్భమునకు వతుకని బొంతలు మాత్రముకావు.

అట్లే కంసుడు దుర్నిమిత్తములు స్వప్నజాగ్రదవస్థలయందు గాంచుచు మరణహేతుకభ్రాంతిఁజింతాక్రాంతుండై నిద్రచెందక వేగించుచున్న సమయంబున

క. అరుణహరినఖరవిదళిత
గురుతిమిరేభేంద్రకుంభకూటవినిర్మ

క్తసుధిరమహాక్తికములక్రియా
సురపతిదిశఁ గెంపుతోడఁ జుక్కలు మెఱసెన్
- ఆం. భాగ. దశమ. పూ.భా. 1302 నుండి 1305

ఇత్యాదిగా నమూలకమైన సూర్యోదయవర్ణనము గావింపబడినది. ఇట్టి వర్ణనలు పురాణమునకు ప్రబంధలక్షణములను కలిగించుటయేగాక యనంతర ప్రబంధకవులకు మార్గదర్శకములగుచున్నవి.

శ్రీకృష్ణబలరాములు చాణూర ముష్టికులను వధించు ఘట్టములో

శా. నాతోఁ బోరఁగ నెంతవాఁడ విసిరో నాపాటియే నీవు ? వి
ఖ్యాతుండన్ గులజుండ సద్గుణుఁడ సత్కర్మ స్వభావుండ నీ
కేతాదృగ్విభవంబు లెల్లఁ గలవే యీ వీటఁ బోరాడుటల్
ప్రేతల్ జూడఁగఁ గుప్పిగంతు లిడుచే వీక్షింపు గోపార్భకా !
-ఆం. భాగ. దశమ. పూ.భా. 1337 నుండి 1342 వఱకు

ఇత్యాదిగాగల చాణూరుని పలుకులకు మూలము మృగ్యము. లోకసామాన్యముగా వర్ణించుచునే యందు గమనించవలసిన అంతరార్థమును సైతము చూపుట పోతనలో కాననగు ప్రత్యేకగుణము. మనకు దుష్టపాత్రలుగ కన్పట్టినను భక్తుడైన పోతన దృష్టిలో నవియు భక్తిసమన్వితములుగానే రూపుదిద్దుకొనుననుటకు పైపల్కులలో నంతరార్థముగా పరమేశ్వరతత్త్వము వ్యక్తీకరింపబడుటయే ప్రబలోదాహరణము.

క. సందేహము మానుం డర
విందాననలార ! మిమ్ము విడువను వత్తున్
బృందావనమున కని హరి
సందేశము పంపెననుము సంకేతమునన్
-ఆం. భాగ. దశమ. పూ.భా. 1435

అని శ్రీకృష్ణుడుద్ధవునిద్వారా గోపికలకు పంపిన సందేశవార్తకు మూలము కానరాదు. కథకు పరిపూర్ణత్వము సిద్ధింపజేసిన యమూలకమిది.

జరాసంధుడిరువదిమూడక్షౌహిణుల సైన్యముతో మధురను ముట్టడించినపట్టున "నిరంతరకిసలయ పత్రకోరక కుసుమ ఫలభారవినమితవృక్ష విలసిత

మహోద్యానంబును, ఉద్యానవనభాగ వలమాన జలోన్నం దారుయంత్ర లతానిబద్ధ కలశ విముక్తసలిలధారాశీకర పరంప సంపాదిత వర్షాకాలంబును కాలకింకరసదృశ వీరభటరథతు సామజసంకులంబును ......................,
ఘోషకామినీప్రాణవల్లభ బాహుదండ పరిరక్షితంబునై, పరమే నలక్షితంబైన మథురానగరంబు చేరి."

- ఆం. భాగ. దశమ. పూ.భా. 15

ఈ మధురానగరవర్ణన మూలాతిరిక్తమై యలరారుచున్నది. పురాణము ప్రబంధచ్ఛాయలలో వెలయించుటలో ప్రవేశించిన నగరవర్ణనమిది. నగరసమ్మ స్వరూపము దీనిద్వారమున విశదమగుచున్నది.

శ్రీకృష్ణుని శంఖనాదము విని జరాసంధుని సైన్యము లంధములై సంచలిం నవసరమున

సీ. అదలించి రొప్పంగ నాలమందలు గావు
గంధగజేంద్రసంఘములు గాని

ఇత్యాదిగా (ఆం. భాగ. దశమ. పూ.భా. 1540నుండి1546) మాగధుడు మాధవునితో పల్కిన పల్కులు మూలములోలేవు. సామాన్యదృష్టితో తిలకించిన జరాసంధుడు శ్రీకృష్ణుని ఎత్తిపొడుపుమాటలనుచున్నట్లున్నను ఇందలియంతరార్థమును గ్రహించి నచో నివి శ్రీకృష్ణునిబాలలీలా కీర్తనలే.

జరాసంధుడు పదునెనిమిదవమారు మధురమీద దండెత్తివచ్చునెడ కలహవిద్యా విశారదుడగు నారదుడు కాలయవనుని కడకు జని

మ. యవనా ! నీవు సమస్త భూపతుల బాహాఖర్వ గర్వోన్నతిన్
బవనుం డభ్రములన్ హరించుపగిదిన్ భంజించియు న్నేల యా
దవులన్ గెల్వవు వారలన్ మఱచియో దర్పంబు లేకుండియో
యవివేకస్థితి నొందియో వెఱచియో హైన్యంబునుం జెందియో.

క. యాదవులలోన నొక్కఁడు
మేదినిపై సత్వశేఖ మెఱసి జరాసం
ధాదులఁ దూలన్ దోలెన్
దాదృశుఁ డిల లేఁడు వినవె తత్కార్యంబుల్.

— ఆం. భాగ. దశమ, పూ.భా. 1579, 1580

అని పురిగొల్పుటయు, నారదుని మాటలువిని కాలయవనుడు

శా. ఏమీ నారద ! నీవు చెప్పిననతం డే రూపువాఁ డెంతవాఁ
డేమేరన్ విహరించు నెవ్వఁడు సఖుం డెందుండు నేపాటి దో
స్సామర్థ్యంబునఁ గయ్యముల్ సలుపు నస్మద్బాహు
శౌర్యంబు సం
గ్రామక్షోణి భరించి నిల్వఁగలఁడే గర్వాఢ్యుఁడే చెప్పుమా.

—ఆం. భాగ. దశమ. పూ. భా. 1582

అనుటయు, నారదుడతనికి

సీ. నీలజీమూతసన్నిభశరీరమువాఁడు
తామరసాభనేత్రములవాఁడు
పూర్ణేందుబింబంబుఁబోలెడి మోమువాఁ
డున్నతదీర్ఘబాహువులవాఁడు
శ్రీవత్సలాంఛనాంచితమహోరమువాఁడు
కౌస్తుభమణిపతకంబువాఁడు
శ్రీకరపీతకౌశేయచేలమువాఁడు
మకరకుండలదీప్తి మలయువాఁడు

తే. రాజ ! యింతంతవాఁ డనరానివాఁడు
మెఱసి దిక్కుల నెల్లను మెఱయువాఁడు
తెలిసి యే వేళలందైనఁ దిరుగువాఁడు
పట్టవేచ్చినఁ గాని లోఁబడనివాఁడు

—ఆం. భాగ. దశమ. పూ.భా. 1584

అనియు, ఆ పరమేశ్వరుని యితర లక్షణంబులను చెప్పుటయు యవనుండు వానిని సరకుసేయక

ఉ. యాదవు డెంతవాఁడు ప్రళయాంతకుఁడైన నెదిర్చెనేనియున్
గాదనఁ బోర మత్కులిశకర్కశ బాహుధనుర్విముక్త నా
నాదృఢ హేమపుంఖకఠిన జ్వలదస్త్రపరంపరా సము
త్పాదిత వహ్ని కీలముల భస్మముఁ జేసెదఁ దాపసోత్తమా !

—ఆం. భాగ. దశమ. పూ. భా. 1586

అని పలుకుటయు, మూలమునకానరాదు. మూలమున యవనవీరుడు నారదునిచే ప్రేరేపింపబడెననియే కలదు. అమూలకమైననీభావములు కథాగతికినత్యంతావశ్యకములేగాక దీనిద్వారా అవకాశమును కల్పించుకొని భగవద్రూపగుణగానము చేసినట్లయినది. దీనివలన యవనునిపాత్ర సమగ్రతనందినదని చెప్పవచ్చును. కాలాంతరమున కాలయవనుడు మధురానగరముపై దండెత్తినపుడు నిరాయుధుడై యొంటరిగా వచ్చు శ్రీకృష్ణునిచూచి యాతడేశ్రీకృష్ణుడని నిశ్చయించుకొనుటకీ యమూలకమైన వర్ణన సహకరించుచున్నది. పూర్వోత్తరానుగుణ్యసంపాదనకై యిట్లు జాగరూకత వహించుట ఇతరులలో కన్పింపదు

సీ. ఘోటక సంఘాతఖురసమున్నిర్గత
ధూళిజీమూతసందోహముగను
మహనీయ మదకలమాతంగకటదాన
ధారలు కీలాల ధారలుగను
నిరుపమస్యందననేమినిర్ఘోషంబు
దారుణగర్జిత ధ్వానముగను
నిశిత శస్త్రాస్త్రమానితదీర్ఘరోచులు
లలితసౌదామినీలతికలుగను

తే. శత్రురాజప్రతాపాగ్ని శాంతముగను
వృష్టికాలము వచ్చునవ్విధము దోఁప
నేగుదెంచె జరాసంధుఁ డిరువదియును
మూఁడునక్షౌహిణులు దన్ను మొనసి కొలువ

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1666

అని జరాసంధుని సైన్యముయొక్క రాకను వర్షపురాకగానూహించిచెప్పుట పోతనభావనావిశేషమేగాని మూలములోనిదికాదు. పోతన రూపచిత్రణా సామర్థ్యమున కిది ప్రబలోదాహరణము.

రామకృష్ణులు ప్రవర్షణగిరిపై దాగినారని తెలిసి జరాసంధుడు పూర్ణక్రోధుండై కాష్ఠములు రాసులుగానిడి చిచ్చుపెట్టించెను. జరాసంధపరిజన ప్రదీపితంబైన మహానల మత్యంతభయదమై యాగిరిని దహించిన విధము

క. పొగలెగసెఁ బొగల తుదలను
మిగులుచు మిణుగురులునిగిడె మిణుగురుగమి ము
న్నుగ బ్రహ్మాండము నిండను
భగభగమని మంటలాడవె భయదము లగుచున్

వ. అమ్మహానలంబు బిలసానుశృంగవృక్షలతాకుంజపుంజంబులం
దరికొని ... ... ... ... ... ... ... ... ... ... ...

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1673, 74

ఇత్యాద్యమూలక భావనలతో వర్ణింపబడుట పోతన భావనాబలమునకుదాహరణము కాగలదు.

క. బాలేందురేఖ దోఁచిన
లాలితయగు నపరదిక్కులాగున ధరణీ
పాలుని గేహము మెఱసెను
బాలిక జన్మించి యెదుగ భాసురమగుచున్.

సీ. వేశ్వర బొమ్మలపెండ్లిండ్లు సేయుచు
నబలలతోడ వియ్యంబు లందు
గుజ్జనగూళ్ళను గొమరొప్ప వండించి
చెలులకుఁ బెట్టించుఁ జెలువు మెఱయ
రమణీయ మందిరారామదేశంబులఁ
బువ్వుఁదీగెలకును బ్రోదిసేయు

తే. మకరకుండలసద్భూషు మంజుభాషు
నిరుపమాకారు దుగ్ధసాగరవిహారు
భూరిగుణసాంద్రు యదుకులాంభోధిచంద్రు
విష్ణు రోచిష్ణు జిష్ణు సహిష్ణుఁ గృష్ణు.

-ఆం. భాగ. దశమ. ఉ. భా. 974, 975

చూచి సమీపింపఁబోయెను, ఇట్లు కుచేలునకు శ్రీకృష్ణుడు దర్శనమిచ్చుట మూలమున వర్ణింపబడలేదు. ఇట్లు పరమాత్మని దర్శించి సమీపింపబోవుట కుచేలుని (పోతన) భక్తితన్మయతను స్పష్టపఱచుచున్నది. రూపసాక్షాత్కారమొనరించుటకు శబ్దాలంకారము లప్రయత్నముగ పోతనరచనలో ప్రవేశించినవనుటకు పైపద్యమే తార్కాణము.

ఈవిధముగా పోతన తనయనువాదమున నమూలకభావములనెన్నిటినో కల్పించెను. భక్తిరసపూరితములు, తత్తదితర రసానుప్లావితములు, సందర్భోచితములునగు నీయమూలకకల్పనలు పోతనయనువాదమును స్వతంత్ర గ్రంథమువలె భాసిల్లఁజేసి మూలమును మించిన జనాదరణను కలిగించుటలో సహకరించినవనుట యథార్థము.

# అమూలకములు - విస్తృతిపరకములు

పోతన భాగవతానువాదము మూలమునకు సుమారు రెండింతలు పెరిగినదనుట నిర్వివాదాంశము. ఇందు మూలమున కానరాని యంశములు చోటుచేసుకొనుటతోడాటు, అంతకంటె ప్రధానముగా మూలమునందలి భావములమూలకమైన విస్తృతినొందుటయు ఈ పెరుగుదలకు కారణము. పోతనభాగవతోత్తముడు, భావుకుడునగుటయేయీ విస్తృతికి కారణమని చెప్పుటలో నెట్టివిప్రతిపత్తియులేదు. ఈతడు మహాభక్తుడగుటచే భక్తిప్రధానములు, భగవద్గుణమాహాత్మ్య వర్ణనామయములునగు చాలభాగములననువదించునపుడు చపలత్వముచేగాక, తన్మయత్వమున నీపెంపు అప్రయత్నకృతమగుట కానవచ్చును. భక్తిపారవశ్యమున నేర్పడిన ఈపెంపు అన్నితావులందు నొకే పరిమాణములో నుండుననుట పొసగదు. ఆయాఘట్టములందలి భక్తిప్రాధాన్యమునుబట్టి తన్మయత్వమును, ఆ తన్మయత్వపుస్థితినిబట్టి భావవిస్తారమును కలుగుచుండును. సముద్ర

మునకు వీరిరువురును తగినవారని నిరూపింపబడినది. శ్రీకృష్ణునియందు మనో లక్షణములు, రుక్మిణియందు శారీరకలక్షణములు వర్ణింపబడుట గమనింపదగిన అంశము. అమూలకమైన ఈ పద్యములవలన రుక్మిణి తనకు తగిన వరుని నిర్ణయించు కొనగలిగిన బుద్ధివయోవిశేషములు కలిగినదని విశదమగుచున్నది. అమూలకమైన ఈ వర్ణనవలన కథాగమనమునకు, కథాకథనవిధానమునకును, పుష్టిచేకురుచున్నది.

రుక్మిణి తన యన్నతలంపు నెఱిగి మనస్సులో నాపన్నతనొంది యొవ్వరుగు బ్రాహ్మణుని పిలిచి శ్రీకృష్ణుని కడకు పంపెనని మూలమునందుండగా అనువాదమున బ్రాహ్మణుని పంపుటకుగలకారణము, శ్రీకృష్ణునితో చెప్పవలసిన రహస్యములను చెప్పినట్లు కల్పించుట యుక్తియుక్తముగా నుండుటయేగాక కథాగతికి పరిపుష్టికలిగించు చున్నది.

శ్రీకృష్ణునకు రుక్మిణిచెప్పిన సందేశమునెఱిగించిన పిమ్మట బ్రాహ్మణుడు పల్కిన

సీ. పల్లవ వైభవాస్పదములు పదములు

కనకరంభాతిరస్కారు లూరు"

ఇత్యాది (ఆం. భాగ. దశమ. పూ. భా. 1710) పల్కులకు మూలముకానరాదు ఇది సందర్భోచితమై, రమ్యమైన రుక్మిణీరూపసౌష్ఠవవర్ణనము.

రుక్మిణీకల్యాణఘట్టమున లీలాగృహీతశరీరుడైన యప్పరమేశ్వరుడు 'ఈజల దుర్గమునకేలయరుదెంచిరని' రుక్మిణీసందేశహారియగు బ్రాహ్మణునడిగిన నతడు పల్కిన "దేవా! విదర్భదేశాధీశ్వరుండగు భీష్మకుండను రాజుగలండు. ఆ రాజుకూతురు రుక్మిణియను కన్యకామణి గలదు. అయ్యిందు వదన నీకు గైంకర్యముసేయంగోరి, వివాహమంగళప్రశస్తంబైన యొక్కసందేశంబు విన్నవింపుమని పుత్తెంచె అవధరింపుము."

ఆం. భాగ. దశమ. పూ. భా. 1700.

ఈ పల్కులకుమూలము వివాదాస్పద విషయముగానున్నది. వావిళ్లవారి భాగవతప్రతిలో నీపట్టున నీశ్లోకములు కానవచ్చుచున్నవి.

శ్లో. విదర్భాధిపతేః పుత్రీ రుక్మిణీ తవ కింకరీ ।

విజ్ఞాపయతి తే కించిత్ప్రస్తుతోద్వాహమంగళా ॥

శ్లో. తయా సంప్రేషితోఽహం తే సకాశం భీష్మకన్యయా।
తస్యాస్సందేశమాకర్ణ్య క్రియతాం యదనన్తరమ్ ॥

సం. భాగ. 10-52-37, 38.

వావిలువాడ జయరామశాస్త్రి అండ్ సన్స్‌వారిచే ప్రచురింపబడిన దశమస్కంధపు పూర్వభాగమునందును పైశ్లోకములు కానవచ్చుచున్నవి. కాని గీతాప్రెస్, గోరఖ్‌పూర్‌వారిప్రతిలో నివి కానరాకున్నవి. పై శ్లోకములలోని భావము, కొన్ని పదములును పోతనవచనమున యథాతథముగా కానవగును. కాని యీ శ్లోకములకు శ్రీధరస్వామివారి వ్యాఖ్య మృగ్యము. పైవిషయమునంతటిని పర్యాలోచనచేయగా పోతన స్వయముగాకల్పించి వ్రాసిన పైవచనమునుబట్టి యర్వాచీనులెవరో పైరెండుశ్లోకములను రచించి మూలమున చేర్చియుండవచ్చును. ఇదిపోతనయనువాదమునను సరించి వ్యాసభాగవత దశమస్కంధమున చేరిన ప్రక్షిప్తము కావచ్చును.

శివపల్లభకు మ్రొక్కి, మౌననియతి మాని, తన్మందిరమునుండి వెల్వడిన రుక్మిణి "మేఘమధ్యంబు వెలువడి విలసించు క్రొక్కారుమెఱుంగు తెఱంగున, మృగధరమండలంబు నిర్గమించిచరించు మృగంబుచందంబునఁ, గమలభవనర్తకుండెత్తిన జవనిక మఱుగుదెరలి పొడసూపిన మోహినీదేవతకైవడి, దేవదానవసంఘాతకరతలసవ్యాపసవ్య సమాకృష్యమాణ పన్నగేంద్రపాశపరివిలయిత పర్యాయపరిభ్రాంతమంథరాచలమంథానమథ్యమానఘూర్ణిత ఘుమఘుమాయిత మహార్ణవమధ్యంబుననుండి చనుదెంచు నిందిరాసుందరీవైభవంబున బహువిధప్రభాసమానయై" (ఆం. భాగ. దశమ. పూ.భా. 1744) దర్శనమిచ్చుట తెలుగువారి యదృష్టము. రుక్మిణి (లక్ష్మి) రూపసాక్షాత్కారము కథకు పుష్టిదాయకము.

అట్లే రుక్మిణిచే చూడబడిన ఈక్రింది శ్రీకృష్ణవర్ణనమునకు మూలము మృగ్యము.

మ. కనియెన్ రుక్మిణి చంద్రమండల ముఖుం గంఠీరవేంద్రావల
గ్నున్ నవాంభోజదళాక్షుఁ జారుతరవక్షున్ మేఘ సంకాశదే

హు నగారాతిగజేంద్రహ స్తనిభబాహుం జక్రిఁ బీతాంబరున్
ఘనభూషాన్వితుఁ గంబుకంఠు విజయోత్కంఠున్
జగన్మోహనున్.
- ఆం. భాగ. దశమ. పూ.భా. 1747

ఈపట్టున మూలమున శ్రీకృష్ణుని చూచెననిమాత్రమేగలదు. వ్యాసునిదృష్టికి కాని యీ రూపసాక్షాత్కారము పోతనదృష్టికి కలుగుటకు పోతన భక్తుడగుటయే కారణము.

నరకాసురవధఘట్టములో హరి నరకాసురుని వధించుటకు గరుడవాహనారూఢుం డయి చను సమయమున సత్యభామ యాతనితో

శా. దేవా నీవు నిశాటసంఘముల నుద్దీపించి చెండాడ నీ
ప్రావీణ్యంబులు చూడఁగోరుదుఁగదా ప్రాణేశ ! మన్నించి నన్
నీవెంటం గొనిపొమ్ము నేఁడు కరుణన్ నేఁ జూచి యేతెంచి నీ
దేవీసంఘముకెల్లఁ జెప్పుదు భవద్దీప్తప్రతాపోన్నతుల్.
- ఆం. భాగ. దశమ. ఉ.భా. 151

అనుటయు, ఆతడామెతో

సీ. సమదపుష్పంధయ ఝంకారములు గావు
భీషణకుంభీంద్రబృంహితములు
వాయునిర్గత పద్మవనరేణువులు గావు
తురగరింఖాముఖోద్ధూతరజము
లాకీర్ణ జలతరంగాసారములు గావు
శత్రుధనుర్ముక్త సాయకములు
కలహంససారసకాసారములు గావు
దనుజేంద్రసైన్యకదంబకములు

క. కమలకల్హారకుసుమసంఘములు గావు
చటులకుంతశూలఖడ్గాదిసాధనములు
కన్య ! నీ వేడ రణరంగగమన మేడ
వత్తు వేగమ నిలువుము వలదు వలదు.

సదమలమణిమయసౌధభాగంబుల
లీలతో భర్మపాంచాలికల నాఁగు.

తే. బాలికలతోడఁ జెలరేగి బంతు లాడు
శారికాకీరపంక్తికిఁ జదువు చెప్పు
బర్హిసంఘములకు మురిపములు గఱపు
మదమరాళంబులకుఁ జూపు మందగతులు.

సీ. దేవకీసుతుకోర్కె తీఁగెలు వీడంగ
వెలదికి మైదీఁగె వీడఁ దొణఁగెఁ
గమలనాభుని చిత్తకమలంబు వికసింపఁ
గాంతి నింతికి ముఖకమల మొప్పె
మధువిరోధికి లోన మదనాగ్ని వొడచూపఁ
బొలతికిఁ జనుదోయిపొడవు సూపె
శౌరికి ధైర్యంబు సన్నమై డయ్యంగ
జలజాక్షి మధ్యంబు సన్నమయ్యె

ఆ. హరికిఁ బ్రేమబంధ మధికంబుగాఁ గేశ
బంధ మధిక మగుచు బాల కమరెఁ
బద్మనయనువలనఁ బ్రమదంబు నిండార
నెలత యౌవనంబు నిండి యుండె.

—ఆం. భాగ. దశమ. పూ. భా. 1685, 1687, 1689

అను రుక్మిణిబాల్యక్రీడలు, యౌవనప్రాదుర్భావము పోతనకల్పితములే. బొమ్మల పెండిండ్లు, గుజ్జనగూళ్లు, ఊయలలూగుట మున్నగు తెలుగుబాలికల బాల్యక్రీడలేగాక, సంపన్నగృహస్థుని పుత్రికయొక్క బాల్యవర్ణనము కానవచ్చుచున్నది. స్వభావోక్తి మాధుర్యము, తెలుగుతనము నీవర్ణనయందు సువ్యక్తము. ఇందు రుక్మిణి చేష్టలొక క్రమమున వర్ణితమగుట గమనింపవలసియున్నది. రుక్మిణీకృష్ణుల యౌవనప్రాదుర్భావమును తుల్యయోగితాలంకారమునగూర్చి పోతన మనోహరమగురీతిని వర్ణించినాడు. దాంపత్యవిషయమున స్త్రీపురుషులపరస్పరసాదృశ్యము వర్ణింపబడి యాదర్శదాంపత్య

తరంగసదృశములైన భావపరంపర లెల్లప్పుడునొకే స్థాయిలో నుండునని చెప్ప వీలుకాదుగదా! మఱికొన్నిచోట్ల ఇట్టి తన్మయత్వమునగాక ఆయా భావములయొక్క ప్రాశస్త్యమునుబట్టి ప్రయత్నపూర్వకముగనే కొంత పెంచి భక్తుడైనపోతన తాను తృప్తిపడుచు పాఠకుని తృప్తిపఱచుచుండును. అట్లయ్యునా పెంపు సహజసిద్ధమైన రీతిలోనే సాగినట్లుండును. నవవిధభక్తులలో ఏవిధమైన భక్తిభావమునకవకాశమేర్పడి నను దానివెనుక మరికొంతదూరమరుగుట, వ్యక్తముచేయుటయు భక్తకవి సహజ గుణము.

మూలమున అస్పష్టముగానున్న భక్తిభావముల సుస్పష్టమొనర్చునపుడును, మసకమసకగాకానవగు రూపమును మఱింతస్ఫుటమగు రేఖలతో చిత్రించినతావులందును విస్తృతి కానవచ్చుచున్నది.

ఇట్టి భక్తిప్రధానములైన అంశములందేగాక తదితర రసములకు సంబంధించిన ఘట్టములందును రసపుష్టిని, రససాంద్రతను కలిగించుటకు, నాయాపాత్రల మనస్తత్త్వమునున్మీలింపచేయుటకు నీవిస్తృతి గావింపబడుట ప్రశంసనీయము.

మూలమున సూత్రప్రాయములుగానున్న అంశములను వ్యాఖ్యాప్రాయములుగా నునుపడించుటయందును, సందర్భోచితములు కథాగతికినవసరములునగు వర్ణనల యందును, పెంపుకానవచ్చుచుండును.

పరిసరప్రాంతములకు, పల్లీజీవితమునకునద్దముపట్టు తావులందు నీపెంపుదల కన్పట్టుచున్నది. గోవులను మాతృదేవతలుగానారాధించుటయు సంస్కృతియందు కాన వచ్చుచున్నది. అంతియేగాక శ్రీకృష్ణునకు, గో, గోపబాలురకుగల సంబంధము మిక్కిలి ఘనిష్టమైనది. కావున నిట్టితావులందు పెంపు జరిగియుండవచ్చును. ఇట్టి ఘట్టములందు కర్షకవృత్తితో పేదరికము ననుభవించినపోతన, కథాంశముగా లభించిన సువర్ణావకాశమును పుష్కలముగానుపయోగించుకొనినాడని చెప్పవచ్చును. పాశ్చాత్య భాషాప్రభావమువలన నధికముగా కర్షకకవులుగా, పల్లీజీవితచిత్రణము గావించినవారి కందరికి పోతన ఆరాధ్యుడనుటలో నెట్టి విప్రతిపత్తియులేదు.

ఈవిధముగా భక్త్యంశములలోను, రసతన్మయత్వములోను, రససాంద్రత నందును, రసపుష్టియందును, మనస్తత్త్వచిత్రణములోను, సుస్పష్ట రూపచిత్రణము నందును, సందర్భోచిత వర్ణనలందును, తదితరఘట్టములందును, బహుముఖములుగా నీవిస్తృతి కానవచ్చుచున్నది. ఈ యమూలకవిస్తృతియొక్క విశ్వరూపమునుదా హరణములతో పేశవించి పరిపుష్టము గావించవలసియున్నది. చెప్పకొనదగినంత

లుగా పరిగణింపబడునని లోగడ వక్కాణింపబడుటచే అమూలకముగా పరిగణించుట సమంజసము కాగలదు.

ఉషాపరిణయఘట్టమున ఉషాదేవి స్వప్నంబునగాంచిన పురుషుని వివరములు తెలిసికొననెంచి తనచెలికత్తెయగు చిత్రరేఖకు చెప్పగానామె ముల్లోకంబుల పేరుగలిగిన వయోరూపసంపన్నులైన పురుషముఖ్యుల చిత్రపటములు వ్రాసి యామెకు జూపెను. అంతియేగాక వారినిగూర్చి

సీ. కమనీయ సంగీత కలితకోవిదులు కిం
పురుషగంధర్వకిన్నరులువీరె
సతతయౌవనులు నిచ్ఛావిహారులు సిద్ధ
సాధ్యచారణవియచ్చరులువీరె
ప్రవిమలసౌఖ్యసంపద్వైభవులు సుధా
శనమరుద్యక్షరాక్షసులు వీరె
నిరుపమ రుచి కళాన్విత కామరూపులై
పొగడొందునట్టి పన్నగులు వీరె
... ... ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ... ...

ఇత్యాదిగా సుమారు 13 పద్యగద్యలలో (ఆం. భాగ. దశమ. ఉ. భా. 346 నుండి 358 వరకు) అతివిస్తృతముగా వర్ణించిచెప్పబడెను. ఇట్టి వర్ణనకు మూలము మృగ్యము. ఆయా రాకుమారులరూపములు ఉషకు చూపునెపంబున పోతన పాఠకులకు చూపిన నేర్పు ప్రశంసనీయము. ఈ ఘట్టము రూపసాక్షాత్కారమొనరించుటలో పోతన నైపుణిని వ్యక్తీకరించుచున్నది. ఆయా రాకుమారులను ఒక్కొక్కరిని వర్ణించుటకు ఉత్పలమాలాదివృత్తములనుగైకొనిన పోతన కృష్ణునిగూర్చి వర్ణించుటకు సీసపద్యమును గైకొనుట గమనించవలసియున్నది.

సీ. కమనీయశుభగాత్రుఁ గంజాతదళనేత్రు
వసుధాకళత్రుఁ బావనచరిత్రు
సత్యసంకల్పు నిశాచరోగ్రవికల్పు
నతపన్నగాకల్పునాగతల్పుఁ

కౌస్తుభమణిభూషు గంభీరమృదుభాషు
శ్రితజనపోషు సంచితవిశేషు
నీలనీరదకాయు నిర్జితదైతేయు
ధృతపీతకౌశేయు నతవిధేయు

తే. నఘమహాగదవైద్యు వేదాంతవేద్యు
దివ్యముని సన్నుతామోదుఁ దీర్ఘపాదు
జిష్ణు వరసద్గుణాలంకరిష్ణుఁ గృష్ణుఁ
జూడు దైతేయకులబాల ! సుభగలీల !

—ఆం భాగ. దశమ. ఉ. భా. 357

అని వర్ణించుటచే పోతన భక్తితన్మయత్వమెట్టిదో సువ్యక్తమగుచున్నది.

కుచేలోపాఖ్యానమున కుచేలుడు ద్వారకానగరమున ప్రవేశించి శ్రీకృష్ణపత్నులైన పదహారువేలమందియొక్క భవనాలను చూచి, అందొకదానియందు ప్రవేశింపగా నచట

తే. దనరు మృదుహంసతూలికాతల్పమందుఁ
దానుఁ బ్రియయును బహువినోదములఁ దనరి
మహితలావణ్య మన్మథమన్మథుండు
ననఁగ జూపట్టు పుండరీకాయతాక్షు.

సీ. ఇందీవరశ్యాము వందితసుత్రాముఁ
గరుణాలవాలు భాసురకపోలుఁ
గౌస్తుభాలంకారుఁ గామితమందారు
సురుచిరలావణ్యు సురశరణ్యు
హర్యక్షనిభమధ్యు నఖిలలోకారాధ్యు
ఘనచక్రహస్తు జగత్ప్రశస్తు
ఖగకులాధిపయానుఁ గౌశేయపరిధానుఁ
బన్నగశయను నబ్జాతనయను

అని పలుకగా నామె ప్రియంబు జనియింప డగ్గఱి

ఉ. దానవు లైన నేమి మఱి దైత్యసమూహము లైన నేమి నీ
మానిత బాహుదుర్గముల మాటున నుండగ నేమిశంక నీ
తో నరుదెంతు నంచుఁ గరతోయజముల్ ముకుళించి మ్రొక్కిన
మ్మానిని దన్ను భర్త బహుమాన పురస్సర దృష్టిఁ జూడఁగన్.

—ఆం. భాగ. దశమ. ఉ. భా. 155

ఇట్లు తనకు మ్రొక్కిన సత్యభామను గరకమలంబులం గ్రుచ్చియెత్తి తోడ్కొని పోయెను. అత్యంత సహజరీతిలో జరిగిన యీసంభాషణాదులు మూలమున లేవు. అమూలకమైన యీకల్పన కథాగతికి పుష్టికల్గించుటయేగాక యీఘట్టమునందు సమర్థవంతముగా నిర్వహింపబోవుచున్న వీరశృంగారరసముల సమ్మేళనమునకు నాందియు పల్కినట్లయినది.

శా. వేణిం జొల్లెము వెట్టి సంఘటిత నీవీబంధయై భూషణ
శ్రేణిం దాల్చి ముఖేందు మండల మరీచీ జాలముల్ పర్వఁగాఁ
బాణిం బయ్యెద జక్కఁగాఁ దుఱిమి శుంభద్వీర సంరంభయై
యేణీలోచన లేచి నిల్చెఁ దన ప్రాణేశాగ్రభాగంబునన్.

- ఆం. భాగ. దశమ. ఉ. భా. 170

అనుపద్యమునందే

క. శంపాలతాభ బెడిదపు
టంపఱచే ఘోరదానవానీకంబుల్
పెంపఱి సన్నాహంబుల
సొంపఱి భూసుతుని వెనుకఁ జొచ్చెన్ విచ్చెన్.

-ఆం. భాగ. దశమ. ఉ. భా. 185

అను పద్యమువఱకు సుమారు 16 గద్యపద్యములలో సత్యభామ నరకాసురునితో యుద్ధముచేయుట మనోహరముగా వర్ణింపబడినది. ఈ యుద్ధవర్ణన అమూలకము. ఈపద్యములు రసాంధశ్శికరశ్రేణులు. సత్యభామనీఘట్టమున

తే. వీరశృంగారభయరౌద్రవిస్మయములు
గలసి భామిని యయ్యెనో కాక యనఁగ

చిత్రించుట, పోతన యనితరసాధ్యమైన రచనానైపుణ్యమునకు ప్రబలోదాహరణము. ఈఘట్టమున

మ. పరుఁ జూచున్ వరుఁ జూచు నొంప నలరింపన్ రోషరాగోదయా
విరత భ్రూకుటి మందహాసములతో వీరంబు శృంగారమున్
జరగన్ గన్నులఁ గెంపు సొంపు బరఁగన్ జండాస్త్ర
సందోహమున్
సరసాలోకసమూహమున్ నెఱపుచున్ జంద్రాస్య హేలాగతిన్
—ఆం భాగ. దశమ. ఉ.భా. 178

సీ. రాకేంగుబింబమై రవిబింబమై యొప్పు
నీరజాతేక్షణ నెమ్మొగంబు
కందర్పకేతువై ఘనధూమకేతువై
యలరుఁ బూఁబోణి చేలాంచలంబు
భావజు పరిధియై ప్రళయార్కపరిధియై
మెఱయు నాకృష్టమై మెలఁతచాప
మమృత ప్రవాహమై యనలసందోహమై
తనరారు నింతి సందర్శనంబు
ఆ. హర్షదాయియై మహారోషదాయియై
పరఁగు ముద్దరాలి బాణవృష్టి
హరికి నరికిఁ జూడ నందంద శృంగార
వీర రసము లోలి విస్తరిల్ల.
—ఆం. భాగ. దశమ. ఉ. భా. 183

ఇత్యాదిగా పరస్పరవిరుద్ధములైన వీరశృంగార రసప్రవాహముల సమ్మేళనము మనోహరముగా చిత్రించి పోతన లోకోత్తరుడైనాడు. ఇట్టి రసావేశవైశద్యము మూలమున కన్పట్టదు. ఈఘట్టమునందు వర్ణితమైన ఈభావములకు, నాచన సోమనాథుని ఉత్తరహరివంశములోని నరకాసురసంహారఘట్టము మూలమని పలువురు విమర్శకు లంగీకరించుటచేతను, సరిపోల్చిచూడగానది యథార్థమనిపించుటచేతను, దీనిని 'అమూలకము' గా పరిగణింపరాదు. ఈ ఘట్టము యథార్థమునకు సమూలకమే. కాని వ్యాసుని దశమస్కంధములోలేని యంశములీసిద్ధాంతవ్యాసమున అమూలకము

విస్తృతిలేకున్నను పోతనచేగావింపఁబడిన అంతంతమాత్రపు విస్తృతికిసహితము నొక ప్రత్యేకప్రతిపత్తియుండుటచే కొలఁదిపాటివిస్తృతికలిగిన యంశములను కొన్ని యిందు చేర్పఁబడినవి.

వైరానుబంధనంబుననన్యానుసంధానంబు మఱచిన కంసుడు కూర్చుండుచునుండును, శయనించుచును, నిలుచుండుచును, భుజించుచును, సంచరించుచును, నీరు త్రాగుచున్న సమయములందంతటను మహావిష్ణువును తలంచుచున్నవాడై జగమంతయు విష్ణుస్వరూపముగా జూచెను. (సం. భాగ. 10-2-24) అను మూలమునకనువాదమున

క. తిరుగుచుఁ గుడుచుచుఁ ద్రావుచు
నరుగుచుఁ గూర్చుండి లేచుచనవరతంబున్
హరిఁ దలచి తలచి జగమా
హరిమయ మని తలచెఁ గంసుఁ డాఅని యలుకన్

- ఆం. భాగ. దశమ. పూ.భా. 85

అని చెప్పినంతమాత్రమున తృప్తిచెందని పోతన వైరభక్తివిశేషములవెనుక మఱికొంత దూరమరగి తానుతృప్తిచెంది పాఠకులను తృప్తిపఱచుట యీక్రిందిపద్యమున కానఁగును. వివిధములైన భక్తిమార్గముల గాంచినపుడు భక్తుడైన పోతన ఆమార్గమున మఱికొంతదూరము ప్రయనించి భగవానుని చూచుటకు గావించిన ప్రయత్నములలో భాగమే ప్రస్తుతాంశము.

సీ. శ్రవణరంధ్రముల నే శబ్దంబు వినఁబడు
నది హరిపలుకని యాలకించు
నక్షి మార్గమున నెయ్యది చూడఁబడు నది
హరిమూర్తి గానోపు నంచుఁజూచు
దిరుగుచో దేహంబుఁ దృణమైన సోకిన
హరికరాఘాతమో యనుచుఁ గలఁగు
గంధంబులేమైన ఘ్రాణంబు సోకిన
హరిమాలికాగంధమనుచు నదరుఁ

ఆ. బలుకు లెవ్వియైనఁ బలుకుచో హరిపేరు
పలుకఁబడియె ననుచు భ్రమసి పలుకుఁ
దలపు లెట్టివైనఁ దలఁచి యా తలఁపులు
హరితలంపు లనుచు నలుగఁ దలఁచు

—ఆం. భాగ, దశమ. పూ.భా. 87

ఇందు బహిరంతరింద్రియములనన్నిట పరమాత్మరూపసందర్శనము గావించుట ప్రశంసనీయము. ఎవరికొఱకైననెదురుచూచునట్టియు ఎవనిగుఱించియైనను భయపడుచున్నట్టియు మానవుని చిత్తవృత్తికి, చేష్టలకు అద్దముపట్టినట్లుగా పై విశ్లేషణము గావింపబడినది.

శ్రీకృష్ణుడు పూతనపాలుత్రాగి ప్రాణాపహరణముగావించినవిధము మూలమున

గాఢం కరాభ్యాం భగవాన్ ప్రపీడ్య తత్
ప్రాణైస్సమం రోషసమన్వితోఽపిబత్॥
సాముంచ ముంచాలమితి ప్రభాషిణీ
నిష్పీడ్యమానాఖిల జీవమర్మణి।

సం. భాగ 10-6-10,11

అనియుండగా ననువాదమున

సీ. మేలొక్కన్న తెఱగున మెల్లనఁ గను విచ్చి
క్రీగంటఁ జూచుచుఁ గిదికి నీల్గి
యావులించుచుఁ జేతు లాకసంబునఁ జాచి
[illegible]దిగిలి [illegible]కొన్న యోజనాది
బిగిచన్నుగవఁ గేలఁ బీడించి కబళించి
గ్రుక్కగ్రుక్కకు గుటు గుటుకు మనుచు
నొకరెండు గ్రుక్కల నువిదప్రాణంబులు
సయితము మేనిలో సత్త్వమెల్లఁ

తే. ద్రావె నదియును గుండెలు దల్లడిల్ల
జిహ్వ దిరుగుచు నిలువక శిరము వ్రాల
నితరబాలురక్రియవాడ వీవు గావు
చన్ను విడువుము విడువుము చాలుననుచు

- ఆం. భాగ. దశమ. పూ. భా. 224

ఇందు పిల్లలు తల్లిపాలు త్రాగు క్రమమంతయు సహజసుందరముగా వర్ణితమైనది. శిశుమనోవిజ్ఞానము, చేష్టలు మనోజ్ఞముగా దర్శనమిచ్చుచున్నవి. పెద్దవారుసయితము చేయలేని పూతనసంహారము చేయుటలో, శిశువుగానున్న విష్ణువుయొక్క లీలలను వర్ణించిన యనుభూతి, తృప్తి యీఘట్టమున కానవచ్చును.

శ్రీకృష్ణుడు శకటమును భంజించెనని సమీపమున నాడుకొనుచున్న గోపబాలురు చెప్పగా

'న తే శ్రద్దధిరే గోపా బాలభాషితమిత్యుత ।

(సం. భాగ. 10-7-10) అనుమూలమునకు

శా. బాలుం డెక్కడ బండి యెక్కడ నభోభాగంబుపైఁ జేవ్పడన్
గాలం దన్నుటయెక్క డాటపడుచుల్ గల్లాడి రీ జడ్డుఁబ
ల్కే లోకంబుననైనఁ జెప్పబడునే యే చదవో కాక యం
చాలాపించుచు వ్రేలువ్రేతలు ప్రభూతాశ్చర్యలై రంతటన్.

— ఆం. భాగ. దశమ. పూ.భా. 256

అనునది హేతుబద్ధమైన వివరణము.

తృణావర్తుడు సుడిగాలిరూపమున వచ్చి శ్రీకృష్ణుని కొనిపోగా తల్లియైన యశోద తనకుమారుని కాననిదై దూడను గోలుపోయిన ఆవువలె మిగులవగతో శోకించెనని (సం. భాగ. 10-7-24) మూలమున నొక్క శ్లోకముననుండగా అనువాదమున యశోద మూర్తీభవించినశోకదేవతవలె యీక్రిందివిధముగా కానవచ్చుచున్నది.

ఉ. పాపనిఁ జూడ గానక విపద్దశ నొంది కలంగి తల్లి యో
పాపడ ! బాలసూర్యనిభ ! బాలశిరోమణి ! నేడు గాలికిన్
జేపడి పోయితే యనుచుఁ జీరుచు దైవముఁ జాల దూరుచున్
దాపమునొంది నెవ్వగల దయ్యుచుఁ గుందుచు బిట్టుఁగూయుచున్.

క. సుడిగాలి వచ్చి నిన్నున్
సుడిగొని కొనిపోవ నింట సుడి సుడిగొనుచున్
బెడఁ గడరెడి నా ముద్దుల
కొడుకా ! యే మంటి వనుచు ఘోరం బనుచున్

ఉ. ఇక్కడఁ బెట్టితిం దనయు డిక్కడ నాడుచునుండె గాలి దా
నెక్కడ నుండి వచ్చె శిశు వెక్కడిమార్గము వట్టి పోయె నే
నెక్కడఁ జొత్తునంచుఁ గమలేక్షణ గ్రేపుఁదొలంగి ఖిన్నయై
పొక్కుచు వ్రాలె గోవు క్రియ భూస్థలి వ్రాలె దురంతచింతయై.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 266, 67, 68

మూలమున నామమాత్రముగానున్న కరుణరసమునకనువాదమున సాంద్రత, పరిపుష్టి కలిగింపబడినది. ఈఘట్టమున మూలమునందలి యశోదలో కానరాని వాత్సల్యా భక్త్యతిశయము పోతన యశోదలో గానవచ్చుట గమనించదగియున్నది.

గోకులమందు బలరామకృష్ణులు శైశవక్రీడలు సల్పినవిధము మూలమున

కాలేన వ్రజతాల్పేన గోకులే రామ కేశవౌ ।
జానుభ్యాం సహ పాణిభ్యాం రింగమాణౌ విజహ్రతుః ॥

- సం. భాగ. 10-8-21

అను శ్లోకమునుండి

తతస్తు భగవాన్ కృష్ణో వయస్యైర్వ్రజబాలకైః ।
సహరామో వ్రజస్త్రీణాం చిక్రీడే జనయన్ ముదమ్ ॥

- సం. భాగ. 10-8-27

అను శ్లోకమువఱకు వర్ణింపబడినది. అవతారపురుషులు, పరిపూర్ణులునైన బలరామ కృష్ణుల లీలలలోనంతర్భాగమైన బాల్యక్రీడలను పోతన భక్తితన్మయత్వమున

సీ. జాను భాగముల హస్తమ్ములు పీడ్వడ
నిడుచు దిగ్గనఁ బోదు రింతనంత

- ఆం. భాగ. దశమ. పూ. భా 288 నుండి 305 వఱకు

ఇత్యాదిగ నా కుమారశేఖరుండు కపటశైశవంబున దొంగజాడలం గ్రీడించె నని యతివిస్తారముగా పదునెనిమిది గద్యపద్యముల వెలయించెను. పోతనయంత రంగము భక్తిరసతరంగిత మహాప్రవాహమున కొట్టుకొనిపోవుటచే లీలామానుషవిగ్రహు డైన శ్రీకృష్ణుని బాల్యక్రీడావిశేషములనతివిస్తారముగా ప్రదర్శింపగలిగెను. ఈఘట్ట మునందలి

సీ. తనువున నంటిన ధరణీ పరాగంబు

పూసిన నెఱిభూతి పూతగాగ

-ఆం. భాగ. దశమ. పూ.భా. 296

అను పద్యము పోతనయందలి శివకేశవాభేదమైన యద్వైతభక్తిని చక్కగా వ్యక్తీక రించుచున్నది. ధూళిధూసరితమైన బాలుని శివునిగాభావించిన పోతన యా బింబభావ నను సర్వాంగీణముగానిందు చిత్రించినాడు. సామాన్యులకు గోచరమగు సహజబాల క్రీడాపరాయణత్వమును విశదీకరించుచునే శ్రీకృష్ణుని మహత్త్వమును, తన్మయత్వ మున కొనియాడుట ప్రశంసార్హము. ఇందు 'నే సూత్రధారి మీరందఱు బహు రూపులని' శ్రీకృష్ణునిచే పల్కించుట భగవానుడు జగన్నాటకసూత్రధారియనియు, జగన్నాటకమందలి వివిధపాత్రలే యీ జీవులనుతత్త్వమును ప్రతిపాదించుటయే. ఈఘట్టము పోతనభక్తితన్మయత్వమునకు, అనన్యరచనానైపుణికి ప్రబలోదాహర ణము కాగలదు.

గోపికలు శ్రీకృష్ణుని దుడుకుచేతలు యశోదాదేవికి తెల్పుసందర్భమున మూలమున

శ్లో. కృష్ణస్య గోప్యో రుచిరం వీక్ష్య కౌమారచాపలమ్ ।
శృణ్వన్త్యాః కిల తన్మాతురితి హోచుః సమాగతాః ॥

శ్లో. వత్సాన్ ముంచన్ క్వచిదసమయే క్రోశసంజాతహాసః
స్తేయం స్వాద్వత్త్యథ దధి పయః కల్పితైః స్తేయయోగైః ।
మర్కాన్ భోక్ష్యన్ విభజతి స చేన్నాత్తి భాండం భినత్తి
ద్రవ్యాలాభే స గృహకుపితో యాత్యుపక్రోశ్య తోకాన్ ॥

శ్లో. హస్తాగ్రాహ్యే రచయతి విధిం పీఠకోలూఖలాద్యైః
ఛిద్రం హ్యన్తర్నిహితవయునః శిక్యభాండేషు తద్విత్ ।

ధ్వాన్తాగారే ధృతమణిగణం స్వాంగమర్థప్రదీపం
కాలే గోప్యో యర్హి గృహకృత్యేషు సువ్యగ్రచిత్తాః ॥

శ్లో. ఏవం ధార్ష్ట్యాన్యుశతి కురుతే మేహనాదీని వాస్తౌ
స్తేయోపాయైర్విరచితకృతిః సుప్రతీకో యథాఽఽస్తే ।
ఇత్థం స్త్రీభిః సభయ నయన శ్రీముఃఖాలోకినీభి
ర్వ్యాఖ్యాతార్థా ప్రహసితముఖో నహ్యుపాలబ్ధుమైచ్ఛత్ ॥

-సం. భాగ. 10-8-28 నుండి 31

అనియుండగా ననువాదమున

క. బాలురకుఁ బాలు లేవని
బాలింతలు మొఱలువెట్టఁ బకపక నగి యీ
బాలుం డాలము సేయుచు
నాలకుఁ గ్రేపులను విడిచె నంభోజాక్షీ !

—ఆం. భాగ. దశమ. పూ. భా. 306

ఇత్యాదిగా

ఉ. కాంతలు తల్లితోఁ దనవికారము లెల్ల గణింప భీతుఁడై
శాంతుని సొంపునన్ బరమసాధుని పెంపున నోలమాడ్కి వి
భ్రాంతునిభంగి నడిన్ జడునిభంగిఁ గుమారకుఁ డూరకుండె నే
వింతయు లేక తల్లి కుచవేదిక నొదల మోపి యాడుచున్.

—ఆం. భాగ. దశమ. పూ. భా. 333

అని అతివిస్తృతముగా రసభరితముగా వర్ణింపబడెను. బాలకృష్ణుని చిలిపిచేష్ట లన్నియు పోతన తన మనోవీధిలో చూచుచుండుటవలన నీఘట్టమునొక దృశ్యకావ్య ఘట్టముగ తీర్చిదిద్దినాడు. ఇందలి యీవిస్తృతికి పోతనభక్తితన్మయతయే ప్రధాన కారణమని నిష్కర్షగా చెప్పవచ్చును.

'వేలుపులటె వాకంటెను
వేలుపు మఱి యెవ్వఁడనుచు వికవిక నగి' వేల్పులనపహసించుటయు,

'నాతోవచ్చెదవా' అని యడుగుటయు, శ్రీకృష్ణుని పరమాత్మ స్వరూపము నభివ్యక్తమొనరించుచున్నవి.

భగవానుని గుఱించి తెలిసికొనవలసినది చాలకలదను భావనను కల్గించి వారిని మరింత నున్నతస్థితికి తీసికొనిపోవుటకు సహకరించుచున్నది.

సీ. రా పూర్ణచంద్రిక! రా గౌతమీ గంగ!
రమ్ము భగీరథరాజతనయ!
రా సుధాజలరాశి! రా మేఘమాలికా!
రమ్ము చింతామణీ! రమ్ము సురభి!
రా మనోహారిణి! రా సర్వమంగళ!
రా భారతీదేవి! రా ధరిత్రి!
రా శ్రీమహాలక్ష్మి! రా మందమారుతి!
రమ్ము మందాకిని! రా శుభాంగి!

ఆ. యనుచు మఱియుఁ గలుగు నాఖ్యలుగల గోవు
లడవిలోన దూరమందు మేయ
ఘనగభీరభాషఁ గడు నొప్పఁ జీరు నా
భీరజనులు బొగడఁ బెంపు నెగడ.

- ఆం. భాగ. దశమ. పూ.భా. 601

అని గోవులను పేరుపేరున పిలచుట మూలమున కానరాదు. పోతన ఆయా గోవులకు పెట్టినపేళ్ళనుపరికించినచో నవి యాగోవులందలి పవిత్రభావమునుబట్టియు, రంగునుబట్టియు, నడకలనుబట్టియు, ఆకారములనుబట్టియు నిర్ణయించబడినవిగా కానవచ్చుచున్నవి. గోవులకు, గోపబాలురకుగల సన్నిహితత్వమునకు, సంబంధమునకు సజీవచిత్రణమే యిది. పల్లీజీవితచిత్రణములో నాధునికులైన కవులకు మార్గము చూపినవాడు పోతనయని వ్యక్తమగుచున్నది.

శ్రీకృష్ణుడు కాళియసర్పముచే పట్టుబడగా గోపికలు మిక్కిలి దుఃఖించుచు భక్తివివశలై యతని చెయ్దములను కీర్తించినవిధము మూలమున కన్పట్టదు. భక్తివివశతతో పోతన (గోపికలు) పల్కిన పల్కులను గమనింపుడు.

ఈపట్టునందు మూలమునందలి ప్రదేశముకంటె పోతన శ్రీకృష్ణుడుగాంచిన మనోహరదృశ్యమును మనకు చూపి వేడుక యధికమగునట్లుచేయుట గమనింపదగి యున్నది. ప్రకృతిదృశ్యములను మనోహరముగా చిత్రించుటలో మూలమునకు వన్నెలు దిద్దుట, పోతనలోని ప్రత్యేకత.

అట్లే బంతిచల్దులారగించు దృశ్యము మూలానువాదములందు వర్ణింపబడిన తీరు గమనింతము.

సర్వే మిథో దర్శయన్తః స్వస్వభోజ్యరుచిం పృథక్ ।
హసన్తో హాసయన్తశ్చాభ్యవజహ్రుస్సహేశ్వరాః ॥

—సం. భాగ. 10-13-10

బాలురెల్లరును ఒండొరులకుఁ దమతమ అన్నపురుచులను బ్రత్యేకముగా తెలియ జేయుచు తామునవ్వుచు, ఇతరులను నవ్వించుచు పరమేశ్వరుడగు కృష్ణునితో ఆహారము భుజించిరని మూలముననుండగా తమతమ యన్నపురుచులను ప్రత్యేకము నొండొరులకు తెలియజేయు విధమును, అట్లు తెలియజేయుటలో వారిలోవారు నవ్వుకొనుటయు, ఇతరులను నవ్వించుటయు, తెలుగుతనముతో పెంచి యనువాదమున మనోహర దృశ్యముగా చిత్రింపబడినది, తిలకింపుడు.

సీ. మాటిమాటికి వ్రేలుమడిచి యూరించుచు
నూరుగాయలు దినుచుండు నొకఁడు
డొకనికంచములోని దోడిసి చయ్యన మ్రింగి
చూడులే దని నోరు సూపు నొకఁడు
డేగు రార్గురచల్దు లెలమిఁ బన్నిద మాడి
కూరొకొని కూరొకొని కుడుచు నొకఁడు
డిన్నియుఁ దగఁ బంచి యిడుట నెచ్చెలితన
మనుచు బంతెనగుండు లాడు నొకడు

ఆ. కృష్ణుఁ జూడు మనుచుఁ గికురించి పరు మ్రోలి
మేలిభక్ష్యరాశి మెసగు నొకఁడు
నవ్వు నొకఁడు సఖుల నవ్వించు నొకఁడు
ముచ్చటాడు నొకఁడు మురియు నొకఁడు

—ఆం. భాగ. దశమ. పూ. భా. 494

ఆ గోపబాలురలో తానొక్కడై చరించుటచే పోతన యింత సహజసుందర దృశ్యమును చిత్రింపగలిగినాడు.

గోపబాలురు చల్దులారగించుచుండగా బ్రహ్మ, పచ్చికమేయుచున్న గోవులను దాచగా వానిని వెదకుటకై శ్రీకృష్ణుడు హస్తమందు అన్నపుముద్దకలవాడై వెళ్లెను. (సపాణికబళో యయౌ) అని మూలమున కలదు. అంతమాత్రపురూపవర్ణనతో తృప్తి చెందనిపోతన పెంచి, సాక్షాత్కరింపజేసిన రూపమును తిలకింతము.

శా. కర్ణాలంబితకాకపక్షములతోఁ గ్రైవేయహారాళితోఁ
స్వర్ణభ్రాజితవేత్రదండకముతో సత్పింఛదామంబుతోఁ
బూర్ణోత్సాహముతో ధృతాన్నకబళోత్ఫుల్లాబ్జహస్తంబుతోఁ
దూర్ణత్వంబున నేగె లేగలకునై దూరాటవీవీధికిన్.

—ఆం. భాగ. దశమ. పూ. భా. 500

ఒకచో కృష్ణుడు గోపబాలురతో తనబలము చూపనెంచి కుస్తీపోట్లాటలాడి అలసిపోయి చెట్టుమొదలుచేరి, ఆబాలుర తొడలు తలదిండుగజేసికొని చిగురాకుసెజ్జపై పరుండునని (సం. భాగ. 10–15–16) మూలముననుండగా పరమాత్మతత్త్వముతో సరిపోల్చుచు, శ్రీకృష్ణుడు గోపబాలురతో కలసిగావించిన చేష్టలయొక్క సమగ్రస్వరూప మనువాదమున పోతన చిత్రించుట ఈతని భక్త్యతిశయమును వెల్లడించుచున్నది. ఆపద్యమును పరికింతము.

సీ. వేదాంతవీథుల విహరించువిన్నాణి
విహరించుఁ గాంతారవీథులందు
ఫణిరాజశయ్యపై బవళించుసుఖభోగి
పల్లవశయ్యలఁ బవ్వళించు
గురుయోగిమానసగుహలఁ గ్రుమ్మరుమేటి
గ్రుమ్మరు నద్రీంద్రగుహలలోనఁ
గమలతోడఁ బెనంగికడు డయ్యుచతురుఁ
డాభీరజనులతోడఁ బెనంగి డయ్యు

ఆ. నఖిలలోకమునకు నాశ్రయుండగుధీరుఁ
డలసి తరులనీడ నాశ్రయించు
యాగభాగచయము లాహారించుమహాత్ముఁ
డడవిలోనిఫలము లాహరించు

- ఆం. భాగ. దశమ. పూ. భా. 605

శ్రీకృష్ణుడు కాంతారవీథులలో గోపబాలురతో సంచరించుసమయమున వారాతనికి గావించిన పరిచర్యలు మూలమున ఈక్రిందివిధముగా వర్ణింపబడినవి.

శ్లో. పాదసంవహనం చక్రుః కేచిత్తస్య మహాత్మనః।
అపరే హతపాప్మానో వ్యజనైస్సమవీజయన్॥

శ్లో. అన్యే తదనురూపాణి మనోజ్ఞాని మహాత్మనః।
గాయంతి స్మ మహారాజ స్నేహక్లిన్నధియశ్శనైః॥

-సం. భాగ. 10-15-17,18

అనువాదమున పోతన ఆయా పరిచర్యలేయే సమయములందు చేయబడినవో వివరించి, మరికొన్ని యుపచారములను గావించి తృప్తినిపొందెను. పోతన (గోపబాలురు) గావించిన పరిచర్యలిట్లున్నవి.

సీ. అలసినచోఁ గొంద ఱతిమోదమున వీపు
లెక్కించుకొని పోదు రేపు మెఱసి
సొలసి నిద్రించినచో నూరుతల్పంబు
లిడుదురు కొందఱు హితవు గలిగి
చెమరించి యున్నచోఁ జిగురుటాకులఁ గొంద
ఱొయ్యన విసరుదు రుత్సహించి
దవ్వేగి నిలుచుచోఁ దడయక గొందఱు
పదము లొత్తుదు రతిబాంధవమున

ఆ. గోపవరులు మఱియుఁ గొందఱు ప్రియమున
మాధవునకుఁ బెక్కు మార్గములను

బనులు సేసి రెల్లభవములం జేసిన
పాపసంచయములు భస్మములుగ.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 607

దీని ద్వారమున మూలమునందలి గోపబాలురలోని భక్తిభావముకంటె అనువాదము నందలి గోపబాలుర సఖ్యభక్త్యతిశయము వెల్లడియగుచున్నది.

కాళియమర్దన ఘట్టమునందు శ్రీకృష్ణుడు కాళిందీనది యొడ్డునగల కదంబ వృక్షమునెక్కి కాళిందిమడుగున దూకినవిధము

కృష్ణః కదంబమధిరుహ్య తతోఽతితుంగ
మాస్ఫోట్య గాఢరశనో న్యపతద్విషోదే॥

— సం. భాగ. 10-16-6

అనిమూలమున నుండగా అనువాదమున నిట్లున్నది.

పూర్వజన్మ భాగ్యంబునం దన చరణసంస్పర్శనంబునకు యోగ్యంబై తత్సమీపంబున విశాలవిటపిశాఖాకదంబంబుతోనున్న కదంబభూజం బునెక్కి

మ. కటి చేలంబు బిగించి పింఛమునఁ జక్కం గొప్పు బంధించి దో
స్తట సంస్ఫాలన మాచరించి చరణద్వంద్వంబు గీలించి త
త్కుటశాఖాగ్రమువీదనుండి యుఱికెన్ గోపాలసింహంబు ది
క్తటముల్ మ్రోయ హ్రదంబులో గుభగుభధ్వానం బనూ
నంబుగన్.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 635

సహజమైనరీతిలో సమగ్రమైన దృశ్యమును పాఠకుల కనులముందుంచినతీరు పై వర్ణనమున స్పష్టమగుచున్నది. ఆలకాపరులు గోవులనుమేపు సమయములందు నదులందును, కాలువలందు నిట్లు దుముకుట మనము చూచుచుందుము.

మాభర్తచేసిన అపరాధమును మన్నించి పతిభిక్షపెట్టుమని కాళియపత్నులు శ్రీకృష్ణుని వేడినవిధము మూలమున నిట్లున్నది.

శ్లో. అపరాధః సకృద్భర్త్రా సోఢవ్యః స్వప్రజాకృతః।
క్షంతుమర్హసి శాంతాత్మన్ మూఢస్య త్వామజానతః॥

శ్లో. అనుగృహ్ణీష్వ భగవన్ ప్రాణాంస్త్యజతి పన్నగః ।
స్త్రీణాం న సాధుశోచ్యానాం పతిః ప్రాణః ప్రదీయతామ్॥

శ్లో. విధేహి తే కింకరీణామనుష్ఠేయం తవాజ్ఞయా।
యచ్ఛ్రద్ధయానుతిష్ఠన్ వై ముచ్యతే సర్వతో భయాత్ ॥
— సం. భాగ. 10-16-51, 52, 53

భక్తివివశుడైన పోతన, నాగపత్నులనీపట్టున పరాకాష్ఠచెందిన ఆర్తిగల శరణాగతలనొనర్చెను. వారియార్తి యిట్లున్నది

ఉ. నేరము లెన్న నెక్కడివి నేము దలంచు తలంపులందులో
నేసుపు లున్నవే సుతుల నేరమిఁ దండ్రులు ద్రోచిపుచ్చరే
నేరము సేయువారి ధరణీపతు లోర్తురొకమాటు గావరే
నేరమి గల్గు మద్విభుని నేఁడిటు గావగదే కృపానిధీ!

శా. బాలుం డీతడు మంచివాడనుచుఁ జెప్పన్ రాము క్రూరుండు దు
శ్శీలుండో నవు నైన నేము సుభగశ్రీఁ బాసి వైధవ్యదు
స్తాలంకారముఁ బొంద నోడెద మనాథాలాప మాలింపవే
చాలున్ నీపదతాడనంబు పతిభిక్షన్ బెట్టి రక్షింపవే.

ఉ. ఆకులమయ్యె భోగమిదె యాచల లన్నియు వ్రస్సెఁ బ్రాణముల్
రాకలఁ బోకలం బొలిసె రాయిడిపెట్టక మానిజేశుపై
నీకరుణాకటాక్షములు నిల్పఁ గదే తగ నో సమస్తలో
కైకశరణ్యా! యో యభయకారణ! యో కమలామనోహరా!

ఆ. మమ్ముఁ బెండ్లిసేయు మాప్రాణవల్లభు
ప్రాణమిచ్చి కావు భక్తవరద!
నీవు సేయు పెండ్లి నిత్యంబు భద్రంబు
పిన్ననాఁటి పెండ్లి పెండ్లి గాదు

ఇంద్రవజ్రము. నీయాన! యెవ్వారిని నిగ్రహింపం

డాయుగ్రపాపాకృతి నందఁ డింకన్
నీయాజ్ఞలో నుండెడు నేటనుండిన్
మాయాశు ప్రాణంబులు మాకు నీవే.

—ఆం. భాగ. దశమ. పూ. భా. 683 నుండి 687

ఇందు చిన్ననాఁటిపెండ్లి పెండ్లికాదని బాల్యవివాహములసమ్మతములను సూచన చేయుట ప్రశంసార్హము.

ఈఘట్టమునందే కాళియమర్దనానంతరము శ్రీకృష్ణుడు కనుపింపగా యశోద పొందిన ఆనందము మూలమున నిట్లు వర్ణితమైనది

శ్లో. యశోదాపి మహాభాగా నష్టలబ్ధప్రజా సతీ।
పరిష్వజ్యాంకమారోప్య ముమోచాశ్రుకలాం ముహుః॥

— సం. భాగ. 10–17–19

యశోద ఆనందాతిరేకమున శ్రీకృష్ణుని ముద్దాడినవిధము అనువాదమున నెట్లున్నదో పరికింతము.

శా. నిన్నాయుగ్రభుజంగమంబు గఱవన్ నీ వాపదం బొందుచు
న్నన్నే మంటి తనూజ! యోడవుగదా నాకూన! నాతండ్రి! రా
వన్నా! యంచు శిరంబు మూర్కొని నిజాంకాగ్రంబుపై నిల్పుచున్
గన్నీరొల్కఁ గవుంగిలించెఁ దనయున్ గారాముతోఁ దల్లిదాన్.

— ఆం. భాగ. దశమ. పూ.భా. 709

మూలమునుమించిన వాత్సల్యభావమనువాదమున నత్యంత సహజరీతిలో ప్రతీయమానమగుట ప్రశంసార్హము.

గోకులమందు రామకృష్ణులు గోవులకాపరులనునెపమున మాయచేఁ గ్రీడించుచుండ ప్రాణులకప్రియమైన గ్రీష్మర్తువు వచ్చెను. (సం. భాగ. 10-18–2) అని మూలమునకలదు. అనువాదమున నాగ్రీష్మర్తువు అఖిలప్రాణిభీష్మమైనవిధము వివరింపబడినది. ఇట్లాభీలంబయిన నిదాఘకాలము వర్ణించినతీరు పరికింతము.

సీ. దినము లంతంతకు దీర్ఘంబులై తోఁచె
దిననాథుఁ డుత్తరదిశఁ జరించె
నాఁడునాటికి నెండ నసహ్యమై ఘనమయ్యె
వెచ్చనిగాడ్పులు విసరఁజొచ్చె
మేదినీరేణువుల్ మింట సంకులమయ్యె
నేఱులుఁ గొలఁకులు నిగిరిపోయెఁ
బానీయశాలలఁ బథికసంఘము నిల్చెఁ
జప్పరంబుల భోగిచయము డాఁగెఁ

తే. దరులు లతలుఁ గుసుమదళములతో వాడె
మిథునకోటికి రతి మెండు దోఁచె
నఖిలజంతుభీష్మమైన గ్రీష్మము రాకఁ
గీలి యడవులందుఁ గేలి సలిపె.

ఆ. వాడిరుచులు గలుగువాని వేడిమి గ్రీష్మ
కాలమందు జగము గలయఁబడియె
బ్రహ్మజనులకొఱకు బ్రహ్మాండఘటమున
నుష్ణరసముఁ దెచ్చి యునిచె ననఁగ.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 714, 715

సందర్భోచితముగ అష్టాదశవర్ణనలను గూర్చుట ప్రబంధకవుల లక్షణము. పోతనయనువాదము ప్రబంధధోరణిలో సాగుచున్న పురాణమగుటచే నిట్టివర్ణనలతి విస్తృతముగ గావింపబడినవి. పోతనవర్ణనానైపుణికి ఇదియొక మచ్చుతునకగా పరిగణింపవచ్చును. ప్రకృతివర్ణనలను సహజసుందరముగా చిత్రించుట పోతనలో కానవగు విశేషము.

గోపికావస్త్రాపహరణఘట్టమున సలిలమధ్యంబుననున్న గోపికలతో దరహసితవదనుడైన హరి యిట్లుపల్కెను.

క. ఏతరుణుఁడు మగడగుటకు
మీతపములు చెప్పెడింక మీయానలు సుం
డీ తప్పిన నీ కూరిమి
మీతలలనె పుట్టెనోటు మేదిని లేదే.

క. ఎవ్వని గని మోహించితి
రెవ్వఁడు మీ మానధనము లెల్లహరించెన్
నివ్వటిలెను మీకూరిమి
యెవ్వనిపైఁ బలుక రాదె యే నన్యుఁడనే.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 830, 831

'మీరెద్దానినుద్దేశించి యీవ్రతము నాచరించి కృశించిపోయిరో అట్టి మీరు తోయములు వెడలిరండని (సం. భాగ. 10-22-10) మూలమున రేఖామాత్రముగా నున్న భావమునకు స్పష్టమైన వివరణతోకూడిన పలుకులే పై ప్రశ్నలు. ఇట్టిఘట్టము సహజసంభాషణాధోరణిలో సాగి దృశ్యకావ్యమును తలపింపజేయుచున్నది.

గోవర్ధనోద్ధరణఘట్టమున శ్రీకృష్ణుడు గోపజనులనెల్లరను తానెత్తిపట్టిన పర్వతము క్రింద నిలువుడని పిలుచుచు 'న త్రాస ఇహావః కార్యో మద్ధస్తాద్రినిపాతనే' (సం. భాగ. 10-25-21) నాచేతినుండి పర్వతము మీపై పడునేమో యను భయము మీకువలదని పలికినట్లు మూలముననున్నది. ఆవిధముగా వారు భయపడుటకు గల హేతువునుసహితము వివరించుచు, వారిభయమును పూర్తిగాతొలగించు ప్రయత్నమనువాదమున ఈక్రిందివిధముగా కానవచ్చుచున్నది.

శా. బాలుం డీతడు కొండ దొడ్డది మహాభారంబు సైరింపగా
జాలండో యని దీనిక్రింద నిలువన్ శంకింపగాఁ బోలదీ
శైలాంభోనిధి జంతుసంయుత ధరాచక్రంబు పైఁబడ్డ నా
కేలల్లాడదు బంధులార! నిలు డీ క్రిందన్ బ్రమోదంబుగన్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 918

దశమస్కంధమునకేగాక భాగవతమునకే మకుటాయమైన ఘట్టము రాసక్రీడాఘట్టము. భాగవత ప్రతిపాదిత భక్తిమార్గములలో ముఖ్యాతిముఖ్యమైన, ఆత్మనివేదనా భక్తి గోపికలలో పరాకాష్ఠనందిన స్థలమిదియే. భక్తుడు, భావుకుడునగు పోతన తదారంభముననే వివశుడై రచనసాగించుట కాననగును. గోపికలలోని భగవద్రతి రసస్థాయినందుట కుద్దీపనవిభావమగు చంద్రోదయమును వర్ణించిన తీరును గమనించిన పై విషయము స్పష్టముకాగలదు.

ఒకానొకప్రియుడు చిరకాలమునకు సందర్శించిన ప్రియురాలి ముఖమునకు కుంకుమపూత పూయునట్లు, నక్షత్రములకురాజైన చంద్రుడు తూర్పుదిక్కను కాంత

ముఖమునందత్యంత సుఖకరములగు తనకిరణములచే కెంపుచాయ మెఱయఁ జేయుచు జనులకు నోషధులకును పగలు రవివలన కలిగిన తాపములని బడలికను పోగొట్టుచు నుదయించెను. నీటిపట్టులందలి కలువలను వికసింపఁజేయుచు తననిండుబింబము చెలువార సిరినెమ్మొగము చాయవెలుగొందుచు, క్రొత్తకుంకుమ కెంపు దీపింప ఆ యమునా నదీతీరమునగల వనమును కెంపుఁదళుకుల మిలమిలమెఱయఁ జేయుచు మనోజ్ఞముగానున్న చంద్రునిగాంచి శ్రీకృష్ణుడు మధురగీతము నాలపించెను ( సం. భాగ. 10_29 2, 3) అని మూలమునసుండగ అనువాదమునిట్లున్నది.

చ. కలువలమేలి కందువలు కాముని కయ్యపుఁబాళెముల్ విర
క్తులు తలడించు వేళలు చకోరకపంక్తులభోగకాలముల్
చెలువలు పైరణల్ విడిచి చిక్కుతఱుల్ ఘనచంద్రచంద్రికా
జ్వలితదిశల్ శరన్నిశలు జారకదుర్దశ లయ్యె నయ్యెడన్.

....................................

....................................

బోడుపుఁగొండచక్కిఁ బొడిచె రాకాచంద్ర
మండలంబు గగనమండలమున.

-ఆం. భాగ. దశమ. పూ. భా. 961 నుండి 964

ఇట్లు పొడమిన నవకుంకుమాంకిత రమాముఖమండలంబునుంబోలె నఖండం బైన చంద్రమండలంబుం బొడగని పుండరీకనయనుండు యమునాతట వనంబున జగన్మోహనంబుగ నొక్కగీతంబుపాడెనని భావికథకనుగుణముగ పలురీతుల మన్మథోద్దీపకమగునట్లు చంద్రోదయవర్ణనమును విస్తృతపఱచుట గమనీయార్థము.

శ్రీకృష్ణుని గీతాలాపనవిని చేరవచ్చిన గోపకాంతలను తమగృహములకు మరలి పొండని శ్రీకృష్ణుడుపల్కుచు జారవృత్తిని తెగడినవిధము

శ్లో. అస్వర్గ్యమయశస్యం చ ఫల్గు కృచ్ఛ్రం భయావహమ్।
జుగుప్సితం చ సర్వత్ర ఔపపత్యం కులస్త్రియాః ॥

- సం. భాగ. 10-29-26

అని మూలమున సూత్రప్రాయముగనుండగ అనువాదమున

చ. ఇలువడి సున్న చేసి హృదయేశుల సిగ్గులు పుచ్చి యత్తమా
మల నెరియించి సోదరులమానము సూఱలు వుచ్చి తల్లిదం
డ్రులగుచి మాన్చి బంధులకు రోత యొనర్చుచు జారవాంఛలన్
వలనఱి సత్కులాంగనలు వత్తురె? లోకులు సూచి మెత్తురే.

సీ. ప్రాణేశుఁ డెఱిగినఁ బ్రాణంబునకుఁ దెగు
దండించు నెఱిగిన ధరణివిభుఁడు
..............................
యశము లేదు నిర్భయానందమును లేదు
జారుఁ జేరఁ జనదు చారుముఖికి.

— ఆం. భాగ. దశమ. పూ. భా, 976, 977

అని వ్యాఖ్యాప్రాయముగా విస్తృతి యొనర్చబడినది. మంచి, చెడులను పూర్తిగా, హృదయమునకు హత్తుకొనునట్లు చెప్పుటయే పురాణముయొక్క ప్రధానమైన ఉద్దేశ్యము. జారత్వముపై నేవగింపు కల్గునట్లి విస్తృతి గావించి తత్ప్రయోజనమును సాధించినాడనవచ్చును.

శ్రీకృష్ణుడు గోపికలను తిరిగి యిండ్లకు పొమ్మనిన సందర్భమున వారి ప్రతివచనంబులు

శ్లో. మైవం విభోఽర్హతి భవాన్ గదితుం నృశంసం
సంత్యజ్య సర్వవిషయాంస్తవ పాదమూలమ్।
భక్తా భజస్వ దురవగ్రహ మా త్యజాస్మాన్
దేవో యథాఽఽదిపురుషో భజతే ముముక్షూన్॥

-సం. భాగ. 10-29-31

అనుశ్లోకమునుండి

శ్లో. వ్యక్తం భవాన్ వ్రజభయార్తిహరోఽభిజాతో
దేవో యథాఽఽదిపురుషః సురలోకగోప్తా।
తన్నో నిధేహి కరపంకజమార్తబంధో
తప్తస్తనేషు చ శిరస్సు చ కింకరీణామ్॥

- సం. భాగ. 10-29-41

అనుశ్లోకమువఱకు మూలమున గోపికల భక్తిభావమభివ్యక్త మొనరింపబడినది. భక్తితన్మయత్వమున పోతన తన యనువాదమున మఱికొంత విస్తృతపఱచి గోపికల భక్త్యతిశయమును మఱింత స్పష్టపఱచినాడు. అనువాదమున వీరిపలుకులు

మ. అకటా ! నమ్మితి మేము క్రూరుడవ నిన్నర్థించె మాయిండ్లలో
సకలవ్యాపుల డించి నీపదసరోజాతంబు లర్పింపఁ జి
క్కఁక యేతెంచితి మీశుఁ డాఢ్యుడు ముముక్షాసక్తులం గాచుపో
లికఁ గావందగుఁ గావవే విడువ మేలే కాంతలన్ భ్రాంతలన్.
-ఆం భాగ. దశమ. పూ. భా. 985

ఇత్యాదిగా సుమారు 15 పద్యములలో విస్తృతముగా కానవచ్చుచున్నవి. ఈ ఘట్టమున పోతన, గోపికలతో తాదాత్మ్యమునొందుటచే ఈతనిగోపికల దీనాలాపములు మూలముకంటె నధికమైన దైన్యము నభివ్యక్తమొనరించి వీరియందలి ఆత్మనివేదనాసక్తిని మఱింత స్పష్టముగా వ్యక్తీకరించుచున్నవనవచ్చును. వీరు ముముక్షాసక్తితో నేతెంచిన భక్తులేగాని లౌకికాసక్తితో నేతెంచినవారు కారని ఈసందర్భమునందలి పలుకులు సువ్యక్తమొనరించుచున్నవి.

శ్రీకృష్ణుండాత్మారాముండై గోపికలతో రమించుచు, వారిలోని మక్కువ నెక్కువ చేయుటకు తిరోహితుడుకాగా, వారాతని గానక మిగుల సంతాపమునంది, విరహవేదనాపరశలై యాతనిగూర్చి తరులతాదులను ప్రశ్నించినతీరు మూలమున

శ్లో. దృష్టో వః కశ్చిదశ్వత్థ ప్లక్ష న్యగ్రోధ నోమనః ।
నందసూనుర్గతో హృత్వా ప్రేమహాసావలోకనైః ॥

శ్లో. కచ్చిత్ కురవకాశోకనాగపున్నాగ చంపకాః ।
రామానుజో మానినీనామితో దర్పహరస్మితః ॥

శ్లో. కచ్చిత్తులసి కల్యాణి గోవిందచరణప్రియే ।

ఇత్యాదిగా (సం. భాగ. 10-30-5 నుండి 13 వఱకు) కరుణరసస్ఫోరకముగా తీర్చిదిద్దెను. ఈపట్టున అనువాదమున మూలమునుమించిన కరుణరస ప్రవాహము వెల్లివిరియింది గోపికలనేగాక పాఠకులను సహితము పరమ విరహాసక్తులను గావించిన తీరు ప్రశంసార్హము.

సీ. పున్నాగ ! కానవే పున్నాగ వందితుఁ
దిలకంబ ! కానవే తిలకనిటలు
ఘనసార ! కానవే ఘనసారశోభితు
బంధూక ! కానవే బంధుమిత్రు
మన్మథ ! కానవే మన్మథాకారుని
వంశంబ ! కానవే వంశధరునిఁ
జందన ! కానవే చందనశీతలుఁ
గుందంబ ! కానవే కుందరదను

తే. నింద్రభూజమ ! కానవే యింద్రవిభవుఁ
గువలవృక్షమ ! కానవే కువలయేశుఁ
బ్రియకపాదప ! కానవే ప్రియవిహారు
ననుచు కృష్ణుని వెదకి రయ్యబ్జముఖులు

ఇత్యాద్యమూలక విస్తృతులు (ఆం. భాగ. దశమ. పూ. భా. 1008 నుండి 1017) రసపుష్టికి, అనుభూతిసాంద్రతకు, మిక్కిలి సహకరించగలవనుట నిస్సంశయము. ఇట్లు శ్రీకృష్ణునిగూర్చి పేరుపేరున ప్రశ్నించుట గోపికల మానసిక స్థితి కద్దముపట్టుటయే. పేరుపేరున ప్రశ్నింపబడుచున్న వృక్షలతాదులకును, కృష్ణునకును కవిచమత్కృతితో శబ్దసామ్యమునుబట్టి సంబంధమునుచెప్పి వానిని ప్రశ్నించుట ప్రశంసింపదగియున్నది. ఇట్టి విస్తృతి ఆయాపాత్రలయెడ సహానుభూతిని పెంచుట కును మిక్కిలి సహకరించుననుట అనుభవములోని విషయము.

అట్లే మూలమున "ఓ మాలతీ ! ఓ మల్లికా ! ఓ జాజీ ! ఓ యూథికా ! తనచేతి తాకిడిచే సంతోషపరచుచు మాధవుడీ దారి పోవుచు మీకు కనబడెనా ? (సం. భాగ. 10–30–8) అని మాత్రమే యుండగా, అనువాదమున

ఉ. నల్లనివాడు పద్మనయనంబులవాఁడు కృపారసంబు పైఁ
జల్లెడువాఁడు మౌళిపరిసర్పిత పింఛమువాడు నవ్వు రా
జిల్లెడుమోమువాఁ డొకఁడు చెల్వల మానధనంబు దెచ్చెనో
మల్లియలార ! మీ పొదలమాటున లేఁడు గదమ్మ ! చెప్పరే.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 1010

అని శ్రీకృష్ణుని భువన మోహన సౌందర్యమును అత్యంత సుందరముగ చిత్రించుట పోతనలోని భక్తితన్మయత్వము వలననే. తన అంతరమైన తృప్తికొరకు నీవర్ణన భక్తుడైన పోతనకు సహజము. లతల మిషతో పాఠకులలో సైతము సాంద్రమైన తృప్తిని కలిగించుటకాధారమేర్పడుచున్నది. ఇన్ని విశేషములు గలిగిన శ్రీకృష్ణుని చూడకపోవుటయెట్లు ? చూచియే యుందురను ప్రగాఢ విశ్వాసమునకీ విస్తృతి అద్దము పట్టుచున్నది.

సీ. మానినీమన్మథు మాధవుఁ గానరే
సలలితోదార వత్సకములార !
సలలితోదార వత్సకవైరిఁ గానరే
సుందరోన్నత లతార్జునములార !

ఇత్యాదిగ ముక్తపదగ్రస్తాలంకార శోభిత చాతుర్యరచనతో కూడిన విస్తృతి అమూలకమైనది.

సీ. అదె నంద నందనుం డంతర్హితుండయ్యెఁ
బాటలీతరులార ! పట్టరమ్మ !

ఇత్యాది పద్యములను చదివినచో ఎటువంటివారి హృదయమేని కరుణరసముచే ద్రవీభూతమగుననుట నిస్సంశయము. ఇట్టి రసస్థాయి మూలమున రానరాదు. ఈ ఘట్టమింత పరాకాష్ఠ చెందుటకు పోతన తానుకూడ ఒక గోపికయై శ్రీకృష్ణదర్శనమునకై తహతహలాడుటయే కారణము.

గోపిక లంతర్హితుడైన శ్రీకృష్ణునిగూర్చి వెదకుచు ఒకచో శ్రీకృష్ణునిపాదచిహ్నములనుచూచి తమలోతాము సంభాషించుకొనునపుడొక గోపిక శ్రీకృష్ణుని పాదముల నంటిన ధూళి యొక్క ధన్యత్వమునుగూర్చి తక్కినవారితో "ఓ చెలికత్తెలార ! గోవిందుని పాదపద్మముల నంటిన ధూళులెంత ధన్యములో గదా ! ఆ ధూళులను బ్రహ్మ, శివుడు, లక్ష్మి, దేవతలు తమ పాపములు హరించుటకై శిరమున దాల్తురు." ( సం. భాగ. 10-30-29 ) అని పలికినట్లుగ మూలమున కలదు. అనువాదమున పరమభక్తుడగు పోతన గోవిందుని పాదపద్మముల ధూళికినట్టి మహత్త్వమును సంక్రమింపజేసిన పాదములను తనకు తృప్తి కలుగువరకు స్తుతించిగాని విడువలేదు.

సీ. ఈ చరణంబులే యిందునిభానన
సనకాదిమునియోగసరణి నొప్పు
నీ పాదతలములే యెలనాఁగ ! శ్రుతివధూ
సీమంతవీథులఁ జెన్ను మిగులు
నీ పదాబ్జంబులే యిభకులోత్తమయాన !
పాలేటిరాచూలి పట్టుకొమ్మ
లీ సుందరాంఘ్రులే యిందీవరేక్షణ !
ముక్తికాంతామనోమోహనంబు

ఆ. లీ యడుగులరజమె యింతి బ్రహ్మేశాది
దివిజవరులు మౌళిదిశలఁ దాల్తు
రనుచుఁ గొంద ఱబల లజ్ఞాంఘ్రుఁ డేగిన
క్రమముఁ గనియు నతనిఁ గానరైరి.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 1029

ఈ సందర్భముననే మూలమున

శ్లో॥ అత్ర ప్రసూనావచయః ప్రియార్థే ప్రేయసా కృతః ।
ప్రపదాక్రమణే ఏతే పశ్యతాసకలే పదే ॥

శ్లో. కేశప్రసాధనం త్వత్ర కామిన్యాః కామినా కృతమ్।
తాని చూడయతా కాంతాముపవిష్టమిహ ధ్రువమ్ ॥

- సం. భాగ. 10-30-33, 34

అనిమాత్రమేయుండగా వారట్లు ఊహించుటకుగల కారణములను సైతము వివరించుచు మరికొన్ని చేష్టలను చేర్చుచు అనువాదమున ఈ దృశ్యమును మనోజ్ఞముగ తీర్చిదిద్దిన విధము పరికింపుము,

సీ. కొమ్మకుఁ బువ్వులు కోసినాఁ డిక్కడ
మొనసి పాదాగ్రంబు మోపినాడు
సతి నెత్తుకొని వేడ్క జరిగినాఁ డిక్కడఁ
దృణములో లేదిదె తెలవజాడ

ప్రియకు ధమ్మిల్లంబు పెట్టినాఁ డిక్కడఁ
గూర్చున్న చొప్పిదె కొమరుమిగుల
నింతికిఁ గెమ్మోవి యిచ్చినాఁ డిక్కడ
వెలది నిక్కినగతి విశదమయ్యె

ఆ. సుదతితోడ నీరుఁ జొచ్చినాఁడిక్కడఁ
జొచ్చి తా వెడలిన చోటు లమరెఁ
దరుణిఁగామకేళిఁ దనిపినాఁ డిక్కడ
ననఁగి పెనఁగి యున్నయంద మొప్పె.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 1026

గోపికల విరహాలాపములచే నార్ద్రహృదయుడైన హరి ప్రత్యక్షముకాగా వారు విరహము వీడిన విధము మూలమున

శ్లో. తం విలోక్యాగతం ప్రేష్ఠం ప్రీత్యుత్ఫుల్లదృశోఽబలాః ।
ఉత్తస్థుర్యుగపత్ సర్వాస్తన్వః ప్రాణమివాగతమ్॥

— సం. భాగ. 10-32-3

ఇత్యాదిగ ఏడుశ్లోకములలోనుండగా అనువాదమున అత్యంతభావ విస్తృతితో

క. వచ్చిన వల్లభుఁ గనుఁ గొని
విచ్చేసె నటంచు సతులు వికసితముఖులై
యచ్చుగ నిలిచిరి ప్రాణము
వచ్చిన నిలుచుండు యవయవంబుల భంగిన్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1058

ఇత్యాదిగ సుమారు పదిపద్యములలో ఆనందరసాబ్ధిని మునకలు వేయించుట ప్రశంసార్హము. ఇదిపోతన పరమాత్మని దర్శించుటచే సంభవించిన ఆనందాతిరేకము. ఈపట్టున 'టెంకిపట్టు' 'లోన మరుడు తలయెత్త తాను తలనెత్తుట' ఇత్యాది తెలుగు పలుకుబడులు పోతనసొత్తు.

రాసక్రీడా వర్ణనము మూలమున

శ్లో. తత్రారభత గోవిందో రాసక్రీడా మనువ్రతైః ।
స్త్రీరత్నైరన్వితః ప్రీతై రన్యోన్యాబద్ధ బాహుభిః ॥

— సం. భాగ. 10-33-2

ఇత్యాదిగ సుమారు ఇరువది శ్లోకములలో కానవచ్చుచుండగ అనువాదమున

ఉ. ఆ సమయంబునన్ విభుఁ డనంతుఁడు కృష్ణుఁడు చిత్రమూర్తియై
చేసెను మండలభ్రమణశీలపరస్పరబద్ధబాహుకాం
తాసువిలాసమున్ బహువిధస్ఫురితానన హస్తపాద వి
న్యాసము రాసమున్ గృత వియచ్చరనేత్రమనోవికాసమున్.

- ఆం. భాగ. దశమ. పూ భా. 1050

ఇత్యాదిగ సుమారు పదునెనిమిది గద్యపద్యములలో రసధునివలె సాగుట పోతన భావవిస్తృతికి, భక్తిరస పరాకాష్ఠకు ప్రబల నిదర్శనము కాగలదు. సుమారు ముప్పది శ్లోకముల భావమునిముడ్చుకొనగలిగిన సుదీర్ఘ వచనము శబ్దాలంకార యుక్తమై కానవచ్చుట పోతన రసతన్మయతను స్పష్టమొనర్చుచున్నది. అనేకవిశేష రాస బంధంబులను, తదనుగుణములైన వివిధ నర్తనములను సమర్థ కవి విలస నంబై యిందు విలసిల్లినవి. పోతన రాసక్రీడా వర్ణనము మూలమును మించిన సొగసులతో సకలజనమానసోల్లాసకరంబై, ఉజ్జ్వలరసాభిరామంబై, రాగపరి పూర్ణంబై అలరారుచున్నది. గోపికాకృష్ణులయొక్క అనుబంధము జీవాత్మపరమాత్మల సన్నిహితత్వము, ఐక్యతలకు, ప్రతీకగా చూచిన భక్తులలో పోతన అగ్రగణ్యుడు. అందుకొనుటకు సాధ్యముకాని లోతులాభావనలో సహజముగ నుండుటచే నీతడు ఆయా ఘట్టములను విశదముగ, విస్తృతముగ, విశిష్టములుగ చిత్రించుట సంభవించి నది. నిరవధికమగు అనుభూతిని కలిగించు విస్తృతములగు ఈరసచిత్రణము లాయా ఘట్టములను, ప్రసిద్ధదేవాలయముల చెంతనున్న పుష్కరిణుల వంటివి.

కృష్ణుడు బృందావనమును వీడి మథురకేగునపుడు గోపికలు వ్యథచెందిన వారై ఒండొరులాలోచించుకొని మనమందరము శ్రీకృష్ణుని బోవలదని ప్రయాణము నడ్డెదము. (సం. భాగ. 10-39-28) అని మూలమున నుండగా అనువాదమున ప్రయాణమును నిరోధించుట కేవలము కృష్ణునిప్రార్థించుటచే సాధ్యము కాదని యెంచిన పోతన

మ. హరి నేలా కొనిపోయె దంచు మనమాయక్రూరుఁ బ్రార్థింతమా
హరిఁ బోనీకుఁడు నిల్పరే యనుచు నేఁ డర్చింతమా వేల్పులన్
హరిపాదంబుల కడ్డముల్ వడుదమా హాదైవమా! యంచు నా
ఱిఖల్ కొప్పులుఁ జీరెలున్ మఱచి కందర్పజ్వరభ్రాంతలై.

- ఆం. భాగ. దశమ. పూ. భా 1218

అని విస్తృతమైన ప్రయత్నము గావించినాడు.

ఈ ఘట్టము నందే గోపికలు విరహవ్యథనందుచు తమ మనస్సు కృష్ణునందు చక్కగ నిల్పినవారై సిగ్గువీడి ‘ ఓ గోవిందా! మాధవా ! దామోదరా ! అని శ్రీకృష్ణుని పిలుచుచు బిగ్గరగా నేడ్చిరి.’ (సం. భాగ 10-39-31) అని మాత్రమే మూలమున నుండగ పోతన వీరిని మూర్తీభవించిన శోకదేవతలవలె మన కన్నుల యెదుట ప్రత్యక్షమొనరించిన తీరు పరికింతము.

మ. ఉవిదల్ సిగ్గులు మాని కన్గవల నీరొండొండ వర్షింపఁగా
వివశత్వంబులతోఁ గపోలతటసంవిన్యస్త హస్తాబ్జలై
పవనోద్ధూతలతాభలై మముఁ గృపం బాలింపు గోవింద! మా
ధవ! దామోదర ! యంచు నేడ్చిరి సుజాతంబైన గీతంబులన్.
—ఆం. భాగ. దశమ. పూ. భా. 1219

అక్రూరుడు బలరామ కృష్ణులను మధురానగరికి తీసుకొనివచ్చుచు మార్గమధ్యమున కాళిందీనదిలో గ్రుంకులిడుచు జలమందును, రథమందును ఒకే మారు బలరామ కృష్ణులను చూచి ‘ నేను వారిని నీటిలో జూచినది అసత్యమా ఏమి ? అని మరల నీటిలో మునిగెను.’ (సం. భాగ. 10-39-43) అని మూలమున కలదు. అనువాదమున అక్రూరుని ద్వైదీ భావనను

శా. కంటిన్ మున్ను రథంబుపై జలములోఁ గంటిన్ దుదిన్ గృష్ణు అన్
గంటిన్ దొంటిరథంబుమీఁద నిదె యీ కళ్యాణచారిత్రులే
వెంటన్ దోఁచిరి రెండుదిక్కుల మనోవిభ్రాంతియో నీటిలో
నుంటాశ్చర్యము చూతునంచు మఱియు న్మ్నాహించిమగ్నాంగుడై.
—ఆం. భాగ. దశమ. పూ. భా. 1227

అను రీతిని స్పష్టముగ చిత్రించినాడు. ఒకే వస్తువును ఒకే మారు రెండుచోటుల గాంచినపుడు సామాన్యముగ నిట్టి అనిశ్చితభావన కలుగుట సహజము. ఈ విధమైన మన స్తత్త్వమునకు సంబంధించిన చిత్రణమే యిందలి విస్తృతి.

మూలమున అక్రూరుడు రెండవమారు నీట మునిగినపుడు వేయిశిరస్సులు గలిగి, పడగలందు మణి భూషణములు గలిగి నీలివన్నె వలువతో తామరతూడువలె తెల్లనైన మేనుతో కూడి శిఖరములతో నుండు

వెండికొండ వలెనున్న దేవుని (ఆదిశేషుని) చూచెను. (సం.భాగ. 10_39_45) ఆదిశేషుని బాహ్యాభ్యంతర రూపమును మరింత స్పష్టరేఖలతో నంత్యానుప్రాసయుక్త సహజకవితాధారతో చిత్రించినతీరు పోతన రూపసాక్షాత్కార విధానమును స్పష్టమొనర్చు చున్నది.

ఉ. పోషితబాంధవుండు యదుపుంగవుఁ డా జలమందుఁ గాంచె స
ద్భాషు సహస్రమస్తక విభాసితభూషు నహీశు భూమిభృ
ద్వేషుఁ గృపాభిలాషుఁ బ్రతివీరచమూవిజిగీషు నిత్యసం
తోషు నరోషు నిర్దళితదోషు ననేకవిశేషు శేషునిన్.

వ. మఱియు నీలాంబరసంయుతుండును, సిద్ధోరగాదిసన్నుతుండును నై
యొప్పు నప్పాపతేనిం దప్పక కనుంగొని.

-ఆం. భాగ. దశమ. పూ.భా. 1228, 1229.

జలరామకృష్ణులు చాణూరముష్టికులతో మల్లయుద్ధమొనరించుటకు మల్ల రంగమును సిద్ధపరచిన విధము మూలమున

శ్లో. ఆనర్చుః పురుషా రంగం తూర్యభేర్యశ్చ జఘ్నిరే ।
మంచాశ్చాలంకృతాః స్రగ్భిః పతాకాచైల తోరణైః ॥

శ్లో. తేషు పౌరా జానపదా బ్రహ్మక్షత్రపురోగమాః ।
యథోపజోషం వివిశూ రాజానశ్చ కృతాసనాః ॥

- సం. భాగ. 10_42-33, 34.

అని యుండగ అనువాదమున మల్లరంగము సిద్ధపరుపబడిన విధమును గమనించినచో పోతన రూప సాక్షాత్కారవిధానము వ్యక్తము కాగలదు.

సీ. పాషాణవల్మీకపంకాదిరహితంబు
మృదులకాంచననిభమృణ్మయంబు
కమనీయకస్తూరికాజలసిక్తంబు
బద్ధచందనదారుపరివృతంబు
మహనీయకుసుమదామధ్వజతోరణ
మండితోన్నత మంచమధ్యమంబు
బ్రాహ్మణక్షత్త్రాదిపౌరకోలాహలం
బశ్రాంతతూర్యత్రయాంచితంబు

ఆ. నిర్మలంబు సమము నిష్కంటకంబునై
పుణ్యపురుషమనముఁ బోలి కంస
సైన్యతుంగ మగుచు సంతుష్టలోకాంత
రంగమైన మల్లరంగ మొప్పె.

-ఆం. భాగ. దశమ. పూ.భా. 1307

నిర్మలము, సమము, నిష్కంటకమునైన మల్లరంగమును పుణ్యపురుషుని మనస్సుతో పోల్చుట పోతన భావనలోని విశిష్టత.

మూలము నందలి ఒక పదమునుగైకొని తత్సంబంధిత విశేషణములను అంత్యానుప్రాసయుక్తముగా ప్రయోగించి తద్రూపమును విస్తృత పరచుట పోతన ప్రత్యేకత. ఉదాహరణమునకు బలరాముడు కూటుడను మల్లుని సంహరించెనని పల్కు సందర్భమున మూలమున "తతః కూటమనుప్రాప్తమ్" అను శ్లోకము నందలి 'కూట'శబ్దమును గైకొని "...... శోభితఘన బాహాటోపన్నృపతికీటుం గూటున్ వాచాటు నధిక ఘోరలలాటున్" అని విస్తృత పరచుటను పేర్కొనవచ్చు. అట్లే ఉగ్రసేనుని రాజుగావించిన సందర్భములో 'ఉగ్రసేను' పదమును గ్రహించి " సత్యావధాను విశ్రుతదానున్, సన్నుతమానున్ కదనచ్ఛిన్నాహితసేను నుగ్రసేనున్ దీనున్" అని అతని స్వభావమును విస్తృతపరచుటయు పోతన రూపసాక్షాత్కార విధానమునకు మచ్చుతునక కాగలదు.

అమూలకమైన అర్థాలంకార యోజనతో మూలమునందలి రసభావములను విస్తృతపఱచుట పలుతావుల కాననగును. ఉదాహరణమునకు కంసవధఘట్టమున కృష్ణుడు మిక్కిలికోపముతో సునాయాసముగా పైకెగిరి కంసుడున్న నెత్తైన మంచెనెక్కెను. (సం భాగ. 10-44-34) అను మూలమునందలి రౌద్రమును, వీరమును

శా. జంఘాలత్వముతో నగోపరిచరత్సారంగహింసేచ్ఛ ను
ల్లంఘింపం గమకించు సింహముక్రియన్ లక్షించి పౌరప్రజా
సంఘాతంబులు తల్లడిల్ల హరికంసప్రాణహింసార్థియై
లంఘించెన్ దమగంబుమీఁదికి రయోల్లాసంబు భాసిల్లఁగన్.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 1371

అని విస్తృత పఱచుటను పేర్కొనవచ్చును.

అట్లే కృష్ణుడు కంసునికేశబంధము పట్టునపుడు కిరీటము చలించినట్లు మూలముననుండ అనువాదమున 'మహాళిమణులాకలాపాంత వేళాపతన్నక్షత్రంబుల భంగి రాల' నని వివరించి మరింత స్పష్టపరచుట నుదహరింపవచ్చును.

జరాసంధుడు మధురను చుట్టుముట్టగా శ్రీకృష్ణుడు దారుకుడను సారథి కలిగినవాడై మధురను వెలువడివచ్చి శంఖమును పూరించెను. ఆ శంఖధ్వనివలన శత్రుసైన్యములయొక్క హృదయమందు విత్రాసవేపథువు కలిగెను. (సం. భాగ. 10-50-16,17) అనుమూలమునందలి శంఖధ్వానమువలన శాత్రవుల భయము మాత్రమే వర్ణింపబడగా అనువాదమునందలి శంఖధ్వానమువలన కలిగిన ఫలితమిట్లున్నది

ఉ. అన్యులు దల్లడిల్ల దనుజాంతకు డొత్తె గభీరఘోషకా
లిన్యమహోగ్రభావవికటీకృతపద్మభవాండజంతుచై
తన్యము ధన్యమున్ దివిజతాపసమాన్యముఁ బ్రీతిభక్తరా
జన్యము భీతదుశ్చరిత శాత్రవసైన్యముఁ బాంచజన్యమున్.

క. సింధురభంజనపూరిత
బంధురతరశంఖనినదభారమున జరా
సంధునికింగల సైన్యము
లంధములై సంచరించె నాహవభూమిన్

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1537, 1538

బలరామకృష్ణులు జరాసంధుని సేనలనెదిరి యుద్ధము గావించినవిధము మూలమున సుమారు పదిశ్లోకములలో నుండగా ననువాదమున సుమారు 19 గద్యపద్యములలో నతివిస్తృతముగా వర్ణింపబడినది. ఇందు మాగధ మాధవ వాహినులు రెండు నొండొంటిందాకిన విధము సుదీర్ఘ వచనమునను, హరి మాగధసేనలను కూల్చినవిధము మరియొక సుదీర్ఘవచనమునను వర్ణితమైనది అతివిస్తృతమైన ఈయుద్ధవర్ణన మాంధ్రసాహిత్యమునందలి యుద్ధవర్ణనలకు తలమానికము. వీరరససాంద్రత ఈ విస్తృతివలన సాధ్యమైనది. ఇట్లత్యద్భుతమై వీరరసానుప్లావితమైన నీయుద్ధవర్ణనము దశమస్కంధమును ప్రబంధలక్షణలక్షితమొనరించినదనవచ్చును. అమేయగుణుడైన పరమాత్మని గుణగణములయొక్క ఆభోగమును వివరముగా వర్ణించుటవలన,

వర్ణించిన భక్తకవికి భక్తిపరముగా, కవితాపరముగా తృప్తినికలిగించుచు పాఠకులను సైతమదే యనుభూతికి కొంపోజాలియున్నది.

మూలమున సుమారు ఏడు శ్లోకములలో వర్ణితమైన విశ్వకర్మచే నిర్మితమైన ద్వారకానగరము అనువాదమునందతివిస్తృతముగా సుమారు 21 పద్యగద్యలలో వర్ణితమగుట గమనీయార్హము. ఇట్టివర్ణనలు ప్రబంధకవులకుమార్గదర్శకములైనవనుట యథార్థము.

శ్రవణభక్తిపరుడగు పరీక్షిన్మహారాజు రుక్మిణీకల్యాణ ఘట్టమును విన కుతూహలియై మూలమున నిట్లు పల్కుచున్నాడు.

శ్లో. బ్రహ్మన్ కృష్ణకథాః పుణ్యా మాధ్వీర్లోకమలాపహాః ।
కో ను తృప్యేత శృణ్వానః శ్రుతజ్ఞో నిత్యనూతనాః ॥
— సం. భాగ. 10–52–20

భాగవతోత్తముడు, శ్రవణభక్తిపరుడునగు పరీక్షిన్మహారాజు విష్ణుకథాశ్రవణ కుతూహలుడగుటకు కారణమునుసైతము వివరించుచు అనువాదమున ఇట్లు పలికినాడు.

శా. కళ్యాణాత్మకమైన విష్ణుకథ లాకర్ణింపుచున్ ముక్తనై
కల్యుం డెవ్వఁడు తృప్తుడౌ నవి వినంగాఁ గ్రొత్తలౌచుండు సా
కల్యం బేర్పడ భూసురోత్తమ యెఱుంగం బల్కవే రుక్మిణీ
కల్యాణంబు వినంగ నాకు మదిలో గౌతూహలం బయ్యెడిన్.

క. భూషణములు సెవులకు బుధ
తోషణము లనేకజన్మదురితౌఘవిని
శ్శోషణములు మంగళకర
ఘోషణములు గరుడగమనుగుణభాషణముల్
— ఆం. భాగ. దశమ. పూ. భా. 1681, 1682

ఇందు శ్రవణభక్తియొక్క విశిష్టత వివరింపబడుటయేగాక విష్ణుకథలపట్ల ఆసక్తి యెట్టిదియో వ్యక్తమగును.

రుక్మిణీసందేశహారియైన బ్రాహ్మణుడు శ్రీకృష్ణుని చెంతనుండి వచ్చి రుక్మిణికి కృష్ణుని ఆగమనమును చెప్పగనామె సంతుష్టాంతరంగయై అన్యమైన ప్రియ మేదియు చేయనేరక నాతనికి నమస్కరించెనని (సం. భాగ. 10-53-31) మూలమునగలదు. ఈ భావమునే విస్తృతపరచి పోతన రసపరిపుష్టముగ ఇట్లు రచించినాడు.

మ. జలజాతేక్షణుఁ దోడితెచ్చితివి నాసందేశముం జెప్పి నన్
నిలువంబెట్టితి నీకృపం బ్రతికితిన్ నీయట్టి పుణ్యాత్మకుల్
గలరే దీనికి నీకుఁ బ్రత్యుపకృతిన్ గావింపఁగానేర నం
జలి గావించెద భూసురాన్వయమణీ ! సద్బంధు చింతామణీ !

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1735

ఇది అక్షరాక్షరమున నమృతము గురియుచు సహృదయుల నలరించు వైదర్భీరీతిలో చెప్పబడినపద్యము. అందు 'నన్ నిలువబెట్టితివి, నీ కృపన్ బ్రతికితిన్' అనునవి రెండును కొంచెమించుమించు సమానార్థకములుగ కన్పడినను విరహవేదనావశమున దేహము నిలువదేమో యనుకొను సమయమున 'తావచ్చె సుదర్శనాయుధుడని' చెప్పి నన్ నిలువబెట్టితివను భావము వ్యక్తము. ఆ వచ్చిన సుదర్శనాయుధుడు నా కల్యాణ మును జూచుటకే వచ్చెనో ? నను గల్యాణము చేసుకొనుటకే వచ్చెనో ? నన్ను వివాహము చేసికొననిచో నా బ్రతుకేమగునో ? అని విచారించుసమయమున 'సురా సురులెల్ల నడ్డమై వచ్చినసైన రాక్షసవివాహమునన్ గొనిపోవు'నని చెప్పితివి గావున నేను నీకృపన్ బ్రతికితిన్ అనునది రుక్మిణి భావన. ఇట్టి ఉపకారము చేసినవానికి ప్రత్యుపకారమెంతేని చేయదగియున్నను దానికి తగిన ప్రత్యుపకృతి చేయలేను. అంజలి మాత్రము ఘటించెదననుట మధురమైనభావన. ఈపలుకులతిసహజముగా నుండి పోతన లోకజ్ఞతను స్పష్టమొనరించును.

రుక్మిణి సందేశమును బ్రాహ్మణుడు శ్రీకృష్ణునకు విన్నవించుచు మూలమున

శ్లో. శ్రుత్వా గుణాన్ భువనసుందర శృణ్వతాం తే
నిర్విశ్య కర్ణవివరైర్హరతోఙ్గతాపం ।
రూపం దృశాం దృశిమతామఖిలార్థలాభం
త్వయ్యచ్యుతావిశతి చిత్తమపత్రపం మే॥

- సం. భాగ. 10-52-37

ఇత్యాదిగ ఏడు శ్లోకములలో వర్ణితమైనది. అనువాదమున పోతన భక్తి తన్మయత్వముచే

సీ. ఏ నీగుణములు కర్ణేంద్రియంబులు సోఁక
దేహతాపంబులు దీఱిపోవు
నే నీశుభాకార మీక్షింపఁ గన్నుల
కఖిలార్థలాభంబు కలుగుచుండు
నే నీచరణసేవ లే ప్రొద్దు చేసిన
భువనోన్నతత్వంబుఁ బొందఁ గలుగు
నే నీల సన్నామ మెప్పుడు భక్తితోఁ
దడవిన బంధసంతతులు వాయు

తే. నట్టి నీయందు నాచిత్త మనవరతము
నచ్చియున్నది నీమీఁద నానలేదు
కరుణఁ జూడుము కంసారి ! ఖలవిదారి !
శ్రీయుతాకార ! మానినీ చిత్తచోర !

ఆం భాగ. దశమ పూ. భా. 1701

మొదలగునెనిమిది పద్యములలో నతివిస్తృతముగ గానవచ్చుచున్నది. ఈ సందర్భమున శ్రీహరిని పొందలేనిచో జీవితము వ్యర్థమని రుక్మిణి భావించినట్లుగ పోతన భావించి పాఠకులను సైతమాతేయలో నాలోచింప చేసినాడు. దీనికి పోతన భావనాజనితమైన యీ క్రింది పద్యమే తార్కాణము

సీ. ప్రాణేశ ! నీమంజుభాషలు వినలేని
కర్ణరంధ్రంబుల కలిమి యేల
పురుషరత్నమ ! నీవు భోగింపగా లేని
తనులతవలని సౌందర్య మేల
భువనమోహన ! నిన్నుఁ బొడగానఁగా లేని
చక్షురింద్రియముల సత్త్వ మేల
దయిత ! నీ యధరామృతం బానఁగా లేని
జిహ్వకు ఫలరససిద్ధి యేల

ఆ. నీరజాతనయన ! నీ వనమాలికా
గంధమబ్బలేని ఘ్రాణమేల
ధన్యచరిత ! నీకు దాస్యంబు సేయని
జన్మమేల యెన్ని జన్మములకు

- ఆం. భాగ, దశమ పూ. భా. 1708

దీనివలన రుక్మిణిలోని ఆత్మనివేదనాభక్తి మూలమునుమించి వ్యక్తీకరింపబడినదని చెప్పవచ్చును.

శ్రీకృష్ణునియందు లగ్నాయత్తచిత్తయైన రుక్మిణి అతనికడకు పంపిన బ్రాహ్మణుడునైతము తిరిగి రాకపోవుటచే చింతించువిధము మూలముననిట్లు కానవచ్చుచున్నది.

శ్లో. అహో త్రియామాంతరిత ఉద్వాహో మేఽల్పరాధసః।
నాగచ్ఛత్యరవిందాక్షో నాహం వేద్మ్యత్ర కారణమ్ ।
సోఽపి నావర్తతేఽద్యాపి మత్సందేశహరో ద్విజః ॥

.................................

శ్లో. ఏవం చింతయతీ బాలా గోవింద హృతమానసా ।
న్యమీలయత కాలజ్ఞా నేత్రే చాశ్రుకలాకులే ॥

- సం. భాగ. 10 53-23 నుండి 26 వఱకు.

అనువాదమున కృష్ణునిరాకకై ఎదురుచూచు రుక్మిణి విరహవేదనాతిశయముతో కుందిన విధము అతివిస్తృతముగ

శా. లగ్నం బెల్లి వివాహముం గదిసె నేలా రాఁడు గోవిందుఁ డు
ద్విగ్నం బయ్యెడి మానసంబు వినెనో వృత్తాంతమున్ బ్రాహ్మణుం
డగ్నిద్యోతనుఁ డేటికిం దడసె నా యత్నంబు సిద్ధించునో
భగ్నంబై చనునో విరించికృత మెబ్భంగిన్ బ్రవర్తించునో.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1723

ఇత్యాదిగ సుమారు ఏడుపద్యములలో కానవచ్చుచున్నది. ఒకపనిపై ఒకనిని స్థలాంతరము పంపగా నాతడెంతకును తిరిగిరాకున్న సందర్భమున వానికై ఎదురుచూచుచుండెడివారి మానసిక స్థితి కద్దముపట్టుటయే. ఈ సందర్భమున మూలాతిరిక్తముగ మనోభావానలశిఖాదోదూయమానాంగియైన రుక్మిణి చేష్టలుడిగినవిధము ఈక్రిందివిధముగ కానవచ్చుచున్నది.

సీ. మృగనాభి యలందదు మృగరాజ మధ్యమ
జలముల నాడదు జలజగంధి
ముకురంబుఁ జూడదు ముకురసన్నిభముఖి
పువ్వులు దుఱుమదు పువ్వుఁబోణి
వనకేళిఁగోరదు వనజాతలోచన
హంసంబుఁ బెంపదు హంసగమన
లతలఁ బోషింపదు లతికాలలితదేహ
తొడవులు దొడవదు తొడవుతొడవు

ఆ. తిలకమిడదు నుదుటఁ దిలకనీతిలకంబు
కమల గృహముఁ జొరదు కమలహస్త
గారవించి తన్నుఁ గరుణఁ గైకొన వన
మాలి రాఁడు తగవు మాలి యనుచు.

-ఆం భాగ. దశమ. పూ. భా. 1729

ఇట్టివర్ణనలు అనంతర ప్రబంధకవులకు మార్గదర్శకములనుట యథార్థము.

రుక్మిణి అంబికాలయమునకేగి దేవికి మ్రొక్కుచు

శ్లో. నమస్యే త్వాంబికేఽభీక్ష్ణం స్వసంతానయుతాం శివాం ।
భూయాత్ పతిర్మే భగవాన్ కృష్ణస్తదనుమోదతాం ॥

-సం. భాగ. 10-53-46

అని ప్రార్థించినట్లు మూలమున కానవచ్చుచుండగ భక్తితన్మయురాలైన రుక్మిణిచే పోతన ఈవిధముగ ప్రార్థింపజేసినాడు.

ఉ. నమ్మితి నామనంబున సనాతనులైన యుమామహేశులన్
మిమ్ముఁ బురాణదంపతుల మేలు భజింతు గదమ్మ! మేటి పె
ద్దమ్మ! దయాంబురాశివి గదమ్మ! హరిం బతిసేయుమమ్మ! నిన్
నమ్మినవారి కెన్నటికి నాశము లేదుగదమ్మ! యీశ్వరీ!

-ఆం. భాగ. దశమ. పూ.భా. 1741

ఈ విధముగా పోతన(రుక్మిణి)లో కాననగు భక్తితన్మయత్వము వలననే ఈపద్యము ప్రార్థన పద్యములలో అత్యుత్తమమైనదైనది.

రుక్మిణీహరణ సమయమున యదువీరులు జరాసంధాది రాజసైన్యములను సంహరించిన విధము "బలభద్రప్రముఖులైన యదువీరులు ప్రళయవేళ మిన్నునం బన్నిన బలుపిడుగుల నడరించి పెనుమొగిళ్ళవడువున జరాసంధాదిపరిపంధిరాజచక్రంబుమీఁద నవక్రపరాక్రమంబున శిఖిశిఖాసంకాశనిశితశిలీముఖనారాచభల్లప్రముఖంబులైన బహువిధబాణపరంపరలుఁగురియ నడియును,విదళితమత్తమాతంగబులును,విచ్ఛిన్న తురంగంబును విభిన్న రథవరూథంబును ........................ ..................ప్రదీపిత మేదోమాంస రుధిరఖానంబును ప్రవర్తిత ఢాకినీ ప్రమోదంబునునై యుండెను" (ఆం. భాగ. దశమ పూ. భా. 1754)అని యతివిస్తృతముగ, అతి భయంకరముగ వర్ణింపబడెను. ఇందు విదళిత, విచ్ఛిన్న, విభిన్న, వినిహిత, విఖండిత, విశకలిత, విస్ఫోటితేత్యాది పదంబులనేకములు ప్రయోగించుటయు, ఘనఘనాత్కార, ఝణఝణాత్కార, థణథణాత్కార మొదలగు ధ్వన్యనుకరణ శబ్దములను ప్రయోగించుటయు వీరరసపుష్టికి మరింత దోహదమగుచున్నది మూలమున నీపట్టున "వాఁడివ వీశల నారాచములచే గజాశ్వముల బడగొట్టి రథములఁ బగులఁ గొట్టిరి. శత్రుసైన్యములోని రథికులు, గుర్రపురౌతులు, గజారోహకులు మున్నగువారి శిరస్సులు కుండల కిరీటములతో కూడి నేలపై బడినవి. మరియు ఖడ్గములు, గదలు, ధనుస్సులు ధరించిన క్షాత్రవుల హస్తములును, వారి మోఁచేతులు, తొడలు, పాదములును, గుర్రములు, కంచరగాడిదలు, ఏనుగులు, ఒంటెలు, గాడిదలు, కాలిబంట్లులోనగువారి శిరస్సులును నేలమీఁదబడెను." (సం. భాగ .0-54-6. 7, 8, 9)

అనిమాత్రమే కలదు. రసపుష్టికి, రససాంద్రతకు గావించినవిస్తృతిగ నీ ఘట్టమును పేర్కొనవచ్చును.

ఉషాపరిణయఘట్టమున ఉష మున్నెన్నఁడుఁగానని అనిరుద్ధునితో సంగమమును పొందినట్లుగా, కలగాంచి మేల్కాంచినదై ఆతనిఁగానక విచారించినవిధము

శ్లో. సా తత్ర తమపశ్యన్తీ క్వాసి కాన్తేతి వాదినీ ।
సఖీనాం మధ్య ఉత్తస్థౌ విహ్వలా వ్రీడితాభృశమ్ ॥
-సం భాగ. 10-62-13

అనిమాత్రమే మూలముననుండగ అనువాదమున

చ. కలగని యంత మేలుకని కన్నులఁ బాష్పకణంబులొల్కఁగా
గలవ లెఁ గాక నిశ్చయముగాఁ గమనీయవిలాసవిభ్రమా
కలితతదీయరూపము ముఖంబున వ్రేలినయట్లు దోఁచినన్
గళవళ మందుచున్ బిగియఁ గౌఁగిటిచే బయ లప్పళించుచున్.

-ఆం. భాగ దశమ. ఉ. భా. 327

ఇత్యాదిగ విరహవేదనాదూయమానమానసయైయుండి నెచ్చెలులు సమీపించగా తన మనోజవికారమును మరువెట్టుటయు ఐదుపద్యములందునతివిస్తృతముగ వర్ణింపబడినది. అయోగవిప్రలంభ శృంగారవర్ణనమునకు సమగ్రత కలిగించుటకై గావింపబడిన విస్తృతిగ దీనిని భావింపవచ్చును.

కృష్ణ బాణాసుర యుద్ధవర్ణనమునందును,యాదవ సాల్వ రణవర్ణనమునందును, తదితర యుద్ధవర్ణనములందును వీర, భయానక రసపుష్టికై అనేకవిధముల విస్తరించి వ్రాయుట గమనింపదగియున్నది. ఇవి అనంతర ప్రబంధకవులకు యుద్ధవర్ణనలందు మార్గదర్శకములై అలరారుచున్నవి.

భీమజరాసంధులు యుద్ధముగావించినవిధము మూలమున

శ్లో. తతః సమే ఖలే వీరా సంయుక్తావితరేతరౌ ।
జఘ్నతుర్వజ్రకల్పాభ్యాం గదాభ్యాం రణదుర్మదా ॥

—సం. భాగ. 10-72-34

ఇత్యాదిగ సుమారు ఆరు శ్లోకములలో వర్ణింపబడగ ననువాదమున

సీ. పర్వతద్వంద్వంబు పాథోధియుగళంబు
మృగపతిద్వితయంబు వృషభయుగము
పావకద్వయము దంతావళయుగళంబు
దలపడఁ వీఁక నుద్దండలీలఁ
గదిసి యన్యోన్యభీకరగదాహతుల
నుగ్రంబుగ విస్ఫులింగములు చెదరఁ
గెరలుచు సవ్యదక్షిణమండల భ్రమ
ణములను సింహచంక్రమణములను

తే. గదిసి పాయుచు డాసి డగ్గఱుచు మింటి
కెగసి క్రుంగుచుఁ గ్రుంగి వే యెగసి భూమి
పగుల నార్చి ఛటచ్ఛటోద్భటమహోగ్ర
ఘనగదాఘట్టనధ్వని గగన మగల

—ఆం. భాగ. దశమ ఉ. భా. 729

ఇత్యాదిగ సుమారు తొమ్మిదిగద్యపద్యములలో అతివిస్తృతముగననేకములైన ముష్టియుద్ధపువిశేషములతో వర్ణింపబడినది. వీరి గదాయుద్ధవిధానమును ధ్వనింపచేయు లయవిధాతియు, ముష్టియుద్ధ బంధంబులను వ్యక్తమొనర్పు లయగ్రాహియు కావచ్చుట పోతన రసానుగుణమైన ఛందఃప్రయోగ వైశిష్ట్యమును వెల్లడియొనర్చుచున్నవి.

కుచేలోపాఖ్యానమున కుచేలునిభార్య అతనిని శ్రీకృష్ణునివద్దకు వెళ్ళవలసినదిగా ప్రోత్సహించుటకు కారణమైన దైన్యమును మూలమున

శ్లో. పతివ్రతా పతిం ప్రాహ మ్లాయతా వదనేన సా।
దరిద్రా సీదమానా సా వేపమానాభిగమ్యచ॥

—సం భాగ 10-80-8

అని అంతంతమాత్రముగ వర్ణింపబడగ, అనువాదమున

సీ. లలితపతివ్రతాతిలకంబు వంశాభి
జాత్య తద్భార్యదుస్సహదరిద్ర
పీడచే గడు నొచ్చి పెదవులు దడుపుచు
శిశువులాకటిచిచ్చుచేఁగృశించి
మలమల మాడుచు మానసం బెరియంగఁ
బట్టెఁ డోరెము మాకు బెట్టుమనుచు
బత్రభాజనధృతపాణులై తనుఁ జేరి
వేడిన వీనులు సూఁడినట్లు

—ఆం భాగ. దశమ. ఉ భా 962

అని, ఆమెయొక్క దైన్యాతిశయమునకు కారణభూతమైన శిశువులదైన్యమును సైతము వర్ణించి భావపరిపుష్టమొనరించుట ప్రశంసార్హము.

కుచేలునిభార్య కుచేలునిచేరి శ్రీకృష్ణునిచెంతకేగవలసినదిగ ప్రోత్సహించినవిధము

శ్లో. నను బ్రహ్మన్ భగవతః సఖా సాక్షాచ్ఛ్రియః పతిః ।
బ్రహ్మణ్యశ్చ శరణ్యశ్చ భగవాన్ సాత్వతర్షభః ॥
-సం. భాగ. 10-80-9

ఇత్యాదిగ మూడు శ్లోకములలో మూలమున గానవచ్చుచుండగ అనువాదమునందలి

చ. వరదుఁడు సాధుభక్తజనవత్సలుఁ డార్తశరణ్యుఁ డిందిరా
వరుఁడు దయాపయోధి భగవంతుఁడు కృష్ణుఁడుఁ దాఁ గుశస్థలీ
పురమున యాదవప్రకరముల్ భజియింపఁగ నున్నవాఁడు నీ
వరిగిన మిమ్ముఁ జూచి విభుఁడప్పుడ యిచ్చు ననూనసంపదల్.
-ఆం. భాగ. దశమ. ఉ. భా. 966

మొదలగు విధముగ శ్రీకృష్ణుని కీర్తించుచు ప్రోత్సహించినవిధము మూలమునందలి భక్తిభావమును మరింత స్పష్టపరచుచున్నది.

కుచేలుడు శ్రీకృష్ణదర్శనార్థము ద్వారకానగరముసకరుగుచు శ్రీకృష్ణదర్శనము నాకెట్లుకాగలదని చింతించినట్లు (సం భాగ. 10-80-15) మూలమున నుండగ నను వాదమున నీ క్రిందివిధమున కానవచ్చుచున్నది.

సీ. ద్వారకానగరంబు నేరీతిఁ జొత్తును
భాసురాంతఃపురవాసి యైన
యప్పుండరీకాక్షు నఖిలేశు నెబ్భంగి
దర్శింపగలను దద్ద్వారపాలు
రెక్కడి విప్రుండ విందేల వచ్చెద
వని యడ్డ పెట్టిరే నపుడు వారి
కేమైనఁ బరిదాన మిచ్చి చొచ్చెదనన్న
నూహింప నర్థశూన్యుండ నేను

తే. నయిన నాభాగ్యమతని దయార్ద్రదృష్టి
గాక తలపోయఁ గానొండుఁ గలదె యాతఁ
డేల నన్నునుపేక్షించు నేటిమాట
లనుచు నాద్వారకాపుర మపుడుసొచ్చి
-ఆం. భాగ. దశమ ఉ. భా. 972

ఎవరినేని యున్నతుని దర్శింపబోవుచున్న అతిసామాన్యుడు, తన మనములో నీవిధమై సంఘర్షణపొందుట సహజము. అట్టి మనస్తత్త్వమున కద్దముపట్టుటయే పై విధమగ కుచేలునిభావన. దీనివలన కుచేలుని(పోతన)భక్త్యతిశయము సహితము మూలమున మించి వెల్లడింపబడుచున్నదని చెప్పవచ్చు.

ఈవిధముగ పోతన తనఅనువాదమును అమూలక విస్తృతితో మూలాతిశాయిగ తీర్చిదిద్దినాడనుట యథార్థము. ఈ పెంపు తాను భక్తితన్మయుడగుటచేమాత్రమేగాక భావుకుడగుటచేతను సంభవించినది.

# అమూలకములు - సంక్షేపాత్మకములు

మూలమున విస్తారముగానున్న అంశములనువాదమున సంక్షేపింపబడినచో నట్టి తావులందలి సంక్షిప్తతనమూలకముగా పరిగణించుట సమంజసము కాగలదని లోగడ వక్కాణింపబడినది. కావున సంక్షేపాత్మకములైన అమూలకములు పోతన భాగవత దశమస్కంధమునందెందు గానవచ్చుచున్నవో పరికించవలసియున్నది. అవకాశము లభించినంతనే విస్తృతి యేర్పరచుటకు ప్రయత్నించు పోతన సంగ్రహించుటకవకాశమంతగా కావరాదు. భగవంతునియొక్కయు, భగవద్భక్తులయొక్కయు గాథలతో కూడిన భాగవతమునకట్టి ప్రాధాన్యముండుటయేగాక భాగవతోత్తముడైన పోతన మనస్తత్త్వముసహితము సంక్షిప్తత నొనరించుట కనుమతింపకుండుటయు ఇందులకు కారణమనవచ్చును. కావున పోతన యనువాదమున కానవగు సంక్షిప్తతారూపకములైన అంశము లాయా సందర్భానుగుణముగ, సంగ్రహరూపమునందినవనుట యుక్తముగాని పోతనయే స్వయముగా సంగ్రహింపవలెనను కుతూహలముతో గావించెననుట సమంజసముగాదు. మూలానువాదముల రచనాప్రణాళికలును, లక్ష్యములును భిన్నమగుటచేత నందందిట్టి సంక్షిప్తత కానవచ్చుటకవకాశము గలదు. కొన్నితావులందు పరిమాణములో సంగ్రహరూపమున గానవచ్చినను, భావప్రతిపాదనలో నట్టి సంక్షిప్తత కానరాకుండుటయు గలదు. పర్యాలోచనచేయగా పోతనయనువాదమున సంక్షిప్తతాపరకములైన, అమూలకములు నగణ్యములనవచ్చును. అయినను మూలమునందు

విస్తృతములైన కొన్ని యంశములనువాదమున సంగ్రహరూపమునందిన విధము పరికింతము.

యశోద శ్రీకృష్ణుని నోటిలో బ్రహ్మాండమును గాంచినవిధము మూలమున ఈ క్రిందివిధముగా వర్ణింపబడినది.

శ్లో. సా తత్ర దదృశే విశ్వం జగత్ స్థాస్ను చ ఖం దిశః ।
సాద్రిద్వీపాబ్ధిభూగోళం సవాయ్వగ్నీందుతారకమ్ ॥

శ్లో. జ్యోతిశ్చక్రం జలం తేజో నభస్వాన్ వియదేవ చ।
వైకారికాణీంద్రియాణి మనో మాత్రా గుణాస్త్రయః ॥

శ్లో. ఏతద్విచిత్రం సహజీవకాల
స్వభావకర్మాశయలింగభేదమ్ ।
సూనోస్తనౌ వీక్ష్య విదారితాస్యే
వ్రజం సహాత్మానమవాప శంకామ్ ॥

- సం. భాగ. 10-8-37, 38, 39.

అనువాదమున నీ వర్ణనము

క. ఆ లలితాంగి కనుంగొనె
బాలునిముఖమందు జలధిపర్వతవనభూ
గోళశిఖితరణిశశిది
క్పాలాదికరండమైన బ్రహ్మాండంబున్

- ఆం. భాగ. దశమ పూ భా. 339.

అను చిన్న పద్యమున రాసుచ్చుచున్నది. పరిమాణమునుబట్టి సంగ్రహింపబడినట్లు తానంబడినను, భావప్రకటనములో మూలమును మించిన సమగ్రత యనువాదమున వ్యక్తమైనదనుట సత్యము. 'మదీయాస్యగంధమాఘ్రాణింపు' మను బాలుడు నోరు తెరచి చూపు సమయమతిస్వల్పమేగదా. ఆ క్షణకాలమున సమగ్రమైన బ్రహ్మాండమును చూపిన విధమును వ్యక్తీకరించుటలో మూలముకంటె అనువాదమే మిక్కిలి సమర్థమైనదనవచ్చును.

కుబేరునికుమారులు శంకరకింకరులై యహంకరించి విగతవస్త్రులై ప్రియురాండ్రతో విహరించుచుండ వారినిచూచిన నారదుడు శాపమొసంగుచు గీతంబు పాడినట్లు మూలమున

శ్లో. న హ్యన్యో జుషతో జోష్యాన్ బుద్ధిభ్రంశో రజోగుణః ।
శ్రీమదాదాభిజాత్యాదిర్యత్ర స్త్రీ ద్యూతమాసవః ॥
- సం. భాగ. 10-10-8 నుండి

శ్లో. అతోఽర్హతః స్థావరతాం స్యాతాం నైవం యథాపునః ।
స్మృతిస్స్యాన్మత్ప్రసాదేన తత్రాపి మదనుగ్రహాత్ ॥
- సం. భాగ. 10-10-21 వఱకుగలదు.

ఇట్లు మూలమున నతివిస్తృతముగానున్న ఈ ఘట్టమనువాదమున నీక్రింది విధముగా సంగ్రహరూపమున దర్శనమిచ్చుచున్నది.

శా. సంపన్నుండొరుఁ గాన లేడు తనువున్ సంసారమున్ నమ్మి హిం
సింపం జూచు దరిద్రుఁ డెత్తువడి శుష్కీభూతుఁడై చిక్కి హిం
సింపం డన్యుల నాత్మకున్ సములుగాఁ జింతించు నష్టాటఁ ద
త్సంపన్నాంధున కంజనంబు వినుమీ దారిద్ర్య మూహింపగన్.

వ. అని గీతంబువాడి తన మనంబున

క. కలవానిసుతుల మనుచును
గలకంఠులతోడఁ గూడి కానకు పఱలన్
గలలోనైనను వీరికిఁ
గలగ్రొవ్వడగించి బుధులఁ గలుపుట యొప్పున్.

వ. అని చింతించి, విజ్ఞానవిశారదుండగు నారదుండు నళకూబర మణి గ్రీవులం జూచి మీరలు శ్రీమదాంధులరు గావున భూలోకంబున నర్జునతరువులై నూరుదివ్యవర్షంబు లుండుండు.
-ఆం. భాగ. దశమ. పూ. భా. 392,93,94,95

కథాచ్ఛలమున మంచిచెడుగుల ప్రభావమును శ్రోతలయొక్కయు, పాఠకుల యొక్కయు నంతరంగమునందు చెరగని విధముగ ముద్రవేయుటకు ప్రయత్నించుటయే పురాణరచనకు పరమోద్దేశము. వముల ననందించువపుడును, బాహ్యాభ్యంతర రూపముల నందించువపుడును ప్రబంధరచన కేవలపురాణరచనకంటె భిన్నముగా నుండుట సహజము. పోతన యనువాదము ప్రబంధఛాయలో సాగిన రచనమగుటచే ప్రధాన సారాంశమునుమాత్రము చెప్పి ముందుకువెళ్లుట జరిగియుండును.

ఒకే భావమును పలుమార్లు, పలురీతుల చెప్పుచుండుట పురాణములందు

సహజము. సాహిత్యశిల్పపరముగా వెలువడు కావ్యములందిట్టి లక్షణము కానరాదు. అంతియేగాక అది దోషముగా పరిగణింపబడుటయు గలదు. కావుననే భక్తుడు, భావుకుడునగు పోతనచే విస్తృతరూపము నందుటకర్హమైన కొన్నితావులుసహిత మను వాదమున సంగ్రహరూపమునందుట గమనింపదగియున్నది. ఉదాహరణమునకు కృష్ణచరిత్రలు విని వెరగుపడిన గోపకులతో నందుడు మున్ను తనకు గర్గమహాముని చెప్పిన సంకేతముల నన్నిటిని

శ్లో. శ్రూయతాం మే వచో గోపా వ్యేతు శంకా చ వోఽర్భకే।
ఏనం కుమారముద్దిశ్య గర్గో మే యదువాచ హ ॥

- సం. భాగ 10-26-15

ఇత్యాదిగా, సవిస్తరముగా 11శ్లోకములతో చెప్పినట్లు మూలముననుండగా అనువాదమున నీక్రింద విధముగా సంగ్రహింపబడుట గమనించదగియున్నది.

వ. నందుండు వారలం జూచి, మున్ను దనకు గర్గమహాముని చెప్పిన సంకేతంబు తెలిపి, శంక లేదు కృష్ణుండు లోకరక్షకుండైన పుండరీకాక్షుని నిజాంశమనుచు నంతరంగంబున జింతింతు అని పలికిన వెఱుగుపడి, గోపకులు కృష్ణుడనంతుండని పూజించిరి.

-ఆం. భాగ. దశమ. పూ. భా. 932

కేశి యను నశ్వరూపధారియైన రాక్షసుని శ్రీకృష్ణుడు సంహరించినపిదప నారదు డేతెంచి రాబోవుకాలమున శ్రీకృష్ణునిచే నెవ్వరెవ్వరు సంహరింపబడుదురో, ఏయే కార్యములు జరుగనున్నవో పల్కినవిధము మూలమున అతివిస్తృతముగా

శ్లో. దిష్ట్యా తే నిహతో దైత్యో లీలయాఽయం హయాకృతిః।
యస్య హేషిత సంత్రస్తాస్త్యజన్త్యనిమిషా దివమ్॥

- సం. భాగ. 10-37-15 నుండి

శ్లో. అథ తే కాలరూపస్య క్షపయిష్ణోరముష్య వై ।
అక్షౌహిణీనాం నిధనం ద్రక్ష్యామ్యర్జునసారథేః ॥

-సం. భాగ. 10-37-22 వరకుకలదు

ఈసందర్భమున అనువాదమున

వ. దేవా! నీచేతనింకఁ జాణూర, ముష్టిక, గజ, కంస, శంఖ, యవన, ముర, నరక, పౌండ్రక, శిశుపాల, దంతవక్త్ర, సాల్వప్రముఖులు

మడిసెదరు. పారిజాతం బపహృతం బయ్యెడిని. నృగుండు శాప విముక్తుండగు. శమంతకమణి సంగ్రహంబగు. మృతబ్రాహ్మణపుత్ర ప్రదానంబు సిద్ధించు. అర్జును సారథివై యనేకాక్షౌహిణీబలంబుల వధియించెదవు.

-ఆం. భాగ. దశమ. పూ. భా. 1177

అను చిన్న వచనము సూత్రప్రాయముగా చెప్పబడినది. భావికథాసూచకమై, రససంబంధి గాని ఘట్టమగుటచే సంగ్రహరూపమునంది యుండవచ్చును. సమాచారసూచకమగు నిట్టి తావులందు వచనము మిక్కిలి సహకరించగలదని భావించి యుండవచ్చును.

అక్రూరుని రథముపై బలరామకృష్ణులు మధురానగరముచేరిరి. అంతట మున్ను చనిన నందాదులు పురోపవనంబున విడిసియుండ వారలం గూడుకొని, కృష్ణుం డక్రూరుని జూచి నీవు రథంబుగొనుచు నగరమునకు జనుము. మేము వెనుక వచ్చెదమనిన, నతండు పల్కిన పల్కులు మూలమున

శ్లో. నాహం భవద్భ్యాం రహితః ప్రవేక్ష్యే మధురాం ప్రభో ।
త్యక్తుం నార్హసి మాం నాథ భక్తం తే భక్తవత్సల ॥

- సం. భాగ. 10 41 11 నుండి 16 వఱకు

విస్తృతముగా, ఆరుశ్లోకములలో భక్తితన్మయత్వముతోనుండ అనువాదమున

క. నా యింటికి విచ్చేయుము
నీ యంఘ్రిసరోజరేణునికరము సోఁకన్
నాయిల్లు పవిత్రంబగు
శ్రీయుత ! నీ భటునిఁ బెద్ద సేయం దగదే.

-ఆం. భాగ. దశమ. పూ. భా. 1239

అను సంగ్రహరూపమైన ప్రార్థనగా కన్పట్టుచున్నది. స్థానాస్థానౌచిత్యమును పాటించి సౌందర్యాపాదకమొనప్పుటకు గావింపబడిన సంక్షిప్తతగా దీనిని భావింపవచ్చును. భావములు సాంద్రములైనప్పుడు మాటలు తక్కువ వచ్చుచుండుటయు, నొక్కొక్క మాఱు మాటరాకుండుటయు మానసికదశావిశేషము. అట్టి విశేషమును గుర్తించిన పోతన యక్రూరుని అంతరంగములోని కృష్ణభక్తిసాంద్రత నీవిధముగా తక్కువ మాటలలో స్పష్టపఱచినాడనవచ్చును.

శ్రీ కృష్ణుడు మధురనుండి గోకులమున కెన్నడురాగలడు ? అతని నెమ్మొగము నెన్నడు చూడగలమని నందుడుద్ధవుని ప్రశ్నించిన పిదప

శ్లో. దావాగ్నేర్వాతవర్షాచ్చ వృషసర్పాచ్చ రక్షితాః ।
దురత్యయేభ్యో మృత్యుభ్యః కృష్ణేన సుమహాత్మనా ॥

శ్లో. స్మరతాం కృష్ణవీర్యాణి లీలాపాంగనిరీక్షితమ్ ।
హసితం భాషితంచాంగ సర్వా నః శిథిలాః క్రియాః ॥

శ్లో. సరిచ్ఛైలవనోద్దేశాన్ ముకుందపదభూషితాన్ ।
ఆక్రీడానీక్షమాణానాం మనోయాతి తదాత్మతామ్ ॥

శ్లో. మన్యే కృష్ణం చ రామం చ ప్రాప్తావిహ సురోత్తమా ।
సురాణాం మహదర్థాయ గర్గస్య వచనం యథా ॥

శ్లో. కంసం నాగాయుతప్రాణం మల్లౌ గజపతిం తథా।
అవధిష్టాం లీలయైవ పశూనివ మృగాధిపః॥

శ్లో. తాళత్రయం మహాసారం ధనుర్యష్టిమివేభరాట్।
బభంజైకేన హస్తేన సప్తాహమదధాత్ గిరిమ్॥

శ్లో. ప్రలంబో ధేనుకోఽరిష్టస్తృణావర్తో బకాదయః।
దైత్యాః సురాసురజితో హతా యేనేహ లీలయా॥

శ్లో. ఇతి సంస్మృత్య సంస్మృత్య నందః కృష్ణానురక్తధీః।
అత్యుత్కంఠోఽభవత్తూష్ణీం ప్రేమప్రసరవిహ్వలః॥"

- సం. భాగ. 10-46-20 నుండి 27.

అని కృష్ణనందనురక్తుడైన నందుడు ప్రేమప్రసరమున పరవశుడై మిన్నకుండెనని మూలమున గలదు అనువాదమున పై వర్ణన

క. అనిహరి మున్నొనరించిన
పను లెల్లను జెప్పి చెప్పి బాష్పాకులలో
చనుడై డగ్గుత్తికతో
వినయంబుననుండె గోపవీరుండంతన్. (ఆం. భాగ. దశమ పూ. భా. 1441)

అను చిన్న పద్యమున కన్పట్టుచున్నది. నందుని యొక్క మానసికవ్యధను శ్రీకృష్ణని లీలావైభవమును వ్యక్తీకరించుటలో అనువాదమునందలి యీ చిన్నవాక్యమే

మూలముకంటె ప్రభావవంతముగానున్నదనవచ్చును. కొన్ని లీలలను చెప్పిన పిదప "అని తలచి తలచి" యనుటకంటె 'హరి మున్నొనరించిన పనులెల్లను జెప్పి చెప్పి' అనుటలో మరింత సమగ్రత గోచరమగుచున్నది. అల్పాక్షరముల ననల్పార్థభావ వ్యక్తీకరణమే యీ సంక్షిప్తత. అంతియేగాక రచనాధోరణిలోని భేదమువలననిట్టి సంగ్రహ రూపమావిర్భవించి యుండుననియు భావింపవచ్చును.

బంధువులయెడగల స్నేహబంధమును ఋషిసైతము వీడలేదనియు, ఇతరులతో చేయు చెలిమి ప్రయోజనము నెరవేరువఱకే నిల్చి యావల సమసిపోవునని గోపిక లుద్ధవునితో పల్కుచు నట్టి నిమిత్తసఖ్యము. తుమ్మెదలు పుష్పములందు చేయు చెలిమివంటిదని పల్కుచు మూలమున దానికి వివరణప్రాయముగ

పుంభిః స్త్రీషు కృతా యద్వత్ సుమనస్స్వివ షట్పదైః॥
నిస్స్వం త్యజన్తి గణికా అకల్పం నృపతిం ప్రజాః।
అధీతవిద్యా ఆచార్యమృత్విజో దత్తదక్షిణమ్॥
ఖగా వీతఫలం వృక్షం భుక్త్వా చాతిథయో గృహమ్।
దగ్ధం మృగాస్తథారణ్యం జారో భుక్త్వా రతాం స్త్రియమ్॥
- సం. భాగ 10-47-6, 7, 8.

అని యనేకోపమలీయబడినవి. అనువాదమున నీక్రిందివిధముగా సంగ్రహింపబడుట గమనీయార్హము.

క. మునివరులైనను బంధుల
ఘనసఖ్యము విడువలేరు గాక విడువరే
సనిమిత్తసఖ్య మాకటి
పని దీఱిన నళులు విరులఁ బాయునొ లేదో
- ఆం. భాగ. దశమ. పూ. భా. 1451

మూలమునందలి భావమునంతటిని సమర్థవంతమైన ఒకే యుపమతో చెప్పించుటచే నిది పరిమాణములో సంక్షిప్తతగా గానవచ్చినను వక్తవ్యాంశమును వ్యక్తీకరించుటలో మాత్రము గాదనుటలో నెట్టి విప్రతిపత్తియు లేదు. అంతియేగాక మూలమునుమించిన రససాంద్రత, పరిస్థితియొక్క గాంభీర్యము నిందువ్యక్తమగుచుండుట ప్రశంసార్హము.

ద్రౌపది, శ్రీకృష్ణుభార్యలను శ్రీకృష్ణుడు మిమ్ములను వివాహమాడిన విధము చెప్పుమనగా నొక్కొక్కరు విడివిడిగా తమ వివాహములనుగురించి సంగ్రహముగా

చెప్పుటయు, లక్ష్మణ విస్తృతముగా చెప్పుటయు గలదు. లక్ష్మణపక్క తక్కినవారు వివరించిన వారి వారి వివాహములు సుమారు పది శ్లోకములలో వర్ణింపబడినవి. అనువాదమున "రుక్మిణీదేవి మొదలగు శ్రీకృష్ణుభార్యలం గనుంగొని, పాంచాలి యిట్లనియె. మిమ్ము నుం బుండరీకాక్షుండు వివాహంబైన తెఱంగులు వినిపింపుడనిన, వారును దమ పరిణయంబుల తెఱంగులు మున్ను నే నీకుం జెప్పినవిధంబున వినిపించిరి. అందు సవిస్తరంబుగా నే దెలియం బలుకని మద్రరాజకన్యకావృత్తాంతం బామానిని పాంచాలికిం జెప్పినవిధంబు వినుము" (ఆం. భాగ. దశమ. ఉ. భా. 1078) అను వచనమున సంగ్రహింపబడెను. అప్రధానమైననిట్టి పునరుక్తులు పురాణరచనకనువైనట్లు కావ్యరచనకు కాదని లోగడ నుడువబడినది. రచనాపరమైన భేదమువలనను, శిల్పపరముగా సౌందర్యాపాదకము గాకుండుటవలనను సంభవించినదిగ నీ సంక్షిప్తతను తలంపవచ్చును.

పర్యాలోచనచేయగా పోతనయనువాదమునందు సంక్షేపాత్మకములైన అమూలకములసంఖ్య స్వల్పమని చెప్పవచ్చును. అందందు కాననగునిట్టి యమూలకములును పోతనయనువాదమునకు మూలమునుమించిన సొగసులను సంతరింపజేయుటలో సహకరించుచున్నవని చెప్పవచ్చును.

# అమూలకములు - అన్యథాకరణములు

ఆంధ్రానువాదకులలో పలువురు స్వేచ్ఛానువాదకులేగాని యథామాతృకముగ ప్రతి శబ్దానువాదము గావించినవారుగారు. కావున మూలమునందలి కథాంశములను, రసభావములను, మరింత పరిభావవంతముగ వ్యక్తీకరించుటకును, దేశకాలానుగుణమైన ఔచిత్యమును పాటించుటకును, అనువాదములం దాయా సందర్భములలో కొన్ని మార్పులు జరుగుచుండుట సహజము. అట్టితఱి నాయా తావులలో మూలమొకతీరున పొగుచుండ అనువాదము మఱియొకరీతిని సాగుచుండును. ఇట్టి మార్పు మూలభిన్నమగుటచే అమూలకమనుటలోననౌచిత్యము కానరాదని ముందుగనే వక్కాణింప

బడినది. అన్యథాకరణరూపములైన అమూలకములు పోతనయనువాదమున ప్రవేశించిన తావులనుగుఱించి యొకింత పరికింతము.

శకట భంజనానంతరము ఏడ్చుచున్న బాలుని (కృష్ణుని) యశోదాదేవి చేతికి తీసుకొని ఈవిపత్తునకు కారణము గ్రహపీడయని అనుమానించి విప్రులచే రక్షగావించి తరువాత చన్నుగుడిపెను (సం. భాగ. 10-7-11) అని మూలముననుండగ అనువాదమున బాలుని రోదనంబు విని యశోద పఱతెంచి

ఆ. అలసితివిగదన్న! యాకొంటివిగదన్న!
మంచియన్న! యేడ్పు మానుమన్న!
చన్ను గుడువుమన్న! సంతసపడుమన్న!
యనుచుఁ జన్నుగుడిపె నర్భకునకు.

వ. అంత నబ్బాలునిమేన బాలగ్రహంబు సోకుచుగదా యని శంకించి, గోపకు లనేకుల నేక బలివిధానంబులు చేసిరి ............

-ఆం. భాగ దశమ. పూ. భా. 258,259

అని ముద్దులాడుచు పాలను త్రాపినతరువాత గ్రహశాంతి చేయనెంచెనని మార్పుటవలన మూలమునుమించిన వాత్సల్యభావమును వ్యక్తీకరించుటకవకాశము కల్గినది.

కృష్ణుడు గో, గోపబాలురతోను, అన్నయగు బలరామునితోను బృందావనమును ప్రవేశించి. అందలి వనశోభగాంచి క్రీడింప వేడుకకలిగి, ఆతడు బలరామునితో పల్కిన పల్కులలో

శ్లో. ధన్యేయమద్య ధరణీ తృణవీరుధస్త్వ
త్పాదస్పృశో ద్రుమలతాః కరజాభిమృష్టాః।
నద్యోఽద్రయః ఖగమృగాః సదయావలోకై
ర్గోప్యోఽన్తరేణ భుజయోరపి యత్ స్పృహా శ్రీః॥

-సం భాగ. 10-15-8

శ్రీదేవికైనను వాంఛించనదైన నీ వక్షస్థలముచే (నీఆలింగనముచే) గోపికలు ధన్యులు అని మూలమున కలదు. శ్రీదేవి బలరాముని వక్షస్థలముపై కోరిక కలిగియుండెనని వెన్నుడు పల్కుట ఔచితీపోషకముగా కన్పట్టదు. అనువాదమున

సీ. నీ వెన్నురము మోవ నేఁడు గోపాంగనా
జనములపుట్టువు సఫల మయ్యె

అని మార్చి యౌచిత్యమును పాటించుట ప్రశంసార్హము.

గోపికావస్త్రాపహరణ ఘట్టమునందు గోపికలు కంఠప్రమాణ జలంబులందుండి చేలంబులిప్పింపుమని శ్రీకృష్ణుని ప్రార్థించినతీరు మూలమున 'ఓకృష్ణా!ఇట్టి చెడ్డ పని చేయకుమా!నీవు మానందప్రభుని కుమారుడవు. మాకుప్రియుడవు. గోకులమునబాగడదగినవాడవు. చలికివణకుచున్నాము. మా చీరలిమ్ము (సం. భాగ. 10-22-14) అనియుండగా అనువాదమున

క. మా పలువలు లాఘవమున
నీవేటికిఁ బుచ్చుకొంటి వీవల్లుఁడ వే
నీవెఱుగని దేమున్నది
నీ వందఱిలోన ధర్మనిరతుఁడవుగదే.

మ. ఇంతుల్ తోయములాడుచుండ మగవా రేతెంతు రే వచ్చిరా
యింతల్ సేయుదు రే కృపారహితులై యేలోకమందైన నీ
వింతల్ నీతలఁబుట్టెఁ గాక మఱి యేవీ కృష్ణ! యోచెల్ల ! నీ
చెంతన్ దాసులమై చరించెదము మా చేలంబు లిప్పింపవే.
-ఆం. భాగ. దశమ. పూ. భా. 827,828.

అని మార్పు గావింపబడినది. గోపికలు తమ చేలంబులిప్పింపుమని ప్రార్థించుట మూలానువాదముల సమానమైనను, ప్రార్థించిన తీరునందలి మార్పువలన ననువాదమున మూలమునుమించిన భక్తిభావము వ్యక్తమగుచున్నది. అంతియేగాక గోపికల ప్రార్థన అనువాదమున నత్యంత సహజముగ నలరారుచున్నది.

అట్లే మూలానువాదములందలి వక్తవ్యాంశము సమానమైనను అలంకారయోజనలో పోతనయనువాదమున కొన్ని మార్పులు కన్పట్టుచున్నవనవచ్చును.

గోవర్ధనోద్ధరణ ఘట్టమున శ్రీకృష్ణుడు గోవర్ధన పర్వతమును అనాయాసముగ వ్రాక్కచేతితో నెత్తిపట్టెనని వ్యక్తీకరించుటకు మూలమున

శ్లో. ఇత్యుక్త్వైకేన హస్తేన కృత్వా గోవర్ధనాచలమ్।
దధార లీలయా కృష్ణశ్ఛత్రాకమివ బాలకః॥
—సం. భాగ. 10-25-19

అని ఛత్రాకమును(పుట్టగొడుగును)ఉపమానముగా గ్రైకొనెను. అవతారపురుషుడగు శ్రీకృష్ణునిచేతిలోని గోవర్ధనపర్వతమును పుట్టగొడుగుతో బోల్చుటకంగీకరింపని భక్తుడగు పోతన తనయనువాదమున

క. కిరియై ధర యెత్తినహరి
కరి సరసిజముకుళ మెత్తుగతిఁ ద్రిభువన శం
కరకరుడై గోవర్ధన
గిరి యెత్తెం జక్క నొక్క కేలన్ లీలన్.

శా. బాలుం డాడుచు నాతపత్రమని సంభావించి పూగుత్తి కెం
గేలన్ దాల్చినలీల లేనగవుతోఁ గృష్ణుండు దా నమ్మహా
శైలంబున్ వలకేలఁ దాల్చె విపులచ్ఛత్రంబుగాఁ బట్టె నా
భీలాభ్రచ్యుతదుశ్శిలాచకితగోపీగోపగోపం క్తికిన్.
—ఆం. భాగ దశమ. పూ. భా 912, 915

అని మార్పుగావించుట ప్రశంసార్హము. ఈ మార్పువలన మూలమునుమించి భావవ్యక్తీకరణమతిస్ఫుటముగా సుందరమగురీతిలో అనువాదమున కన్పట్టుచున్నదనుట స్పష్టము.

మఱియొక గ్రంథము ననువదించుచున్నట్లుగాక స్వతంత్ర గ్రంథమును రచించుచున్నట్లుగా భావించుటవలనను అనువాదగ్రంథములందనేకములైన మార్పులు సంభవించుచుండును. పోతన యనువాదమునందిట్టిఘట్టములు పెక్కు కానవచ్చుచున్నవి. ఉదాహరణమునకు కృష్ణ గోవులనుమేపుట కరణ్యమునకు బోవగా ప్రియుని ఎడబాటును భరింపలేక గోపికలు కృష్ణునిలీలలను కీర్తించుచు పగటివేళలు కష్టములతో వెళ్ళబుచ్చిన విధము మూలమున

శ్లో. వామ బాహు కృత వామకపోలో
వల్గితభ్రురధరార్పితవేణుమ్ ।
కోమలాంగుళిభిరాశ్రితమార్గం
గోప్య ఈరయతి యత్ర ముకుందః ॥

ఇత్యాదిగా

శ్లో. ఏవం వ్రజస్త్రియో రాజన్ కృష్ణలీలా ను గాయతీః!
రేమిరేఽహఃసు తచ్చిత్తా స్తన్మనస్కా మహోదయాః॥
—సం. భాగ. 10—35—2నుండి 26వఱకు

అను శ్లోకమువఱకు వర్ణింపబడినది. ఈపట్టున అనువాదమున

శా. భ్రూవిక్షేపముతోడ దాపలిభుజంబుం జెక్కుఁ గీలించి కె
మ్మోమ్మెపన్ వేణువుఁ గూర్చి సుస్వరముగా మ్రోయించు చున్నంగుళీ
ప్రావీణ్యంబు విభుండు సూపఁ గని సప్రాణేశలై యుండియున్
నీవీబంధములూడఁ జొక్కుదురహో నింగిన్ నిలింపాంగనల్.
—ఆం. భాగ. దశమ. పూ. భా 1125

ఇత్యాదిగా కృష్ణవిరహదుఃఖంబున బహువిధంబుల బశ్చాత్తాపంబునొందుచు గోపికలోపి కలులేక దినంబు గడపినవిధము వర్ణితమైనది. ఇందు పైపద్యమొక్కటియే కొంచె మించుమించుమూలానుసారియై వర్తిల్లుచున్నది.ఈ సందర్భమున మృగగోయూధములు కృష్ణుని పిల్లనగ్రోవివాయిద్యము తమ చిత్తములు హరింపగా తాముమేయుచున్న గడ్డిక వళములను నోటియందు దంతములతోనట్లే పట్టుకొనినవై, చెవులు నిక్కపొడుచుకొని నిద్రించువానివలె, వ్రాసినచిత్తరువువరెనైనవి (సం. భాగ. 10-35-5)అనిమూలమున నుండగననువాదమున 'మృగగోయూధంబులుత్కంఠతో దివికిం గంఠములెత్తి లోవదలుఁబో దేహేంద్రియవ్యాపృలన్ (ఆం. భాగ. దశమ. పూ. భా. 1126)' అని మార్చబడెను. తక్కిన వర్ణనమంతయు మూలమునకు ననువాదమునకు నెట్టిసంబంధము లేని రీతిలో సాగినది. ఈతావున పోతన, విరహముయొక్క స్వరూపమును చిత్రించుటలో మూలముననుసరించుటకు బదులు స్వతంత్రగ్రంథమునురచించు కవి భావించి వ్రాసినట్లే వ్రాసినాడు. మూలమున గోపికలు కృష్ణలీలలను గానముచేయుచు నడుమ కృష్ణుని ప్రేమలీలాకటాక్షముచే సమర్పితమైన కామావేశముగల మేము వృక్షములగతిని పొంది అనగా కృష్ణుని వెంబడించి పోలేక నిల్చిపోయి మోహమునుపొంది, జారిపోవు కట్టుచీరను పయ్యటనుగాని, వీడిపోవు కొప్పునుగాని యెఱుంగలేకున్నాము (సం. భాగ. 10-35-17) అని యశోదతో పలుకుట కానవచ్చుచున్నది. ఇట్టి భావములు యశోదకు వ్యక్తీకరించుటలో నౌచిత్యమును, రసమును లేదు. కావుననను వాదమునందలి. గోపికల విరహాలాపములన్నియు తమలోతాము వ్యక్తీకరించుకొనినవేగాని, యశోద

ప్రసక్తి తీసుకొని రాబడలేదు, తమలోతామెట్టిభావములను వ్యక్తీకరించుకొనినను దోషముకాదుగదా ! ఇందు శ్రీకృష్ణునితో సంచరించు ఆనందమయమైన రాత్రికాలము క్షణములో సాగిపోయినట్లు, వియోగవ్యథనందుచున్న ప్రతిక్షణము మహాయుగములై కల్పములై సుదీర్ఘములైనట్లు, భావించి కాలగతి మానవుని మనఃస్థితి కనుగుణముగ నొకప్పుడు శీఘ్రముగాను, మరియొకప్పుడు మందముగాను సాగుచున్నట్లు భావింప బడుచుండుటను వ్యక్తీకరించినాడు. ఈవిధమైన మార్పులు, స్వతంత్రభావనలు, తాను స్వతంత్రగ్రంథమును రచించుచున్నట్లు భావించుటవలననే.

పూర్వాపరసమన్వయము కానరాని మూలమునందలి కొన్ని యంశములను మార్చి సమన్వయమును, పొత్తును సమకూర్చిన ఘట్టములును పోతనయనువాదమున కన్పట్టుచున్నవి.

రాసక్రీడాఘట్టమున శ్రీకృష్ణుడంతర్హితుడుకాగా గోపికలందరు వెన్నెల యున్నంతవఱకు నావనమున ప్రవేశించి శ్రీకృష్ణుని వెదకుచుండిరి. వెన్నెలపోయి చీకటి క్రమ్మినంతనే వెదకుట మానిరి (సం. భాగ. 10-30-43) అని మూలమున కలదు. ఈఘట్టమునకు ప్రారంభమున చంద్రోదయమును వర్ణించుచు 'దృష్ట్వాకుము ద్వంతమఖండమండలమ్' అని పూర్ణ చంద్ర మండల ముదయించెనని చెప్పబడెను అనగా నాడు పూర్ణిమయని చెప్పినట్లయినది. అట్టితఱి వెన్నెల యున్నంతవఱకు గోపికలు వెదకిరనియు, చీకటిక్రమ్మినంతనే వెదకుట మానిరనియు పలుకుటచే పూర్వాపరసమ న్వయమంతగా సరిపడకున్నది. అట్లు వెదకుట మానినపిదప యమునాసైకతమున కృష్ణగుణగానము చేయుటయు, కృష్ణుడు వారిని కరుణించి రాసక్రీడనొనరించుటయు వివరింపపడినది. కావున వీరు తెల్లవారువఱకు వెదకిరని సమర్థించుటయును, సమంజసము కాదు. కావున పోతన తనయనువాదమున

మ. అని యిభ్భంగి లతాంగులందఱును బృందారణ్యమందీశ్వరున్
వనజాక్షున్ బరికించి కానక విభున్ వర్ణింపుచున్ బాడుచున్

-ఆం. భాగ. దశమ. పూ. భా. 1033

అని మార్చి పూర్వాపరసమన్వయమును, దేశకాలములకు సంబంధించిన ఐక్యతను సమకూర్చినాడు.

అక్రూరుడు బృందావనమునకు వచ్చిన కారణమరసినపిదప రామకృష్ణుల మాటవిని నందుడు గోపకులనెల్ల పిలచి కంసునకు పాలు, పెరుగు, వెన్న, నేతులు తీసుకొని, మేలగువస్తువులు కానుకలుగా తీసుకొని, మధురకు బండ్లుకట్టుడని ఆజ్ఞా

పించినట్లుగ (సం. భాగ. 10-39-11) మూలమున నుండగా అనువాదమున నందాది గోపకులతో శ్రీకృష్ణుడే యిట్లు పల్కినట్లు మార్చబడినది. ఈ పట్టున మూలాను వాదములు రెండును యుక్తియుక్తములుగనే కన్పట్టుచున్నవి. వ్రజనాథుడు నందుడు గావున నాతడాదేశించుట యెంతసమంజసమో మధురానగరమునకు ప్రధానముగా నాహ్వానింపబడిన బలరామకృష్ణులు ప్రయాణసన్నాహములు గావింపవలసినవిధము వివరించుటయు నంతే సమంజసము.

శ్రీకృష్ణుడు రాచవిల్లు విఱచెను. కావలివారిని బలరామకృష్ణులు సంహరించి, మధురాపురంబున విహరించి విడిదలకుంజని క్షీరాన్నమునుభుజించి, కంసుని కార్యారంభమెఱింగి నారేయి సుఖముగాగడిపిరి (ఊషతుస్తాం సుఖం రాత్రిం) అని మూలమున కలదు మధురానగరమున ప్రవేశించినప్పటినుండియు అనేకములగునాపదల నెదుర్కొని, కంసుడుచేయబోవు కార్యమునుసహితమెఱింగిన వారలారాత్రి సుఖముగా గడపుట యెట్లు సాధ్యమని సామాన్యపాఠకులు భావించుటకవకాశము గలదు. కావున అనువాదమున

క. ఆరేయి గోపయుతులై
క్షీరాన్నము గుడిచి రామకృష్ణులు మదిఁ గం
సారంభమెఱిఁగి యిట్లు
విహారంబుల నప్రమత్తులై యుండి రిటన్.

-ఆం. భాగ. దశమ. పూ. భా. 1297

అని మార్చబడెను. అప్రమత్తులైయుండిరనుభావన లోకసామాన్యముగానుండి సామాన్యపాఠకుల సందేహమును తొలగించుటతోబాటు దుష్టసంహారముచేయు నవతార తత్త్వమును ప్రతిబింబించుచున్నదని చెప్పవచ్చును. దుష్టసంహారము గావించుటయే యవతారమునెత్తుటలోని తత్త్వముగదా! ఆ కార్యమునందును అప్రమత్తులై యుండి రనుట యిందలి విశేషము. పోతనయనువాదమున కానవగు నిట్టి చిన్నచిన్న మార్పులును సౌందర్యాపాదకములై యలరారుచున్నవి.

బలరామకృష్ణులు చాణూరముష్టికులను వధించు ఘట్టమున చాణూరుని మాటలు విని కృష్ణుడు 'మేము అడవిద్రిమ్మరులమైనను కంసరాజుయొక్కఏలుబడిలోని ప్రజలము. ఎప్పుడునాతనికి ప్రియమాచరించుట మాకోరిక. అట్లు చేయుడనుటయే మాయందనుగ్రహము చూపుట యగును. కాని మేము మాకు సాటివచ్చు బల్లిదులతో క్రీడింపగలముగాని మీతో యుద్ధమొనరించుట అధర్మమగునేమో' యనిపలుకగా, చాణూ

రుడు 'ఓకృష్ణా! నీవు బాలుడవుగావు బలరాముడునట్టివాడుగాడు. ఏలయన నీవు వేయి యేనుగుల బలముగల కువలయాపీడము ననాయాసముగ గూల్చితివి. మీరు బల వంతులుగావున బలవంతులమైన మాతోయుద్ధముచేయుట యధర్మముగాదు. నీవు నాతో విక్రమించుము. బలరామునితో ముష్టికుడు పోట్లాడుగాక (సం. భాగ. 10–43–37, 38, 39, 40) అనిపల్కినట్లు మూలమునకన్పట్టుచున్నది. అనువాదమునమాత్రము

ఉ. సాములు లేవు పిన్నలము సత్త్వము గల్గనరాదు మల్లసం
గ్రామవిశారదుల్ కులిశకర్కశదేహులు మీరు మీకడన్
నేము చరించు టెట్లు ధరణీశుని వేడ్కలు సేయువారమున్
గాము వినోదముల్ సలుపఁ గాదన వచ్చునె యొక్క మాటికిన్.

క. నీతోడుత నేఁ బెనగెద
బ్రీతిన్ ముష్టికునితోడఁ బెనఁగెడి బలుఁడు
గ్రాతతమల్లాహవమున
భూతలనాథునికి మెచ్చుఁ బుట్టింతు సభన్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1334, 1335

అని కృష్ణుడు పల్కినట్లును, ఆ మాటలువిని చాణూరుడు రోషించినట్లును మార్చబడినది. నాతోడ నీవు యుద్ధము సేయుమని కృష్ణుడాహ్వానించుటచేతనే చాణూరుడు కుపితుడగుటయు, అందువలననే ఆతడు దంభోక్తులు పలుకుటయు జరిగినది. ఆమాటలవలననే చాణూరుని బలపరాక్రమములు చెప్పించుటకు, నాతనికి శ్రీకృష్ణునియందుగల వైరభక్తిని వ్యక్తీకరించుటకు తగిన అవకాశమేర్పడినది. మూలమున కానరాని చాణూరుని స్వరూపమును, భక్తిని, సువ్యక్తమొనరించుటకీమార్పు గావింపబడినదని తలంపవచ్చును.

నానావిధముల విశ్లేషింపబడిన భక్తియొక్క సమగ్రస్వరూపమును కీర్తించుట కనువుగా మూలమునందలి ఆయా సంభాషణాదులను మార్చుట భక్తకవియగు పోతన యనువాదమునందలి ప్రత్యేకత.

కంసుడు శ్రీకృష్ణునిచే సంహరింపబడగా, వారి భార్యలు

శ్లో. హా నాథ ప్రియ ధర్మజ్ఞ కరుణానాథవత్సల ।
త్వయా హతేన నిహతా వయం తే సగృహప్రజాః ॥

శ్లో. త్వయా విరహితా పత్యా పురీయం పురుషర్షభ ।
న శోభతే వయమివ నివృత్తోత్సవమంగళా ॥

శ్లో. అనాగసాం త్వం భూతానాం కృతవాన్ ద్రోహముల్బణమ్ ।
తేనేమాంభో దశాం నీతో భూతధ్రుక్ కో లభేత శమ్ ॥

శ్లో. సర్వేషామిహ భూతానామేష హి ప్రభవాప్యయః ।
గోప్తా చ తదవధ్యాయీ న క్వచిత్ సుఖమేధతే ॥

—సం. భాగ. 10-44-45 నుండి48.

అని సుస్వరంబున విలపించినట్లు మూలముననుండగా అనువాదమున

సీ. గోపాలసింహంబు కోపించి వెల్వడి
నిను గజేంద్రునిభంగి నేడు గూల్చె
యాదవేంద్రానిల మాఖీలజనముల
నిను మహీజముమాడ్కి నేల ద్రాల్చె
వాసుదేవాంభోధివారి యుద్వేలమై
నిను దీవికైవడి నేడు ముంచె
దేవకీసుతవజ్రి దేవత లలరంగ
నినుఁ గొండక్రియ నేడు నిహతుఁ జేసె

తే. హా మనోనాథ !హా వీర! హా మహాత్మ!
హా మహారాజ! నీవిట్లు హతుడవయిన
మనుచు నున్నార మక్కట! మమ్ము బోలు
కఠినహృదయలు జగతిపైఁ గలరె యెందు.

- ఆం భాగ. దశమ. పూ భా. 1383, 84, 85

ఇత్యాదిగ వీరి విలాపము మరియొకరూపు దాల్చినది. 'భర్తవైన నీ యెడబాటువలన నీమధురాపురి మావలె నుత్సవములు, శుభకార్యములు, లేనిదై యుండెను. నీవు కృష్ణునిచే చంపబడిన నీచే ఇండ్లతో బిడ్డలతో కూడినమేము కొట్టబడితిమి ... ' అను మూలమునకు 'గోపాలసింహంబు కోపించి వెల్వడి ...' ఇత్యాదిగాననువాదమున మార్పుచెందుటవలన మూలమునుమించిన కరుణరసపుష్టితో నలరారుటయేగాక, వారి భక్తియు ప్రతీయమానమగు చున్నది సర్వప్రాణులకు జన్మనాశములు

కలిగించువాడు, రక్షకుడునైన కృష్ణునకవమానము కలిగించినవాడు సుఖమును పొందడను మూలముకంటె 'శ్రీకృష్ణునితో విరోధము తెచ్చుకొని మరణించినవారి గుఱించి బుధులు సెప్పలేదా? చెప్పినవెంటనే వానిపై కోపమును వీడి సేవింపవలదా?' అనునునువాదము భక్తిరసస్ఫూర్తిని గావించుచున్నది. భక్తివిరోధమువలన నష్టమును, కోపము ఆలస్యము పరిహరింపదగినవనియు ననువాదము వ్యక్తమొనరించుచున్నది. అనువాదమున గావింపబడిన మార్పువలన కరుణరసము మరింత పరిపుష్టమగుటయే గాక కృష్ణభక్తి స్ఫుటముగా వ్యక్తీకరింపబడినది.

ఎల్లవిద్యలకు జన్మస్థానమైన, సర్వజ్ఞులైన జగదీశ్వరులు రామకృష్ణులు. తమకు స్వతస్సిద్ధమై నిర్మలమైన విద్యాజ్ఞానమును మానవచేష్టలచే కప్పిపుచ్చువారైరి. కావున వడుగైనతరువాత రామకృష్ణులు గురుకులవాసము జేయగోరిరి (సం. భాగ. 10-45-30,31) అని మూలముననుండగ అనువాదమున పోతన

శా. ఉర్విన్ మానవు లెవ్వరైన గురువాక్యోద్యుక్తులై కాని త
త్పూర్వారంభము సేయఁ బోల దనుచున్ బోధించుచందంబునన్
సర్వజ్ఞత్వముతో జగద్గురువులై సంపూర్ణులై యుండియున్
గుర్వంగీకరణంబు సేయఁ జని రా గోవిందుఁడున్ రాముఁడున్.

ఆం. భాగ. దశమ. పూ. భా 1406

అని రూపుదిద్దినాడు. ఎంతటి జ్ఞానులైనను లోకభిన్నముగా తమ జ్ఞానమును కప్పిపుచ్చెనని చెప్పుటకంటె ఎంతవారికైన గుర్వంగీకరణము తప్పదను విషయమును వ్యక్తముచేయుటకే యీమార్పు. మూలమున కప్పిపుచ్చిరనుట సహజముగా లేదు. భగవానుడవతారమెత్తినపుడే యవతారతత్త్వము కప్పబడినది. ఆ విషయము పాఠకు లెఱింగినను మధ్యమధ్య నిట్లు కప్పిపుచ్చుకొనిరని చెప్పుటవలన రసభంగము కాగలదు. అట్టి రసభంగమును తొలగించుటకీమార్పు గావింపబడినది. వర్ణన లోకసామాన్యముగా నుండవలెను. అందలి మహిమ మనకు గ్రహింపబడుటకనువుగ నుండవలెను. కావుననే యనువాదమున నిట్టి మార్పు గావింపబడినది.

బలరామకృష్ణులు, మరణించిన గురుపుత్రుని తెచ్చుటకు యముని పట్టణమును చేరి, కృష్ణుడు శంఖధ్వానము చేసెను. ఆశంఖధ్వనిని విని యముడు రామకృష్ణులను భక్తితో పూజించెనని (సం. భాగ. 10-45-42, 43, 44) మూలముననుండగ అనువాదమున

"...సంయమనీ నామనగరంబు చేరి, తద్ద్వారంబునం బ్రళయ కాలమేఘ గంభీరనినదభీషణంబగు శంఖంబుపూరించిన విని వెఱంగుపడి

శా. అస్మద్బాహుబలంబు గైకొనక శంఖారావమున్ మానసా
పస్మారంబుగ నెవ్వఁడొక్కొ నగరప్రాంతంబునం జేసె మ
ద్విస్మేరావహ రోషపావకునిచే విధ్వస్తుఁడై వాఁడు దా
భస్మంబై చెడునంచు నంతకుఁడు కోపప్రజ్వలన్మూర్తియై

వ. వచ్చి, రామకృష్ణులం గని వారు లీలామనుష్యులయిన విష్ణుమూర్తులని యెఱింగి, భక్తితోడ శుశ్రూషచేసి, సర్వభూతమయుండగు కృష్ణునకు నమస్కరించి యేమి సేయుదు ఆనతిమ్మా. అనిన......"

- ఆం.భాగ. దశమ. పూ.భా. 1421,22,23

అని కానవచ్చుచున్నది. మూలమునందలి చిత్రణమీపట్టున సాధారణ జీవనమునకు సన్నిహితముగా లేదు. కావున సామాన్యజనులకు సన్నిహితముగానుండుటకనువాదమున నిట్టిమార్పు గావింపబడినదనవచ్చును

రుక్మిణీసందేశహారియైన బ్రాహ్మణుడు శ్రీకృష్ణునిచెంతకేగి సందేశమును వినిపించిన తరువాత

శ్లో. ఇత్యేతే గుహ్యసందేశా యదుదేవ మయాఽహృతాః।
విమృశ్య కర్తుం యచ్చాత్ర క్రియతాం తదనంతరమ్ ॥

—సం.భాగ. 10-52-44

అని పలికినట్లు మూలమునందు అనువాదమున

వ. ఇట్లు రుక్మిణీదేవి పుత్తెంచిన సందేశంబును, రూపసౌందర్యాది విశేషంబులును, బ్రాహ్మణుండు హరికి విన్నవించి కర్తవ్యంబెద్ది సేయ నవధరింపుమని

ఉ. ఆ యెలనాఁగ నీకుఁ దగు నంగనకుం దగు దీవు మాయుపా
ధ్యాయులయాన పెండ్లియగుఁ దప్పదు జాడ్యము లేల నీవు నీ
తోయమువారుఁ గూడుకొని తోయరుహాననఁ దెత్తు గాని వి
చ్చేయుము శత్రు న న్నులుము సేయుము సేయుము శోభనంబిలన్

—ఆం. భాగ. దశమ. పూ. భా. 1709 నుండి 1711

అని బ్రాహ్మణుడు పల్కినట్లు మార్చబడినది. మూలమునందలి బ్రాహ్మణునిపాత్ర కేవలము వార్తాహరునివలె కన్పట్టుచుండ ననువాదమున నీతడు కార్యసాధకుడుగా, లోకజ్ఞుడుగా, చతురవచోనిధిగా తీర్చిదిద్దబడినాడు.

ఇట్లాయాపాత్రలను చక్కగా తీర్చిదిద్దుటకు పోతన తనయనువాదమున మూలము నన్యథాకరణమొనరించుచుండుననుట స్పష్టమగుచున్నది.

ధర్మరాజు రాజసూయ యాగమును నిర్వర్తించు సమయమున ప్రేమపాశ బద్ధులైనవారాయా కార్యక్రమములను బాధ్యతతో నిర్వర్తించిరి. ఈసందర్భమున భీమసేనుడు పాకశాలను, దుర్యోధనుడు కోశాగారమును, సహదేవుడు అతిథి స్వాగత కార్యక్రమమును, నకులుడు వస్తుసముదాయసేకరణను, అర్జునుడు గురుజనసేవా శుశ్రూషను, శ్రీకృష్ణుడతిథులకు పాదప్రక్షాళనమును, ద్రౌపది వడ్డన కార్యక్రమమును కర్ణుడు దాన నిర్ణయములను కడుసమర్థతతో నిర్వహించిరని మూలమున చెప్పబడెను. (సం. భాగ. 10-75-3 నుండి 7 వఱకు) అనువాదమున నాయాకార్యక్రమములను నిర్వహించుటకు వారిని ధర్మరాజు నియమించెనని మార్చుటయేగాక పంకజోదరు నొద్ద పాయక పరిచర్య గావించుటకర్జునుని నియమించినట్లును మార్చబడినది. (ఆం. భాగ. దశమ. ఉ.భా. 766,767). మూలమున శ్రీకృష్ణుడతిథులకు పాద ప్రక్షాళనము నిర్వహించుచుండ ననువాదమున నీతనికి ఎట్టికార్యక్రమమును కేటాయింపబడలేదు. అగ్రపూజనందుకొనుటకర్హుడైన శ్రీకృష్ణుడు ఏ కార్యక్రమమునను నియమింపబడకుండుటయు, అట్టి శ్రీకృష్ణునకు మాత్రమే పరిచర్యగావించుటకర్జునుడు నియమింపబడుటయు, సందర్భోచితముగ నున్నది. మూలమున ప్రేమపాశబద్ధులై కార్యక్రమములను నిర్వహించుచున్నారని చెప్పబడగా ననువాదమున ధర్మరాజు నియమించినట్లు మార్చుటయు లోకవ్యవహారమునకు దగ్గఱగానున్నదని చెప్పవచ్చును.

కుచేలోపాఖ్యానమున భార్యచే ప్రోత్సహింపబడిన కుచేలుడు శ్రీకృష్ణుని దర్శనార్థము వెళ్లుటకు నిశ్చయించుకొని, కానుకగా తీసుకొనివెళ్లుటకు గృహమందేదేని కలదా ? అని భార్యనుప్రశ్నింపగా నామె నాలుగు పిడికెలల పృథుకతండులములను యాచించి తెచ్చి శిథిలవస్త్రంబు కొంగున ముడివేసెనని మూలమున ( సం. భాగ. 10-80-14 ) కన్పట్టుచున్నది.

శ్లో. యదృచ్ఛయోపపన్నేన వర్తమానో గృహాశ్రమీ।
తస్య భార్యా కుచైలస్య క్షుత్క్షామా చ తథావిధా॥

-సం భాగ. 10-80-7

అని వర్ణింపబడిన ఆమె శ్రీకృష్ణునకుపాయనముగా నర్పించుటకు నాలుగు పిడికెలల పృథుతండులములు యాచించి తెచ్చెననుటలో నౌచిత్యము కానరాదు. ఈ సందర్భమున పోతన మిక్కిలి చాకచక్యముతో

తే. అనిన నయ్యింతి యట్ల కాక యనుచు విభుని
శిథిలవస్త్రంబు కొంగునఁ బృథుక తండు
లముల నొక కొన్ని ముడిచి నెయ్యమున ననుపఁ
జనియె గోవిందసందర్శనోత్సాహియగుచు

—ఆం. భాగ. దశమ. ఉ. భా. 970

అని మార్పుగావించి పాత్రౌచిత్యమును పాటించినాడు.

ఈవిధముగా దేశకాలపాత్రౌచిత్యములను పాటించుటకును, భక్తితన్మయతను తదితరరసభావములను మిక్కిలి ప్రభావవంతముగ వెలయించుటకును, స్వతంత్ర గ్రంథమువలె భాసిల్లజేయుచు మూలమును మించిన సొగసులను సంతరింపజేయుటకు నన్యథాకరణరూపములైన అమూలకములును పోతన యనువాదమున లెక్కకు మిక్కిలిగ ప్రవేశించినవి.

# పరిత్యక్తములు

క. భూషణములు సెవులకు బుధ
తోషణము లనేక జన్మ దురితౌఘ విని
శోషణములు మంగళతర
ఘోషణములు గరుడగమను గుణభాషణముల్

—ఆం. భాగ. దశమ. పూ. భా. 1682

అని భావించు భాగవతోత్తముడగు పోతనకు మూలమునందలి కథాంశములన్నియు ప్రధానములైనవే. అనుసరణ యోగ్యములైనవే. కావున పోతన అనువాదమున పరిత్యక్తములగు నంశములు మిక్కిలి తక్కువయని చెప్పుటలో నెట్టి విప్రతిపత్తియును లేదు.

మూలభిన్నమైన విస్తృతిని, సంక్షిప్తతను, అన్యథాకరణమును అమూలకములుగ పరిగణించినట్లుగనే పరిత్యక్తములగునంశములను సైతము అమూలకములుగ పరిగణించుట తర్కబద్ధమైనను, అమూలకములను వలయములోనికి తెచ్చుట జరిగినదే గాని అమూలకములుగ పరిగణిపకుండగనే పరిత్యక్తాంశములను గుఱించి యిందు చర్చింపబడుచున్నది.

మూలానువాదములలో రచనాపరమైన భేదముండుటచేతను, వక్తవ్యాంశమును ప్రభావవంతముగా కళాత్మకముగ చెప్పవలసిన అవసరము ప్రబంధచ్ఛాయలలో సాగిన పురాణరచనకు నుండుటచేతను, పోతన యనువాదమున నందందు పరిత్యక్తములగు నంశములు కానవచ్చుచున్నవి. అంతియేగాక ఔచిత్యపోషణమును దృష్టిలో నిడుకొనుటచే మూలమునందలి కొన్నియంశములు పోతన యనువాదమున కానరాకున్నవి.

కథ సంతటిని చెప్పినపిదప దానిసారము మరల చెప్పబడుట పురాణ రచన లక్షణము. కథాకథన శిల్పముతో రచింపబడు ప్రబంధధోరణికి నిట్టివిధానము సౌందర్యాపాదకము కాజాలదు. కావున నిట్టివి పోతన యనువాదమున తొలగియుండును. ఉదాహరణమునకు శ్రీకృష్ణుడు గోపబాలురతో క్రీడలు సలిపినవిధము వివరముగా వర్ణింపబడిన పిదప మూలమునందలి

శ్లో. ఏవం నిగూఢాత్మగతిః సమాయయా
గోపాత్మజత్వం చరితైర్విడంబయన్।
రేమే రమాలాలితపాదపల్లవో
గ్రామ్యైః సమం గ్రామ్యవదీశచేష్టితః ॥

— సం భాగ. 10-15-19

అను శ్లోకమునకు అనువాదము కానరాదు. అట్లే

శ్లో. ఏవం లీలా నరవపుర్నృలోకమనుశీలయన్।
రేమే గో గోప గోపీనాం రమయన్ రూపవాక్కృతైః॥

- సం భాగ. 10-23-36

అను శ్లోకమునకును అనువాదము కానరాదు.

మునిపత్నులు అన్నము తీసుకొనివచ్చి శ్రీకృష్ణునకారగింపుచేసి తమ భర్తలున్న యజ్ఞశాలలకు బోయిరి. మరలిపోయిన వారిని భర్తలు చేరదీసిరి. కాని వారిలో నొక్క ఇల్లాలిని మాత్రమామె భర్త తన్ను చేర రానీయక తరిమెను. అప్పుడామె తనకు శ్రీకృష్ణుడుపదేశించిన రీతిని జ్ఞానభావమున భగవంతుని ధ్యానించి ప్రారబ్ధ

జనితమైన భౌతికదేహమును త్యజించి భగవంతుని పొందెను. (సం. భాగ. 10-23-34) అని మూలమున వర్ణితముకాగా ననువాదమున నిది విడువబడినది. కృష్ణుని మాయాప్రభావ మొకనియందు పనిచేయలేదను విపరీతభావము కల్గించుటకు ఈ ఘట్ట మవకాశమును కల్గించుచున్నది ఇట్టి దీనిని చెప్పుటవలన కథకు పొందిక, ప్రయోజనము, ప్రభావము నంతగా కానరాకున్నందున విడచియుండును.

శ్రీకృష్ణునిచే పంపబడిన ఉద్ధవుడు సూర్యాస్తమయ సమయమునకు వనంబుల నుండివచ్చు గోవుల చరణరేణువులచే, ప్రచ్ఛన్నరథుండై నందుని గోకులమును చేరెను. ఈ సందర్భమున మూలమున ఈక్రిందివిధముగ గోకులము వర్ణింపబడెను.

శ్లో. వాసితార్థేఽభియుధ్యద్భిర్నాదితం శుష్మిభిర్వృషైః ।
ధావంతీభిశ్చ వాస్రాభిరూధోభారైః స్వవత్సకాన్ ॥

శ్లో. ఇతస్తతో విలంఘద్భిర్గోవత్సైర్మండితమ్ సితైః ।
గోదోహశబ్దాభిరవం వేణూనాం నిస్వనేన చ ॥

శ్లో. గాయంతీభిశ్చ కర్మాణి శుభాని బలకృష్ణయోః ।
స్వలంకృతాభిర్గోపీభిర్గోపైశ్చసువిరాజితమ్ ॥

శ్లో. అగ్న్యర్కాతిథిగోవిప్ర పితృదేవార్చనాన్వితైః ।
ధూపదీపైశ్చ మాల్యైశ్చ గోపావాసైర్మనోరమమ్ ॥

శ్లో. సర్వతః పుష్పితవనం ద్విజాళికులనాదితమ్ ।
హంసకారండవాకీర్ణైః పద్మషండైశ్చ మండితమ్ ॥

— సం. భాగ. 10-46-9 నుండి 13 వఱకు

పోతన అనువాదమున నీవర్ణన కానరాదు. తనరాకను తెలియనీయక ప్రచ్ఛన్న రథుడై వచ్చి నందుని మందిరముజొచ్చిన ఉద్ధవుడు గోకులసౌందర్యమును తిలకించుట కంతగా అవకాశము గానరాదు. కావున గోకుల సౌందర్యమును వర్ణించుటకనువుగాని స్థానమగుటచేతను, పాత్రచిత్తవృత్తికిని అనువుగాని సందర్భమగుటచేతను, ఈ వర్ణనము విడిచి యుండవచ్చును.

పెక్కు విధంబుల హరి ప్రభావంబు నుపన్యసించుచు ఉద్ధవుడును, నందుడును నాటిరేయి గడుపగ గోకులములోని గోపికలు నిద్రలేచి దధిమథనము గావించినవిధము, సూర్యోదయానంతరము గోపికలు గోకుల ద్వారముకడ నిలిచియున్న రథమునుచూచి

మరల అక్రూరుడు వచ్చినాడేమోయని భావించినవిధము, కంసునిచంపించి మరల యెందులకు వచ్చినాడని యాశంకించి కార్యమునూహించినవిధము (సం. భాగ. 10-46-44 నుండి 49 వఱకు) మూలమున కానవచ్చుచుండగ, అనువాదమున కానరాదు రసవత్తరమైన కృష్ణుని సందేశము గోపికలకందించు ఘట్టము పోతనను బాగుగ నాకర్షించి యుండుటచే అప్రయత్నముగనే ఇది విడువబడియుండునని ఊహించుట సమంజసము కాగలదు.

గోపికలు తన మనోవాక్కాయ కర్మలు గోవిందుని పొందినవి కాగా కృష్ణ సందేశమును గొనివచ్చిన ఉద్ధవుని గాంచి లోకవ్యవహారమంతయు వీడినవారై వారు శ్రీకృష్ణుడు చేసిన చేతలను గానముచేయుచు బాలుడుగా నున్నపుడు చేసిన పనులను తలంచి తలంచి సిగ్గులువీడి ఏడ్చుచున్నవారైరి. (సం. భాగ. 10-47-9,10) అని మూలమున నుండగ ననువాదమున నిది విడువబడినది. సిగ్గువీడియేడ్చిన గోపికలు వెంటనే భ్రమరగీతముల నాలపించుటలో నేర్పరితనము గానరాదు. గోపికలయొక్క జాణతనమును, బింకమును నిలువబెట్టుటకు సనిమిత్త సఖ్యమునుగూర్చి ప్రసంగించిన వెంటనే పోతన భ్రమర ప్రవేశమును చేయించినాడు. గోపకల రోదనమువకు నీఘట్టమునకు పొందిక తక్కువగానున్న కారణమున విడచియుండునని భావింపవచ్చును.

కృష్ణలీలలను వర్ణించుచు ఉద్ధవుడు వ్రేపల్లెలో కొన్ని నెలలుండెను అతడుండిన దినములన్నియు గోకులవాసులకు క్షణకాలమాత్రములై తోచెను. అతడు యమునా నదిని, బృందావనమును, గోవర్ధనగిరిని, పుష్పించినవృక్షములను చూచుచు, కృష్ణలీలలను ప్రశ్నించి గోకులవాసులకు కృష్ణుని జ్ఞప్తిపరచి స్మరింపజేయుచు, సంతోషించెను. గోపికలు తమ మనస్సును కృష్ణునందావేశింపజేసి పరవశులై యుండుటలోనగు, వారి ప్రేమను తిలకించి ఉద్ధవుడు మిగుల సంతోషించి వారికి నమస్కరించెను. అట్లు ఉద్ధవుడు గోపస్త్రీలకు నమస్కరించుట న్యాయమగునని వారి మహత్త్వమును గుఱించి

శ్లో. ఏతాః పరం తనుభృతో భువి గోపవధ్వో
గోవింద ఏవ నిఖిలాత్మని రూఢభావాః ।
వాంఛంతి యద్భవభియో మునయో వయం చ
కిం బ్రహ్మజన్మభిరనంత కథా రసస్య ॥

— సం. భాగ. 10-47-58 నుండి 62 వఱకు

ఇత్యాదిగ మూలమున నైదుశ్లోకములలో చెప్పబడెను. దీనికంతకును అనువాదము కానరాదు. గోపికలెంత ధన్యులరో, వారేలధన్యులైరో ఉద్ధవుని వచనములలో

ఈయధ్యాయమునందే 9 వివరముగ జెప్పబడుటయేగాక శ్రీకృష్ణుడు సైతము గోపికల విశిష్టతను తన సందేశములో చెప్పియున్నాడు. ఇట్లు గోపికల ధన్యత్వమును గురించి లోగడ వివరించుట జరిగినది. పురాణములలో పునరుక్తి దోషముకాదుగాని కావ్యము లందు దోషమే. ఆయా విశేషములొకే అధ్యాయమున పలుమార్లు చెప్పుటకంటె లోగడ వివరించిన విషయములు భావించుటకనువుగ తిరిగి చెప్పకుండుట మేలు. అట్లు విడచుట కావ్యశిల్పనిర్మాణము నందలి ధర్మము.

రుక్మిణీకళ్యాణఘట్టమున భీష్మకుడు తన కుమార్తె యగు రుక్మిణికి విప్రులచే మంగళోచితమైన క్రియలు చేయించినట్లే 'చేదిరాజు' 'దమఘోషుడు' తన పుత్రుడగు శిశుపాలుని క్షేమముకొరకు వేదమంత్రవిదులగు విప్రులచే నభ్యుదయోచితమైన మంగళక్రియలను చేయించెను. (సం. భాగ. 10-53-14) అని మూలమున నుండగా అనువాదమున శిశుపాలునకు ఇట్టిమంగళక్రియలు గావింపబడలేదు. ఈఘట్టమున రుక్మిణికిగావించిన మంగళక్రియలకు ఫలితము లభింపనున్నది. శిశుపాలుడాచరించిన మంగళక్రియలకు ప్రయోజనము శూన్యము. వేదవిదులైన విప్రులను, వారుచేయించిన మంగళక్రియలను, పాఠకులు అసంగతముగ నవగాహన చేసికొనుటకు అవకాశము గలదు. ఈ సందర్భమున ఆచారవ్యవహారములు ప్రదర్శితమైనను, ఇట్టి మంగళక్రియలు శిశుపాలునివంటివానికి తగవని భావింతురేగాని ఇందుండి లోకాచారమును గ్రహించుటకు సామాన్యపాఠకుడైనను ప్రయత్నింపడు. కావున నీపట్టున శిశుపాలున కిట్టి మంగళోచితక్రియలు నిష్ప్రయోజనములు, అనుచితములునగుటచే పోతన తన యనువాదమున విడచియుండవచ్చును.

బలరామకృష్ణులకు వసుదేవుడు బ్రహ్మతత్త్వమును వివరించుట మూలము నందు అతివిస్తృతముగ గలదు. (సం. భాగ. 10-85-1 నుండి 20 వరకు) అనువాదమున నీఘట్టము విడువబడినది. ఈ సందర్భమునందు చెప్పబడకపోయినను ఆయాఘట్టములందు బ్రహ్మతత్త్వము వ్యక్తీకరింబబడినదనుట యథార్థము. పరబ్రహ్మ స్వరూపులైన బలరామకృష్ణులకు, వసుదేవుడు బ్రహ్మతత్త్వమును గురించి వివరించుట పొందికలేనిదగుటచే దీనిని పోతన తన యనువాదమున విడచియుండవచ్చును.

పర్యాలోచనచేయగా పోతనయనువాదమున పరిత్యక్తాంశములు మిక్కిలి తక్కువయనియు, మూలమునందలి ఆయా అంశములు అనువాదమున విడువబడినను ఔచిత్యపోషకములై అలరారుచున్నవనియు చెప్పవచ్చును.

# అమూలకములు
# శ్రీధర వ్యాఖ్యాను సరణములు:

పోతన భాగవతము ప్రధానముగ వ్యాసభాగవతమునాధారముగగొని అనువదింప బడెననునది నిర్వివాదాంశము. ఇందు ప్రధానముగ అద్వైతతత్త్వప్రతిపాదనమందును తదితరములగు కొన్ని అంశముల నవగాహన చేసికొనుటయందును శ్రీధరవాఖ్య యందించిన విశ్లేషణము తనకు ఆమోదయోగ్యమగుటచే తదాధారముగకూడ పోతన తన యనువాదమును సాగించెనని చెప్పవలసియున్నది. పండిత ప్రకాండులనేకులీ యభిప్రాయముతో నేకీభవించుచున్నారు.

శ్రీధరీయానుసరణముగ ఈతని అనువాదమునచేరిన అంశములు యథార్థమునకు సమూలకములేగాని అమూలకములు గానేరవు. కాని ఈ సిద్ధాంతవ్యాసముయొక్క ప్రధానలక్ష్యమునుబట్టి వ్యాసభాగవతదశమస్కంధమున కానరాని అంశములమూలక ములుగ పరిగణింపబడునని ఈ యధ్యాయముయొక్క ప్రారంభమునందు వక్కాణించుట జరిగినది. కావున అమూలకములు – శ్రీధరీయానుసరణములునైన అంశములను గురించి యిందు చర్చింపబడుచున్నది.

మూలమునందలి యంశములను స్పష్టపరచుటయు, వానికి సంబంధించిన విశేషాంశములను గొన్ని చర్చించుటయు వ్యాఖ్యాతయొక్క ప్రధానలక్షణములు.

శ్రీధరుని వ్యాఖ్యలో స్పష్టత, సమగ్రత కానవచ్చిన కొన్నితావులందు పోతన తానుకూడ దానిని సమగ్రముగ సంగీకరించుచు ఆమేరకే ఆపదములతోనే వివరించు పద్యములువ్రాసి శ్రీధరవ్యాఖ్య నత్యంత సన్నిహితముగ ననుసరించిన ఘట్టములను పోతన యనువాదమున గానవచ్చుచున్నవి.

దేవకీగర్భస్థుడైన పురుషోత్తముని సత్యస్వరూపునిగ దేవతలు స్తుతించుచు

శ్లో. సత్యవ్రతం సత్యపరం త్రిసత్యం
సత్యస్య యోనిం నిహితం చ సత్యే
సత్యస్య సత్యమృతసత్యనేత్రం
సత్యాత్మకం త్వాం శరణం ప్రపన్నాః ||

– సం భాగ. 10-2-26

అను మూలము నందలి శ్లోకమునకు వ్యాఖ్యారూపముగ పోతన యిట్లనువదించెను.

సీ. సత్యవ్రతుని నిత్యసంప్రాప్తిసాధనుఁ
గాలత్రయమునందుఁ గలుగువాని
భూతంబులైదును పుట్టుచోటగువాని
నైదుభూతంబులం దమరువాని
నైదుభూతంబులు నణఁగినఁ బిమ్మటఁ
బరఁగువానిని సత్యభాషణంబు
సమదర్శనంబును జరిపెడువానిని
నిన్నాశ్రయింతుము నీ యధీన

ఆ. మాయచేత నెఱుకమాలినవారలు
పెక్కుగతుల నిన్నుఁ బేరుకొందు
రెఱుఁగనేర్చువిబుధు లేకచిత్తంబున
నిఖిలమూర్తులెల్ల నీవ యండ్రు.

- ఆం. భాగ. దశను. పూ. భా. 89

మూలమునందలి శ్లోకమునకు శ్రీధరవ్యాఖ్య యిట్లున్నది. "ప్రతి శృతం సత్యం కృతమితి హృష్టాః. సత్యత్వేనైవ ప్రథమంస్తువంతి. సత్యవ్రతమితి. సత్యం వ్రతం సంకల్పోయస్యతం. సత్యంపరం శ్రేష్ఠం. ప్రాప్తిస్థానమ్ యస్మిన్‌తం. త్రిసత్యం త్రిష్వపికాలేషు సృష్టేః పూర్వం ప్రళయానంతరం స్థితిసమయేచ సత్యం అవ్యభిచారేణ వర్తమానం తదేవాహుః సత్యస్యయోనిమితి. సచ్ఛబ్దేన పృథివ్యప్తేజాంసి, త్యశబ్దేన వాయ్వాకాశా ఏవం సచ్చత్యంచ సత్యం, భూతపంచకం "శ్రుతత్సత్యమిత్యాచక్షత" ఇతిశ్రుతేః. యోనింకారణమ్, అనేనసృష్టేః పూర్వం వర్తమానతోక్తా. తథా సత్యే తస్మిన్నేవనిహితం అంతర్యామితయా స్థితమ్. అనేన స్థితిసమయేఽపి వర్తమానతోక్తా తథాచ సత్యస్య సత్యం సత్యస్యైకస్య సత్యం పారమార్థికం తన్నాశేఽప్యవశిష్యమాణరూపం అనేనప్రళయేఽప్యవధిత్వేన సత్యత్వందర్శితమ్. ఏవం త్రిసత్యత్వముపపాదితమ్. తథా ఋతస్య నేత్రం ఋతంచ సూనృతవాణీ. సత్యంచ సమదర్శనమ్. తథా భగవతా వ్యాఖ్యాస్యమానత్వాత్. శ్లో. "సత్యంచ సమదర్శనం, ఋతంచ సూనృతావాణీ కవిభిః పరికీర్తితే"తి. తయోర్నేత్రం నయన సాధనం నేతారం ప్రవర్తకమితి యావత్. ఏవం సర్వప్రకారేణ సత్యాత్మకం త్వాం భగవన్

వయం శరణం ప్రపన్నాః ప్రాప్తా ఇతి." ఈ పరమసత్యముయొక్క విస్త మూలములో ననేక విధములుగ చెప్పిన పదములకర్థము వివిధములుగ చెప్పబడక మున్నను వివరణ పరిమితిలోను, వివరణకు సంబంధించిన నాయాపదముల క్రమ ములోను శ్రీధరవ్యాఖ్యకు పోతన పద్యమత్యంత సన్నిహితమగుట గమనించవ యున్నది.

శ్లో. ఏకాయనోఽసౌ ద్విఫలస్త్రిమూల
శ్చతూరసః పంచవిధః షడాత్మా ।
సప్తత్వగష్టవిటపో నవాక్షో
దశచ్ఛదీ ద్విఖగో హ్యాదివృక్షః ॥

- సం. భాగ. 10-2-27

అని మూలమున ప్రపంచమను ఆదివృక్షమును వర్ణించెను. పాఠకులక గాహన యగుటకు కొంతవరకు వివరణమవసరమని భావించిన పోతన వివర ప్రాయముగ వ్రాసిన ఈక్రింది పద్యమును పరికింతము

సీ. ప్రకృతియొక్కటిపాదు ఫలములు సుఖదుఃఖ
ములు రెండు గుణములు మూఁడు వేళ్ళు
తగు రసంబులు నాల్గు ధర్మార్థముఖరంబు
లెఱిఁగెడి విధము లైదింద్రియంబు
లాఱు స్వభావంబు లా శోకమోహాదు
లూర్ములు ధాతువు లొక్క యేడు
పై పొర లెనిమిది ప్రంగలు భూతంబు
లైదు బుద్ధియు మనోఽహంకృతులును

తే. రంధ్రములు తొమ్మిదియుఁ గోటరములు ప్రాణ
పత్రదశకంబు జీవేశపక్షియుగము
గలుగు సంసారవృక్షంబుఁ గలుగఁజేయఁ
గావ నణఁగింప రాజవొక్కరుఁడ వీవ.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 91

మూల శ్లోకమునకు శ్రీధరుని వ్యాఖ్యానమిట్లున్నది.

"లోకాది రూపం ద్వైతంచ సర్వం తద్వ్యతిరేకేణ నాస్తీతివక్తుం ద్వైత ప్రపంచం వృక్షరూపేణ నిరూపయన్తి- ఏకాయన ఇతి. అసౌ ప్రపంచః ఆదివృక్షః వృశ్చ్యత ఇతివృక్షః. సమష్టి వ్యష్టి దేహరూపః. కథంభూతః. ఏకాయనః ఏకాప్రకృతిః అయనం ఆశ్రయో యస్యసః. ద్వేసుఖదుఃఖే ఫలే యస్యసః. త్రియో గుణాస్సత్త్వా దయో మూలానియస్యసః. ధర్మార్థకామ మోక్షాశ్చత్వారో రసాయస్యసః. పంచఇంద్రి యాణి శిఫా జ్ఞానప్రకారా యస్యసః. షడూర్మయః. శ్లో. "బుభుక్షాచ పిపాసాచ ప్రాణాస్యమనసః స్మృతౌ। శోకమోహౌ శరీరస్య జరామృత్యూ షడూర్మయః॥" కోశావా. త్వగ్రుధిర మాంసమేదోఽస్థి మజ్జా ఏతే షట్కోశాః. ఆత్మానః స్వభావాః యస్యాసః షడాత్మా. సప్త ధాతవః త్వచో యస్యసః. పంచభూతాని మనోబుద్ధ్య హంకారాశ్చేత్యష్టౌ. విటపాః శాఖా విస్తరా యస్యసః. నవాక్షః నవద్వారాణి అక్షీణి ఛిద్రాణి యస్య. దశప్రాణాః. నాగకూర్మకృకర దేవదత్త ధనంజయప్రాణా పాన వ్యానోదానసమానాః. ఛదాః పత్రాణి యస్యసః దశచ్ఛదః. ద్వౌ జీవేశ్వరౌ ఖగౌ యస్మిన్ సః ద్విఖగః."

పోతన అనువాదమును శ్రీధరవ్యాఖ్యను పరిశీలించినచో మూలమునకు వివర ణాత్మకముగా వ్రాసిన పోతన పద్యములో శ్రీధరుని వివరణను కొన్నిచోట్ల సన్ని హితముగాను, మరికొన్నిచోట్ల నతి సన్నిహితముగను అనుసరించినవిధము గానవచ్చు చున్నది.

ఉపర్యుక్తోదాహరణములందువలె పోతన తన అనువాదమున శ్రీధరవ్యాఖ్యను సన్నిహితముగాను, అతిసన్నిహితముగాను అనుసరించుటయేగాక అంతంతమాత్రముగ ననుసరించిన ఘట్టములును గానవచ్చుచున్నవి. ఉదాహరణమునకు నీక్రింది దానిని పేర్కొనవచ్చును.

దేవకీగర్భస్థుడైన పురుషోత్తముని దేవతలు స్తుతించుఘట్టమున

శ్లో. తథా న తే మాధవ తావకాః క్వచిత్
భ్రశ్యన్తిమార్గాత్త్వయి బద్ధసౌహృదాః।
త్వయాభిగుప్తా విచరన్తి నిర్భయా
వినాయకానీకపమూర్ధసు ప్రభో॥

—సం భాగ. 10-2-33

ఓమాధవా ! నీభక్తులు నీయందు నిర్మలమైన మనస్సు సమకూర్చినవారై మోక్షమార్గమునుండి జారిపడరు. నీచేతి ప్రాపును పొందినవారుగావున భయ

రహితులై 'వినాయకానీకపమూర్ధములందు విహరింతురు.' అని మూలమునందు కానవచ్చుచున్నది. ఇందలి 'వినాయకానీకపమూర్ధసు' అను దానికి శ్రీధరుని వ్యాఖ్యాన మిట్లున్నది. "త్వదీయాస్తు న కదాచిదపి పతన్తీత్యాహుః తథేతి వినాయకాః విఘ్న హేతవః తేషామనీకాని స్తోమాః తాని పాంతియే. తేషాం మూర్ధసు. విచరన్తి విఘ్నాన్ జయన్తీత్యర్థః. యద్వాత్వద్రూపాః ప్రత్యేకం వినాయకానీకపమూర్ధసు గరుడానాం మూర్ధసు చరన్తి."

శ్రీధర వ్యాఖ్యానమున వివరింపబడిన అర్థద్వయమును దృష్టిలో నిడుకొని పోతన

క. నీవారై నీదెసఁ దమ
భావంబులు నిలిపి ఘనులు భయవిరహితులై
యే విఘ్నంబులఁ జెందక
నీ వరయగ మేటిచోట నెగడుదు రీశా!

- ఆం. భాగ. దశమ. పూ. భా. 95

అనుపద్యమునందు 'ఏవిఘ్నంబులఁజెందక, నీవరయగ మేటిచోట నెగడుదురు' అని చెప్పియుండునని భావింపవచ్చును.

కథకు, రసభావములకు, సంబంధించినవిగాక, వ్యాఖ్యాతలు వివరణనిచ్చెడి తావులందు సైతము, ఒక్కొక్కచో పోతన శ్రీధరవ్యాఖ్యాననుసరించినట్లు చెప్పవచ్చును.

అఘాసుర సంహారగాథను శుకుడు పరీక్షిన్మహారాజుతో చెప్పెడి సందర్భమున మూలమునందలి

శ్లో. ఏతత్కౌమారజం కర్మ హరేరాత్మాహిమోక్షణమ్ ।
మృత్యోః పౌగండకే బాలా దృష్ట్వోచుర్విస్మితా వ్రజే ॥

-సం. భాగ. 10 12-37

అను శ్లోకమననువదించుచు పోతన

"......ఇట్లు కౌమారవిహారంబున నైదవయేట కృష్ణుండ ఘాసురునిం దెగఁజూచుటయుఁ దమ్ముం గాచుటయు, నాఱవయేటిదైన పౌగండవృత్తాంతంబని చిత్తంబులం గోపకుమారులు దలంపు చుందురు. ......"

ఆం. భాగ దశమ. పూ. భా. 485

అని కౌమారక పౌగండక పదముల వివరణమునిచ్చియున్నాడు. మూలశ్లోకమునకు శ్రీధరస్వామి రచించిన వ్యాఖ్య పై వివరణమునకు సహకరించి యుండవచ్చును. ఈ పదములకు శ్రీధరవ్యాఖ్యలో ఈ క్రిందివివరణము కానవచ్చుచున్నది.

"ఏతదితి శ్లో. కౌమారం పంచమాబ్దాంతం పౌగండం దశమావధి ।
కైశోర మాపంచదశాద్యౌవనంతు తతః పరం॥

హరేః కౌమారజం పంచమాబ్దకృతం కర్మ తథైవ దృష్ట్వా పౌగండకే షష్ఠేఽబ్దే బాలా అద్యైవ తద్వృత్తమిత్యూచుః."

తదుపరి దీనికి కారణమడుగు పరీక్షిన్మహారాజు పల్కులలోఁగూడ మూలమున 'కౌమారే, పౌగండకే' అనియుండగా ననువాదమున పై వ్యాఖ్యానాధారముగాఁగొనియే

సీ. ఐదేండ్లు కౌమార మటమీఁద నైదేండ్లు
పౌగండ మనియెడు ప్రాయమందు
నైదేండ్లవాఁడైన యబ్జాక్షుచరితంబు
పౌగండమని గోపబాలురెల్లఁ
దలఁతురంటివి యెట్లు తలఁతురు ....

- ఆం. భాగ. దశమ. పూ. భా. 486

అని వివరించియుండునని భావింపవచ్చును.

కాళియమర్దనము గావించిన శ్రీకృష్ణుని నాగపత్నులు స్తుతించినవిధము మూలమున నీక్రిందివిధముగానున్నది.

శ్లో. నమస్తుభ్యం భగవతే పురుషాయ మహాత్మనే।
భూతావాసాయ భూతాయ పరాయ పరమాత్మనే॥

శ్లో. జ్ఞానవిజ్ఞాననిధయే బ్రహ్మణేఽనన్తశక్తయే।
అగుణాయావికారాయ నమస్తేఽప్రాకృతాయచ॥

శ్లో. కాలాయ కాలనాభాయ కాలావయవసాక్షిణే।
విశ్వాయ తదుపద్రష్టే తత్కర్త్రే విశ్వహేతవే॥

..........................................

..........................................

శ్లో. పరావరగతిజ్ఞాయ సర్వాధ్యక్షాయ తే నమః ।
అవిశ్వాయ చ విశ్వాయ తద్ద్రష్ట్రేఽస్య చ హేతవే॥

- సం. భాగ. 10-16-39 నుండి 48 వఱకు

ఈ సందర్భమున పురుషాయ మహాత్మనేత్యాది పదములకు శ్రీధరుని వివరణ మెట్లున్నదో పరికింతము.

"నమ ఇతి. భగవతే అంచిత్యైశ్వర్యాదిగుణాయ కించ. పరమాత్మనే తదుపాదానాయ ఏతాని దశభిశ్శ్లోకైర్విశేషణాని. పురుషాయ పూర్షు అంతర్యామిరూపేణ వర్తమానాయ. మహాత్మనే ఏవమప్యపరిచ్ఛిన్నాయ కుతః భూతావాసాయ ఆకాశాద్యాశ్రయాయ. తదపి కుతః ? భూతాయ పూర్వమపి స తే కుతః ? పరాయ కారణాయ. కించ పరమాత్మనే కారణాతీతాయేతివా. 39. కారణత్వం కారణాతీతత్వంచ సమర్థయితుమాహుః - జ్ఞానేతి. జ్ఞానవిజ్ఞాననిధయే. జ్ఞానం జ్ఞప్తిః, విజ్ఞానం చిచ్ఛక్తిః. తయోర్నిధయే. తాభ్యాం పరిపూర్ణాయ కథంతదాత్వమత క్తం. బ్రహ్మణే అనంతశక్తయే. బ్రహ్మణే కథం భూతాయ ? అగుణాయ వికారాయ. పునః కథం భూతాయ. అనంతశక్తయే. ప్రాకృతాయ ప్రకృతిప్రవర్తకాయ. యద్వా అప్రాకృతాయ అప్రాకృతానంతశక్తియుక్తాయ అయమర్థః. అగుణత్వాదవికారం బ్రహ్మజ్ఞప్తిమాత్రత్వాత్కారణాతీతం ప్రకృతిప్రవర్తానంతశక్తివిజ్ఞాననిధిత్వాదీశ్వరః కారణం. తదుభయాత్మనే నమ ఇతి 40. ... ... ...

... ... ... ... ... ... ...

పరాపరేతి. కుతః పరాపరగతిజ్ఞాయ స్థూల సూక్ష్మాణాం గతిజ్ఞత్వేన న క్వాపి సజ్జమానాయేత్యర్థః, సర్వాధ్యక్షాయ సర్వస్యాధిష్ఠాత్రే. కుతఏతత్. అవిశ్వాయ, నవిశ్వం యస్మిన్. తన్నిషేధావధయే విశ్వాయ చ తద్వివరాధిష్ఠానాయేత్యర్థః. తద్ద్రష్ట్రే అధ్యాసాపవాదసాక్షిణే అపి చ. అస్య చ విశ్వాధ్యాసస్య, తదపవాదస్య చ విద్యావిద్యాభ్యాం హేతవే యద్వా. అవిశ్వాయ విశ్వతైజసాద్యవస్థారహితాయ విశ్వాయ మాయయా స్వాంశైస్తత్తదవస్థాయ. దద్రష్ట్రే తాసామవస్థానాం భావాభావసాక్షిణే. అన్యత్సమానం. తస్మాత్సర్వజ్ఞత్వ సర్వాధిష్ఠాతృత్వాత్మారామత్వాదిభిర్నిరతిశయైశ్వర్యాయ తుభ్యం నమ ఇతి.

శ్లో. విశేషణై రసంకీర్ణైః పంచ పంచాశతానుతః ।
అహిత్రీభిః ప్రసన్నో యస్తాసామేవ భవేద్ధరిః ॥

- శ్రీధరీయోయం శ్లోకః. 48"

పై వివరణమును సహాయముగాగొని పోతనగావించిన అనువాదమును పరికింతము.

"వ. దేవా ! సకలపురుషాంతర్యామిరూపత్వంబువలనఁ బరమపురుషుండవయ్యు, నపరిచ్ఛిన్నత్వంబువలన మహాత్ముండవయ్యు, నాకాశాదిభూతసమాశ్రయత్వంబువలన భూతవాసుండవయ్యు, భూత

మయత్వంబువలన భూతశబ్దవాచ్యుండవయ్యుం, గారణాతీతత్వంబు వలనం బరమాత్ముండవయ్యు, జ్ఞానవిజ్ఞానపరిపూర్ణత్వంబుగలిగి, నిర్గుణత్వనిర్వికారత్వంబువలన బ్రహ్మంబవయ్యుం, బ్రకృతిప్రవర్తకత్వంబునవలన ననంతశక్తివై, యప్రాకృతుండవయ్యును, గాలచక్రప్రవర్తకత్వంబునం గాలుండవయ్యుం, గాలశక్తిసమాశ్రియత్వంబు వలనం గాలనాభుండవయ్యుం, జిన్మయత్వంబువలన మహాత్ముండ వయ్యు, సృష్టిజీవనసంహారాదిదర్శిత్వంబువలనం గాలావయవసాక్షి వయ్యు, నొప్పు నీకు నమస్కరించెదము.

సీ. విశ్వంబు నీవయై విశ్వంబుఁ జూచుచు
విశ్వంబుఁ జేయుచు విశ్వమునకు
... ... ... ... ... ... ...
... ... ... ... ... ...

నీవు విశ్వంబు కాకయు, విశ్వంబు నీవ యయ్యును, విశ్వభావాభావ సందర్శనంబు సేయుచు, విద్యావిద్యలకు హేతువైన నీకుం బ్రణామంబు లాచరించెదము. ”

- ఆం. భాగ. దశమ. పూ. భా. 678, 679, 680

సంబుద్ధిపదములలోగల విశిష్టతను, శ్రీధరునివివరణమును తోడుచేసుకొని చెప్పినచో మఱింత స్పష్టముగానుండుటయేగాక ప్రభావవంతముగకూడ నుండునను సంకల్పమే యీ పట్టున పోతన తనయనువాదమున శ్రీధరకృత వివరణసహితములగు మూలమునందలి సంబుద్ధిపదముల గ్రహించుటకు కారణము.

శ్రీకృష్ణుని రాసక్రీడనుగుఱించి వినిన పరీక్షిన్మహారాజు 'ధర్మరక్షణ సేయుటకు ధరమీద నవతరించిన శ్రీకృష్ణుడు ధర్మవ్యతిక్రమమగు పరస్త్రీసంగమమునెట్లాచరించె'నని శుకుని ప్రశ్నించగా దానికి సమాధానమొసంగుచు నాతడిట్లు పల్కియున్నాడు.

శ్లో. ధర్మవ్యతిక్రమో దృష్ట ఈశ్వరాణాం చ సాహసమ్ ।
తేజీయసాం న దోషాయ వహ్నేః సర్వభుజో యథా॥

- సం. భాగ. 10-33-30

ఈ శ్లోకమునకు శ్రీధరస్వామి తన వ్యాఖ్యలో "ధర్మవ్యతిక్రమ ఇతి. సాహసం చ. దృష్టం ప్రజాపతీంద్రసోమవిశ్వామిత్రాదీనాం. తచ్చ తేషాం తేజస్వినాం దోషాయ

వయం శరణం ప్రపన్నాః ప్రాప్తా ఇతి." ఈ పరమసత్యముయొక్క విస్తృతిని మూలములో ననేక విధములుగ చెప్పిన పదములకర్థము వివిధములుగ చెప్పుటకవకాశ మున్నను వివరణ పరిమితిలోను, వివరణకు సంబంధించిన నాయాపదముల ప్రయోగ ములోను శ్రీధరవ్యాఖ్యకు పోతన పద్యమత్యంత సన్నిహితమగుట గమనించవలసి యున్నది.

శ్లో. ఏకాయనోఽసౌ ద్విఫలస్త్రిమూల
శ్చతూరసః పంచవిధః షడాత్మా ।
సప్తత్వగష్టవిటపో నవాక్షో
దశచ్ఛదీ ద్విఖగో హ్యాదివృక్షః ॥

- సం. భాగ. 10-2-27

అని మూలమున ప్రపంచమను ఆదివృక్షమును వర్ణించెను. పాఠకులకవ గాహన యగుటకు కొంతవరకు వివరణమవసరమని భావించిన పోతన వివరణ ప్రాయముగ వ్రాసిన ఈక్రింది పద్యమును పరికింతము

సీ. ప్రకృతియొక్కటిపాదు ఫలములు సుఖదుఃఖ
ములు రెండు గుణములు మూఁడువేళ్ళు
తగు రసంబులు నాల్గు ధర్మార్థముఖరంబు
లెఱిఁగెడి విధము లైదింద్రియంబు
లాఱు స్వభావంబు లా శోకమోహాదు
లూర్ములు ధాతువు లొక్క యేడు
పై పొర లెనిమిది ప్రంగలు భూతంబు
లైదు బుద్ధియు మనోఽహంకృతులును

తే. రంధ్రములు తొమ్మిదియుఁ గోటరములు ప్రాణ
పత్రదశకంబు జీవేశపక్షియుగము
గలుగు సంసారవృక్షంబుఁ గలుగఁజేయఁ
గావ నణఁగింప రాజవొక్కరుఁడ వీవ.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 91

మూల శ్లోకమునకు శ్రీధరుని వ్యాఖ్యానమిట్లున్నది.

మూఢులు బీభత్సమును బొంద వికటుఁడై
తండ్రికి దయ రాఁగఁ దనయుఁ డగుచు
ఖలులకు విరసంబుగా దండియై గోప
కులకు హాస్యంబుగఁ గుఱ్ఱఁ డగుచు

ఆ. బాంధవులకుఁ బ్రేమభాసిల్ల వేలుపై
శాంతమొనర యోగిజనుల కెల్లఁ
బరమ తత్త్వమగుచు భాసిల్లె బలునితో
మాధవుండు రంగమధ్యమందు.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1322

ఈ పట్టున రసనామములను పేర్కొనక పలువురకు పలువిధములుగ కన్పట్టినట్లు మూల మునుండగ, వేరువేరువర్గములవారికి వివిధరసరూపములలో కన్పట్టినట్లు రసనామము లను పేర్కొనుచు వివరించిన శ్రీధరునివ్యాఖ్యకును,[10] ఆమార్గముననే సాగిన పోతన యనువాదమునకును సన్నిహితత్వము గలదు.

రుక్మిణీసందేశహారియైన బ్రాహ్మణుడు శ్రీకృష్ణునిచెంతకేగి, తిరిగివచ్చి యామెతో పల్కినపల్కులు మూలముననిట్లున్నవి.

శ్లో. తస్యా ఆవేదయ త్ప్రాప్తం శశంస యదునందనమ్ ।
ఉక్తం చ సత్యవచనమాత్మోపనయనం ప్రతి ॥

- సం. భాగ. 10-53-30

ఇందలిభావము స్పష్టముగా బోధపడుటలేదు కావున నీభావమునకు వివరణాత్మక ముగా పోతనబ్రాహ్మణుడు రుక్మిణితోనిట్లుచెప్పెను.

ఉ. మెచ్చె భవద్గుణోన్నతి కమేయ ధనాదుల నిచ్చె నాకుఁ దా
వచ్చె సుదర్శనాయుధుడు వాఁడె సురాసురు లెల్ల నడ్డమై
వచ్చిననైన రాక్షసవివాహమునన్ గొనిపోవు నిన్ను నీ
సచ్చరితంబు భాగ్యమును సర్వము నేడు ఫలించెఁ గన్యకా!

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1733

ఈవిధమైన వివరణకు శ్రీధరస్వామి వ్యాఖ్యయు కొంత సహకరించియుండవచ్చును. మూలశ్లోకమునందలి 'ఆత్మోపనయనం' అనుపదమును శ్రీధరస్వామి మూడువిధము

లుగా వివరించియున్నారు. "ఆత్మోపనయనం ప్రతి - ఆత్మనా స్వయం కృష్ణస్య ఆనయనం ప్రతి (తాను స్వయముగా కృష్ణునితీసుకొనివచ్చుటనుగూర్చియు), ఆత్మనః ప్రాణేశ్వరస్యేతివా (ప్రాణేశ్వరుని తీసుకొనివచ్చుటనుగూర్చియు), ఆత్మనః తస్యాః ఉపనయనం ప్రతి (రుక్మిణిని తీసుకొనిపోవుటనుగూర్చియు)" అని. ఇట్టి యాత్మోపనయనమునుగూర్చి శ్రీకృష్ణునిచే చెప్పబడిన సత్యవాక్కు, బ్రాహ్మణునిచే రుక్మిణికి చెప్పబడినదని, శ్రీధరవ్యాఖ్యానమునందలి యీభావములను పోతన తన సహజకవితా ధోరణిలో మఱికొంతవివరముగా చెప్పియున్నాడు.

ఈవిధముగా పర్యాలోచనచేయగా పోతన తనయనువాదమున భగవత్తత్త్వ ప్రతిపాదనమునందతిసన్నిహితముగను, తదితరములగు నాయా యంశములందంతంత మాత్రముగను, శ్రీధరవ్యాఖ్యననుసరించినట్లు స్పష్టమగుచున్నది.

## ఆధ సూ చి క లు

1. ఆంధ్రవాఙ్మయారంభదశ, ద్వి. సం. నన్నయభారతము; పుట : 522
2. ఆం. భాగ. ఆం. ప్ర. సా. అ. ప్రచురణ; పీఠిక; పుట : 26
3. శ్రీమద్భాగవతానుశీలనము; పుట : 232
4. ఆంధ్ర భాగవత విమర్శ; పుట : 162
5. సం. భాగ. 10_9_17
6. ఆం. భాగ. దశమ. పూ. భా. 383
7. ఈరెండు పద్యములును తాళపత్రప్రతులలో లేవని అకాడమీవారి భాగవత సంపాదకవర్గము చెప్పియున్నారు.
8. విష్ణుకథాః అనునది పాఠాంతరము. పోతన యనువాదమునందలి ప్రయోగమునుబట్టియేగాక, పరీక్షిన్మహారాజు కేవలము కృష్ణకథలేగాక విష్ణుకథలన్నిటిని వినుచుండుటనుబట్టియు ఈపాఠమే మూలమునందలి పాఠముగా గ్రహింపవచ్చును. లేదా పోతన గ్రహించిన ప్రతిలో ఈ పాఠముండియుండవచ్చును.
9. సం. భాగ. 10_47_23 నుండి 29 వఱకు.
10. చూడుము. సం. భాగ. 10_43_17 శ్రీధర వ్యాఖ్య.

# తృతీయాధ్యాయము

# యథామూలములు - మూలప్రాయములు

పూర్వాధ్యాయమున ప్రదర్శింపబడిన పోతనయనువాదమునందలి యమూలకముల విరాట్స్వరూపమును తిలకించి ఈతని అనువాదమాద్యంతము మూలభిన్నమని భావింపదగదు. పోతనయనువాదమున యథామూలముగ వెలసిన తావులును లెక్కకు మిక్కిలిగా కలవు. ఇచట యథామూలానువాదమన యథామూలభావానువాదమేగాని యథామూలపదానువాదము గాదు. పోతనదృష్టి ప్రధానముగా మూలమునందలి భావములపైనుండుటయేగాక, ఒక భాషనుండి వేరొక భాషలోనికనువదించునపుడు యథామూలభావానువాదమేగాని పదానువాదము పొసగదుగదా! మూలమునందలి భావములకు ఎట్టి మార్పు చేయక చాలవఱకు ఉన్నదియున్నట్లుగాననువదించుటయే యథామూలభావానువాదము. పోతన పెక్కుభావములను యథామూలముగా వెలయించి తన యనువాదకౌశలమును ప్రకటించుట ప్రశంసార్హము. ఈతని యనువాదమున వెలసిన యథామూలములనుగుఱించి స్థాలీపులాకముగానిట చర్చింతము.

మూలమునందలి కర్మవాదములను, పరమాత్మతత్త్వమును యథాతథముగ అనువాదమున పొందుపఱచుట కన్పట్టును.

ఆకాశవాణి పలుకులువిని దేవకిని తెగవేయ గమకించు కంసునిగని వసుదేవుడు పలికినతీరు గమనింతము.

శ్లో. మృత్యుర్జన్మవతాం వీర దేహేన సహ జాయతే ।
అద్య వాబ్దశతాంతే వా మృత్యుర్వై ప్రాణినాం ధ్రువః ॥

శ్లో. దేహే పంచత్వమాపన్నే దేహీ కర్మానుగోఽవశః ।
దేహాంతరమనుప్రాప్య ప్రాక్తనం త్యజతే వపుః ॥

శ్లో. వ్రజంస్తిష్ఠన్ పదైకేన యథైవైకేన గచ్ఛతి ।
యథా తృణజలూకైవం దేహీ కర్మగతిం గతః ॥

శ్లో. స్వప్నే యథా పశ్యతి దేహమీదృశం
మనోరథేనాభినివిష్ట చేతనః ।
దృష్టశ్రుతాభ్యాం మనసానుచింతయన్
ప్రపద్యతే తత్ కిమపి హ్యపస్మృతిః ॥

శ్లో. జ్యోతిర్యథైవోదక పార్థివేష్వదః
సమీరవేగానుగతం విభావ్యతే ।
ఏవం స్వమాయారచితేష్వసౌ పుమాన్
గుణేషు రాగానుగతో విముహ్యతి ॥

- సం. భాగ. 10-1-38, 39, 40, 41, 43

పై భావములు యథాతథముగా నీక్రిందివిధమున ననువాదమున వెలసినవి.

సీ. మేనితోడనె పుట్టు మృత్యువు జనులకు
నెల్లి నేఁడైన నూఱేండ్లకైనఁ
దెల్లంబు మృత్యువు దేహంబు పంచత
నందఁ గర్మానుగుఁడై శరీరి
మాఱుదేహము నూది మఱితొంటి దేహంబుఁ
బాయును దనపూర్వభోగమెత్తి[1]
నేఱొంటిపైఁ బెట్టి వెనుక భోగంబెత్తి
గమనించు తృణజలూకయును బోలె

ఆ. వెంటవచ్చు కర్మవిసరంబు మును మేలు
కన్నవేళ నరుఁడు గన్న విన్న
తలఁపఁబడిన కార్యతంత్రంబు కలలోనఁ
బాడితోడఁ గానబడినయట్లు.

ఆ. జలఘటాదులందుఁ జంద్రసూర్యాదులు
గానఁబడుచు గాలిఁ గదలు భంగి
నాత్మ కర్మనిర్మితాంగంబులను బ్రాణి
గదలుచుండు రాగ కలితుఁడగుచు

- ఆం. భాగ. దశమ. పూ. భా. 29, 31

నందాదులింద్రయాగంబు సేయదలంచ శ్రీకృష్ణుడు వారిని వారించి వారికి కర్మవాదము బోధించిన తీరు

శ్లో. కర్మణా జాయతే జంతుః కర్మణైవ విలీయతే ।
సుఖం దుఃఖం భయం క్షేమం కర్మణైవాభిపద్యతే ॥

- సం. భాగ. 10-24-13

ఇత్యాదిగా, పదకొండు శ్లోకములలో మూలముననుండగా ఈ భావములే యథాతథముగా ననువాదమున

క. కర్మమునఁ బుట్టు జంతువు
కర్మమునన్ వృద్ధిఁ బొందుఁ గర్మమునఁ జెడున్
గర్మమె జనులకు దేవత
కర్మము సుఖదుఃఖములకుఁ గారణమధిపా !

- ఆం. భాగ. దశమ, పూ.భా. 882

మొదలగువిధముగ మూడు పద్యగద్యములలో ప్రత్యక్షమగుచున్నవి.

శ్రీకృష్ణుడుద్ధవునిచే గోపికలకు పంపిన సందేశములో చెప్పబడిన పరమాత్మ తత్త్వము, ఆత్మవిద్య, మూలముననిట్లు కానవచ్చుచున్నది.

శ్లో. భవతీనాం వియోగో మే న హి సర్వాత్మనా క్వచిత్।
యథా భూతాని భూతేషు ఖంవాయ్వగ్నిర్జలం మహీ ।
తథాహం చ మనః ప్రాణభూతేంద్రియ గుణాశ్రయః ॥

శ్లో. ఆత్మన్యేవాత్మనాత్మానం సృజే హన్మ్యనుపాలయే ।
ఆత్మమాయానుభావేన భూతేంద్రియగుణాత్మనా॥

శ్లో. ఆత్మా జ్ఞానమయః శుద్ధో వ్యతిరిక్తోఽగుణాన్వయః ।
సుషుప్తి స్వప్నజాగ్రద్భిర్మాయావృత్తిభిరీయతే ॥

శ్లో. యేనేంద్రియార్థాన్ ధ్యాయేత మృషాస్వప్నవదుత్థితః ।
తన్నిరున్ధ్యాదింద్రియాణి వినిద్రః ప్రత్యపద్యత ॥

శ్లో. ఏతదంతస్సమామ్నాయో యోగః సాంఖ్యం మనీషిణామ్ ।
త్యాగస్తపో దమః సత్యం సముద్రాన్తా ఇవాపగాః ॥

- సం. భాగ. 10-47-29 నుండి 33 వఱకు

పైన వివరింపబడిన తత్త్వమును యథాతథముగా అనువాదమున ప్రవేశపెట్టిన తీరు గమనీతము.

సీ. ఎల్ల కార్యములకు నేను ప్రధాన కా
రణము గావున మీరు రమణులార

కలుగదు మద్వియోగము చరాచరరూప
మ్ములలోఁ మహాభూతములు వసించు
కరణినుండుదు సర్వగతుఁడనై నే మనః
ప్రాణబుద్ధి గుణేంద్రియాశ్రయుండ
నాత్మయందాత్మచే నాత్మఁ బుట్టింతు ర
క్షింతును ద్రుంతు హృషీకభూత

తే. గుణ గణాకార మాత్మలోఁ గొమరుమిగులు
నిబిడ మాయానుభవమున నిత్యశుద్ధ
మాత్మ విజ్ఞానమయమునై యమరుగుణముఁ
బ్రకృతికార్యమనోవృత్తిఁ బట్టి పొందు

చ. కలఁ గని లేచి మున్ను కలఁగన్న సమస్తవిధంబు కల్లగా
దలఁచినభంగి మానసపదార్థముచే నిఖిలేంద్రియార్థముల్
బలమునఁ గట్టి తద్జ్ఞుఁడు ప్రపంచము లేదనుఁ దన్ మనంబు దా
రలయక గట్టుఁడున్ బుధుల కవ్వల నొండొక భేదమున్నదే.

ఆ. సాంఖ్యయోగ నిగమ సత్య తపోదమ
ములు మనో నిరోధములు గడపలఁ
గాఁగ నుండు జలధి కడపలగాఁ గల
నదులభంగి నళిన నయనలార !

- ఆం. భాగ. దశమ. పూ.భా. 1468, 1469, 1470

ఆయా భక్త్యంశములను పోతనయనువాదమున యథామూలముగా ప్రవేశించుట ప్రశంసార్హము.

వైరభక్తిపరుడైన కంసుడు 'జగము హరిమయ'మని తలచినవిధము మూలమున

శ్లో. ఆసీనః సంవిశంస్తిష్ఠన్ భుంజానః పర్యటన్ మహీమ్ ।
చింతయానో హృషీకేశమపశ్యత్ తన్మయం జగత్ ॥

- సం. భాగ. 10-2-24

అని వర్ణింపబడగా అనువాదమున అవిధముగనే

క. తిరుగుచుఁ గుడుచుచుఁ ద్రావుచు
నరుగుచుఁ గూర్చుండి లేచుచనవరతంబున్
హరిఁ దలఁచి తలఁచి జగమా
హరిమయ మని తలఁచెఁ గంసు డాఅని యలుకన్

- ఆం భాగ. దశమ. పూ.భా. 85

అని వెలయింపబడినది.

బ్రహ్మాదిదేవతలు దేవకీగర్భస్థుడగు స్వామిని స్తుతించు సందర్భమునందలి

శ్లో. బిభర్షి రూపాణ్యవబోధ ఆత్మా
క్షేమాయ లోకస్య చరాచరస్య
సత్త్వోపపన్నాని సుఖావహాని
సతామభద్రాణి ముహుః ఖలానామ్ ॥

శ్లో. త్వయ్యంబుజాక్షాఖిల సత్త్వధామ్ని
సమాధినాఽవేశిత చేతసైకే ।
త్వత్పాదపోతేన మహత్కృతేన
కుర్వంతి గోవత్సపదం భవాబ్ధిమ్ ॥

- సం. భాగ. 10-2-29, 30

అను శ్లోకములు పోతన యనువాదమున నీక్రిందిరీతిని వెలసినవి.

క. నీ దెసఁ దమచిత్తము విడి
యే వెసలంబోక కడతు రెఱుక గలుగువా
రాదూఢ యడుగుక్రియ నీ
పాదంబను నావకతన భవసాగరమున్.

ఆ. మంచివారికెల్ల మంగళప్రదమయ్యుఁ
గల్లరులకు మేలుగానియట్టి
తనువు లెన్నియైనఁ దాల్చి లోకములకు
సేమ మెల్లప్రొద్దుసేయు దీవు.

- ఆం. భాగ. దశమ. పూ.భా. 92, 93

శ్రీకృష్ణుడు యశోదకు విశ్వరూపప్రదర్శనము గావించిన విధము మూలమున

శ్లో. ఏకదార్భకమాదాయ స్వాంకమారోప్య భామినీ ।
ప్రస్నుతం పాయయామాస స్తనం స్నేహపరిప్లుతా ॥

శ్లో. పీతప్రాయస్య జననీ సా తస్య రుచిరస్మితమ్ ।
ముఖం లాలయతీ రాజంజృంభతో దదృశే ఇదమ్ ॥

శ్లో. ఖం రోదసీ జ్యోతిరనీకమాశాః
సూర్యేందువహ్ని శ్వసనాంబుధీంశ్చ ।
ద్వీపాన్ నగాం స్తద్దుహితౄర్వనాని
భూతాని యాని స్థిరజంగమాని ॥

శ్లో. సా వీక్ష్య విశ్వం సహసా రాజన్ సఞ్జాతవేపథుః ।
సమ్మీల్య మృగశాబాక్షీ నేత్రే ఆసీత్ సువిస్మితా ॥

- సం. భాగ 10-7-34, 35, 36, 37

అని వర్ణింపబడగా ననువాదమున

సీ. జననాథ ! యొకనాడు చన్ను చేపినఁ దల్లి
చిన్నిముద్దుల కృష్ణుఁ జేరఁదిగిచి
యెత్తి పెందొడలపై నిడికొని యొద్దాడి
చన్నిచ్చి నెమ్మోము చక్కనివిరి
యల్లని నగవుతో నావులించిన బాలు
వదనగహ్వరమున వారినిధులు
దిశలు భూమియు నవద్వీపశైలంబులు
నేఱులు గాలియు నినుఁడు శశియు

ఆ. దహనుఁ డాకసంబుఁ దారలు గ్రహములు
నఖిలలోకములుఁ జరాచరంబు
లైన భూతగణము లన్నియు నుండుటఁ
జూచి కన్నుమోడ్చి చోద్యపడియె.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 279

అని యథామూలముగ కానవచ్చుచున్నది 'ప్రస్నుతం స్తనం' అను సంస్కృత మూలమునకు 'చన్ను చేపిన' అనునది చక్కని తెలుగుసేత. ఈసందర్భమున మూలానువాదముల రెండింటను వాత్సల్యము, అద్భుతము చక్కగా స్పష్టపఱుపబడినవి.

అన్యులకు సాధ్యముకాని భగవత్ప్రసాదము యశోదకు లభించినదని వక్కాణించు సందర్భమునందలి

శ్లో. నేమం విరించో న భవో న శ్రీరప్యంగసంశ్రయా ।
ప్రసాదం లేభిరే గోపీ యత్తత్ ప్రాప విముక్తిదాత్ ॥
శ్లో. నాయం సుఖాపో భగవాన్ దేహినాం గోపికాసుతః ।
జ్ఞానినాం చాత్మభూతానాం యథా భక్తిమతామిహ ॥

— సం. భాగ. 10-9-20, 21

అను మూలమునకు

క. సంగడిఁ దిరిగెడు శంభుఁడు
సంగాశ్రయయైనసిరియు నాత్మజుఁడై యు
ప్పొంగెడు పద్మజుఁడును
గోపాంగనక్రియఁ గరుణ వడయ రక్షలేశ్వరుచేన్

క. జ్ఞానులచే మానులచే
దానులచే యోగసంవిధానులచేతన్
బూనినిబద్ధుండగు నే
శ్రీనాథుడు భక్తియుతులచేతం బోలెన్

— ఆం. భాగ. దశమ. పూ. భా. 387, 388

అనునది పోతనయనువాదము.

శ్రీకృష్ణుని గీతాగానమునువిని కొందఱుగోపికలు తమతమ గృహములలో నుండియే సంసారబంధవినిర్ముక్తలైనారని వర్ణించు సందర్భమున మూలములోని

శ్లో. అంతర్గృహగతాః కాశ్చిత్ గోప్యోఽలబ్ధవినిర్గమాః।
కృష్ణం తద్భావనాయుక్తా దధ్యుర్మీలితలోచనాః ॥
శ్లో. దుస్సహప్రేష్ఠవిరహ తీవ్రతాప ధుతాశుభాః ।
ధ్యానప్రాప్తాచ్యుతాశ్లేష నిర్వృత్యాక్షీణమంగళాః॥
శ్లో. తమేవ పరమాత్మానం జారబుద్ధ్యాపి సంగతాః ।
జహుర్గుణమయం దేహం సద్యః ప్రక్షీణబంధనాః ॥

— సం. భాగ. 10-29-9, 10, 11

అనుభావమునే అనువాదమునందును

మ. తరుణుల్ గొందఱు మూలగేహముల నుద్దండించి రారాక త
ద్విరహాగ్నిం బరితాప మొందుచు మనోవీథిన్ విభున్ మాధవున్
బరిరంభంబులు సేసి జారుఁ డనుచున్ భావించియుం జొక్కి పొం
దిరి ముక్తిన్ గుణదేహముల్ విడిచి ప్రీతిన్ బంధనిర్ముక్తలై.

- ఆం. భాగ. దశమ. పూ. భా 966

అని పొందుపఱచినాడు.

గోపికలు శ్రీకృష్ణుని ప్రార్థించినవిధము మూలానువాదములనిట్లు కానవచ్చు చున్నది.

శ్లో. ప్రణత దేహినాం పాపకర్శనం
తృణచరానుగం శ్రీనికేతనమ్ ।
ఫణిఫణార్పితం తే పదాంబుజం
కృణు కుచేషు నః కృన్ధి హృచ్ఛయమ్ ॥

- సం. భాగ, 10-31-7

అనుమూలమునకు

ఉ. గోవులవెంటఁ దిమ్మరుచుఁ గొల్చినవారల పాపసంఘముల్
ద్రోవఁగఁ జాలి శ్రీఁ దనరి దుష్టభుజంగ ఫణాలతాగ్ర సం
భావితమైన నీ చరణపద్మము చన్నులమీఁద మోపి త
ద్భావజ పుష్పభల్లభవబాధ హరింపు వరింపు మాధవా!

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1040

అనునది చక్కని తెలుగుచేత. ఈపట్టున మూలానువాదముల రెంటను గోపికల భక్తి భావము చక్కఁగా వ్యక్తీకరింపబడుచున్నది.

మూలమునందలి ధర్మ, నీతి ప్రబోధకములైన అంశములనువాదమున యథాతథముగ చోటుచేసుకొనుటయు కానవచ్చుచున్నది.

శ్రీకృష్ణుని చేరవచ్చిన గోపకాంతలనుద్దేశించి పల్కు సందర్భమున మూలమున

శ్లో. దుశ్శీలో దుర్భగో వృద్ధో జడో రోగ్యధనోఽపి వా ।
పతిః స్త్రీభిర్న హాతవ్యో లోకేప్సుభిరపాతకీ ॥

-సం భాగ, 10-29-25

అను శ్లోకమున స్త్రీలు భర్తను విడనాడుట భావ్యముకాదని చక్కఁగానుపదేశిం ఎగా ననువాదమునసైతము

క. నడవడి కొఱ గాకున్నను
బడుగైనఁ గురూపియైనఁ బామరుఁడైనన్
జడుఁడైన రోగియైనను
విడుచుట మర్యాదకాదు విభు నంగనకున్.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 978

అను పద్యమున యథాతథముగానుపదేశించినాడు.

బలరామకృష్ణులు, చాణూరముష్టికులతో మల్లయుద్ధమొనరించుచుండ పౌర కాంతలది యధర్మయుద్ధమని పల్కుచు, అట్టి ధర్మాతిక్రమణమును చూచినవారికిని దోషము కలుగునని మూలమునఁనీవిధముగా చెప్పఁబడినది.

శ్లో. న సభాం ప్రవిశేత్ ప్రాజ్ఞః సభ్యదోషాననుస్మరన్।
అబ్రువన్ విబ్రువన్నజ్ఞో నరః కిల్బిషమశ్నుతే॥

— సం. భాగ. 10-44-10

ఆ. సభకుఁ బోవఁజనదు సభవారిదోషంబు
నెఱిగి యూరకున్న నెఱుఁగకున్న
నెఱిగియుండియైన నిట్టట్టు పలికిన
బ్రాజ్ఞులైనఁ బొందుఁ బాపచయము

— ఆం. భాగ. దశమ. పూ. భా. 1356

అనునది పై శ్లోకమునకు చక్కని యనువాదము.

కంసవధానంతరము బలరామకృష్ణులు తమ తల్లిదండ్రులైన దేవకీవసుదేవులను సమీపించి, 'మీ పరిచర్య లోపించుటచే ధర్మహాని యేర్పడిన' దని వారితో పల్కుచు నిట్లు మూలమున వివరింపబడినది.

శ్లో. సర్వార్థసంభవో దేహో జనితః పోషితో యతః।
న తయోర్యాతి నిర్వేశం పిత్రోర్మర్త్యః శతాయుషా॥

శ్లో. యస్తయోరాత్మజః కల్ప ఆత్మనా చ ధనేన చ।
వృత్తిం న దద్యాత్తం ప్రేత్య స్వమాంసం ఖాదయన్తి హి॥

శ్లో. మాతరం పితరం వృద్ధం భార్యాం సాధ్వీం సుతం శిశుమ్।
గురుం విప్రం ప్రపన్నంచ కల్పోఽబిభ్రచ్ఛ్వసన్ మృతః॥

— సం. భాగ. 10-45-5, 6, 7

ఈ ధర్మపరిబోధ యథామూలముగ ననువాదమున ప్రవేశించినతీరు గమనింతము.

తే. ... ... ... ... ... ... ... ...
నిఖిల పురుషార్థహేతువై నెగడుచున్న
మేని కెవ్వార లాఢ్యులు మీర కారె
యా ఋణముఁ దీర్ప నూతేండ్లకైనఁ జనదు

క. చెల్లుబడి గలిగి యెవ్వఁడు
తల్లికిఁ దండ్రికిని దేహధనముల వృత్తుల్
సెల్లింపఁ డట్టి కష్టుఁడు
పల్లదుఁ డామీద నాత్మపలలాశి యగున్.

క. జననీ జనకుల వృద్ధులఁ
దనయుల గురువిప్రసాధు దారాదులనే
జనుఁడు ఘనుఁడయ్యుఁ బ్రోపక
వనయును జీవన్మృతుండు వాడు ధరిత్రిన్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1388, 89, 90

రుక్మిణిసందేశమును గ్రహించి శ్రీకృష్ణునిచెంతకేగిన బ్రాహ్మణునితో సంతోషచిత్తులగుట ప్రధానమని శ్రీకృష్ణుడు వక్కాణించినవిధము మూలమున నీక్రిందివిధముగానున్నది.

శ్లో. 'కచ్చిత్' ద్విజవరశ్రేష్ఠ ధర్మస్తే వృద్ధసమ్మతః ।
వర్తతే నాతికృచ్ఛ్రేణ సంతుష్టమనసః సదా ॥

శ్లో. సంతుష్టో యర్హి వర్తేత బ్రాహ్మణో యేన కేనచిత్ ।
అహీయమానః స్వాద్ధర్మాత్ స హ్యస్యాఖిలకామధుక్ ॥

శ్లో. అసంతుష్టోఽసకృల్లోకానాప్నోత్యపి సురేశ్వరః ।
అకించనోఽపి సంతుష్టః శేతే సర్వాంగవిజ్వరః ॥

శ్లో. విప్రాన్ స్వలాభసంతుష్టాన్ సాధూన్ భూతసుహృత్తమాన్ ।
నిరహంకారిణః శాంతాన్ నమస్యే శిరసాసకృత్ ॥

- సం. భాగ. 10 52-30 నుండి 33 వరకు

పోతన తనయనువాదమున పై భావములను యథాతథముగా నిబద్ధించినాడు.

సీ. జగతీసురేశ్వర! సంతోషచిత్తుండ
వైయున్న నీధర్మ మతిసులభము
వృద్ధసమ్మత మిది విత్త మెయ్యది యైన
బ్రాపింప హర్షించు బ్రాహ్మణుండు
తనధర్మమున నుండుఁదరల డా ధర్మంబు
గోరిక లతనికిఁ గురియుచుండు
సంతోషి గాఁ డేని శక్రుడైన నశించు
నిర్ధనుండయినను నిందుఁ బోలు[2]

ఆ. సంతసించెనేని సర్వభూతసుహృత్త్వ
ములకుఁ బ్రాప్తలాభముదితమాన
సులకును శాంతులకును సుజనులకును గర్వ
హీనులకును వినతు లే నొనర్తు.

\- ఆం. భాగ. దశమ. పూ. భా. 1698

మూలానువాదముల రెండింటను సంతోషచిత్తుడగువానికి పరమాత్ముడుసహితము నమస్కరించునని వ్యక్తీకరించుట ప్రశంసార్హము.

పైన వివరింపబడిన విధమున న్యాయాభక్త్యంశములు, కర్మవాదములు, పరమాత్మతత్త్వవిషయములు, నీతి, ధర్మబోధలుమాత్రమేగాక తదితరములగు ననేకాంశములును యథామూలముగ పోతన యనువాదమున ప్రవేశించినవి. మచ్చునకు కొన్ని

నందుడు కుమారునకు జాతకకర్మమహోత్సవము జరిపించినవిధము మూలమునని ట్లున్నది.

శ్లో. నందస్త్వాత్మజ ఉత్పన్నే జాతాహ్లాదో మహామనాః ।
ఆహూయ విప్రాన్ వేదజ్ఞాన్ స్నాతః శుచిరలంకృతః ॥

శ్లో. వాచయిత్వా స్వస్త్యయనం జాతకర్మాత్మజస్య వై ।
కారయామాస విధివత్ పితృదేవార్చనం తథా ॥

శ్లో. ధేనూనాం నియుతే ప్రాదాద్ విప్రేభ్యః సమలంకృతే ।
తిలాద్రీన్ సప్త రత్నౌఘశాతకౌంభాంబరావృతాన్ ॥

\- సం. భాగ. 10-5-1, 2, 3

ఈ యత్నవమనువాదమున యథాతథముగ జరిపించుట కాననగును.

'వ. అంత మందలో నందుండు, నందనుండు పుట్టుట యెఱింగి, మహానందంబున నెఱవాదులగు వేదవిదులం బిలిపించి, జలంబులాడి, శుచియై, శృంగారించుకొని, స్వస్తిపుణ్యాహవాచనంబులు చదివించి, జాతకర్మంబులు సేయించి, పితృదేవతలనర్చించి, క్రేపుల తోడంగూడం గై సేసినపాడిమొదవుల రెండులక్షలను, గనకకలశమణివసనవిశాలంబులైన తిలశైలంబు లేడింటిని భూదేవతల కిచ్చిన'

– ఆం. భాగ. దశమ. పూ. భా. 172

గోదానము సేయునపుడు 'వత్సలతోకూడిన పాడియావుల' నీయవలెనను అర్థము ద్యోతకమౌనట్లుటకు మూలమునందలి 'సమలంకృతములైన ధేనువులను' అనువాద మున 'క్రేపులతోడగూడం గై సేసిన పాడిమొదవుల'నుగా వక్కాణించుట ప్రశంస నీయము.

నేలకూలిన పూతన పెన్నురముపై నాడుకొనుచున్న శ్రీకృష్ణుని గోపికలు వేగముగానెత్తుకొని రక్షగావించినవిధము మూలమున

రక్షాం విదధిరే సమ్యగ్గోపుచ్ఛభ్రమణాదిభిః ॥
గోమూత్రేణ స్నాపయిత్వా పునర్గోరజసార్భకమ్ ।
రక్షాం చక్రుశ్చ శకృతా ద్వాదశాంగేషు నామభిః ॥
గోప్యః సంస్పృష్టసలిలా అంగేషు కరయోః పృథక్ ।
న్యస్యాత్మన్యథ బాలస్య బీజ న్యాసమకుర్వత ॥
అవ్యాదజోంఘ్రిమణిమాంస్తవ జాన్వథోరూ
యజ్ఞోఽచ్యుతః కటితటం జఠరం హయాస్యః ।

— సం. భాగ. 10-6-19 నుండి 29 వఱకు

ఇత్యాదిగా వర్ణింపబడినది. అనువాదమునందును యథాతథముగ నిట్లు వర్ణింపబడినది.

గోలాంగూలముఁ ద్రిప్పి గోవురజమున్ గోమూత్రమున్ జల్లి త
ద్బాలాంగంబుల గోమయం బలది రా పండ్రెండు నామంబులన్.

రక్షావచనము. మఱియు, నంతటం దనియక, గోపిక లాచమనం బులు చేసి, దక్షులై, మునుతమకు రక్షాకరంబగు, బీజన్యాసంబు

చేసికొని, చిన్నియన్న ! నీ యడుగు లజుండును, జానువులణి
మయును, దొడలు యజ్ఞుండును ... ... ... ... ...

— ఆం. భాగ. దశమ. పూ. భా. 234, 235

ఈఘట్టము పూర్తిగా మూలానుసారియై వెలయుటయేగాక మూలమునందలి కొన్ని పదములును యథాతథముగ ప్రవేశించుట గమనించవలసియున్నది. అనువాదమున రక్షావచనము గావింపబడుట పోతన ఛందఃప్రయోగవైశిష్ట్యమును వ్యక్తమొనరించు చున్నది. దీనివలన రక్షావిధానము మఱింత ప్రభావవంతముగ వెలయుట ప్రశంస నీయము.

కృష్ణుడు గోపబాలురతో చల్దులారగిలచుటకు కూర్చుండిన విధము మూలాను వాదములందు క్రిందివిధముగ కన్పట్టుచున్నది.

శ్లో. కృష్ణస్య విష్వక్ పురురాజిమండలై
రభ్యాననాః ఫుల్లదృశో వ్రజార్భకాః ।
సహోపవిష్టా విపినే విరేజు
శ్ఛదా యథాంభోరుహకర్ణికాయాః ॥

శ్లో. కేచిత్ పుష్పైర్దలైః కేచిత్ పల్లవైరంకురైః ఫలైః ।
శిగ్భిస్త్వగ్భిర్దృషద్భిశ్చ బుభుజుః కృతభాజనాః ॥

- సం. భాగ. 10-13-8, 9

మ. జలజాంతస్థితకర్ణికం దిరిగి రా సంఘంబులై యున్న రే
కుల చందంబునఁగృష్ణునిం దిరిగి రాఁ గూర్చుండి వీక్షింపుచున్
శిలలుం బల్లవముల్ దృణంబులులతల్ చిక్కంబులున్ బువ్వులా
కులు కంచంబులుగా భుజించి రచటన్ గోపార్భకుల్ భూవరా!

- ఆం భాగ. దశమ. పూ భా. 493

మూలమునందు చిత్రితమైన మనోహరదృశ్యములనువాదమునను యథాతథముగా చిత్రింపబడినవనుటకు దీనిని ఉదాహరణముగ పేర్కొనవచ్చును. అలంకారములును యథాతథముగ కొన్నితావుల ననువాదమున ప్రవేశించినవనియు చెప్పవచ్చును.

భావములతోబాటు మూలమునందలి పదములును యథాతథముగ అనువాదమున నందందు ప్రవేశించుటయు కలదు. ఉదాహరణమునకు బ్రహ్మ మోహమునందిన విధము మూలమున

శ్లో. ఏవం సమ్మోహయన్ విష్ణుం విమోహం విశ్వమోహనమ్ ।
స్వయైవ మాయయాజోఽపి స్వయమేవ విమోహితః ॥
- సం. భాగ. 10-13-44

అని వర్ణింపబడగ అనువాదమునన్నిట్లు కానవచ్చుచున్నది.

క. మోహము లేక జగంబుల
మోహింపగజేయనేర్చు మొనసిన విష్ణున్
మోహింపించెద ననియెడి
మోహమున విధాత తాన మోహితుడయ్యెన్.
- ఆం. భాగ. దశమ. పూ. భా. 531

మూలమునందలి 'మోహ' శబ్దావృత్తిచే సాధించిన భావము, సౌందర్యము, అనువాదమున సహితము సాధింపబడుట గమనించవలసియున్నది.

వనమునుండి గోగణంబులందోలుకొని మందకుంజను శ్రీకృష్ణుడు గోపకాంతలకు దర్శనమిచ్చినతీరు మూలమునన్నిట్లున్నది.

శ్లో. తం గోరజశ్ఛురితకుంతలబద్ధ బర్హ
వన్యప్రసూనరుచిరేక్షణచారుహాసమ్ ।
వేణుం క్వణన్తమనుగై రనుగీతకీర్తిం
గోప్యో దిదృక్షితదృశోఽభ్యగమన్ సమేతాః ॥
- సం భాగ. 10-15-42

శ్రీకృష్ణుని రూపసాక్షాత్కారమనువాదమునందును యథామూలముగా గావింపబడిన విధము పరికింతము.

ఉ. గోపద రేణుసంకలితకుంతలబద్ధమయూరపింఛు ను
ద్దీపితమందహాసశుభదృష్టిలసన్ముఖు వన్యపుష్పమా
లాపరిపూర్ణు గోపజనలాలితవేణురవాభిరాము నా
గోపకుమారునిం గనిరి గోపసతుల్ నయనోత్సవంబుగన్
- ఆం. భాగ. దశమ. పూ. భా. 625

యథామూలానువాదములయ్యు మూలమునకు మెరుగులుపెట్టిన తావులును పోతనదశమస్కంధమున కానవచ్చుచున్నవి. ఉదాహరణమునకు కంసుడక్రూరుని పిలిచి అతని చేయి తన చేతితోపట్టుకొని యిట్లు పలికెనని చెప్పుచు మూలమున

'గృహీత్వా పాణినా పాణిం' అని యుండగ అనువాదమున 'అక్రూరునిం బిలిచి, చెట్టఁబట్టుకొని,' యని యనువదింపబడెను. ఈ 'చెట్టబట్టుకొనుట' యను తెలుగు పదము సౌహార్దభావమును మరింత ప్రభావవంతముగ వ్యక్తీకరించుచున్నది.

ఈవిధముగ రస, భావ, సౌందర్యములను యథామూలముగ ననువాదమున వెలయించుటయేగాక మూలమునకు మెరుగులు దిద్దిన పోతనయనువాదకౌశలము ప్రశంసనీయము.

# మూలప్రాయములు

మూలమునందలి భావములలతియలతి మార్పులతోననువాదమున ప్రవేశించిన, అట్టివానిని మూలప్రాయములు లేక మూలప్రాయానువాదములనవచ్చును. ఇవి పూర్తిగా మూలవిధేయములై యుండక మూలమునకు సన్నిహితముగమాత్రముండును. కావున వీనిని సన్నిహితానువాదములనియుననవచ్చును. ఇట్టి యభిప్రాయమునే డా॥ ప్రసాదరాయకులపతిగారును వెలిబుచ్చియున్నారు.[3] మూలమునందలి భావముల ననువాదమున వెలయించునపుడెల్లయెడల యథామూలానువాదము సాధ్యము, సమంజసమును గాదు. చిన్నచిన్న మార్పులప్రయత్నముగనే సిద్ధించుచుండును. స్వేచ్ఛానువాదకుల గ్రంథములలోనిట్టి మూలప్రాయములునధికముగ ప్రవేశించుచుండును. భావుకుడు, భక్తుడునగు పోతన దశమస్కంధానువాదమునందును మూలప్రాయములసంఖ్యాకములుగా ప్రవేశించినవి. మచ్చునకు కొన్నిటిని పరికింతము.

పరబ్రహ్మస్వరూపులై ప్రకాశించు, గోపబాలురను, వత్సములను చూచిన బ్రహ్మ వెఱగుపడినవిధము మూలమునసిట్లున్నది

శ్లో. ఏవం సకృద్దదర్శాజః పరబ్రహ్మాత్మనోఽఖిలాన్ ।
యస్య భాసా సర్వమిదం విభాతి సచరాచరమ్ ॥

శ్లో. తతోఽతికుతుకోద్వృత్తస్తిమితైకాదశేంద్రియః ।
తద్ధామ్నాభూదజస్తూష్ణీం పూర్దేవ్యన్తీవ పుత్రికా ॥

- సం. భాగ. 10-13-55, 56

అనువాదమిట్లున్నది

ఉ. ఏ పరమేశు తేజమున నీ సచరాచరమైన లోకము
దీపిత మయ్యె నట్టి విభు తేజముఁ గన్నులఁ జక్కఁ జూడగా
నోపక పారవశ్యమును నొందుచు సంస్తిమితాఖిలేంద్రియుం
డై పరమేష్ఠి మై మఱచె నప్పుడు చిత్రపురూపుకై వడిన్.
— ఆం. భాగ. దశమ. పూ. భా. 538

మూలమున బ్రహ్మ 'దృష్టిని మరల్చుకొని' అనునది అనువాదమున 'కన్నులఁ జక్కగా చూడనోపక' అని మార్పునొందినది. అట్లే మూలమున బంగారుబొమ్మవలె (పుత్రికా ఇవ) అను నుపమ 'చిత్రపురూపుకై పడిన్' అనియు మార్పునొందినది. ఇట్టి యలతియలతి మార్పులొందినను పరమేశ్వరునితేజమును చూడలేక బ్రహ్మ నిశ్చేష్టుఁడగుట మూలానువాదముల సమానముగా వర్ణితమైన అంశము.

బ్రహ్మ శ్రీకృష్ణుని స్తుతించు సందర్భమునందలి

శ్లో. అతః క్షమస్వాచ్యుత మే రజోభువో
హ్యజానత స్త్వత్పృథగీశమానినః ।
అజావలేపాంధతమోఽంధచక్షుష
ఏషోఽనుకంప్యో మయి నాథవానితి ॥

శ్లో. క్వాహం తమోమహదహంఖచరాగ్నివార్భూ
సంవేష్టితాండఘటసప్తవితస్తికాయః ।
క్వేదృగ్విధావిగణితాండపరాణుచర్యా
వాతాధ్వరోమవివరస్య చ తే మహిత్వమ్ ॥
— సం. భాగ. 10-14-10, 11

అను శ్లోకములకనువాదము క్రిందివిధముగా నున్నది.

సీ. సర్వేశ ! నే రజోజనితుండ మూఢుండ
ప్రభుఁడ నే నని వెఱ్ఱిపల్లదమున
గర్వించినాడను గర్వాంధకారాంధ
నయనుండఁ గృపఁజూడు ననుఁ బ్రధాన
మహదహంకృతినభోమరుదగ్నిజలభూమి
పరివేష్టితాండకుంభంబులోన

నేడు జేనలమేన నెనయ నే నెక్కడ
నీదృగ్విధాండంబు లేరి కైన
తే. సంఖ్య సేయంగరానివి సంతతంబు
నోలిఁ బరమాణువులభంగి నొడలిరోమ
వివరములయందు వర్తించు విపులభాతి
నెనయుచున్న నీ వెక్కడ నెంత కెంత.

— ఆం. భాగ. దశమ. పూ భా. 555

మూలమునందలి 'ఏడంగుళముల శరీరము (సప్తవితస్తి కాయః)' అనువాదమున 'ఏడుజానలమేన' అని మార్పునొందినది. మూలమునందలి 'వాతాధ్వ రోమవివరస్య' అను సమాసమునందలి 'వాతాధ్వ' మనువాదమున కానరాదు. తక్కిన భావమంతయు మూలానుసారముగనే యున్నది. ఇట్టిమార్పులు గావింపబడినను ప్రధానముగా వర్ణింపబడవలసిన బ్రహ్మయొక్క అల్పత్వ నిరూపణమున కెట్టిలోపమును లేదు.

శ్లో. ఏషాం ఘోషనివాసినాముత భవాన్ కిం దేవరాతేతి న
శ్చేతో విశ్వఫలాత్ఫలం త్వదపరం కుత్రాప్యయన్ ముహ్యతి।
సద్వేషాదివ పూతనాపి సకులా త్వామేవ దేవాపితా
యద్ధామార్థసుహృత్ప్రియాత్మతనయప్రాణాశయా స్త్వత్కృతే॥

— సం. భాగ. 10-14-35

అను శ్లోకమునకు పోతనయనువాదమీ క్రిందివిధముగా నున్నది.

మ. నిను హింసించిన పూతనాదులకు మున్నే మేటిసంకేత మి
చ్చిన నీకున్ బురదారపుత్రగృహగోస్త్రీప్రాణదేహాదులె
ల్లను వంచింపక యిచ్చు గోపకులకున్ లక్షింప నే మిచ్చెదో
యని సందేహము దోచుచున్నది ప్రపన్నానీకరక్షామణీ !

— ఆం భాగ. దశమ పూ. భా. 571

సాధువులగు భక్తులవేషమననుకరించిన మాత్రముననే (సద్వేషాదివ) పూతన తన కులమువారితోసైతము నిన్నే పొందెననుమూలము 'నిను హింసించిన పూతనాదులకు' నని యనువాదమున కొలదిగా మార్పుచెందినది. తక్కిన భావమంతయు మూలానుసరణముగనే యున్నది. అనువాదమున గావింపబడిన మార్పు పూతన వైరభక్తురాలను విషయమును స్పష్టమొనర్చుచున్నది.

శ్లో. ప్రాయో బతాంబ విహగా మునయో వనేఽస్మిన్
కృష్ణేక్షితం తదుదితం కలవేణుగీతం ।
ఆరుహ్య యే ద్రుమభుజాన్ రుచిరప్రవాళాన్
శృణ్వంత్యమీలితదృశో విగతాన్యవాచః ॥
— సం. భాగ. 10-21-14

అను శ్లోకమునకు

మ. జగతీజంబులశాఖ లెక్కి మురళీశబ్దామృతస్యందముల్
మిగులన్ వీనులఁ ద్రావి ప్రేగుపడి నెమ్మిం గృష్ణరూపంబు చి
త్తగమై యుండఁగ నడ్డపెట్టుక్రియ నేత్రంబుల్దగన్ మూసి యీ
ఖగముల్ సొక్కెడిఁ జూచితే మునిజనాకారంబులం గామినీ.
- ఆం. భాగ. దశమ. పూ. భా. 788

అనునది పోతనయనువాదము. ఇందు ఖగములు నేత్రములు మూయుటకు 'కృష్ణ రూపంబు చిత్తగమై యుండఁగ నడ్డపెట్టుక్రియన్' అను కారణమును చేర్చి మూలము నందలి భావమునే వెలయించుట జరిగినది. మూలమునందలి 'విగతాన్య వాచః' అనునది విడువబడినది.

గోపికలు శ్రీకృష్ణునితో పలుకు ఈక్రింది పలుకులు మూలప్రాయముగా ననువదింపబడిన తీరు గమనింతము.

శ్లో. మైవం విభోఽర్హతి భవాన్ గదితుం నృశంసం
సంత్యజ్య సర్వవిషయాంస్తవ పాదమూలమ్ ।
భక్తా భజస్వ దురవగ్రహ మా త్యజాస్మాన్
దేవో యథాఽదిపురుషో భజతే ముముక్షూన్ ॥
- సం. భాగ. 10-29-31

మ. అకటా! నమ్మితి మేము క్రూరుఁడన నిన్నర్హంబె మాయిండ్లలో
సకలవ్యాప్తుల డించి నీపదసరోజాతంబు లర్చింపఁ జి
క్కక యేతెంచితి మీశుఁ డాఢ్యుఁడు ముముక్షాసక్తులం గాచుపో
లికఁ గావం దగుఁ గావవే విడువ మేలే కాంతలన్ భ్రాంతలన్.
- ఆం. భాగ. దశమ. పూ. భా. 985

మూలమునందలి 'ఓ ప్రభూ! నీవు ఈప్రకారము కఠినవాక్కు పలుకదగదు'

అనుదానిని 'అకటా నమ్మితి మేము క్రూరుఁడన నిన్నర్థ్యంబె' అని మార్పుగావించి శక్యనభావమంతయు యథామూలముగనే అనువదింపబడినది.

గోపకులు కృష్ణుడుగావించిన గోవర్ధనోద్ధరణాదికృత్యములు చూచి యాశ్చర్య మొందినవారై నందునికడకేగి పలికిన పలుకులలో

శ్లో. క్వ సప్తహాయనో బాలః క్వ మహాద్రి విధారణమ్ ।
తతో నో జాయతే శంకా వ్రజనాథ తవాత్మజే ॥

- సం. భాగ. 10-26-14

అనుదానికి అనువాదమిట్లున్నది.

క. ఏడేండ్ల బాలుఁ డెక్కడ
క్రీడం గిరి తమ్మియెత్తుక్రియ నిందఱముం
జూడ గిరి యెత్తు టెక్కడ
వేడుక నొకచేత నేఁడు వెఱఁగౌ గాదే.

- ఆం భాగ. దశమ. పూ. భా. 930

మూలమునందలి 'సందేహము కలుగుచున్నది (జాయతే శంకా)' అనుదానిని 'వెఱఁగౌ గాదె' అని అనువాదమున మార్చి మూలభావమునకు పుష్టికలిగించుట ప్రశంసార్హము.

గోపికా గీతలలో మూలమునందలి

శ్లో. విషజలాప్యయాద్ వ్యాలరాక్షసాత్
వర్షమారుతాద్వైద్యుతానలాత్ ।
వృషమయాత్మజాద్విశ్వతోభయా
దృషభ తే వయం రక్షితా ముహుః ॥

-సం. భాగ. 10-31-3

అను శ్లోకమునకు పోతన యనువాద మిట్లున్నది.

ఆ. విషజలంబువలన విషధర దానవు
వలన గాలివానవలన వహ్ని

వలన మిగులు హానివలనను రక్షించి
కుసుమశరుని బారిఁ గూర్పఁదగునె.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1037

ఈపట్టున మూలమున విషజలాశయాదులనుండి రక్షించితివని మాత్రమే ఉండగా ననువాదమున విషాదులనుండి రక్షించిన నీవు కుసుమశరుని బారినుండి రక్షింపకుండుట, న్యాయముగాదని మార్చబడినను, వ్యక్తీకరింపబడిన ప్రధాన భావ మొక్కటియే. అనువాదమునందలి యీ మార్పువలన గోపికలప్రార్థనలో దీనత్వము మరింత స్పష్టమగుచున్నది.

మధురానగరమున ప్రవేశించిన రామకృష్ణులను చూచుటకు త్వరపడు పురస్త్రీలచేష్టలు మూలానువాదముల రెండింటను కొంచెమించుమించు సమానముగ నున్నవి.

శ్లో. కాశ్చిద్విపర్యగ్ధృతవస్త్రభూషణా
విస్మృత్య చైకం యుగలేష్వథాపరాః ।
కృతైకపత్రశ్రవణైకనూపురా
నాంక్త్వా ద్వితీయం త్వ పరాశ్చ లోచనమ్ ॥

శ్లో. అశ్నంత్య ఏకా స్తదపాస్య సోత్సవా
అభ్యజ్యమానా అకృతోపమజ్జనాః ।
స్వపంత్య ఉత్థాయ నిశమ్య నిస్స్వనం
ప్రపాయయంత్యో ర్భ మపోహ్య మాతరః ॥

- సం. భాగ. 10-41-25, 26

అను మూలమునకు

వ. గోవిందసందర్శన కుతూహలంబులం బౌరసుందరులు పరస్పరాహూయమానలై, భుంజానలై భోజనభాజనంబులు దలంగద్రోచియు, శయానలై లేచియు, నభ్యజ్యమానలై జలంబు లాడకయు, గురుజన శిక్ష్యమాణలై యోడకయు, గృహకార్యప్రవర్తమానలై పరిభ్రమింపకయు, రమణరమమాణలై రమింపకయు, శిశుజనబిభ్రాణలై

డించియు, నలంకుర్వాణలై యన్యోన్య వస్త్రాభరణమాల్యానులాప నంబులు పీడ్వడ ధరించియు నరిగి.

-ఆం. భాగ. దశమ పూ. భా. 1246

అనునది అనువాదము. పరస్పరాహూయమానలై, గురుజన శిక్ష్యమాణలై యోడకయు; రమణరమమాణలై రమింపకయునను భావములుదక్క నన్నియు మూలానుసరణములే. ఈ కొలదిపాటి చేర్పువలన పౌరకాంతల త్వర మరింత విశద మగుచున్నది.

భ్రమరగీతలలో ఝుంకారమును బహుళముగచేయు మధుపమునుజూచి తమ అనుగ్రహ లాభముకొఱకు కృష్ణునిగూర్చి గానముచేయుచున్నదని తలచి గోపికలిట్లు పలుకుచున్నారు.

శ్లో. కిమిహ బహు షడఙ్ఘ్రే గాయసి త్వం యదూనా
మధిపతిమగృహాణామగ్రతో నః పురాణమ్ ।
విజయసఖసఖీనాం గీయతాం తత్ప్రసంగః
క్షపితకుచరుజస్తే కల్పయన్తీష్టమిష్టాః ।

- సం. భాగ. 10-47-14

శా. భృంగా! కృష్ణుఁడు మంచివాడనుచు సంప్రీతిన్ బ్రసంగించె దీ
సంగీతంబున నేము పొక్కుదుమె తచ్చారిత్రముల్ వింతలే
యంగీకారము గావు మాకుఁ బురకాంతాగ్రప్రవేశంబులన్
సంగీతం బొనరింపు వారిడుదు రోజన్ నీకు నిష్టార్థముల్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1456

మూలమునందలి "చనుగవల తెగులు వాసిన విజయసఖసఖీజనమును" అనువాదమున పురకాంతలుగ మార్చెను. తక్కినభావమంతయు మూలపాఠీయముగనే సాగినది.

ముచుకుందుడు గావించిన శ్రీకృష్ణస్తుతిలో మూలమునందలి

శ్లో. విమోహితో௨యం జన ఈశ మాయయా
త్వదీయయా త్వాం న భజత్యనర్థదృక్ ।
సుఖాయ దుఃఖప్రభవేషు సజ్జతే
గృహేషు యోషిత్పురుషశ్చ వంచితః ॥
-సం భాగ. 10-51-46

ఆనుశ్లోకమునకు అనువాదము క్రిందివిధముగ నున్నది.

క. నీమాయఁ జిక్కి పురుష
స్త్రీమూర్తిక జనము నిన్ను సేవింపదు వి
త్తామయ గృహగతమై సుఖ
తామసమై కామవంచితంబై యీశా.
- ఆం. భాగ. దశమ. పూ. భా. 1652

స్త్రీ, పురుష మూర్తికజనము, శ్రీమహావిష్ణువును సేవింపకుండుటకు స్త్రీ, పురుషులు పరస్పరమోహముచే, సుఖేచ్ఛచే దుఃఖములకు స్థానమైన గృహాదులందు నాసక్తులగుటయే కారణమని మూలమున జెప్పబడెను. అనువాదమున 'విత్తామయ గృహగతమై, సుఖతామసమై కామవంచితమై స్త్రీమూర్తికజనము విష్ణువును సేవించుట లేదని' కొలదిమార్పుతో ప్రధానభావము వ్యక్తీకరింపబడెను.

రుక్మిణీ కల్యాణఘట్టమునందు రుక్మిణి బంధువులందరు ఆమెను కృష్ణునకీయ గోరుచుండగా వారి ప్రయత్నమును నివారించి కృష్ణద్వేషియైన రుక్మి శిశుపాలుని రుక్మిణికి పతిగా తలచెను. ( సం. భాగ. 10-52-25 ) అను మూలమునకు

ఉ. బంధువు లెల్లఁ గృష్ణునకు బాలికనిచ్చెద మంచు శేముషీ
సింధువులై విచారములు సేయఁగ వారలనడ్డపెట్టి దు
స్సంధుఁడు రుక్మి కృష్ణునెడఁ జాల విరోధముసేసి మత్తపు
ష్పంధయవేణి నిత్తు శిశుపాలున కంచుఁ దలంచె సంధుఁడై
- ఆం. భాగ. దశమ. పూ. భా. 1694

అనునది పోతన యనువాదము. మూలానువాదముల రెండింటియందును ప్రధానభాగము సమానముగనే కానవచ్చుచున్నది. కాని అనువాదమునందు కొన్ని సాభిప్రాయ విశేషణములు చేర్చబడినవి "బంధువులు శేముషీసింధువులనుటయు, రుక్మి దుస్సంధుడు, అంధుడు ననుటయు గమనించతగినవి."

రుక్మిణీసందేశమునందు -

శ్లో. పూర్తేష్టదత్తనియమవ్రతదేవవిప్ర
గుర్వర్చనాదిభిరలం భగవాన్ పరేశః ।
ఆరాధితో యది గదాగ్రజ ఏత్య పాణిం
గృహ్ణాతు మే న దమఘోషసుతాదయోఽన్యే ॥
— సం. భాగ 10-52-40

అను మూలమునందలి రుక్మిణి పలుకులకు

మ. వ్రతముల్ దేవగురుద్విజన్మబుధసేవల్ దానధర్మాదులున్
గతజన్మంబుల నీశ్వరున్ హరి జగత్కల్యాణుఁ గాంక్షించి చే
సితినేనిన్ వసుదేవనందనుఁడు నా చిత్తేశుఁ డౌఁ గాక ని
ర్జితులై పోదురు గాక సంగరములోఁ జేదీశముఖ్యాధముల్.
- ఆం. భాగ. దశమ. పూ. భా. 1704

అనునది పోతన మూలపాఠ్యానువాదము. మూలమున దమఘోషసుతాదులు నన్ను గ్రహింపకుందురుగాక ! అని యుండగా అనువాదమున 'నిర్జితులై పోదురుగాక సంగరములో చేదీశ ముఖ్యాధముల్' అని కొలదిగా మార్చబడినను మూలమునందలి భావమంతయు ననువాదమున ప్రవేశించుట గమనింపవలసియున్నది.

ఈవిధముగ రసభావపోషకములైన మూలప్రాయానువాదములు పోతన దశమస్కంధమున లెక్కకు మిక్కిలిగ గలవు. స్థాలీపులాకముగ మాత్రమే ఉదాహరింపబడినవి.

---

# అధస్సూచికలు

1. పూర్వభోగమెత్తి, వెనుకభోగంబెత్తి యనుపాఠములకాడమీవారి ప్రతిలో ముద్రాపకులదోషము కావచ్చును. పూర్వభాగమెత్తి, వెనుకభాగంబెత్తి అని చదలువాడవారి ప్రతిలోను, తంజనగరము తేవప్పెరుమాళ్ళయ్యగారిచే వ్రాయబడిన ప్రతిలోను, తదితరప్రతులలోను కానవచ్చుచున్నది. యతిమైత్రి దృష్ట్యా సూచినదియే సరియైన పాఠమువలె కన్పట్టుచున్నది.
2. "స్రవవోవు" అనునది పాఠాంతరము, మూలమునుబట్టి పరిశీలనచేసి చూడగా ఈ పాఠమే మూలమునకతిసన్నిహితముగనున్నట్లు తోచుచున్నది.
3. ఆంధ్రభాగవతవిమర్శ, పుట : 99



# చతుర్థాధ్యాయము

# భక్తితత్త్వము

మోక్షప్రదములైన కర్మ, జ్ఞాన, భక్తిమార్గములలో ననంతము, విధివిహితము, ఫలాపేక్షరహితమునైన కర్మమార్గము సంకీర్ణమైనది. జ్ఞానమార్గము పరిణత చిత్తులైన యోగీంద్రులకుదక్క నందరికి నందుబాటులోనుండునది కాదు. భక్తి మార్గమొక్కటియే జనసామాన్యమునకందుబాటులో నుండునది. కావుననే 'మోక్ష సాధన సామగ్ర్యాం భక్తి రేవ విశిష్యతే' అని శంకరభగవత్పాదులవారు వక్కాణించి యున్నారు.

ఇట్టి భక్తి వేదోపనిషత్తులలో బీజరూపముననుండి, భగవద్గీతలో మొలకెత్తి, శాండిల్యనారదుల సూత్రవాఙ్మయమున కుసుమించి, పురాణవాఙ్మయమున అందున భాగవతమున ఫలించినదని చెప్పవచ్చును. శుకముఖసంగసంజాతసుధాపూరమును' వేదతరువిగళితమునగు భాగవతఫలరసాస్వాదనమున పరీక్షిన్మహారాజు సప్తరాత్రమున ముక్తుడగుటచే శ్రీమద్భాగవతమును మోక్షశాస్త్రముగా వక్కాణింపవచ్చును. శ్రీమద్భాగవతమునుగూర్చి పోతన పల్కులిచట స్మరింపదగినవి.

క. నిగమములు వేయుఁ జదివిన
సుగమంబులు గావు ముక్తిసుభగత్వంబుల్
సుగమంబు భాగవతమను
నిగమంబు పఠింప ముక్తినివసనము బుధా!

— ఆం. భాగ. ప్రథమ. 140

గ్రంథస్థములైన వ్యాసపోతనల భాగవతావతరణ కారణములను పరిశీలించినచో భక్తిద్వారమున మోక్షమును సాధించుటకే యీ భాగవతావిర్భావము జరిగినదని చెప్పవచ్చును. 'భాగవతమనగా' భగవంతునకును భగవద్భక్తులకును సంబంధించిన దనియేగదా యర్థము! ఇందలి గాథలన్నియు భగవంతునియొక్కయు, భగవద్భక్తుల యొక్కయు, గుణమహిమలను వర్ణించునవియేగదా! ఇందలి ప్రతిఘట్టమునందును భక్తివర్ణితమగుచునే యుండును. కావునభక్తితత్త్వమెరింగిననేగాని భాగవతమవగతము కాదు. అందువలననే 'భక్త్యా భాగవతం జ్ఞేయం న వ్యుత్పత్త్యా న టీకయా' అను నార్యోక్తియేర్పడినది.

భాగవతమున వర్ణింపబడిన భక్తుల చరిత్రములన్నింట భక్తి ప్రాశస్త్యము వెల్లడింపబడినది. భగవానునిపొందుటకు భక్తిమార్గముదక్క తదితరములేవియు సమర్థములుకావని భాగవతమున భగవంతుడే యిట్లనెను -

శ్లో. న సాధయతి మాం యోగో న సాంఖ్యం ధర్మ ఉద్ధవ ।
న స్వాధ్యాయ స్తపస్త్యాగో యథా భక్తిర్మమోర్జితా ॥
- సం. భాగ. 11-14-20

భాగవతోత్తముడైన ప్రహ్లాదుడు భక్తిచే భగవానుడు ప్రీతుడగును గాని తద్విరహితమైన యేయితరకర్మచేతను ప్రీతుడుకాడనుచు రాక్షసకుమారులకిట్లు బోధించుచున్నాడు.

శ్లో. నాలం ద్విజత్వం దేవత్వమృషిత్వం వాసురాత్మజాః ।
ప్రీణనాయ ముకుందస్య న వృత్తం న బహుజ్ఞతా ॥

శ్లో. న దానం న తపో నేజ్యా న శౌచం న వ్రతాని చ ।
ప్రీయతేఽమలయా భక్త్యా హరిరన్యద్విడంబనమ్ ॥
— సం. భాగ. 7-7-51, 52

పైన వివరించిన భగవానుని, మఱియు భాగవతుని పల్కులనుబట్టి భక్తినుద్బోధించి తద్ద్వారమున పాఠకులను ముక్తులనొనరించుట భాగవతపరమార్థమని తెలియుచున్నది. కావున భాగవతము భక్తికి లక్ష్యలక్షణభూతమైనదని చెప్పవచ్చును.

# భక్తినిర్వచనము

'భజ సేవాయాం' అను ధాతువునకు క్తిన్ ప్రత్యయము చేరగా భక్తిపదము సముద్భూతమైనది. ఈ ధాత్వర్థమునుబట్టి పరిశీలించినచో నిర్మలమైన మనోవాక్కాయకర్మలతో పరమేశ్వరుని సేవించుటయే భక్తియనబడును. కాని భక్తియను పదము ననేకులనేకవిధములుగా నిర్వచించుచున్నారు.

శ్లో. మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే ।
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః ॥
— భగవద్గీత. 12-2

అను గీతాచార్యుని వాక్యమునుబట్టి అన్యచింత మాని నిరంతరము నిర్మలమైన మనస్సుతో భగవంతుని సేవించుటయే భక్తియని విశదమగుచున్నది. 'స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే' అని వివేకచూడామణిలో శంకరాచార్యులవారు చెప్పియున్నారు. ఎట్టి ప్రతిబంధకములకు లొంగని నిరంతరప్రేమప్రవాహమే భక్తి యని శ్రీభాష్యమున శ్రీమద్రామానుజాచార్యులవారు నుడివియున్నారు. సర్వాధికమైన స్నేహభావమే 'భక్తి' యని మహాభారతతాత్పర్యనిర్ణయమున మధ్వాచార్యులవారు వివరించియున్నారు. వివేకహీనులకు శబ్దాది విషయములయందెట్టి ప్రీతి కలుగుచుండునో అట్టి ప్రీతియే భగవంతునిపై కలిగెనేని భక్తియనబడునని ద్రవిడోపనిషత్సారసంగ్రహమున వేదాంతదేశికులు నిర్వచించియున్నారు.

శ్లో. ద్రుతస్య భగవద్ధర్మాద్ధారావాహికతాం గతా ।
సర్వేశే మనసో వృత్తిః భక్తిరిత్యభిధీయతే ॥

అని భక్తిరసాయనగ్రంథమున మధుసూదనసరస్వతి నిర్వచనము. పరమేశ్వరుని పాదారవిందములనుచేరిన మానసికవృత్తియే భక్తియనిపించుకొనునని శివానందలహరి యందు శంకరభగవత్పాదులీవిధముగా పేర్కొనియున్నారు.

శ్లో. అంకోలం నిజబీజసంతతిరయస్కాంతోపలం సూచికా
సాధ్వీ నైజపతిం లతా క్షితిరుహం సింధుస్సరిద్వల్లభమ్ ।
ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవిందద్వయమ్
చేతోవృత్తిరుపేత్య తిష్ఠతి సదా సా భక్తిరిత్యుచ్యతే ॥

వేరుకోరికలులేక జ్ఞానకర్మాదులచే నాచ్ఛాదింపబడక తదేకనిష్ఠతో కృష్ణుననుశీలించుటయే ఉత్తమభక్తియని భక్తిరసామృతసింధువు క్రిందవిధముగా నిర్వచించినది.

శ్లో. అన్యాభిలషితాశూన్యం జ్ఞానకర్మాద్యనావృతమ్ ।
ఆనుకూల్యేన కృష్ణానుశీలనా భక్తిరుత్తమా ॥

భక్తియొక్క స్వరూపస్వభావములనుగూర్చి విపులముగా చర్చించినవారిలో శాండిల్యనారదమహర్షులు ముఖ్యులు. 'సాపరానురక్తిరీశ్వరే' అని శాండిల్యుడు, భగవంతునిమీద మిక్కిలి ప్రేమకలిగి యుండుటయే భక్తియని నారదుడు వక్కాణించియున్నారు. నారదునిమతమున భక్తి అమృతస్వరూపము. ఇట్టి ప్రేమరూపము, అమృతరూపమునైన భక్తిని పొంది పురుషుడు కార్యసిద్ధిని పొందును. అమృతుడగును.

తృప్తుడగును. ఆ భక్తిని పొంది యింకేమియును కోరడు. దుఃఖింపడు ఎవరిని ద్వేషింపడు. ఇతరమైనదానిచే సంతోషింపడు. ఇంక దేనిని పొందుటకుత్సహింపడు. ఆభక్తినిపొంది తన్మయుడగును. శాంతుడగును. ఆత్మయందె విహరించువాడగును.

శ్లో. మాహాత్మ్యజ్ఞానపూర్వస్తు సుదృఢః సర్వతోఽధికః ।
స్నేహో భక్తిరితి ప్రోక్తస్తయా ముక్తిర్నచాన్యథా ॥

అని వల్లభాచార్యులవారును, ప్రేమతో ప్రారంభమై ప్రేమతోనభివృద్ధిగాంచి ప్రేమతో బరిసమాప్తమగు యథార్థపరమేశ్వరాన్వేషణమే భక్తియని వివేకానందస్వామియును సూచించియున్నారు. భక్తినిగూర్చి శ్రీమద్భాగవత మిట్లు పల్కుచున్నది–

శ్లో. స వై పుంసాం పరోధర్మో యతో భక్తిరధోక్షజే ।
అహైతుక్యప్రతిహతా యయాఽత్మా సంప్రసీదతి ॥
– సం. భాగః 1-2-6

శ్రీకృష్ణునియందు భక్తిగల్గియుండుట మానవులకు పరమధర్మమై యున్నది. ఎందును, ఏవిధమైన కోరికయు లేని భక్తివలన హృదయానందస్వరూపకమగు పర మాత్మనుపొంది కృతకృత్యుడగును. ఈ నిర్వచనములన్నింటిబట్టి చూడ పరమేశ్వ రునియందనన్యమైన ప్రేమ కలిగియుండి లౌకికవిషయములయందు వైరాగ్యము చూపుటయే భక్తియని విశదమగుచున్నది.

## భక్తిరసము

విభావైరనుభావైశ్చ సాత్త్వికైర్వ్యభిచారిభిః ।
ఆనీయమానస్స్వాదుత్వం స్థాయిభావో రసస్స్మృతః ॥

ఆలంకారికుల రసశబ్ద నిర్వచనమిది. దీనినిబట్టి భక్తికి రసత్వసిద్ధిని కలిగిం చినవారిలో నుజ్జ్వలనీలమణికర్త రూపగోస్వామి, భక్తిరసాయనకర్త మధుసూదన సరస్వతి ముఖ్యులు. భగవత్సంబంధమైన రతి వ్యభిచారిభావములలోనే చేరుననియు, కావున దానికి రససిద్ధి యుండదనియు దశరూపకమున ధనంజయుడు వివరించెను. ఇట్లే జగన్నాథపండితరాయలువంటి పలువురు ఆలంకారికులు భక్తికి రసత్వమునంగీ కరింపరైరి. భక్తిని శాంతమునకంగముగ నుంచవచ్చునని యభినవగుప్తుని యభి ప్రాయము. ఆలంకారికులిట్లు భక్తిని రసముగనంగీకరింపకున్నను వాఙ్మయమున నిది రసానందమును కలుగజేయుచునే యున్నది. ఇందులకు సహృదయులే ప్రమాణము.

తగిన విభావాదిసామగ్రిని సముత్పూర్చినను రసస్థాయికిచేరి సహృదయులకానందమును కలిగించు సామర్థ్యములేని కొన్నిభావములను రసములుగనెవ్వరును అంగీకరింపరు. కాని యెట్టి సహాయసామగ్రియు లేకున్నను సహృదయహృదయముల కానందమునందజేయుచు రసస్థాయికి చేరగలిగిన సామర్థ్యమున్న భక్తివంటి కొన్ని భావములను రసములుగనంగీకరించుట యసమంజసము కాదు. కావుననాలంకారికుల యభిప్రాయములెట్లులున్నను భక్తిని రసముగనంగీకరించుట సహృదయ సమ్మతము కాగలదు.

# భక్తి భేదములు

శ్లో. చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినోఽర్జున ।
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥
— భగవద్గీత. 7-16

అను భగవద్గీతలోని శ్లోకమునుబట్టి ఆర్తభక్తి, జిజ్ఞాసభక్తి, అర్థార్థభక్తి, జ్ఞాన భక్తి, అని భక్తిని నాలుగువిధములుగా విభజింపవచ్చును. ఆపదనివారణకొఱకు సేవించు భక్తుడు ఆర్తభక్తుడుగాను, భగవంతుని యథార్థరూపమునఱయునిచ్ఛతో సేవించువాడు జిజ్ఞాసభక్తుడుగాను, ఐహికసుఖములను, ప్రాపంచికపదార్థములను కోరి సేవించువాడు అర్థార్థభక్తుడుగాను, ఫలేచ్ఛలేక నిర్గుణతత్త్వమునెరిగి సేవించువాడు జ్ఞానభక్తుడుగాను, పరిగణింపబడుచున్నారు. కాబట్టి భగవద్గీతనుబట్టి విపన్నుడు, తత్త్వజిజ్ఞాసువు, అర్థకామి, తత్త్వజ్ఞాని యను నాలుగువిధములుగ భక్తులను వర్గీకరింపవచ్చునని తెలియుచున్నది.

సమగ్రమైన భక్తిస్వరూపమును చిత్రించిన నారదభక్తిసూత్రములలో ప్రేమస్వరూపమైన భక్తి యొకేవిధమైనదైనను ఆసక్తినిబట్టి పదునొకండువిధములుగ వర్గీకరింపబడినది.

సూ: గుణమాహాత్మ్యాసక్తి రూపాసక్తి పూజాసక్తి స్మరణాసక్తి దాస్యాసక్తి సఖ్యాసక్తి కాంతాసక్తి వాత్సల్యాసక్తి ఆత్మనివేదనాసక్తి తన్మయతాసక్తి పరమవిరహాసక్తి రూపా ఏకధాప్యేకాదశధా భవతి.
— నా. భ. సూ. 82

పైసూత్రమునకుగల వివరణమునందు నారద, వేదవ్యాస. శుక, యాజ్ఞవల్క్య, కాక, భుశుండి, శేష, సూత, శౌనక, శాండిల్య. భీష్మార్జున, పరీక్షిత, పృథు, జనమేజయాదులు గుణమాహాత్మ్యాసక్తి గలవారుగను; మిథిలానగరనారీమణులు, జనకుడు, దండకారణ్యాఋషులు, వ్రజనారీమణులు మొదలైనవారు రూపాసక్తిగలవారుగను; శ్రీమహాలక్ష్మి, పృథువు, భరతుడు మొదలగువారు పూజాసక్తిగలవారుగను; ప్రహ్లాద, ధ్రువ, సనకాదులు స్మరణాసక్తిగలవారుగను; హనుమంతుడు, అక్రూరుడు, విదురుడు మొదలగువారు దాస్యాసక్తిగలవారుగను; అర్జునుడు, ఉద్ధవుడు, సంజయుడు, కుచేలుడు మొదలగువారు సఖ్యాసక్తిగలవారుగను; అష్టమహిషులు కాంతాసక్తిగలవారుగను; కశ్యపుడు, అదితి, శతరూప, దశరథుడు, యశోద, దేవకీ వసుదేవులు మున్నగువారు వాత్సల్యాసక్తిగలవారుగను; హనుమంతుడు, అంబరీషుడు, బలి, విభీషణుడు, శిబియిత్యాదులు ఆత్మనివేదనాసక్తిగలవారుగను; యాజ్ఞవల్క్యుడు, శుకుడు, సనకాదిజనులు, కౌండిన్యుడు, సుతీక్ష్ణుడువంటి ప్రేమికులు, మునులు తన్మయాసక్తిగలవారుగను; ఉద్ధవుడు, గోపగోపికలు మొదలగువారు పరమవిరహాసక్తి గలవారుగను వర్గీకరింపబడిరి. [1]

భక్తి యీ పదునొకండువిధములకే పరిమితమనుట నారదమహర్షి తలంపు కాదు. భక్తులయొక్క సంస్కారాదులబట్టి భక్తి వివిధరూపములనందుట కవకాశము కలదనునదియే వారి భావము.

భాగవత తృతీయస్కంధమునందలి కపిలదేవహూతిసంవాదఘట్టమున భక్తియోగ వివరణమును పరికించిన సాధకుని స్వభావభేదములచే భక్తి యనేక విధములనియు; ప్రధానముగ తామస, రాజస, సాత్త్విక భేదములచే మూడువిధములనియు క్రిందివిధముగా కలదు-

శ్లో. భక్తియోగో బహువిధో మార్గైర్భామిని భావ్యతే ।
స్వభావగుణమార్గేణ పుంసాం భావో విభిద్యతే ॥

శ్లో. అభిసంధాయ యో హింసాం దంభం మాత్సర్యమేవ వా ।
సంరంభీ భిన్నదృగ్భావం మయి కుర్యాత్స తామసః ॥

శ్లో. విషయానభిసంధాయ యశ ఐశ్వర్యమేవ వా ।
అర్చాదావర్చయేద్యో మాం పృథగ్భావః స రాజసః ॥

శ్లో. కర్మనిర్హారముద్దిశ్య పరస్మిన్ వా తదర్పణమ్ ।
యజేద్యష్టవ్యమితి వా పృథగ్భావః స సాత్త్వికః ॥
- సం. భాగ. 3-29-7, 8, 9, 10.

వీనియందుత్తరోత్తరము శ్రేష్ఠతమము. శ్రీమద్భాగవతమునందే సప్తమ స్కంధమున ప్రహ్లాదునిచే నవవిధ భక్తిమార్గములు ప్రతిపాదింపబడినవి.

శ్లో. శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్ ।
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్ ॥

శ్లో. ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తిశ్చేన్నవలక్షణా ।
క్రియతే భగవత్యద్ధా తన్మన్యేऽధీతముత్తమమ్ ॥
- సం. భాగ. 7-5-23, 24.

మ. తనుహృద్భాషల[2] సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలోనెఱుకయున్ సంకీర్తనల్[3] చింతనం
బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్నమ్మి స
జ్జనుడై యుండుట భద్రమంచు దలతున్ సత్యంబు దైత్యోత్తమా!
- ఆం. భాగ. సప్తమ. 167.

పైన పేర్కొనబడిన నవవిధభక్తులలో వ్యాసుని 'ఆత్మనివేదనము' పోతన చేతిలో 'ఆత్మలోనెఱుక'గా పరివర్తనమందినది. ఆత్మసమర్పణమునందహంకార ముండును గాన ఆత్మలో నెఱుక యనుటయే మంచిదని చెప్పదగును.

"వ్యాసుడు 'ఆత్మనివేదనము' ను 'ఆత్మసమర్పణము'ని భావించెను. కాని పోతన దానిని ఆత్మని = ఆత్మలో, వేదనమ్ = ఎఱుకగా భావించుట అద్భుతావహము. ఆత్మసమర్పణముకన్న ఆత్మలో నెఱుక మిన్న. అది భక్తిపరాకాష్ఠయగు స్వస్వరూపానుసంధానముతో సమన్వితము. సమర్పణమున కర్తృత్వముండును. అది అహంకారోపేతము. కాని 'ఎఱుక' అట్టిదికాదు."[4]

అని తెలికేపల్లి లక్ష్మీనారాయణశాస్త్రిగారును వక్కాణించియున్నారు. వ్యాసుడు భక్తిసాధనములైన తొమ్మిదింటిని వరుసగా చెప్పుచు శ్రవణముతో ప్రారంభించగా పోతన సఖ్యమునకు ప్రథమస్థానమును కల్పించినాడు. ఏ విషయమునైనను శ్రవణ

స్మరణము లౌనర్పవలెనన్న నావిషయమునందు సఖ్యమవసరము. అట్టి సఖ్యము భాగవతసాంగత్యముచే సంప్రాప్తము. ఇది భక్తిభావ ప్రధానము. దాస్య వాత్సల్య మాధుర్య భావములు సఖ్య సంభరితములు. ఇట్టి ప్రాముఖ్యమును పురస్కరించు కొనియే పోతన సఖ్యమునకు అగ్రతాంబూలమునొసగియుండునని లక్ష్మీనారాయణశాస్త్రిగారి యభిప్రాయము.[5] కాని పోతన సఖ్యమునకు హెచ్చు ప్రాముఖ్యము నిచ్చియున్నాడను విషయము నిర్ణాయకముగ చెప్పుట పొసగదు. పోతన హృదయ గతినిబట్టియు, భాగవత కథాంశములనుబట్టియు అన్నిటికి సమప్రాధాన్యముండుటయే గాక, వ్యాప్తినిబట్టియు ప్రాధాన్యమునుబట్టియు ఆత్మనివేదనమునకున్న ప్రాముఖ్యము యితరములకున్నవనుట సమర్థనీయము కాదు. ఈ నవవిధ భక్తిమార్గములు త్రికరణ శుద్ధి గావలెనను తలంపుతోడనే 'తనుహృద్భాషల'నని వక్కాణించెను. ఈ విషయమునే వ్యాసుడు

శ్లో. యద్బ్రహ్మణి పరే సాక్షాత్ సర్వకర్మసమర్పణమ్ ।
మనోవాక్తనుభిః పార్థ క్రియాద్వైతం తదుచ్యతే ॥
- సం భాగ. 7-'5-65

అనుచు స్పష్టపఱచినాడు. దీనివలన వ్యాస, పోతనలిరువురి యుద్దేశములందున్ను భక్తి నవవిధములైనను మనోవాక్కాయకర్మలచే భగవదర్పణముగ సాగవలెయునని స్పష్టమగుచున్నది.

నవవిధ భక్తిమార్గమును ప్రతిపాదించిన వ్యాసశ్లోకమునందలి 'దాస్యమనగా కర్మార్పణమనియు, ఆత్మనివేదనమనగా దేహసమర్పణమనియు' శ్రీధరస్వామి వ్యాఖ్యానించి, ఒకరికి వృషభమును విక్రయించినపిమ్మట దాని పాలన పోషణాదుల చింత అమ్మినవానికి లేనట్లే పరమేశ్వరార్పితమైన దేహపోషణాది చింత భక్తునకుండ దని వివరించియున్నారు. కావున నవవిధభక్తి పరమేశ్వరార్పణభావమున నుండవలయు నని శ్రీధరస్వామి యభిప్రాయము.

ఈ నవవిధభక్తినే వైధీ భక్తియనియు, సాధనాభక్తియనియు నందురు. ఇది సకామ నిష్కామ భేదములచే ద్వివిధము. నిష్కామమైన వైధీభక్తియే భక్తుని రాగాత్మికాభక్తి వఱకు తీసికొనిపోగలదు. ఈ నవవిధ భక్తిద్వారమున కర్మగ్రంథి నాశనమగును. అశుభవాసనలు నష్టమగును. రజోగుణము, మఱియు తమోగుణము తిరోహితమగును. సత్త్వగుణ ముద్దీపింపబడును. సత్త్వగుణమువలన సాధకునిలో ప్రేమస్వరూపమైన భక్తి ఉదయించి సమస్త సాంసారికాసక్తులు నశించును.

దీనివలన తృతీయస్కంధమున వివరింపబడిన తామస,రాజస, సాత్త్వికములను మూడువిధములైన భక్తిమార్గములు, ఈ నవవిధభక్తిమార్గమునం దంతర్భూతములని తెలియుచున్నది. ఈ నవవిధ సాధనలనన్నిటియందును స్వల్పముగనైనను ప్రేమ, ఆత్మసమర్పణములుండును. కాని దాస్య, సఖ్యములందు పరిపుష్టములై, ఆత్మనివేదనమునందు పరాకాష్ఠ నందుచున్నవి. ఈమూడును భాగవతమున దశమస్కంధముననే ప్రతిపాదితములగుట విశేషము. ఆత్మసమర్పణము సర్వోత్కృష్టమైనదనునది భాగవత ధర్మమైనప్పటికిని భాగవతకథలందు నవవిధభక్తులు వ్యక్తీకరింపబడినవి.

'చతుర్విధా భజంతే మాం... ...' అని భగవద్గీతచే ప్రతిపాదితములైన నాలుగువిధముల భక్తిమార్గములును భాగవతోక్త నవవిధమార్గముల ప్రపంచీకరింపబడినవని చెప్పవచ్చును. కావుననే డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారిట్లుగ్గడించిరి.

"భాగవతమతమునకు గీతయందలి సమన్వయ తత్త్వము ఆధారభూతమైనది. భాగవత సిద్ధాంతము గీతయు నొకటేయని సూచింపబడినది. దీనిని హరిగీతయనియు నందురు." [6]

భాగవతము కేవలము భగవద్గీతకేకాదు, నారద భక్తిసూత్రములకుసహితము వ్యాఖ్యాగ్రంథమని చెప్పవచ్చును. ఏలయన భాగవతమున నవవిధ భక్తిమార్గములే పేర్కొనబడినను, అందు ప్రతిపాదింపబడిన భక్తితత్త్వమంతమాత్రముననే పరిమితము కాదు. ఆసక్తిదృష్టితో విశ్లేషించినపుడు నారదమహర్షిచే చెప్పబడిన యేకాదశ భక్తిభేదముల సమగ్రస్వరూపము మనకు భాగవతమున ప్రత్యక్షము కాగలదు. నారద భక్తిసూత్రములందు గాన్పించు కాంతాసక్తి, వాత్సల్యాసక్తి యనురెండును భాగవతముచే పేర్కొనబడకపోయినను భాగవతమునందు ప్రతిపాదితములగుచున్నవి. భాగవతమున యశోదపాత్రయందభివ్యక్తమైనంతటి వాత్సల్యభక్తి ఇతరములందెందును కానము.

భాగవత నవవిధభక్తుల కంటెను నధికముగ తన్మయత, పరమవిరహాసక్తులను పేర్కొని నారదుడు ఏకాదశభక్తి విధముల ప్రతిపాదించెనని డా. తెలికేపల్లి లక్ష్మీనారాయణశాస్త్రిగారి యభిప్రాయము. [7] సమగ్రమైన పరిశీలన గావించినచోనిది యసమంజసమని వ్యక్తముకాగలదు. ఏలయన తన్మయత భక్తుని సామాన్యలక్షణము. అట్టి తన్మయత లేనిదే త్రికరణశుద్ధిగా భక్తుడు కానేరడు. ఇక పరమవిరహాసక్తి ఆత్మసమర్పణమునం దంతర్భూతమగుటకు నవకాశము కలదు. కావున స్థూలదృష్టితో పరిశీలించిన నవవిధ భక్తిమార్గములలో స్పష్టముగ చెప్పబడక, అందేయొక్కదాని

యందైనను సంపూర్ణముగ నంతర్లీనమగుటకంతగ నవకాశములేక యున్నవి కాంతాసక్తి వాత్సల్యాసక్తులనుట సమంజసము. అంతియగాక యే సూత్రకారుడును చెప్పనట్టి పైరభక్తి భాగవతమున ప్రత్యేకముగ పేర్కొనబడకపోయినను ప్రతిపాదింపబడుట యొకవిశేషము.

శ్లో. కామం క్రోధం భయం స్నేహమైక్యం సౌహృదమేవ చ ।
నిత్యం హరౌ విదధతో యాంతి తన్మయతాం హి తే ॥

- సం. భాగ. 10-29-15.

ఆ. బాంధవముననైనఁ బగనైన వగనైనఁ
బ్రీతినైనఁ బ్రాణభీతినైన
భక్తినైన హరికిఁ బరతంత్రులై యుండు
జనులు మోక్షమునకుఁ జనుదు రధిప.

- ఆం. భాగ. దశమ పూ. భా. 971.

కామముచేగాని, క్రోధముచేగాని, భయముచేగాని, స్నేహముచేగాని, బంధుభావముచేగాని, ఏ యితరభావముచేగాని, హరికి పరతంత్రులై యుండుట ప్రధానమని భాగవతము స్పష్టపఱచుచున్నది.

ఈ విధముగ పర్యాలోచనచేయగా శ్రీమద్భాగతము భక్తికి లక్ష్యలక్షణగ్రంథ మనుటలో నెట్టి విప్రతిపత్తియును లేదు. వివిధ భక్తిభేదములిందుల్లేఖింపబడినప్పటికి ప్రధానముగ పేర్కొనబడిన నవవిధభక్తిమార్గములు పోతనభాగవతమునందెట్లు పరాకాష్ఠనందెనో పరిశీలింపవలసియున్నది. కావున భాగవతకల్పతరువునకు మూలభూతమైన దశమస్కంధమున వ్యాస, పోతనలచే తీర్చిదిద్దబడిన నవవిధభక్తుల స్వరూప నిరూపణము ముందుగా గావింపబడుచున్నది.

# నవవిధభక్తిరీతులు

## శ్రవణభక్తి

'కథాదిష్వితిగార్గః' అను నారద భక్తిసూత్రమునుబట్టి దైవకథాశ్రవణము నందలి యనురాగమునే భక్తిగా గర్గమహర్షి నిర్వచించినట్లు తెలియుచున్నది.

శ్రవణమే అన్నిధర్మములయందు ముఖ్యమైనదనియు, దీనివలన వైకుంఠవాసుని సులభముగా పొందగలమనియు భాగవతమాహాత్మ్యమున కీర్తింపబడినది.

శ్లో. శ్రవణం సర్వధర్మేభ్యో వరం మన్యే తపోధనాః ।
వైకుంఠస్థో యతః కృష్ణః శ్రవణాద్యస్య లభ్యతే ॥
—శ్రీమద్భాగవతమాహాత్మ్యమ్ - 6 76

'శ్రవణంనామ చరితగుణాదీనాం శ్రుతిర్భవేత్' [8] భగవంతుని నామ గుణ చరిత్రాదులను శ్రద్ధతోనాలకించుటయే శ్రవణభక్తి యనబడును. శ్రవణ భక్తియేగాక శ్రవణ స్వరూపమునసహితము పై నిర్వచనమువలన స్పష్టమగుచున్నది.

'శ్రీవిష్ణోః శ్రవణే పరీక్షిదభవత్' అను సుప్రసిద్ధ శ్లోకభాగమునుబట్టియేగాక వ్యాససుతుడైన శ్రీశుకునివలన, భాగవతస్కంధాంతర్గతములైనభగవంతునియొక్కయు భాగవతులయొక్కయు రూప గుణ మహిమావిశేషములను విని, యేడుదినములలో ముక్తుడగుటనుబట్టియు పరీక్షిన్మహారాజు శ్రవణభక్తికి ఉదాహరణప్రాయుడని చెప్ప వచ్చును. అంతియేగాక

ఆ. నీ ముఖాంబుజాతనిర్ముక్తహరికథా
మృతము ద్రావఁ ద్రావ మేను వొదలె
వంత మాను నీరువట్టు నాకలియును
దూరమయ్యె మనము తొంగలించె.
- ఆం భాగ. దశమ. పూ.భా. 11

అను పరీక్షిత్తు మాటలనుబట్టి అతని శ్రవణాసక్తితోబాటు శ్రవణభక్తియొక్క విశిష్టతసహితము విశదమగుచున్నది. ఈపట్టున వ్యాసుని పరీక్షిత్తును, ఇట్టిభావమునే వ్యక్తపఱచినాడు.[10] రెండింటను పరీక్షిత్తు మాటలలో అతనిజీవనము హరికథామృత పానము మాత్రమేయనియు, అదిలేకున్న నాతనిజీవనము దుష్కరమనియు తెలియు చున్నది.

పరీక్షిన్మహారాజు శ్రీకృష్ణావతారచరిత్రను విన కుతూహలపడుచు శుక మహర్షితో పల్కిన క్రిందిపల్కులను పరికించిన నాతడెంతటి భక్తితత్పరుడో విశదమగుటయేగాక శ్రవణమందు విరక్తుడగువాడెట్టి నిరసింపదగినవాడో స్పష్ట మగును.

శ్లో. నివృత్తతర్షైరుపగీయమానాత్
భవౌషధాచ్ఛ్రోత్రమనోఽభిరామాత్ ।
క ఉత్తమశ్లోకగుణానువాదాత్
పుమాన్ విరజ్యేత వినా పశుఘ్నాన్ ॥

- సం. భాగ. 10-1-4

ఐహికాముష్మిక సుఖములనుండి విరక్తులై ముక్తులైన పురుషులగు భక్తులచే నిరంతరము కీర్తింపబడుచుండునదియు, సంసారమను తెగులునకు మంచి మందును, చెవులకు పండువును, మనస్సునకాహ్లాదమును, కలిగించు పుణ్యశ్లోకుడగు భగవంతుని గుణసంకీర్తనమును శ్రవణముచేయుటకు నాత్మజ్ఞానము లేనివాడు, పశుఘ్నుడనగు మానవుడుదక్క అన్యులు విరక్తులుకారు. ఈ లోకమందలి జనులు మూడు విధములుగా నుందురు. ముక్తులు, ముముక్షువులు, విషయాసక్తులు. వీరందరును శ్రీకృష్ణుని చరిత్రము నింకను వినవలయునను కుతూహలమును పెంచుకొందురేగాని చాలునని తృప్తిపడరు. ఈవిషయమునే పోతన యిట్లు పలికినాడు.

క. భవములకు మందు చిత్త
శ్రవణానందము ముముక్షుజనపదము హరి
స్తవము పశుఘ్నుడు దక్కను
జెవులకుఁ దనివయ్యె ననెడి చెనటియుఁ గలడే!

- ఆం. భాగ. దశమ. పూ. భా. 5

ఇంతటి శ్రవణాసక్తి కలిగించుటకు కారణభూతమగు శ్రీకృష్ణకథాప్రాశస్త్యము పరీక్షిన్ముఖమున ఇట్లు కీర్తింపబడినది.

శ్లో. వీర్యాణి తస్యాఖిల దేహభాజా
మంతర్బహిః పూరుషకాలరూపైః ।
ప్రయచ్ఛతో మృత్యుముతామృతం చ
మాయామనుష్యస్య వదస్వ విద్వన్ ॥

- సం. భాగ. 10-1-7

భగవంతుడంతర్దృష్టిగల యోగులకంతర్యామియై ముక్తిని, బహిర్దృష్టిగల సామాన్యులకు గాలరూపమున సంసారమునిచ్చుచున్నాడు. అందువలన నంతర్దృష్టిచే కృష్ణుని మహిమాదులు విని తెలియదగినవి.

ఆ. కలసి పురుషమూర్తి కాలరూపములను
లోకజనుల వెలిని లోననుండి
జన్మమృత్యువులను సంసారముక్తుల
నిచ్చు నతని చరితమెల్లఁ జెపుమ.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 8

అను పోతనగారి పరీక్షిత్తుపల్కులుసహితము పైభావమునే వ్యక్తీకరించుచున్నవి.

అజ్ఞులు సంసారమును తరించుటకు శ్రీకృష్ణకథాశ్రవణ ప్రభావముదక్క మార్గాంతరములేదని బ్రహ్మ యిట్లు పల్కుచున్నాడు.

శ్లో. జ్ఞానే ప్రయాసముదపాస్య నమన్త ఏవ
జీవంతి సన్ముఖరితాం భవదీయవార్తామ్ ।
స్థానేస్థితాః శ్రుతిగతాం తనువాఙ్మనోభి
ర్యే ప్రాయశోఽజిత జితోఽప్యసి తైస్త్రిలోక్యామ్ ॥

- సం. భాగ. 10-14-3

కం. విజ్ఞానవిధము తెలియగక
తజ్జులు నీ వార్తఁ జెప్పఁ దను వాఙ్మనముల్
యజ్ఞేశ నీకు నిచ్చిన
యజ్ఞులు నినుఁ బట్టి గెలుతు రజితుడ వైనన్.

- ఆం. భాగ. దశమ. పూ. భా.548

కేవల విష్ణుకథాశ్రవణమువలన ముల్లోకములందెవ్వరును పొందుటకు సాధ్యము గాని భగవంతుని అజ్ఞులుసహితము పొందగలరని స్పష్టమగుచున్నది.

శ్లో. పురేహ భూమన్ బహవోఽపియోగిన
స్త్వదర్పితేహా నిజకర్మలబ్ధయా ।
విబుధ్య భక్త్యైవ కథోపనీతయా
ప్రపేదిరేఞ్జోఽచ్యుత తే గతిం పరామ్ ॥

- సం. భాగ. 10-14-5

యోగులైనవారయ్యును యమాద్యష్టాంగయోగముల నభ్యసించియు నాత్మజ్ఞానము బడయనివారై తమ మనోవాక్కాయకర్మలను భగవానునకు సమర్పించి,

తచ్చరిత్రములను విని, తద్ద్వారమున ప్రాప్తించిన భక్తిచే నాత్మతత్త్వమెరింగి పరమ పదమందుచున్నారు. దీనినే పోతన శ్రీకృష్ణునిస్తుతించు బ్రహ్మచేనిట్లు పలికించినాడు

క. నిజముగ నిన్నెఱుగరు [11] మును
నిజవాంఛలు నిన్నుఁ జేర్చి నీ కథ వినుచున్
నిజకర్మలబ్ధభక్తిన్
సుజనులు నీ మొదలి ఠెంకిఁ జొచ్చి రధీశా !

—ఆం. భాగ. దశమ. పూ. భా. 550

బృందావనమునందలి తిర్యక్కులు, తరువులు శ్రవణభక్తిచే తన్మయమందెననుటకు

ఉ. కానల నుండుచున్ సరసగానవివేకవిహీనజాతలై
వీనుల నేడు కృష్ణముఖవేణురవామృతధార సోకినన్
మేనులు మేతలున్ మఱచి మెత్తనిచూడ్కి మృగీమృగావళుల్
మానిని ! చూడవమ్మ బహుమానముచేసెఁ గృతార్థచిత్తలై.

- ఆం. భాగ. దశమ. పూ భా. 785 నుండి 790, 793

మొదలగు పద్యములే తార్కాణములు. శ్రీకృష్ణుని మురళీగానమును విని పరవశించిన బృందావనమందలి చరాచరజగత్తంతయు శ్రవణభక్తికాలవాలమనుటలో నెట్టి సందియమును లేదు. దీనివలన శ్రవణాసక్తిరహితుడు తరులతాదులకంటెనధముడని చెప్పవచ్చును. అందువలననే 'విష్ణునాకర్ణించు వీనులు వీనులు' అని ప్రహ్లాదుడు శ్రవణభక్తినిగురించి కీర్తించియున్నాడు. భాగవతమునందంతటను శ్రవణభక్తి తత్త్వము ప్రతిపాదింపబడినప్పటికి దశమస్కంధమున దీని ప్రకటన మెండు.

గోపికలు శ్రీకృష్ణ రూప గుణ మాహాత్మ్యమును, మురళీగానంబును, అత్యంతాసక్తితో నాలించినఘట్టములు దశమస్కంధమందంతట గానవచ్చుచుండుటనుబట్టి గోపికలత్యంత శ్రవణానురక్తులను విషయము విశదమగుచున్నది. వీరి శ్రవణాసక్తి యెట్టిదో శ్రీకృష్ణుని వేణుగీతంబాలించినప్పటి

శా. రావే సుందరి ! యేమె బోటి ! వినవే రాజీవనేత్రుండు బృం
దావీథిన్ దగ వేణువూదుచు లసత్సవ్యానతాస్యంబుతో
భ్రూవిన్యాసము లంగుళీక్రమములం బొల్పార షడ్జంబుగాఁ
గావించెన్ నటుభంగి బ్రహ్మమగు తద్గాంధర్వసంగీతమున్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 770

మొదలగుమాటలు, చేష్టలుసువ్యక్తమొనరించగవు. శారదపూర్ణిమానిశల హరివేణుగానము విని గోపికలు తమ పతులను, బిడ్డలను, బంధువులను వీడి శ్రీకృష్ణుని చేరి "నీవాగమృతధార నిండఁగ్రోలగగాని చెవులన్యభాషలఁజేరిఁ వినవు"[1] అనిపల్కుట,

ఆ. నీ నవీన మాననీయ సల్లాపంబు
కర్ణరంధ్రదిశలఁ గప్పుకున్న
నెల్లు బ్రదుకువార మెందుఁ జేరెడువార
మధిప వినగదగదె యాడుకుయులు

— ఆం. భాగ. దశమ. పూ.భా. 994.

అని ప్రార్థించుట, వారి శ్రవణభక్తితన్మయత్వమును సువ్యక్తమొనరింపుచున్నది. ఇంతటి తన్మయత్వము వ్యాసునిగోపికలలో కానరాదు. అయినను

శ్లో. కస్త్ర్యంగ తే కలపదాయతమూర్ఛితేన
సమ్మోహితాఽర్యచరితాన్నచలేత్త్రిలోక్యామ్ ।
త్రైలోక్యసౌభగమిదం చ నిరీక్ష్య రూపం
యద్గోద్విజద్రుమమృగాః పులకాన్యబిభ్రన్ ॥

—సం భాగ. 10-29-40

అనుగోపికల పలుకులు వ్యాసునిహృదయమును, శ్రవణభక్తితన్మయత్వమును చాటుచున్నవి.

హరికథామృతముఁ ద్రాగువారలపమృత్యువుపాలు కారను విషయమును దశమస్కంధమందు ప్రతిపాదితమైనది. సంస్కృతాంధ్రముల రెంటింటను గోపికలీవిషయమును ముక్తకంఠమున నంగీకరించిరి.

శ్లో. తవ కథామృతం తప్తజీవనం
కవిభిరీడితం కల్మషాపహమ్ ।
శ్రవణమంగళం శ్రీమదాతతం
భువి గృణన్తి తే భూరిదా జనాః ॥

— సం. భాగ. 10-31-9.

మ. ఘనలక్ష్మీప్రయుతమై మహాశుభదమై కామాదివిధ్వంసియై
సనకాదిస్తుతమై నిరంతరతపస్సంతప్తపున్నాగ జీ

వనమై యొప్పెడు నీ కథామృతము ద్రావం గల్గునే భూరిదా
ననిరూఢత్వము లేని వారలకు మానారీమనోహారకా !

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1043

ఈవిధమున పర్యాలోచనచేయగా భక్తిపథదీపికలైన గోపికలు శ్రవణభక్తులలో అగ్రగణ్యులనుటలో నెట్టివిప్రతిపత్తియును లేదు.

నిర్మలమైన భక్తిని కోరువారు శ్రీహరిపావనకథలనుగాని, హరిభక్తుల కథలను గాని, అత్యంతాసక్తితో నాకర్ణించవలెననియు, భగవత్కథాకర్ణనమునుమించిన సులభ మైన మార్గాంతరము మోక్షగాములకు లేదనియు వ్యాస, పోతనల దశమ స్కంధము అందంతటను ప్రతీయమానమగుచున్నదని చెప్పవచ్చును.

## కీర్తన భక్తి

'కృతసంశబ్దనే' అను ధాతువునుండి కీర్తనమను పదముత్పన్నమైనది. భగవంతుని నామలీలాగుణాదులనుచ్చైస్స్వరమున స్తుతించుట కీర్తనమనబడును ఏకాంతముగా భగవంతుని కీర్తించుట కీర్తనమనియు, సామూహికముగా కీర్తించుట సంకీర్తనమనియు చెప్పవచ్చును. భగవత్సంబంధిసాధనాత్మకబుద్ధికృతగానము సంకీర్తనమనియు, గుణ, లీలా, భావ, నామభేదములచేత సంకీర్తనము నాలుగు విధములనియు, సంకీర్తన మీ మాంస పేర్కొనుచున్నది. [13]

మానసికముగ భగవద్రూపమును ధ్యానించుచు నుచ్చైస్స్వరమున గాన మొనర్చుచు నృత్యమొనర్చుట త్రికరణోపేత సంకీర్తనము. ఇట్టి సంకీర్తనపరుడు శ్రీకృష్ణునకతిశయప్రీతిపాత్రుడు. అతడు త్రిలోకములను పవిత్రమొనర్చును. [14] అను తెలికేపల్లి లక్ష్మీ నారాయణ శాస్త్రిగారి పల్కులనుబట్టి సంకీర్తన స్వరూపము స్పష్టమగుచున్నది.

శ్లో. బ్రహ్మహా పితృహా గోఘ్నో మాతృహాఽఽచార్యహాఘవాన్ ।
శ్వాదః పుల్కసకో వాపి శుద్ధ్యేరన్ యస్య కీర్తనాత్ ॥

- సం. భాగ. 6-13-8

అను భాగవతశ్లోకమునుబట్టి యెంతటి పాపాత్ముడైనను, కుక్క మాంసమును భక్షించువాడైనను, భగవానుని సంకీర్తనమాత్రమున పవిత్రుడుకాగలడని విశదమగుచున్నది. కలియుగమునందలి దోషములను, పాపములను పోగొట్టి పతితుని

మాధవు సన్నిధికి చేర్చగలిగినది కృష్ణుని సంకీర్తనమొక్కటియేయని భాగవత ప్రతిపాదనము.

శ్లో. కలేర్దోషనిధే రాజన్నస్తి హ్యేకో మహాన్ గుణః ।
కీర్తనాదేవ కృష్ణస్య ముక్తసంగః పరం వ్రజేత్ ॥

శ్లో. కృతే యద్ధ్యాయతో విష్ణుం త్రేతాయాం యజతో మఖైః ।
ద్వాపరే పరిచర్యాయాం కలౌ తద్ధరికీర్తనాత్ ॥
— సం. భాగ. 12–3–51, 52.

శ్రీకృష్ణుని లీలాగుణ విశేషములన్నియు సంపూర్ణముగా భాగవత దశమ స్కంధమునందు వర్ణితమైన విషయము సర్వవిదితము. కావున శ్రీకృష్ణసంకీర్తన మొనరించి యతి దుస్తరమైన దుఃఖకరమైన సంసారసాగరమును దాటి శ్రీవిష్ణు పదమునందుమని భాగవతము బోధించుచున్నది. శ్రీకృష్ణుని నామసంకీర్తనముగాని గుణసంకీర్తనముగాని, లీలాసంకీర్తనముగాని, భావసంకీర్తనముగాని భక్తులను దివ్యానందానుభూతుల నోలలాడించగలదనుట నిశ్శంకయుతము.

శ్రీకృష్ణనామ సంకీర్తనంబు జగన్మంగళంబనియును, జగన్మోహనంబనియును, జగజ్జేగీయమానంబనియును, నిఖిలపాపైక నిష్కృతియనియును, నిఖిలదుఃఖ నివారణంబనియును, నిఖిలదారిద్ర్య నిర్మూలనంబనియును, నిఖిలమాయాగుణవిచ్ఛేదకంబని యును, భాగవతముద్ఘోషించుచున్నది.[15] ఇట్లు భగవంతుని నామగుణలీలాదుల వర్ణించి కీర్తించుటచే కృతార్థులైన వారిలో శుకుడు ముఖ్యుడు.

భాగవతదశమస్కంధమునందంతటను, కీర్తనభక్తి కానవచ్చుచునే యుండును. దేవతలును నారదాదిమునులును కూడి దేవకీదేవిగర్భార్భకుండైన పురుషోత్తముని స్తుతించుటయు, శ్రీకృష్ణావిర్భావసమయంబున దేవకీవసుదేవులుపొగడిన విధమును, తన ముఖంబున నజాండంబంతయును చూప యశోద

ఆ. ఏ మహాత్మువలన నీ విశ్వమంతయు
గానబడిన బుద్ధి కంపమయ్యె
నా మహాత్ము విష్ణు నఖిలలోకాధారు
నార్తులెల్లఁ బాయ నాశ్రయింతు
— ఆం. భాగ. దశమ. పూ. భా. 344

అని కీర్తించుటయు, శాప విముక్తులైన నలకూబర మణిగ్రీవులు శ్రీకృష్ణునేక విధంబుల కీర్తించుటయు, నాగపత్నులు శ్రీకృష్ణుని కీర్తించినవిధమును మొదలుగా గల యనేక కీర్తనలతో నిండిన దశమస్కంధము కీర్తనభక్తి కుదాహరణ ప్రాయమై యలరారుచున్నది. కంసప్రేరితుడైన అక్రూరుడు 'మహా విష్ణువగు శ్రీకృష్ణుని కరుణాదిగుణములను దుష్టసంహరణ శిష్టరక్షణాదులగు కర్మలను, మత్స్యాద్యవతారములను శ్లాఘించువాక్కులే జగమును బ్రదికించునవి, ప్రకాశింపజేయునవి, పవిత్రము జేయునవియగును. కాని అట్లు భగవంతుని గుణాదులను గానము చేయక ఇతరములైన విషయములను పేర్కొను వాక్కులు శవములనలంకరించు నలంకారములై నిష్ప్రయోజనములగుచున్నవి'[16] అని భావించుటనుబట్టి యాతనిలోని కీర్తనాసక్తి యెట్టిదో విశదమగుచున్నది. భగవద్గుణనామకీర్తనానురక్తుడైన యక్రూరుని యీ వాక్కులవలన కీర్తనముయొక్క మహత్త్వముసహితము చక్కగా ప్రతిపాదింపబడినది.

అక్రూరుడు బలరామకృష్ణులను మధురకు తీసుకొనివచ్చు మార్గమున కాళిందీ జలమున విధివిహిత కర్మానుష్ఠానమునకరిగి యా జలమునందును, రథమునందును ఒకే సమయమున గానవగు బలరామ కృష్ణులను చూచి వెఱగుపడి వారి మాహాత్మ్యమును తెలిసికొని '(శ్రీ) మానినీమానచోరా శుభాకారవీరా జగద్ధేతు హేతుప్రకారా సమస్తంబున స్సంగతంబై మహాలోలకల్లోల మాలాకులాభీల పాథోనిధిం గూలగా బాలకేళీగతిం దేలి నారాయణాఖ్యం బటుఖ్యాతి శోభిల్లు నీ నాభికంజంబులో లోకపుంజంబులం బన్నువిన్నాణియై యున్నయా బమ్మ యుత్పన్నుడయ్యెంగదా........ నిన్నెన్న నేనెంతవాడన్ నన్ను మాయావిపన్నున్ విషణ్ణున్ బ్రపన్నుం బ్రసన్నుండవై ఖిన్నతం బాపి మన్నింపవే పన్నగాధీశతల్పా కృపాకల్ప వందారుకల్పా నమస్తే నమస్తే నమస్తే నమః.'[17] అను దండకంబున భక్తితన్మయత్వంబున కీర్తించెను. ఈతన్మయత్వము వ్యాసుని యక్రూరునిలోను గానవచ్చును.[18] అక్రూరుడిట్లు భక్తితన్మయుడై భగవానుని కీర్తించి శ్రీకృష్ణుని అనుగ్రహమునకు పాత్రుడగుట గాననగును. ఇచట గావింపబడిన స్తోత్రము విష్ణుకీర్తనాసక్తులగు జనులకు నిత్యపారాయణయోగ్యమై అలరారుచున్నది.

శ్రీ కృష్ణుని యనుగ్రహమునకు పాత్రుడైన ముచుకుందుడు గావించిన శ్రీకృష్ణస్తోత్రము, భూదేవి భక్తితోడ వాక్కుసుమంబులబూజించి భగవానుని యభయము

పొందిన విధము, శ్రీకృష్ణలాలితయైన రుక్మిణి యాతనిని స్తుతించుట, శివుడు బాణుని రక్షింపనెంచి శ్రీకృష్ణునిస్తుతించుట, కారాగారవిముక్తులైన రాజులు శ్రీ కృష్ణుని పొగడుట, శృతిగీతల ద్వారమున యోగనిద్రావశుండైన సర్వేశ్వరుని వేదంబులు స్తోత్రంబుసేయుట, మున్నగువానితో వ్యాసపోతనల భాగవత దశమ స్కంధములు శ్రీకృష్ణసంకీర్తనావశులై యలరారుచున్నవని చెప్పవచ్చును.

భాగవతము శివకేశవాద్వైతమును ప్రతిపాదించు గ్రంథమనుటయు సమంజసము. కావుననే భాగవత దశమస్కంధమున శివానీ సంకీర్తనముసైతము కానవచ్చుచున్నది. శ్రీకృష్ణునకత్యంతసన్నిహితులైన గోపికలు తమ స్వామిని పొందుటకై కాత్యాయనీ కీర్తనము గావించిరి.[19] బ్రాహ్మణముఖమున సందేశరూపమున 'ఏ నీ గుణంబులు కర్ణేంద్రియములసోక దేహతాపంబులు దీఱిపోవు' ఇత్యాదిగా కృష్ణుని కీర్తించిన రుక్మిణి, తన సంకల్ప సిద్ధికై

ఉ. నమ్మితి నామనంబున సనాతనులైన యుమామహేశులన్
మిమ్ముఁ బురాణదంపతుల మేలు భజింతు గదమ్మ ! మేటిపె
ద్దమ్మ ! దయాంబురాశివి గదమ్మ ! హరిం బతిసేయుమమ్మ నిన్
నమ్మినవారి కెన్నటికి నాశము లేదుగదమ్మ ఈశ్వరీ !

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1741

అని గౌరీప్రార్థన చేసినది. అయా ప్రార్థనలవలన గోపికలు, రుక్మిణి, కృష్ణ భగవానుని పొందగల్గిరి. దీనివలన 'సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి' యను నియమంబున చిత్తైకాగ్రతతో నే నామంబున గీర్తించినను భగవంతుని ప్రీతిని పొందవచ్చుననియు వ్యాస, పోతనల భాగవత దశమస్కంధములందు ప్రతిపాదింపబడినదని చెప్పవచ్చును.

మధురానగరమందలి స్త్రీలు, చాణూరముష్టికులతో యుద్ధమాచరించుచున్న రామకృష్ణులను చూచి అదియధర్మయుద్ధమనియు, అట్టి దురవస్థలోనున్న కృష్ణుని చూచు తామల్పపుణ్యులమని విచారించుచు, గోపికలెంతయు పుణ్యాత్ములనియు, నిరంతర శ్రీకృష్ణ కీర్తనముచేత సంస్తవనీయులైరనియు భావించినవిధమిట్లున్నది

శ్లో. యా దోహనేఽవహననే మథనోపలేప
ప్రేంఖేంఖనార్భరుదితోక్షణమార్జనాదౌ ।

గాయన్తి చైనమనురక్తధియోఽశ్రుకంఠ్యో
ధన్యా వ్రజస్త్రియ ఉరుక్రమచిత్తయానాః ॥

- సం. భాగ. 10-44-15

దీనివలన శ్రీకృష్ణకీర్తనమునకు సమయనియమము లేదనియు, నియమ బద్ధమైన సంకీర్తనమొనరించువారికంటె తమ గృహకృత్యముల గావించుకొనుచు పరమేశ్వరుని కీర్తించు వారు ధన్యులనియు, సతత హరినామలీలాకీర్తనమున భగవంతుని యనుగ్రహము సిద్ధించుటయేగాక భాగవతోత్తములు కాగలరనియు, సర్వ కర్మములు భగవదర్పణము గావించవలయుననియు విశదమగుచున్నది.

దశమస్కంధమునందేగాక భాగవతమునందలి సంకీర్తనములలో అతి ముఖ్యమైనవి, ప్రసిద్ధమైనవి, గోపికాగీతలు. వీనికంత ప్రాశస్త్యమేర్పడుటకు కారణము గోపికలు, హరినుద్దేశించి ప్రత్యక్షమున గానముచేసినవగుటయే. హరియెదుట గానము చేయుటచేత నా గోపికలు, హరియెదుట గానముచేయబడుటచేత నా గీతికలు, భాగవత లోకమున నత్యున్నత స్థానమునందెను.

ఒక్క రాకానిశాకాలంబున యమునాతటవనంబున పుండరీకనయనుండు జగన్మోహనంబుగా నొక్క గీతంబుఁబాడిన విని పరాయత్తచిత్తలై తత్క్షణంబున వ్రేతలు తమతమ పనులను విడచి యమందగమనంబుల గోవిందసందర్శనంబునకుం జనిరి. ఘనమధురగీతనినదము వినివచ్చిన గోపికలజూచి

క. ధ్యానాకర్ణనదర్శన
గానంబుల నా తలంపు గలిగినఁ జాలున్
బూనెదరు కృతార్థత్వము
మానవతుల్ చనుడు మరలి మందిరములకున్

— ఆం. భాగ. దశమ. పూ. భా. 981

అనుచు శ్రీ కృష్ణుడు పలుకగా

ఆ. నిన్నె కాని పలుకనేరవు మాజిహ్వ
లొల్ల ననుచుఁ బలుకనోడ దీవు
మా మనంబు లేల మఱపి దొంగిలితివి
యేమి సేయువార మింకఁ గృష్ణ !

— ఆం. భాగ. దశమ. పూ. భా. 988

అనుచు గోపికలు దీనాలాపములాలపించిరి. అంతట శ్రీకృష్ణుడును

ఆ. సతులు దన్నుఁ బాడ సంప్రీతి నాడుచు
నలుత నున్న వైజయంతితోడ
వనజలోచనుండు వనభూషణుండయ్యె
యువతిజనశతంబు లోలి గొలువ.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 1008

అంతియేగాక హరి వారి భక్తినతిశయింపచేయదలచి యంతర్హితుడుకాగా వల్లవకాంతలు తదీయగమనహాసవిలాసవీక్షణవిహారవచనరచనానురాగంబులజిత్తంబులు గోల్పడి, వివిధచేష్టలకుంబాల్పడి, తదాత్మకత్వంబున నేననేన కృష్ణుండనని కృష్ణగుణావేశంబులంబాడుచు జరియించుచు నా కాళిందీతీరవనాంతరముల వెదకుచు తదాత్మకత్వంబునఁ గృష్ణలీలల ననుకరింపుచు గోపికలు హరినుద్దేశించి

మ. ఘనలక్ష్మీయుతమై మహాశుభదమై కామాదివిధ్వంసియై
సనకాదిస్తుతమై నిరంతరతపస్సంతప్తపున్నాగ జీ
వనమై యెప్పుడు నీ కథామృతము ద్రావం గల్గునే భూరిదా
ననిరూఢత్వము లేనివారలకు మా నారీమనోహారకా!

— ఆం. భాగ. దశమ. పూ. భా 1043.

మ. అని యిట్లంగన లంచితస్వరముతో నంకింపుచున్ బాడుచున్
దను రావే యని చీరి యేడువ జగత్త్రాణుండు త్రైలోక్య మో
హనుడై మన్మథమన్మథుండయి మనోజ్ఞాకారియై హారియై
ఘనపీతాంబరధారియై పొడమెఁ దత్కాంతాసమీపంబునన్.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 1057.

వచ్చిన వల్లభుని కనుగొని పరిపూర్ణమనోరథలై యతిసంగమంబున మనంబు నందలి వియోగతాపమును విడచిరి. అతనిచే నను గ్రహింపబడి రాసకేళిదేలిరి.

ఇట్లు మనోవాక్కాయ కర్మంబుల శ్రీకృష్ణుని కీర్తించి గోపికలు శ్రీకృష్ణున కత్యంత ప్రీతులైరి. వీరికి లభించిన స్థానమితరులెవ్వరికిని దక్కలేదు. పరమభాగవతోత్తముడు, భావుకుడగుటచే పోతన తాను నొకగోపికయై త్రికరణంబుల శ్రీకృష్ణ లీలాగానమొనరించుటచే ఆతనిదశమస్కంధము భక్తిరసమయసంకీర్తనమైవ్యాసకృతము

కంటె మిన్నయైఅలరారినది. కావున 'వైయాసకిః కీర్తనే' యనుటలో నాంధ్రభాగవత కీర్తనమొనరించిన వైయాసకి పోతనయే యననగును.

## స్మరణభక్తి

'స్మరణంనామ భగవన్నామరూపాదీనామనుసన్ధానాధ్యానాపరపర్యాయో మానసో వ్యాపారవిశేషః[20]' అను నిర్వచనమునుబట్టి భగవంతుని విస్మరింపక నిరంతరము ధ్యానించుచుండుటయే స్మరణభక్తి యనబడును. భగవన్నామరూపలీలాగుణవిశేషములను నిరంతరము మానసికముగా కీర్తించిన స్మరణమనవచ్చును. నారదుడు భక్తిలక్షణమును నిర్వచించుచు 'నారదస్తు తదర్పితాఖిలాచారితా తద్విస్మరణేపరమవ్యాకులతేతి.'[21] భగవంతునకు తన సమస్తకర్మల నర్పించుచు, భగవంతుని విస్మరించినచో మిగుల వ్యాకులత్వమును పొందుట, భక్తిగానుగ్గడించెను. దీనినిబట్టి ప్రతిక్షణము భగవానుని స్మరించుటయే స్మరణ భక్తిలోని ప్రధానలక్షణమని విశదమగుచున్నది. ఈ స్మరణమనన్యచిత్తముతో సాగవలెను. అట్టివాడు సులభముగా భగవత్ప్రాప్తి నొందగలడు. ఈ విషయమే, భగవద్గీతలో ఇట్లు చెప్పబడినది.

శ్లో. అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః ।
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః ॥

— భగవద్గీత. 8-14.

స్మరణ భక్తి విశేషము భాగవతమున నిట్లు చెప్పబడినది-

శ్లో. విషయాన్ ధ్యాయతశ్చిత్తం విషయేషు విషజ్జతే,
మామనుస్మరతశ్చిత్తం మయ్యేవ ప్రవిలీయతే ॥

— సం. భాగ. 11-14-27.

ఏ మానవుడు నిరంతరము విషయచింతన చేయునో వానిమనము విషయాసక్తము కాగలదు. అట్లుగాక యే మానవుడు సతతము హరిస్మరణము గావించునో అతడు భగవంతునియందు లీనమగుచున్నాడు. పోతనభాగవతమున భగవానుడే స్వయముగ స్మరణ భక్తిని గూర్చిచెప్పియున్నాడు-

'గంధపుష్పధూపదీపనైవేద్యంబుల లక్ష్మీసమేతుండనై శంఖచక్రగదాశార్ఙ్గాదియుక్తుండనైన నన్ను శుకసనకాదియోగీంద్రులుసంబ

రీషవిభీషణరుక్మాంగదులు మొదలుగాగల భాగవతులు శాస్త్రాచార చోదితులుగాక, భక్తిభావనావిశేషంబున నన్నెఱక నిత్యంబును చింతనాయుక్తులై నన్నెఱిగిరి'

— ఆం. భాగ. ఏకాదశ. 103.

పై ప్రతిపాదనలవలన మనసునన్యాయత్తముచేయక నిరంతరము భగవంతుని రూపగుణలీలావిశేషముల ననుసంధానమొనర్చుటయే స్మరణభక్తి యని విశదమగు చున్నది. కీర్తనయొక్క పరిపక్వరూపమే స్మరణమనియుననవచ్చును. ప్రత్యక్షముగనో పరోక్షముగనో ప్రతిపాత్రయు శ్రీకృష్ణుని లీలావిశేషముల స్మరించుటచే తరించుటవలన వ్యాస, పోతనల భాగవత దశమస్కంధములురెండును స్మరణ భక్తికి ప్రబల నిదర్శనములని చెప్పవచ్చును.

వైరము తోడనైనను అనన్యచింతనపూర్వకమైన స్మరణమున భగవత్సాక్షాత్కారము కలుగునని భాగవతము ప్రబోధించుచున్నది. ఇందులకు కంసునిపాత్ర ప్రబలోదాహరణము కాగలదు. కంసుడు వైరానుబంధంబున నన్యానుసంధానము మరచి

క. తిరుగుచుఁ గుడుచుచుఁ ద్రావుచు
నరుగుచుఁ గూర్చుండి లేచు చనవరతంబున్
హరిఁ దలచి తలచి జగమా
హరిమయ మని తలచెఁ గంసు డాఅని యలుకన్.

— ఆం. భాగ. దశమ పూ. భా. 85.

సీ. శ్రవణరంధ్రముల నే శబ్దంబు వినబడు
నది హరిపలుకని యాలకించు
నక్షిమార్గమున నెయ్యది చూడబడు నది
హరిమూర్తి గానోపునంచుఁ జూచు
దిరుగుచో దేహంబుఁ దృణమైన సోకిన
హరికరాఘాతమో యనుచుఁ గలఁగు
గంధంబు లేమైన ఘ్రాణంబు సోకిన
హరిమాలికాగంధమనుచు నదరుఁ

ఆ. బలుకు లెవ్వియైనఁ బలుకుచో హరి పేరు
పలుకఁ బడియె ననుచు బ్రిమసి పలుకుఁ
దలపు లెట్టివైనఁ దలచి యా తలపులు
హరితలంపు లనుచు నలుగఁదలచు

— ఆం. భాగ. దశమ. పూ భా 87.

క. రోషప్రమోద నిద్రా
భాషాశన పానగతులఁ బాయక చక్రిన్
దోషగతిఁ జూచియైన వి
శేషగతిన్ గంసుఁ డతనిఁ జెందె నరేంద్రా!

- ఆం. భాగ. దశమ. పూ భా. 1376.

ఇట్లు పరమాత్మని పొందగలిగెను. వ్యాసుని దశమస్కంధమునందును కంసుని యందిట్టి స్మరణము కీర్తింపబడినదనుటకు నీ క్రింది శ్లోకము ఉదాహరణముకాగలదు.

శ్లో. ఆసీనస్సంవిశం స్తిష్ఠన్ భుంజానః పర్యటన్ పిబన్ ।
చింతయానో హృషీకేశమపశ్యత్ తన్మయం జగత్ ॥

- సం. భాగ. 10-2-24.

దశమస్కంధమున నిట్టి పాత్రలు పెక్కుండుటంబట్టి ఉభయకవులచేతను రోషప్రమోదనిద్రాభాషాశనపానగతులలో పాయక భగవానుని స్మరించుటవలన విరోధముచేతనైనను మానవుడు ముక్తుడుకాగలడని ప్రతిపాదించినట్లయినది.

స్మరణభక్తిచే ముక్తులైనవారిలో 'మధువైరి దవిలిన మనము మనము' అని భావించు ప్రహ్లాదుడు ముఖ్యుడైనను నుత్కంఠత ననుక్షణము భగవానుని స్మరించి తరించిన గోపికలురూపుదాల్చిన స్మరణభక్తిగా చెప్పవచ్చును. యోగీంద్రులకుసహితము కష్టసాధ్యమైన భగవద్దర్శనము గోపికలకత్యంతసులభముగా లభించుటకి స్మరణ భక్తియే కారణముకాగలదు. అంతటి స్మరణానురక్తులుగావుననే 'యథావ్రజగోపికానాం' అనుచు నారదుడు తన భక్తిసూత్రములందు గోపికలనాదర్శముగా పేర్కొని యున్నాడు. శరద్రాత్రియందు శ్రీకృష్ణుని మురళీగానమువిని మూలగేహములనుండి యమునాతటికి రాకపోయినను శ్రీకృష్ణుని మనోవీథిని స్మరించి కొందరు గోపికలు బంధనిర్ముక్తలైనవిధము తిలకింపుడు

మ. తరుణుల్ గొందఱు మూలగేహముల నుద్దండించి రారాక త
ద్విరహాగ్నిం బరితాప మొందుచు మనోవీధిన్ విభున్ మాధవున్
బరిరంభంబులు సేసి జారుడనుచున్ భావించియుం జొక్కి పొం
దిరి ముక్తిన్ గుణదేహముల్ విడిచి ప్రీతిన్ బంధనిర్ముక్తలై.

—ఆం. భాగ. దశమ. పూ. భా. 966.

ఈ సందర్భమున వ్యాసుడిట్లు వర్ణించియున్నాడు.

శ్లో. అన్తర్గృహగతాః కాశ్చిత్ గోప్యోఽలబ్ధవినిర్గమాః ।
కృష్ణం తద్భావనాయుక్తా దధ్యుర్మీలితలోచనాః ॥

శ్లో. దుఃసహప్రేష్ఠవిరహతీవ్రతాపధుతాశుభాః ।
ధ్యానప్రాప్తాచ్యుతాశ్లేషనిర్వృత్యా క్షీణమంగళాః ॥

— సం. భాగ. 10-29-9, 10.

గోపికలనుక్షణము శ్రీకృష్ణుని స్మరించుచుందురనుటకు శరద్రాత్రియందు యమునాతటి నాతడొక్కక్షణము కనుమరుగుకాగా—

ఉ. నల్లనివాడు పద్మనయనంబులవాడు కృపారసంబుపైఁ
జల్లెడువాడు మౌళిపరిసర్పితపింఛమువాడు నవ్వు రా
జిల్లెడు మోమువాఁ డొకఁడు చెల్వలమానధనంబు దెచ్చె నో
మల్లియలార మీపొదలమాటున లేడుగదమ్మ చెప్పరే

— ఆం. భాగ. దశమ. పూ. భా. 1010.

ఇత్యాదిగా నున్మత్తచిత్తంబున స్మరించుటయు, తదాత్మకత్వంబున 'పూతనయై యొక్క పొలతిపరింపగ శౌరియై యొకకాంత చన్నుఁగుడుచు' మొదలుగా పలురీతుల కృష్ణ లీలల ననుకరించుటయు, మనోహరంబులైన హరిచరణంబుల చొప్పుగని తమలో తాము "కొమ్మకుఁ బువ్వులు కోసినాడిక్కడ మొనసి పాదాగ్రంబు మోపి నాడు' మున్నగు ననేకవిధముల జెప్పికొనుచు స్మరించుకొనుటయు చక్కని యుదాహరణములు కాగలవు. ఈ పట్టున వ్యాసుని గోపికలు సహితమున్మత్తచిత్తలై శ్రీకృష్ణ భగవానుని విలాస చేష్టల ననుసరించిరి. [22]

గోపికలిట్లనవరతము శ్రీకృష్ణస్మరణానురక్తలై విస్మృతినేమాత్రము సహింప లేనివారనుటకు శ్రీకృష్ణుడు గోపకాంతల చెంతకు నుద్ధవునిబంపుచు పలికినవిధము తార్కాణముకాగలదు.

శ్లో. తా మన్మనస్కా మత్ప్రాణా మదర్థే త్యక్తదైహికాః ।
మామేవ దయితం ప్రేష్ఠమాత్మానం మనసా గతాః ।
యే త్యక్తలోకధర్మాశ్చ మదర్థే తాన్ బిభర్మ్యహమ్ ॥

శ్లో. మయి తాః ప్రేయసాం ప్రేష్ఠే దూరస్థే గోకులస్త్రియః ।
స్మరన్త్యోఽంగ విముహ్యన్తి విరహౌత్కంఠ్యవిహ్వలాః ॥

శ్లో. ధారయన్త్యతికృచ్ఛ్రేణ ప్రాయః ప్రాణాన్ కథంచన ।
ప్రత్యాగమన సందేశైర్బల్లవ్యో మే మదాత్మికాః ॥

- సం. భాగ. 10-46-4,5,6

గోపికల స్మరణభక్తికి వారి భ్రమరగీతలును చక్కని యుదాహరణములు కాగలవు. అనేకులైన పెద్దలు, జ్ఞానులు, యోగిపుంగవులు గోపికలకు నమస్కరించి నట్లు దశమస్కంధమున ననేక సందర్భముల గానవచ్చుచున్నది. చాణూరముష్టికులతో యుద్ధమొనరించు బలరామకృష్ణులను చూచి మధురానగరస్త్రీలు 'వేణునాదములమై వెలసిన మాధవుం డధరామృతము లిచ్చి యాదరించు' ఇత్యాదిగా గో, గోప, గోపికలను; మురళీనాళ, పింఛ, దామ, పీతాంబర, వైజయంతికలను స్మరించివిచారించు టనుబట్టి భగవత్స్మరణమేగాక భాగవతస్మరణమును ప్రధానమను విషయము ప్రతి పాదించినట్లయినది. ఈ సందర్భమున వ్యాసుని పౌరకాంతలు గోకులభూముల పావనత్వమును, పుణ్యాత్ములైన గోపికలను మాత్రము స్మరించిరి.[23]

ఈ విధముగా వ్యాస,పోతనల భాగవత దశమస్కంధములు స్మరణభక్తి స్వరూపమును సమగ్రముగా ప్రతిపాదించు గ్రంథరాజములైనవి.

## పాదసేవనాభక్తి

'పాదయోః సేవనమ్ పాదసేవనమ్' అను వ్యుత్పత్తినిబట్టి భగవానుని పాదములను సేవించుటయే పాదసేవనమనబడును.

'పాదసేవనంనామ భగవత్పరిచర్యా, చామరాందోళనపర్య మహోత్సవాద్యనేకరూపా[24] అని భక్తిప్రకాశమ్ చెప్పుచున్నది. పాదసేవ నముయొక్క సమగ్ర స్వరూపమును గూర్చి డా. తెలికేపల్లి లక్ష్మీనారాయణ శాస్త్రి గారిట్లు వక్కాణించియున్నారు.

"పౌనఃపున్యముగా సంతృప్తినొందని నయనములతోడ భగవచ్చరణారవిందములు దర్శించుట, భగవచ్చరణ పూజనసేవనములొనర్చుట, చరణోదకముసేవించుట, భగవచ్చరణకమలముల చింతించుట, మానసికముగాపూజించుట, భగవత్పాదుకలనారాధించుట, చింతించుట భగవచ్చరణరజమును శిరమున అలంకరించుకొనుట, భగవచ్చరణ స్పర్శాభాగ్యమునుపొందిన శయ్యాసనాదికములను తీర్థములనిభావించి సమాదరించుట, బృందావనాదిపుణ్యక్షేత్రములు భగవదవతారపావన భూములు, భగవచ్చరణ స్పర్శనొందిన పుణ్యభూములను పరమక్షేత్రములుగా సంభావించి తత్పావనధూళిని భగవచ్చరణరజముగా సంభావించి శిరసున అలంకరించుకొనుట, గంగాసలిలమును భగవచ్చరణోదకముగా గ్రహించి ప్రణామ పూజనములొనర్చుట, స్నానాదికములచేగంగాసేవనమొనర్చుట-ఈసమస్తము పాదసేవనాసంవిధానములు. శ్రీపతిపాదములు ప్రత్యక్షలబ్ధములుకావు. భగవదవతారకాలమున గాని అట్టి సేవసంప్రాప్తించదు. కాని భగవదాదేశములగు శాస్త్రముల శిరసావహించి గురువులను, సాధువులను, భాగవతులను, సదాచారశీలురను, భూసురులను సేవించుటయు పాదసేవనము." [25]

భగవంతుని పాదములను, భక్తుల పాదములను, గురువులపాదములను, సాధువుల పాదములను సేవించుటయే పాదసేవనభక్తి యని స్థూలముగా వ్యక్తీకరించవచ్చును. దశమస్కంధమున బ్రహ్మ శ్రీకృష్ణునుద్దేశించి పల్కిన వాక్కులందు పాదసేవనమాహాత్మ్యము విశదమగుచున్నది.

శ్లో. అథాపి తే దేవ పదాంబుజద్వయ
ప్రసాదలేశానుగృహీత ఏవహి ।
జానాసి తత్త్వం భగవన్మహిమ్నో
నచాన్య ఏకోఽపి చిరం విచిన్వన్ ॥

- సం భాగ. 10-14-29.

ఇట్లే ఆంధ్ర భాగవత దశమస్కంధమునకూడ కనిపించును.

శా. దేవా! నీ చరణప్రసాదకణలబ్ధిం గాక లేకున్న నొం
డే వెంటన్ జను నీ మహామహిమ నూహింపంగ నెవ్వారికిన్.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 566

ఈ స్కంధముననే బ్రహ్మాదిదేవతలు భగవానుని పాదపద్మముల నాశ్రయించినచో భవసాగరము నవలీలగా దాటగలరని ఇట్లు వ్యక్తము చేసిరి

శ్లో. త్వయ్యంబుజాక్షాఖిల సత్త్వధామ్ని
సమాధినావేశిత చేతసైకే ।
తత్పాదపోతేన మహత్కృతేన
కుర్వన్తి గోవత్సపదం భవాబ్ధిమ్ ॥

- సం. భాగ. 10-2-30.

క. నీదెసఁ దమచిత్తములిడి
యేదెసలకుఁ బోక కడతు రెఱుక గలుగువా
రాదూడయడుగుక్రియ నీ
పాదంబను నావకతన భవసాగరమున్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 92

భగవానుని పాదధూళి లభించినవాడు ముక్తిని సహితము కోరడని నాగపత్నుల స్తుతి యందు క్రిందివిధముగా కలదు.

శ్లో. న నాకపృష్ఠం న చ సార్వభౌమం
న పారమేష్ఠ్యం న రసాధిపత్యమ్।
న యోగసిద్ధీరపునర్భవం వా
వాంఛంతి యత్పాదరజః ప్రపన్నాః ॥

— సం. భాగ. 10 16-37.

ఉ. ఒల్లరు నిర్జరేంద్రపద మొల్లరు బ్రహ్మపదంబు నొందగా
నొల్లరు చక్రవర్తిపద మొల్లరు సర్వరసాధిపత్యము
న్నొల్లరు యోగసిద్ధి మఱి యొందుభవంబుల నొందనీని నీ
సల్లలితాంఘ్రి రేణువుల సంగతి నొందిన ధన్యు లెప్పుడున్.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 676.

పరమాత్మని పాదసేవనము గాక పాదరజసేవనముచేసిన మోక్షాతీతమైన పదవి యనగా పరమాత్మైక్యము లభించగలదని యిందువలన ప్రతిపాదించబడినది.

'యోనాద్రియేత త్వత్పాదా స శోచ్యో హ్యాత్మవంచకః'[26]

అను శివుని పలుకులద్వారమున పాదసేవనావిరతుండాత్మవంచకుడని నిరసింపబడు చున్నాడు. ఈవిధముగా పాదసేవనమాహాత్మ్యము నుగ్గడించుచుబోయిన దశమ స్కంధమునంతటిని పేర్కొనవలెను. శ్రీకృష్ణుని పదములు, పదరేణువులు, వీని స్పర్శచే పవిత్రమైన భూవస్త్వాదులు, పునర్జన్మరహితమైన పరమపదము నొసగు ననియు, అట్టివానిని త్రికరణశుద్ధిగా భజించినవాడు బ్రహ్మేంద్రాది పదవులకంటె, మోక్షపదవికంటె, అతీతమైన అమృతపదమునందగలడని వ్యాస, పోతనల భాగవత దశమస్కంధములు బోధించుచున్నవి. సుదాముడిట్టి పాదసేవచేతనే భగవానుని పొంద గలిగెను. బలరామకృష్ణులను కంసునియాగనిమిత్తము అక్రూరుడు మధురకు తీసికొనిరానవ్వారు సుదాముని ఇంటికేగ నాతండును లేచి గ్రక్కున మ్రొక్కి చక్కన అర్ఘ్యపాద్యాదికంబుల సేవించి తాంబూలగంధకుసుమంబులిచ్చి-

ఉ. పావనమయ్యె నా కులము పండెఁ దపంబు గృహంబు లక్ష్మికిన్
సేవిత మయ్యె నిష్టములు సేకుఱె విశ్వనిదానమూర్తులై
భూవలయంబు గావ నిటు పుట్టిన మీరలు రాకఁ జేసి నే
నే విధ మాచరింతుఁ బను లెయ్యవి బంట నెఱుంగఁ జెప్పరే.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1264

అని పలికి ఘనసురభికుసుమదామము లర్పించెను. వారును వరము కోరుమన-

క. నీ పాదకమలసేవయు
నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపారభూతదయయును
దాపస మందార నాకు దయసేయఁగదే !

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1268

అనుచు భగవానుని పాదసేవను, తత్పాదార్చకులతో స్నేహమును కోరిన పాదసేవనా తత్పరుడు సుదాముడు. రామకృష్ణులును వానికి బలాయుఃకాంతికీర్తిసంపదలొసంగిరి. వ్యాసుని రచనలో సుదాముడు మిక్కిలి భక్తుడైనను ఇంతటి పాదసేవనాతత్పరునిగా రూపుదిద్దుకొనలేదు.

ఇట్లు పాదసేవనాభక్తిమార్గమున భగవదనుగ్రహముబడసి దశమస్కంధమున కనిపించువారిలో శ్రుతదేవ బహుళాశ్వులు ప్రముఖులు. వీరిరువురును మిథిలానగర వాసులు. ఇందు శ్రుతదేవుడు బ్రాహ్మణుడు. బహుళాశ్వుడు మిథిలానగరపాలకుడు. ఒకమారు శ్రీకృష్ణుడు నారదాదిఋషిమండలముతో ద్వారకనుండి బయలుదేరి మార్గ మధ్యమున తనను పూజించు గ్రామీణులకు జ్ఞానదానమొనరించుచు మిథిలజేరగా బహుళాశ్వశ్రుతదేవులిరువురును వారికెదురేగి సాష్టాంగదండప్రణామంబులాచరించి యాతిథ్యమొసంగుటకై తమతమ నెలవులకేకకాలమ్మునసాహ్వానింప శ్రీకృష్ణుడిరువురి పిలుపులనంగీకరించి యేకకాలమున భక్తులిద్దరిని ఆనందింపజేయనెంచి రెండురూపములు ధరించి వారియాతిథ్యముస్వీకరింప వారును ఎవరికివారు తమతమగృహములకే వచ్చిరని భావించి యానందించిరి. మిథిలాప్రభువైన బహుళాశ్వుడు తనయింటికేతెంచిన మునిగణయుతుండైన శ్రీకృష్ణుని

సీ. కూర్చుండ నియమించి కోమరారు కాంచన
కలధౌతకలశోదకములచేతఁ
బాదముల్ గడిగి తత్పావనజలములు
దానును సతియు బాంధవజనంబుఁ
గర మర్థి నిజమస్తకంబుల ధరియించి
వివిధార్చనములు సద్విధినొనర్చి
మణిభూషణాంబర మాల్యానులేపన
రాజితధూపనీరాజనములు

తే. భక్తిఁ గావించి పరిమృష్టబహువిధాన్న
పాయసాపూప పరిపక్వఫలము లోలి
నారగింపగఁ జేసి కర్పూరమిళిత
లలితతాంబూలములు నెయ్య మలర నొసగె.

- ఆం. భాగ. దశమ. ఉ. భా. 1179.

అనంతరమారాజు

చ. హరిపదపద్మయుగము నిజాంకతలంబునఁ జేర్చి యొత్తుచుం
బురుషవరేణ్య! యీనిఖిలభూతగణావళియాత్మలందు సు
స్థిరమతిఁ గర్మసాక్షివి సుధీవర! నీపదభక్తకోటితో
నరయ రమాహినాథ చతురాస్యులు బోలరటందు వెప్పుడున్.

వ. అట్టి లోకవిదితంబైన భవద్వాక్యంబు నిక్కంబుగా భవదీయ పాదారవిందంబులందు నొకానొకవేళ లేశమాత్రధ్యానంబుగల నా గృహంబున కకించనుండనని చిత్తంబునం దలపక భక్తవాత్సల్యుండ వగుటం జేసి విజయము చేసితివి. భవత్పాదపంకేరుహధ్యానసేవారతిం దగిలిన మహాత్ములు త్వద్ధ్యానంబులు వదలుం జాలుదురే! ...

- ఆం. భాగ. దశమ. ఉ.భా. 1181,82.

అనుచు పలురీతుల బ్రస్తుతించి కొన్నిదినంబులాతని గృహమునందుండివేడగా శ్రీకృష్ణుండు నచ్చట నాపౌరజనులకున్నత శోభనంబులు గావించుచు కొన్నిదినంబులు గడపెను.

శృతదేవుండును తన యింటికేతెంచిన మునిగణమండితుండైన ఇందిరాపతిని దర్భాస్తరణంబులన్నునిచి, సతియుందానును మిక్కిలి భక్తితో వారిపాదముల గడిగి, తత్తోయంబులు శిరమున ధరించి, తులసీదళదామప్రసూనమాలికలతో పూజ యొనర్చి, తత్పాదతీర్థము మందిరమంతయు చిలికించి, కృష్ణుని తనయింట నారగింప జేసి, తనకు మనోరథసిద్ధియైనందులకు సంతసించుచు, శ్రీకృష్ణుని చరణంబులు మెల్లనయొత్తుచు ననేకవిధంబుల స్తుతించెను. అంత కృష్ణుండావిప్రుకరంబాత్మకరమున జేర్చి యిట్లనెను. 'తపశ్శక్తివఱలిన యమ్మునివరేణ్యులు తమ పదాంబుజరేణువితానంబు లనుతగిలి లోకంబులను పవిత్రము సేయుటకుగాను వారు నన్నుఁగూడి వలయునెడల కరుదెంతురు. నీ భాగ్యగరిమనిటకు చనుదెంచిరి. కావున వారిని పూజింపుము.'

అది విని శ్రుతదేవుడు మునిజనంబులఁబూజించి కృతార్థుడయ్యెను. ఇట శ్రీకృష్ణువచనంబుల భగవత్పాదంబులేకాక భగవద్భక్తుల పాదములును పవిత్రములే యనియు, వాని భజించియు తరింపవచ్చుననియు తెలియుచున్నది. ఇట్లు శ్రీకృష్ణ పరమాత్ముడు భక్తులిరువురనేకకాలమున కరుణించి వారికనూనసుభగస్థితిని కలిగించి మునికోటియు దానును కుశస్థలిఁజేరెను. ఈ కథ వ్యాసుని దశమస్కంధమునందును ఇంతటి వివరణాత్మకముగికలదు [27]

ఒకచో చతుర్ముఖుడును శ్రీకృష్ణపాదసేవనాతత్పరుడైనట్లుకాన్పించుచున్నది.[28] అంతియేగాక

శా. ఏలా బ్రహ్మపదంబు ? వేదములకున్ వీక్షింపగారాని ని
న్నీలోకంబున నీ వనాంతరమునం దీ మందలోఁ గృష్ణ యం

చాలాపాదిసమస్తభావములు నీయందే సమర్పించు నీ
ప్రేలం దొక్కనిపాదరేణువులుపై వేష్టించినఁజాలదే.

-ఆం. భాగ. దశమ. పూ. భా. 570

అను నలువపలుకులబట్టి యోగిబృందారకగణముకంటెను, బ్రహ్మాదిపదవులకంటెను, భగవత్పాదస్పర్శచే పవిత్రమైన బృందావనము, గోపికాగోపాలగణములున్నతము లైనట్లు వ్యక్తమగుచున్నది.

ఆ. ఘోషభూమి వెడలి గోవులమేపంగ
నీరజాభమయిన నీ పదములు
కసవు శిలలు దాకి కనునొచ్చునోయని
కలఁగు మామనములు కమలనయన !

ఆ. భక్తకామదంబు బ్రహ్మసేవిత మిలా
మండనంబు దుఃఖమర్దనంబు
భద్రకరమునైన భవదంఘ్రియుగము మా
యురములందు రమణ యునుపఁ దగదె.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1045, 1047

మున్నగు గోపికా గీతలనుబట్టి గోపికల శ్రీకృష్ణపాదానురక్తి వ్యక్తమగుచున్నది. వ్యాసభాగవతమునందును గోపికలహృదయమిట్టివే-

శ్లో. చలసి యద్వ్రజాచ్చారయన్ పశూన్
నలిన సుందరం నాథ తే పదమ్।
శిలాతృణాంకురైః సీదతీతి నః
కలిలతాం మనః కాన్త గచ్ఛతి॥

శ్లో. ప్రణత కామదం పద్మజార్చితం
ధరణిమండనం ధ్యేయ మాపది।
చరణపంకజం శంతమం చ తే
రమణ నః స్తనేష్వర్పయాధిహన్॥

- సం. భాగ. 10-31-11,13.

విరోధమున భగవంతుని పాదహతివలన పరమపదమునొందిన కాళియఫణి చరితమునుబట్టి యెట్టిభావముననైనను భగవత్పాదసంస్పర్శనము పరమపదప్రాపకమని భాగవతము బోధించుచున్నది. దీనికి నిదర్శనముగా ఈనాటికి సర్పజాతి కృష్ణపాదముల ధరించుట గమనింపనగును.

ఈవిధమున పర్యాలోచనచేయగా వ్యాస, పోతనల దశమస్కంధములు రెండును పాదసేవనమహత్త్వమునకు, పాదసేవానురక్తులకుదివ్యజ్యోతులై పరమపదమార్గమును దేదీప్యమానముగా ప్రకాశింపజేయుచున్నవని చెప్పవచ్చును.

## అర్చనభక్తి

'అర్చనం పూజా'[29] "గౌరవితప్రీతిహేతుక్రియాపూజా" [30] అను నిర్వచనములనుబట్టి గౌరవింపబడువారికి ప్రీతిహేతువైన సమస్తక్రియలు పూజయనబడును; ఆపూజయే అర్చనమనబడునని తెలియుచున్నది. త్రిలోకవాసులకును పూజింపదగినవాడు పరమాత్ముడుకాన పరమాత్మకు ప్రీతికరమగు క్రియలనాచరించుట యర్చనమనబడునని స్పష్టమగుచున్నది. పరమాత్మపాదసంస్పర్శనమందిన భక్తులకు, యోగులకు, జ్ఞానులకు, గురువులకు, పెద్దలకు ప్రీతికరమైన క్రియలనన్నింటిని అర్చనమని పిలువవచ్చును. కాని లోకసాధారణముగా భగవంతునుద్దేశించిన పూజమాత్రమే అర్చనమనుట జరుగుచున్నది. పైనిర్వచనములందలి 'గౌరవితప్రీతి' శబ్దమునకు డా. తెలికేపల్లి లక్ష్మీనారాయణశాస్త్రిగారిట్లు వివరించియున్నారు.

"గౌరవితప్రీతిశబ్దమునకు షష్ఠీసమాసమునకుబదులు సప్తమీతత్పురుషసమాసముగా జెప్పికొన్నచో గౌరవింపబడువానియందు ప్రీతియనునర్థము నిష్పన్నము. గౌరవితునెడ మనకెట్టికార్యములవలన ఆసక్తిజనించునో అట్టికార్యములొనర్చుట వాస్తవమున అర్చన యగును. మానవస్వాభావికవిషయప్రీతి మాధవునందర్పితము కావలెనను సంకల్పముతో అర్చనము ద్దేశింపబడినది.[31]

'పూజాదిష్వనురాగ ఇతిపారాశర్యః' అను నారద భక్తిసూత్రమును బట్టిదైవార్చనాదులందనురాగమే భక్తియని వ్యాసునిఅభిప్రాయముగా తెలియుచున్నది చర్ల గణపతిశాస్త్రిగారీసూత్రమునకర్థము వ్రాయుచు 'శ్రీవిష్ణోరర్చనం యే తు ప్రకుర్వంతి నరా భువి। తే యాంతి శాశ్వతం విష్ణోరానందం పరమం పదం॥ 'అను

విష్ణురహస్యశ్లోకమునాధారముగా గొని 'ఏమనుష్యులు శ్రీవిష్ణువును అర్చింతురో వారు శ్రీవిష్ణువుయొక్క శాశ్వతానందరూపమైన పరమపదమును పొందుదురని' వివరించిరి.

శ్లో. స్వర్గాపవర్గయోః పుంసాం రసాయాం భువి సంపదామ్।
సర్వాసామపి సిద్ధీనాం మూలం తచ్చరణార్చనమ్॥
— సం. భాగ. 10-81-19,

ఆను భాగవతశ్లోకమున భగవంతుని పాదములనర్చించుటవలననే స్వర్గాపవర్గములు, సర్వసంపదలు, సిద్ధులు కలుగునని కలదు. ఇచట అర్చనచేయవలసిన భగవంతుని దేహభాగము పేర్కొనబడినది. విరాట్పురుషపాదమనగా తత్పాదజన్యమగు శూద్ర వర్గమను అర్థము తీసికొన్నచో సమాజమందలి నిమ్నవర్గపుసేవచేత భగవత్ప్రసాద ప్రాప్తి కలుగునను అభిప్రాయమును భాగవతమిచట ప్రతిపాదించుచున్నదనియు భావింపవచ్చును.

అర్చనము బాహ్యాభ్యంతర భేదములచే ద్వివిధము. షోడశోపచారములొనరించుట బాహ్యరూపమగు అర్చనము. భగవంతుని మనసులోధ్యానించుట, స్మరించుట మున్నగునవి ఆభ్యంతరార్చనావిధానమున చేరును. ఇందు ఆభ్యంతర లేక మానసికార్చనము విశిష్టమైనది. కాని చిత్తము స్వాధీనముగునంతకు బాహ్యార్చనము చేయదగియున్నది. సామాన్యమానవునకు బాహ్యాపూజావిధానమే తరణోపాయము. ఈరకమైన విధానమునందుపాయనసమర్పణముగూర్చి దశమస్కంధమిట్లు వివరించుచున్నది

శ్లో. అణ్వప్యుపాహృతం భక్తైః ప్రేమ్ణా భూర్యేవ మే భవేత్।
భూర్యప్యభక్తోపహృతం న మే తోషాయ కల్పతే॥

శ్లో. పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి।
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః॥
— సం. భాగ. 10-81-3,4.

భగవంతునియందు భక్తితో నణుమాత్రపు పదార్థముపాయనముగా సమర్పించిన వద్దానినధికముగా భావించుననియు, సభక్తుడైనవాడెంతటి ఘనమైన పదార్థములనుపాయనముగా సమర్పించినను భగవానునకు సమ్మతముకాదనియు, త్రికరణశుద్ధితో సత్ప్రవర్తనతోకూడిన యర్చనదక్క భక్తివిరహితమైనదానిని భగవంతుడు హర్షించడనియు భావము. ఆంధ్రభాగవతమందును కుచేలునితో శ్రీకృష్ణుడీవిధముగనేపల్కెను.[32]

ఇట్లు వ్యాస పోతనల దశమస్కంధములందు పలుతావులయందర్చనభక్తి కానవచ్చుచున్నది. అందు గోపికలు శ్రీకృష్ణుని చేతోవిభునిగాగోరి కాత్యాయనినర్చించిన విధమొకటి.[33] ఈ ఘట్టమున మూలమునందలి 'ఇతి మంత్రం జపంత్యః' అనుదానిని బట్టి మంత్రజపముకూడ అర్చనలోనొకభాగమని విశదమగుచున్నది. జపాంగపూజ, భక్త్యంగపూజ యను ద్వివిధ పూజావిధానములలో మంత్రసిద్ధ్యర్థపూజయైన జపాంగ పూజయు భాగవతసమ్మతమని తెలియుచున్నది.

రుక్మిణీకళ్యాణఘట్టమున రుక్మిణి, గౌరీదేవినర్చించినవిధము పరికింపుడు.

మందగమనంబున ముకుందచరణారవిందంబులు డెందంబునం దలంచుచు నిందుధరసుందరీ మందిరంబుచేరి, సలిలధారాధౌతచరణ కరారవిందయై, వార్చి శుచియై గౌరీసమీపంబునకుంజనియె. అంత ముత్తైదువులగు భూసురోత్తములభార్యలు భవసహితయైన భవానికి మజ్జనంబు గావించి, గంధాక్షతంబు లిడి, వస్త్ర మాల్యాదిభూషణం బుల నలంకరించి, ధూపదీపంబులొసంగి, నానావిధోపహారంబులు సమర్పించి, కానుకలిచ్చి, దీపమాలికల నివాళించి రుక్మిణీదేవిని మ్రొక్కించిరి. అప్పుడు

ఉ. నమ్మితి నామనంబున సనాతనులైన యుమామహేశులన్
మిమ్ముఁ బురాణదంపతుల మేలుభజింతు గదమ్మ! మేటిపె
ద్దమ్మ! దయాంబురాశివిగదమ్మ! హరిం బతి సేయుమమ్మ! నిన్
నమ్మిన వారికెన్నటికి నాశము లేదు గదమ్మ! యీశ్వరీ!

వ. అని గౌరీదేవికిమ్రొక్కి, పతులతోఁ గూడిన బ్రాహ్మణ భార్యలకు లవణాపూపంబులును, తాంబూల కంఠసూత్రంబులును, ఫలంబులు నిక్షుదండంబులునిచ్చి రుక్మిణీదేవి వారలఁ బూజించిన వారు దీవించి యామెశిరమునందు శేసలిడిరి.

—ఆం. భాగ. దశమ. పూ. భా. 1740,41,42.

ఇందు సమగ్రమైన యర్చనావిధానము విశదింపబడినది. శ్రీకృష్ణునిపొందగోరి కాత్యాయనినర్చించుటయు నామెయనుగ్రహమున వారి వారి కోర్కెలు నెరవేరుటయు

గానవచ్చుచున్నది. అనగా రూపమేదైనను బాహ్యార్చనమున ఫలితము సిద్ధింపగలదని తెలియుచున్నది.

శ్రీకృష్ణుని పూజార్హుడని యెంచి యథావిధిగా ప్రత్యక్షముగా పూజించినవారిలో పాండవులు, అందున ధర్మరాజు ముఖ్యుడని చెప్పనగును. రాజసూయయాగ పరిసమాప్తిదినంబున సదస్యగురుద్విజకోటిని పూజించునపుడందు పూజార్హులెవ్వరని యడిగిన, సదస్యులు తమకుతోచినవిధంబులంబలుక, వారి భాషణంబులు వారించి, వివేకశీలుండును చతురవచనకోవిదుడునగు సహదేవుడు భగవంతుడును యదుకుల సంభవుండునైన శ్రీకృష్ణునిజూపి యిమ్మహాత్ముని సంతుష్టుంజేసిన భువనంబు లన్నియుఁ బరితుష్టినొందునని పల్కెను.[34] ఆపల్కులకు సదస్యులయొక్కయు విప్రులయొక్కయు అంగీకారము తెలియజేయబడినది. అంతట ధర్మరాజు శ్రీకృష్ణున కగ్రతాంబూలమునిచ్చి లోకపావనములైన అతని పాదములనుకడిగి, ఆజలమును అనుజామాత్యబాంధవజనులెల్లరు శిరమున ధరించిరి. పీతాంబరములతోడను, అమూల్యాభరణములతోడను పూజించి ఆనందాశ్రువులతో నిండిన కనులచే భగవానుని సరిగా చూడలేకపోయెను. ఇచట పోతనయు సహదేవుముఖమున శ్రీకృష్ణునర్చితుజేయు నావశ్యకతను వివరించియున్నాడు.[35] ఈసందర్భమున మూలానువాదములందలి పల్కులు సమానములైనను పోతనపల్కులీపట్టున కొంతప్రభావవంతముగానున్న వని చెప్పవచ్చును. అట్లే అర్చనావిధానమున మూలమునందు సామాన్యముగా జరిగిన పాదప్రక్షాళనమనువాదమున మునిజన మానస మధుకర వనజాతము లయినయట్టి వారిజదళలోచను పదయుగప్రక్షాళనమైనది. మూలమున శ్రీకృష్ణున కర్పించబడిన పీతకౌశేయవాసము లనువాదమున చంచత్కాంచన రుచిరోదంచిత వస్త్రములుగాను, మహాఘనములైన భూషణములు నూతనార్కప్రభలస్మించిన రత్నములుగాను, అర్పింపబడినవి. ధర్మజుడానందబాష్పజలబిందుసందోహ కంప శితనయనారవిందంబుల గోవిందుని సుందరాకారము దర్శింపలేకపోయెను. ఈవిధమున మూలమునకంటె అనువాదమున ధర్మరాజు శ్రీకృష్ణార్చనాభక్తితన్మయుడైనట్లు కానవచ్చుచున్నది. ఈఘట్టమున నర్చనాభక్తితత్త్వమెంతయు నుద్దీపితమై యున్నది.

రకరకములైన అనులేపనముల బలరామకృష్ణులనర్చించి త్రివక్రయైన కుబ్జ సుందరరూపమునొందుటచే కుబ్జ యర్చనాభక్తికి చక్కని యుదాహరణము. సుదాముని ఇంటినుండి బయల్వెడలి రాజవీధినిచనుచున్న కృష్ణుడు నానాలేపనముల గొనిపోవుచున్న కుబ్జనుచూచి 'ఓ నీరజనేత్రీ నీపేరేమి ? ఎవ్వరిదానవు ? ఎవ్వరి

కొఱకీలేపనములు తీసికొనిపోవుచున్నావు ? మాకు నన్నియునిమ్ము' అని యడుగగా నామెయు

ఉ. చక్కనివాఁడ వౌదు సరసంబుల నొంపకు మెల్లవారికిన్
జక్కదనంబు లెక్కడివి చారుశరీర ! త్రివక్ర యండ్రు నే
నిక్కము కంసుదాసిని వినిర్మల లేపన విద్యదాన నన్
మిక్కిలి రాజు మెచ్చుఁ దగ మీరు విలేపనముల్ ధరింపరే
- ఆం. భాగ. దశమ. పూ. భా. 1274

అని పలికి యాకుమారుల తనువులును, నగవులును, వీక్షితములును, మాటలును, తన చిత్తము కరగించగా ప్రీతితో వారికి ననులేపనములిచ్చెను. వానిని తనువులకలదికొని ప్రసన్నుడైన శ్రీకృష్ణుడు కుబ్జయొక్క మువ్వంకల యొడలు చక్కనొత్తుటకామె పాదములపై తనపాదములనుమోపి చుబుకమునుస్పృశించి మీదికెత్తగా వక్రతపోయి యామె చక్కనైన చిత్తజన్మబాణముక్రియఁ గొమరుమిగిలె. మూలానువాదములం దొకేవిధముననున్న యీకథనుబట్టి గంధమాల్యాదుల భగవంతునెవరు ప్రీతిగొలిచెదరో వారు భగవదనుగ్రహమునొందుటేగాక నిర్వక్రగతిని పొందగలరనియు, అనన్యసుందర స్థానమునందగలరనియు విదితమగుచున్నది.

శ్రీకృష్ణస్పర్శమాత్రమున వక్రత్వముదొలగి సురుచిరరూపిణియైన కుబ్జ తన యింటికివచ్చి యాతనికొఱకు మధనపడుచున్న తనచిత్తమును కుదుటపఱచుమని ప్రార్థింప కృష్ణుడు తనకామితము తీరినపిదప యామెకామితము దీర్తునని పలికెను. తదనుగుణముగా నుద్ధవునిగూడి యామెయింటికేగ నామెయు విహితోపచారములు చేయించి, యుద్ధవునిపూజించి, భాసురపీఠంబుననుంచి యేలాకర్పూరమిశితహితమధుర మహోహలారసపానమదశ్రీలాలిత యగుచు కృష్ణుని గవయజేరనాతండును పెక్కు విధంబుల నాతొయ్యలిని మనోజాతసుఖంబులదనిపెను. సనకాదులకును దక్కని సత్ప్రభుని పొందియు ముక్తిమార్గమునుగోరక మరికొన్ని దినంబులంగభవులీలం దేల్పుమనికోరగా నాతడునట్లేయొనర్చెను. అనగా కర్మఫలముననుసరించి యేకోర్కెల భగవానునర్చించుట జరుగునో ఆతడవ్వానినే తీర్చునని తెలియుచున్నది. మానవులు నిష్కామభక్తిని భగవంతునర్చనచేయవలెననియు క్షణికములగు దేహసుఖములనాశింప రాదనియు భాగవతార్థముగ గ్రహింపవలెను.

బాహిరమైన లేపనాదులతోగాక నిరంతరం శ్రీకృష్ణధ్యానాంతరంగమున మానసికార్చనముగావించినవారు గోపికలు. కావున వారు విశిష్టమైన అర్చనాభక్తులు. ఉదాహరణమునకు—

ఉ. ఒక్కలతాంగి మాధవుని యుజ్జ్వలరూపము చూడ్కి తీగెలం
జిక్కఁగఁ బట్టి హృద్గతముఁ జేసి సెలిం జనకుండ నేత్రముల్
గ్రక్కున మూసి మేనఁ బులకంబులు గ్రమ్మఁగఁ గౌఁగిలించియున్
జొక్కములైన లోచవులఁ జొక్కుచు నుండెను యోగికైవడిన్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1061

వారి యొక్కమానసికస్థితికి మెచ్చిన పరమాత్ముడిట్లనుచున్నాడు—

ఉ. పాయని గేహశృంఖలముఁ బాసి నిరంతరమత్పరత్వముం
జేయుచు నున్న మీకుఁ బ్రతి సేయ యుగంబుల నైన నేర నన్
బాయక గొల్చు మానసము ప్రత్యుపకారముగాఁ దలంచి నా
పాయుట తప్పుగాఁ గొనక భామినులార! కృపన్ శమింపరే!

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1078.

శ్లో. న పారయేఽహం నిరవద్యసంయుజాం
స్వసాధు కృత్యం విబుధాయుషాఽపి వః ।
యా మాభజన్ దుర్జర గేహశృంఖలాః
సంవృశ్చ్య తద్వః ప్రతియాతు సాధునా ॥

– సం. భాగ. 10 32 22.

భగవానుడుసహితము ప్రత్యుపకారము చేయసమర్థుడగానని పల్కుటకు గోపికలు నిర్దోషమైనతలంపుతో నిరంతరార్చనముగావించుటయే కారణము. కావుననే వారు బ్రహ్మాదులచేతను, మునివరులచేతను, నమస్కరింపబడిరి.

భగవంతుని ప్రత్యక్షముగా పూజించుట యెల్లరకును సాధ్యముకాదు. కావున భగవంతునిగూర్చి బోధించు గురువులను, శ్రుతులబఠించినసద్విప్రులను, అర్చించుట భగవంతుని అర్చించుటగా భావించవలెను. అందులకు తార్కాణముగా శ్రీకృష్ణుడే స్వయముగా స్వత్వము ప్రక్కనబెట్టి సాందీపనిని గురువుగాసేవించుటయు, అగ్ని ద్యోతనాదులగువిప్రుల సేవించుటయు, మునిపుంగవులనర్చించుటయు, తనభక్తులగు శ్రుతదేవాదులచేత నర్చింపజేయుటయు గావించినాడు.

ఈ విధముగా అర్చనాభక్తియొక్క స్వరూపమాహాత్మ్యములను ప్రబోధించుచు వ్యాస, పోతనల దశమస్కంధములు పాఠకులను, శ్రోతలను భగవద్గురుద్విజార్చనా తత్పరులగావించు ప్రబోధగ్రంథములై యలరారుచున్నవనుట అతిశయోక్తికాదు.

# వందనభక్తి

'వది అభివాదనస్తుత్యోః' అను ధాతువున్నుండి వందనశబ్దముత్పన్నమైనది. వందనమనగా నమస్కరించుటయని యర్థము. నవధాభక్తియను గ్రంథమాధారముగా వందనభక్తినిగూర్చి తెలికేపల్లి లక్ష్మీనారాయణశాస్త్రిగారిట్లు వక్కాణించిరి. "పరమేశ్వర శాస్త్రవర్ణిత స్వరూపమునకు, భగవన్నామమునకు, పరమేశ్వర ధాతుకృతమూర్తికి. చిత్రమూర్తికి లేక మానసికమూర్తికి కాయికముగ లేక మానసికముగ శ్రద్ధాసహిత సాష్టాంగప్రణామ మొనర్చుట, చరాచర సకలభూతములను పరమేశ్వరస్వరూపముగ దర్శించి కాయికముగను లేదా మానసికముగను ప్రణమిల్లుట, యిట్టి యాచరణమున భగవత్ప్రీతియందు భక్తుడు ముగ్ధుడగుట వందనభక్తి."

మిగిలిన భక్తిమార్గములకంటె నీమార్గమత్యంత శీఘ్రానుగ్రహప్రదమైనది. వానియందు కావలసిన సాధనమిందవసరములేదు. కావుననే గీతాచార్యుడిట్లు పలుకుచున్నాడు

శ్లో. మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః ॥
— భగవద్గీత- 9-34.

మాతాపితృగురుభాగవతవందనము భగవదనుగ్రహమును వెంటనే కలిగించునని భాగవతము ప్రతిపాదించుచున్నది. ఈవందనమునందు వినయము, అనునయము, స్తోత్రపాఠము, ప్రార్థన మొదలగునవిసమ్మిళితమై యుండును. భక్తిపూర్ణమైన ఈవందనము స్తోత్రములందు కానవచ్చును ఇది దశమస్కంధమందు అణువణువున ప్రతీయమానముగుచునే యుండును. ఇట్టిభక్తిచే ముక్తినొందినవారిలో అక్రూరుడు ముఖ్యుడు.

యదుశ్రేష్ఠుడగు నక్రూరుడొకనాడు కంసునిచేత గోకులమందలి వసుదేవ నందనులైన రామకృష్ణులను రథముపై మధురకు కొనితెచ్చుటకు నియోగింపబడెను. మఱునాడు రథముపై నందగోకులమునకు బయలుదేరిన అక్రూరుడు

శ్లో. కిం మయాఽచరితం భద్రం కిం తప్తం పరమం తపః ।
కిం వాథాప్యర్హతే దత్తం యద్ద్రక్ష్యామ్యద్య కేశవమ్ ॥
— సం. భాగ. 10-38- 3 నుండి 23 వఱకు.

అని బహువిధముల మనమున చింతించుచు, బృందావనము చేరెను. అందు శ్రీకృష్ణుని అడుగుజాడలు కన్నంతనే దుర్లభమైన యాపాదధూళి తనకుదొరకుట భాగ్యమని భావించి యొడలుపులకించి యందు పొర్లాడినాడు. రామకృష్ణులను చూచినంత వారి పాదములకు దండమువలె సాగిలపడి మ్రొక్కినాడు. ఆనందాతిరేకమున తనపేరునైన చెప్పలేకపోయెను. కృష్ణుడాతనినక్కునజేర్చికొని యారాత్రి భోజనానంతరము మధుర యందలి యందఱి యోగక్షేమములనడిగి తెలిసికొనెను. అక్రూరుడు కంసునిసందేశము వినిపించి, యామఱునాడే రామకృష్ణులను రథముననిడుకొని మధురకు ప్రయాణమైనాడు. రథము యమునానదిని సమీపించగా, రామకృష్ణులు అందలి నీరమునుగ్రోలి తిరిగి యుపవిష్టులైరి. స్నానమునకుదిగిన అక్రూరునకు నీటమునుగగా అందు రామ కృష్ణులు కనిపించిరి. ఆశ్చర్యముతో పైకివచ్చిచూడ వారు రథమునందే కలరు. తిరిగి నీటమునిగిచూడ శ్రీకృష్ణుని ప్రహ్లాదాదులు స్తుతించుచు కనిపించిరి.

శ్లో. నతోఽస్మ్యహం త్వాఖిలహేతుహేతుం
నారాయణం పూరుషమాద్యమవ్యయమ్ ।
యన్నాభిజాతాదరవిందకోశాద్
బ్రహ్మాఽఽవిరాసీద్యత ఏష లోకః ॥

— సం. భాగ. 10-40-1 నుండి.

ఇత్యాదిగా బహువిధముల కీర్తించి నమస్కరించెను. జలముల శ్రీకృష్ణుని రూప మంతర్ధానముకాగా సంధ్యావందనాదికృత్యములనొనర్చి రథమునుచేరి 'ఓకృష్ణా! నీయందు నేయద్భుతములుగలవో ఆ నిన్ను చూచుచున్ననాకు భూమ్యాకాశములందు గాని, జలమందుగాని, యికనేయాశ్చర్యము జూడబనిలేదని' పలికెను. ఈపట్టున యక్రూరుని, పోతనయెట్లు పందనాభక్తునిగా రూపొందించెనో చూతము.

గోకులమునకుబోవు అక్రూరుడు,

మ. ఇతడా కంసునిచేతఁ బంపువడి నన్ హింసింప నేతెంచినా
డతిదుష్టుండని చూచునో సకల భూతాంతర్బహిర్మధ్యసం
గతు డౌటం దలపోసి నన్ను సుజనుండంగాఁ జూచునో యెట్టి యు
న్నతిఁ గావించునొ యేక్రియన్ బలుకునో నాభాగ్య మెట్లున్నదో.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 1189.

అనుటవలన మూలమునందలి నిశ్చయభావనకుబదులు అనువాదమున భక్తునిలో ఆందోళనమును నింపి పోతన సహజత్వమును వ్యక్తముజేసినాడు. ఇది సహజకవియగు పోతనరచనాపైదుష్యమునకొక యుదాహరణము. ఇట్లే-

ఉ. మాపటివేళ నేను జని మాధవుపాదసమీపమందు దం
డాపతితుండనైన నతఁ డాశుగకాలభుజంగవేగసం
తాపిత భక్తలోక భయదారణమైన కరాబ్జ మౌదలన్
మోపి హసించి నా కభయమున్ గృపతోడుత నీయకుండునే.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1192

అనుటలో భక్తునిఅంతరంగము మూలమునకంటె అనువాదమున స్పష్టముగా వ్యక్తమగుచున్నది. రామకృష్ణులను చూచిన పోతనయక్రూరునకు-

కం. కని వారల పాదములకు
వినయంబున మ్రొక్కి భక్తి వివశుం డగుచుం
దనువునఁ బులకాంకురములు
మొనయగ నానంద బాష్పములు జడిగురియన్

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1198

అని అమూలకముగ పులకాంకురములు మొనయుట, ఆనందబాష్పములజడిగురియుట, సంభవించినది. ఇందు పోతనయక్రూరుడెంతటి వందనభక్తితన్మయుడో తెలియుచున్నది. అట్లే కాళిందీజలముల దర్శనమిచ్చిన శేషశాయిని, శ్రీవత్సకౌస్తుభవనమాలికానిరాజవిశాలవక్షుని, 'శ్రీమానినీమానచోరా...'యనెడు దండకముతోడను,

మ. కలలం బోలెడి పుత్రమిత్రవనితాగారాదిసంయోగముల్
జలవాంఛారతి నెండమావులకు నాసల్ చేయు చందంబునన్
దలతున్ రుచ్యములంచు మాధవ వృథాతత్త్వజ్ఞుడన్ నాకునీ
విలసత్పాదయుగంబుఁ జూపి కరుణన్ వీక్షింపు లక్ష్మీపతీ!

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1233.

అనుచుననేకవిధముల భక్త్యావేశముతోడను కీర్తించెను. వ్యాసుని అక్రూరునిలోనింతటి యావేశము, తన్మయత కానరావు. పోతనవ్రాసిన దండకమును చదువునపుడు పాఠకుడు తానే అక్రూరుడై ఆయనుభూతిని, పులకాంకురములను, పొందుట అనుభవైకవేద్యము. వందనభక్తితత్త్వప్రకటనయందు పోతనతీరు విశిష్టమైనది.

అక్రూరుని వలెనే దశమస్కంధమందు వందనభక్తిచే శ్రీకృష్ణుని అనుగ్రహమును పొందినవారెందరో గలరు. దేవకీగర్భార్భకుడై యున్న పురుషోత్తము యనుచరసమేతులైన దేవతలును, నారదాదిమునులును, నలువయును, ముక్కంటి యును పలుదీతుల స్తుతించి,

మ. గురుపాఠీనమవై జలగ్రహమవై కోలంబవై శ్రీనృకే
సరివై భిక్షుండవై హయాననుండవై క్ష్మాదేవతాభర్తవై
ధరణీనాథుడవై దయాగుణగణోదారుండవై లోకముల్
పరిరక్షించిన నీకు మ్రొక్కెద మిలాభారంబు వారింపవే !

- ఆం. భాగ. దశమ. పూ. భా. 100

శ్లో. మత్స్యాశ్వకచ్ఛపనృసింహవరాహహంస
రాజన్యవిప్రవిబుధేషు కృతావతారః ।
త్వం పాసి నస్త్రిభువనం చ యథాధునేశ
భారం భువో హర యదూత్తమ వందనం తే ॥

— సం. భాగ. 10 2-40

అని వందనమొనరించిరి. ఇచ్చట గర్భస్థశిశువునకు వందనమాచరించినందున పరోక్షమందైనను వందనభక్తిమార్గమున పరమాత్మని పొందవచ్చునని ప్రతిపాదించినట్లయినది. శ్రీకృష్ణజననసమయమున వసుదేవుడు

ఆ. చాగి మ్రొక్కి లేచి సరగున నొసలిపైఁ
గేలుఁదమ్మి దోయిఁ గీలుకొలిపి
పాపఁడనక వెఱక పాపని మొదలింటి
పోక లెల్లఁ దలచి పొగడఁ దొడగె.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 116.

అనుచు మ్రొక్కుటను బట్టియు,

మ. ఒంటినిల్చిపురాణయోగులు యోగమార్గనిరూఢులై
కంటిమందురుగాని నిక్కము గాన రీ భవదాకృతిన్
గంటి భద్రముఁ గంటి మాంసపుఁ గన్నులంగనబోలదీ
తొంటిరూపుఁదొలంగఁ బెట్టుముతోయజేక్షణ! మ్రొక్కెదన్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 127.

అనుచు దేవకి మ్రొక్కుటనుబట్టియు దేవకీవసుదేవులలోని వందనభక్తి వెల్లడియగు చున్నది.

నిర్మూలంబై పడిన సాలంబులనుండి వెలువడిన కుబేరకుమారులిరువురును ఉలూఖలబద్ధుడైన శ్రీకృష్ణునకు మ్రొక్కి లేచి కరకమలములుమొగిచి పలురీతుల స్తుతించిరి. అట్లు నమస్కరించిన వారితో శ్రీహరి—

క. తమ తమ ధర్మము దప్పక
సములై నను నమ్మి తిరుగుసభ్యులకును బం
ధమునను జూచిన విరియును
గమలాప్తుఁడు వొడమ విరియు ఘనతమముక్రియన్.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 408.

శ్లో. సాధూనాం సమచిత్తానాం సుతరాం మత్కృతాత్మనామ్।
ధర్మనాన్నో భవేద్బంధః పుంసోఽక్ష్ణోః సవితుర్యథా॥

- సం. భాగ. 10-10-41.

అని పల్కుటనుబట్టి స్వధర్మాచరణపరులకు కేవలమొకమారు దర్శనమైన బంధమోక్ష మగునని, వందనభక్తిమాహాత్మ్యము విశదీకరింపబడినది. అట్లే కాళియుని భార్యలైన నాగకాంతలు గోపాలచూడామణికి భక్తితో నమస్కరించి,

సీ. విశ్వంబు నీవయై విశ్వంబుఁ జూచుచు
విశ్వంబుఁ జేయుచు విశ్వమునకు
హేతువై పంచభూతమాత్రేంద్రియ
ములకు మనఃప్రాణబుద్ధి చిత్త
ముల కెల్ల నాత్మవై మొనసి గుణంబుల
నావృత మగుచు నిజాంశభూత
మగునాత్మచయమున కనుభూతి సేయుచు
మూఢహంకృతులచే మునుగువడక

తే. నెఱిననంతుండవై దర్శనీయరుచివి
కాక సూక్ష్ముఁడవై నిర్వికారమహిమఁ

దనరి కూటస్థుఁడనఁ గ సమస్తంబు నెఱుఁగు
నీకు మ్రొక్కెద మాలింపు నిర్మలాత్మ.

- ఆం. భాగ. దశమ. పూ.భా. 679

శ్లో. నమస్తుభ్యం భగవతే పురుషాయ మహాత్మనే।
భూతావాసాయ భూతాయ పరాయ పరమాత్మనే॥

మొదలుగా-

శ్లో. పరావరగతిజ్ఞాయ సర్వాధ్యక్షాయ తే నమః।
అవిశ్వాయ చ విశ్వాయ తద్ద్రష్ట్రేఽస్య చ హేతవే॥

- సం. భాగ. 10-16-39 నుండి 48.

అనుచు చేతులొగ్గి వందనమాచరించి పతిభిక్షపెట్టుమన నాతండును మన్నించి వరము నిచ్చుట వందనభక్తికి చక్కనియుదాహరణము కాగలదు. అట్లే గో, గోపాలురెల్ల తానే యైనకృష్ణునకు కృతాంజలియైన బ్రహ్మదేవుడు, చీరలుగొని చెట్టెక్కిన కృష్ణు నకు సిగ్గువిడిచి రెండుచేతులు పైకెత్తి వందనమాచరించిన గోపకాంతలు, ఈమార్గమున ధన్యులైన పరమభక్తులు. ఇట్టిచోట్ల భక్తులు ఒంటిచేతితో భగవంతునకు వందన మాచరింపరాదనియు, అహంకారమువిడిచి సర్వమునాతనిపరముచేసి నమస్క రింపవలయుననియు తెలియుచున్నది.

ఈ విధముగా వ్యాస, పోతనల దశమస్కంధములు రెండును వందనమాచ రించుటయే పరమేశ్వరానుగ్రహమునకు సులభమార్గమని స్పష్టపఱచి వందనము యొక్క మాహాత్మ్యమునుగ్గడించినవి.

'దురహంకారమున వికృతాకారము దాల్చిన నేటి నమస్కా రమునకు, నేటిజాతి కృతఘ్నతకు భాగవతప్రతిపాదితవందన సాధనమే శరణ్యము'[37] అను తెలికేపల్లి లక్ష్మీనారాయణశాస్త్రిగారి పలుకులియ్యెడ నుటంకింపదగినవి.

## దాస్యభక్తి

'దాస్యం కర్మార్పణం తస్య కైంకర్యమపి సర్వదా'[38] అను నిర్వచనమునుబట్టి సర్వకర్మలను భగవదర్పణము గావించి సర్వదా కైంకర్య మొనరించుటయే దాస్యమని తెలియుచున్నది.

శ్లో. కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాఽత్మనా వానుస్రుతస్వభావాత్ ।
కరోతి యద్యత్సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయేత్తత్ ॥

\- సం. భాగ. 11-2-36.

క. కరణత్రయంబుచేతను
నరుఁ డేకర్మంబు సేయు నయ్యై వేళన్
హరి కర్పణ మని పలుకుట
పరువడి సుజ్ఞానమండ్రు పరమమునీంద్రుల్.

\- ఆం. భాగ. ఏకాదశ. 42.

అని భాగవతము దాస్యమునుగుఱించి చెప్పుచున్నది. శ్రీమద్భగవద్గీతయు కొంచెమించుమించుగా ఈ భావమునే వ్యక్తపఱచుచున్నది.

శ్లో. యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్ ॥

\- భగవద్గీత. 9-27.

పై నిర్వచనములన్నింటినిబట్టి పరిశీలించగా త్రికరణములచేనాచరించు కర్మలనెల్ల భగవదర్పణమొనరించి నిష్కామమున అహంకారరహితముగాచేయు కైంకర్యమే దాస్యమని తెలియుచున్నది. నవవిధ భక్తిమార్గములలో దాస్య, సఖ్య, ఆత్మనివేదనములు మానసికప్రధానములేగాక భక్తిరసోత్పాదకములు. ఉత్తరోత్తర మొకదానికొకటి సాధనములగుచు భగవత్సాన్నిహిత్యమును పెంపుచేయుచుండును. అనగా దాస్యభక్తునికంటె సఖ్యభక్తునితోడను, సఖ్యభక్తునికంటె ఆత్మనివేదకుని తోడను, భగవంతునకు సాన్నిహిత్యమెక్కువగానుండును. శాంత, ప్రీత, ప్రేయ, వాత్సల్య, మధురములను నైదురసములలో ప్రీతరసమునే దాస్యమనియు, ప్రేయ రసమునే సఖ్యమనియు రూపగోస్వామి వక్కాణించియున్నారు.

దాస్యభక్తులు అధికృత, ఆశ్రిత, పారిషద, అనుగత భేదములచేత నాలుగు విధములు. జగత్సంబంధి కార్యములలోనధికారమునుపొంది భగవంతుని సేవించు వారధికృతదాసులు: బ్రహ్మేంద్రాది దేవతలిట్టివారు. శరణాగతులు, జ్ఞానులు, సేవానిష్ఠులు అని యాశ్రితదాసులు త్రివిధము. కాళియనాగము, జరాసంధబంధ

విముక్తులగు రాజసమూహము, శరణాగతదాసశ్రేణికి చెందినవారు. శౌనకాది మహర్షులు జ్ఞాననిష్ఠాపరులై శ్రీహరిని సమాశ్రయించుటచేత జ్ఞానాశ్రితదాసులైరి. భజనాసక్తుల సబహుళాశ్వాదులు సేవానిష్ఠులగునాశ్రితదాసులు. మంత్రణాదికార్యములు నెరపుచున్నప్పటికిని అప్పుడప్పుడుపరిచర్యలందు నియుక్తులగుటంబట్టిపారిషదదాసులుగా పరిగణింపబడుచున్నారు. విదురుడు, ఉద్ధవుడు, శ్రుతదేవాదులిట్టివారు. సదాప్రభు పరిచర్యాత్మకచిత్తులగువారనుగతదాసులు. వీరు వ్రజస్థులు, పురస్థులు అని రెండు విధములు. సుచంద్రుడు,మండలుడు మున్నగువారు ద్వారకానగర పురానుగతదాసులు. వీరు చామరాదులచే మాధవుని పరిచర్యలందు నిమగ్నులు. రక్తక. పత్రకాదులు వ్రజానుగతదాసులు.[39] ఇంకను అనేకవిధములనీదాసులు ప్రపంచీకరింపబడిరి, శ్రీమద్భాగవతమునందెందఱు భక్తులుగలరో అందఱి చరిత్రలయందీదాస్యభక్తి ప్రతీయమానమగుచునే యుండును.కావున నీవ్యాసమున దశమస్కంధమున ప్రతిపాదితమైన దాస్యభక్తిని, తదనుగుణమైన భక్తులగాథలను స్థాలీపులాకముగానుదహరింతును.

అధికృతదాసులలో దశమస్కంధమున ముఖ్యుడుగా బ్రహ్మదేవుని పేర్కొనవచ్చును. కృష్ణునిగూడి గోపాలురు చల్దులుగుడుచునెడ లేగలు పచ్చికజొంపములు మేయుచు ఘోరంబగునరణ్యంబున కడుదూరమేగగా వానిని వెదకుటకు శ్రీకృష్ణుడరిగెను. అంతట బ్రహ్మ మాయాబాలుడైన శ్రీకృష్ణుని శుంభద్బలంబాలోకింపదలచి యాలేగలను, గోపబాలురను ఒకచోదాచెను. దూడలజాడదెలియరాక తిరిగి చల్దులు గుడిచిన స్థలమునకురాగా నచట గోపబాలురును కనరాకపోయె అంతట విశ్వవిదుండైన గోవిందుడు మందహాసాస్యుడై, కరపాదాద్యవయవంబులు, భాషాగుణాదులు వీడ్వడక వత్సార్భకాకారములను దాల్చి మందకువచ్చి ఆయాతల్లులకు, గోవులకు,గోపకులకు యథావిధి బీ్రితిని కలిగించుచుండెను. ఇట్లొక్కవత్సరంబు గడచెను. అంతట బ్రహ్మ వత్స, బాలకాదులనుచూచి అందరును మాయాగుహాసుప్తులై యుండ వీరెవ్వరాయని వితర్కించిచూడ వారెల్లరును మేఘశ్యాములును, హారకుండలకేయూరకిరీటవనమాలికాభిరాములునై వేదాంతవిదులకైన నెఱుంగరానితెఱంగున గానంబడిన మోసము వచ్చెగదాయని చింతింపదొడగెను. కృష్ణుడును కరుణించి తన మాయాజాలమును విప్పి యారూపములనెల్ల దాచెను. అంతట విధాత నిర్జీవుండును, సజీవుండునునై బృందావనంబున సామాన్యగోపబాలకుపగిది విహరించు శ్రీకృష్ణుని కట్టెదుటగాంచి సంభ్రమించి, పాదంబులబడి, బాష్పజలంబుల గడిగి, యల్లనల్లనలేచి నయనారవిందములుదెఱచి, గోవిందుశుభాకృతి జూచి, తలవంచి, కృతాంజలియై, డిగ్గన డగ్గుత్తికనేకచిత్తంబున చతుర్ముఖంబుల

తరలము. కడుపులోపల నున్న పాపడు కాలదన్నిన గిన్కతో
నడుమఁ బోలునె కాఁగి తల్లికి నాథ సన్నము దోడ్డునై
యడగి కారణకార్యరూపము నైన యీ సకలంబు నీ
కడుపులోనిది గాదె పాపడ గాక నే మఱియెవ్వడన్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 556

అనుచునెన్నియోవిధముల వేడుకొని 'దేవా ! నీకు కల్పపర్యంతంబు నమస్కరించెద' నని ప్రార్థించి ముమ్మాఱువలగొని, పాదంబులపైఁబడి వీడ్కొని బ్రహ్మ తన నెలవునకుంజనియె. మూలమున నీపట్టున బ్రహ్మ సుమారు నలభైశ్లోకములలో కృష్ణుని ప్రార్థించెను. ఇందు పాదములపై పడి మ్రొక్కుట, దైన్యముతో ప్రార్థించుట, క్షమించుమని చేసినదోషము నంగీకరించుట, కీర్తించుట, వ్రేపల్లెజనుల పాదరేణువులు శిరమున ధరింతుననుట, తత్త్వమునెఱిగి యంగీకరించుట మున్నగునవి బ్రహ్మను దాస్యభక్త లక్షణలక్షితుజేయుచున్నవి. లోకములస్పృజించునధికారముగల బ్రహ్మ తానే సృష్టికర్తనను అధికారదర్పమునువదలి శ్రీకృష్ణదాసుడగుటచేత నీతడధికృతదాసు డనుట తగియున్నది.

అనంతరము అధికృతదాసులలో పేర్కొనదగినవాడు దేవేంద్రుడు. నందాదులు ప్రతివత్సరంబుజేయువిధంబున నింద్రయాగము సేయందలంచుటయు సంతట శ్రీకృష్ణుండు 'కర్మంబుల దప్పించి పెంపుజడయ నప్పరమేశ్వరుండైన సమర్థుడుగాడు. అట్టితఱి ప్రజావృద్ధికొఱకు నింద్రయాగంబు సేయఁబనిలేదు. కర్మానుయాతంబులైన భూతంబులకుఁ బురుహూతునివలన భీతియేల ? ఇంద్రుడేమి సేయగలడు? పశువులను, కొండను, బ్రాహ్మణులకు పూజసేయుడు. హోమముచేయుడు. అధమచండాల శునక సంహతికి తిండిబెట్టుడు. పశువులకడుపు నింపుడు. గిరిగోద్విజానలనమస్కారంబు గావింపుడు. జన్మధన్యంబగును. జన్నంబుధన్యంబగును.' అనుచు నింద్రునకు కోపంబు దీపింప నతని పెంపు దింపుతలంపున పలుకగా నందాదులు తద్వచనప్రకారము యథావిధి గోవర్ధనగిరిని పూజించుటయు, మహేంద్రుడలిగి సంవర్తకాది మేఘంబులను గోవిందుమందను గొందలపెట్టుమని ఆజ్ఞాపించుటయు, రాలవర్షముచే నామేఘంబులు ఘోషంబును ఘోషింపజేయుటయు జరిగెను. శిలావర్షహతులై శరణాగతులైనవారిని రక్షింప కృష్ణుండు గోవర్ధనగిరినొంటికేలనెత్తి, యేడహోరాత్రములుధరింప గిరిభేదియు విసిగి నందనందనుచరితంబులువిని వెఱగుపడి త్రిలోకరాజ్యమదంబు జాలించి యాతని చరణంబులబడి నమస్కరించి 'నీ దాసున్ నన్ను గృతాపరాధు గరుణన్ దర్శింపవే మాధవా' యనుచును,

మ. నిను బ్రహ్మాదు లెఱుంగలేరు జడతానిష్ఠుండ లోకత్రయా
వనదుర్మానగరిష్ఠుడన్ విపులదుర్వైదుష్యభూయిష్ఠుడన్
వినయత్యాగకనిష్ఠుడన్ గుజనగర్విశ్రేష్ఠుడన్ దేవ ! నీ
ఘనలీలావిభవంబుపెంపుఁ దెలియంగా నెవ్వడన్ సర్వగా ।

- ఆం. భాగ. దశమ. పూ. భా. 941

అనుచును బహువిధంబుల బ్రార్థించిన చక్రియు, శ్రీయుతుడవై మదింపకు, శ్రేయంబులుగల్గుబొమ్మనిన, 'నీచేతన్ శాశ్వతులమైతిమిప్పుడు శాశ్వతముగఁ గంటి మధిక సౌఖ్యంబు' అని గోగణంబులకు వాసుదేవుని పతిగానభిషిక్తుఁజేసి దివంబున కరిగెను. ఈఘట్టమున మూలమునందలి యింద్రుని అపరాధక్షమాపణముకంటె, 'జడతానిష్ఠ దుర్మానగరిష్ఠడ' నిత్యాదిగా పోతనయింద్రునిలోని యాత్మన్యూనతాభావము, పరాత్పరుని ముందాతని యల్పత్వము, దాసలక్షణమును, స్పష్టపఱచుచున్నది. ఇది పరమాత్మనిముందు పోతన తానత్యల్పుడనని భావించుటయే. దీనివలవ వ్యాసుని యింద్రునికంటె పోతన యింద్రునిలోని దాస్యభక్తి పరాకాష్ఠనందినదని చెప్పవచ్చును. అతనిగర్వమణగినది. త్రిలోకాధిపతిననెడి యహంకారము తొలగినది. కావుననే అట్టియింద్రునిచేత శ్రీకృష్ణుడు గోపగోగణాధిపత్యమునకభిషిక్తుడైనాడు. ఇట్లు వ్యాస పోతనల భాగవతములరెండింట నింద్రుడు గర్వాంధకారమునువీడి జగదీశ్వరుదాసుడై అధికృతదాసుడాయెను. త్రిలోకాధీశుడే తానత్యల్పుడననుచుండ యా పరమాత్ముని ముందు సామాన్యుడెంతటియల్పుడో తెలియజెప్పుటయేగాక యెట్టివాడైనను తన యల్పత్వమునంగీకరించి దాసుడైనచో పరమాత్ముని అనుగ్రహమునకు పాత్రుడగునని భాగవతార్థమైనట్లు స్పష్టమగుచున్నది.

ఆశ్రితదాసులలో పాత్రుడైనవాడు కాళియుడని చెప్పవచ్చును. ఈతనికెట్టి యధికారము లేకున్నను బలగర్వితుడు, కుపితుడుకాగా శ్రీకృష్ణునిచే బలదర్పమణగి దాసుడై యాశ్రయించుటవలన నీతడాశ్రితదాసుడై పరమాత్ముని యనుగ్రహమునకు పాత్రుడైనాడు. కాళియుని బలగర్వమెట్టిదనిన విషదోషమడప దవమడుగుసజొచ్చిన కృష్ణునిజూచి -

శా. బాలుం డొక్కడు వీడు నా మడుగు విభ్రాంతితోఁ జొచ్చి లక్ష్మీకర్ణక
ల్లోలంబై కలగం జరించె నిట నే లోనుంటఁ జూడండు మ
త్కీలాభీల విశాలదుస్సహవిషాగ్నిజ్వాలలన్ భస్మమై
కూలం జేసెద నేడు లోకులకు నా కోపంబు దీపింపగన్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 632.

అనుచు విజృంభించినాడు. కృష్ణుడు వాని దౌడలుపట్టి, దుర్విషానలము గ్రక్కనట్లుగ చిటచిటగ్రదిప్పివైవ, వాడును, రెట్టించిన సంభ్రమంబున విజృంభించెను. కృష్ణుడును కాళియఫణిఫణామండపమున నక్షీణోద్ధతి కేళిగతితో పదప్రక్షేపంబులుసేయగా ప్రాణావశేషుడైన కాళియుడు బెండువడి, ముఖంబుల రక్తమాంసంబులుమియుచు, కన్నుల విషంబుగ్రక్కుచు, తుదకు తన్ను హింసించునది సేవాప్రీతుడగు శ్రీహరియగు ననితలంచి, శరణుపొందినాడు. నలిగిన తలలు సవరించుకొనుచు 'మేముపావజాతుల మతికోపనులము కాని

క. నాపుణ్యమేమి చెప్పను
నీపాదరజంబుఁ గంటి నే సనకాదుల్
నీపాదరజముఁ గోరుదు
రేపదమం దున్ననైన నీక మేలు హరీ!'

— ఆం. భాగ. దశమ పూ. భా. 691,

అని విన్నవించిన ఇకపై యిందుండవలదని సర్వేశుడు శాసించెను. ఫణీంద్రుడును భగవానునకనేక దివ్యాంబరాభరణాదుల సమర్పించి, బహువారంబులు కైవారంబులు చేసి, వీడ్కొని, రత్నాకరద్వీపమునకు వెడలెను. అప్పాపజాతి యిప్పటికి కృష్ణపాదములు శిరమున ధరించుట వాని దాస్యభక్తికి ప్రబల నిదర్శనము. పాదరజమునందిన విశేషము పోతనచేత మాత్రమే చెప్పబడినది. కావున అనువాదమునందలి కాళియుని దాస్య భావముపరిపుష్టమైనట్లయినది. ఆపదనొంది 'సర్వము నీయధీనము, మనిచిన నిగ్రహించిన నీవే' యని భగవానుని పాదముల నాశ్రయించిన దాసుడుగాన కాళియుడాశ్రితదాసభక్తి కుదాహరణప్రాయుడాయెను.

శ్రుతిదేవుడు పారిషదదాసులలో పేర్కొనదగినవాడు. ఈతడు శ్రీహరిపాదకంజాత భక్తుడు. గళితరాగాదివికారుడు. శాంతుడు. నిగమార్థకోవిదుడు. గృహస్థ ధర్మమందుండిన సముచిత కర్ముడు అట్టి యమలచరితుని ఇంటికి శ్రీకృష్ణుడు మునిగణసమేతుడై వెడలగానాదేవదేవుని చరణారవిందంబుల నా పరమభాగవతుడు యథావిధినర్చించి, భగవదాజ్ఞనమ్మునిజనంబులను పూజించెను. ఇందు శ్రీకృష్ణపద దాసుడైన శ్రుతిదేవుడు నిజగృహస్థాశ్రమకర్మానుష్ఠాననిరతుడయ్యును భగవంతునానతిపై మునిగణములకు పూజలుసలుపుట నాతనిని పారిషదదాసునిగా తెలియజేయుచున్నది. తమతమ విధ్యుక్తకర్మలయందుండియు భగవానునిపాదములను సేవించుచు, ఆతనియాజ్ఞలను పాటించుచుండవలెనని దీనిచే ప్రతిపాదింపబడినది.

శ్రీకృష్ణుని అష్టమహిషులు, పదియారువేలమంది రాజకన్యలు భగవానుని ప్రియదాసీజనముగా పరిగణింపవచ్చును. ఒకపరి ద్రౌపది శ్రీకృష్ణపత్నులెనమండ్రను వారి వివాహములగురించి యడుగగా రుక్మిణి 'తచ్ఛ్రీనికేతన చరణోఽస్తు మమార్చనాయ' అనుటయు; సత్యభామ తనతండ్రి నిజమునుగ్రహించక నిందమోపినందులకు ప్రాయశ్చిత్తముగా స్యమంతకమణితోపాటు తన్నర్పించెననుటయు; జాంబవతి 'నేనెన్ని జన్మలకైన నను భగవానుని చరణదాసినే యగుదునుగాక' యనుటయు కాళింది 'నేను శ్యామసుందరుని గృహమునలంకరించు దాసిన' నుటయు; మిత్రవింద జన్మజన్మలకు శ్రీకృష్ణపాదసేవ లభించవలెననునదియే తనకోరికయనుటయు; సత్య భగవానుని నిరంతరము సేవించవలెననువాంఛ పూర్తిగానెరవేరినదనుటయు; భద్ర జన్మజన్మలకుసహితము భగవచ్చరణసేవ లభించవలెననియు, అదియేపరమ కల్యాణమని భావింతుననుటయు; లక్ష్మణ తన వివాహవృత్తాంతమును సవిస్తరముగా వివరించి 'మేము పూర్వజన్మలో గొప్పతపస్సుచేసి యాసక్తులు విడిచియుండుటచే నీజన్మలో నాత్మారాముడైన భగవానుని పత్నులమైనాము' అనుటయు వారు కృష్ణునకు ప్రియులైన దాస్యభక్తులని తెలియుచున్నది. అంతియేగాక పదునారువేలమంది కులకాంతలు 'మాకు సామ్రాజ్యభోగము, ఇంద్రపదవులు, అణిమాది విభూతులు, బ్రహ్మపదము వలదు. సాలోక్య, సారూప్య ముక్తులును మాకువలదు. లక్ష్మీవక్షఃస్థలకుంకుమ రాగము పాదములందుగల శ్రీపతిచరణసేవయే మాకుకావలెను. గోపాలన సమయమున ఏచరణధూళినిస్పృశించి గోపగోపికలు, భిల్లస్త్రీలు, లతలు, తీగలు పరవశించినవో అట్టి భగవానుని పాదరజస్పర్శనే మేము కోరుచున్నాము' అనుటయు వీరిలోగల దాస్యభక్తిని వెల్లడించుచున్నది.[40]

పోతనయనువాదమున రుక్మిణ్యాది కన్యల వివాహఘట్టముల వారిలో గల దాస్యభక్తి వ్యక్తీకరింపబడినది. రుక్మిణీకల్యాణఘట్టమున

మ. ఘను లాత్మీయతమోనివృత్తికొఱకై గౌరీశుమర్యాద నె
వ్వని పాదాంబుజతోయమందు మునుగన్ వాంఛింతు రే నట్టి నీ
యనుకంపన్ విలసింపనేని వ్రతచర్యన్ నూఱుజన్మంబులన్
నినుఁ జింతించుచుఁ బ్రాణముల్ విడిచెదన్ నిక్కంబు ప్రాణేశ్వరా!

ఆ. నీరజాతనయన, నీవనమాలికా
గంధ మబ్బలేని ఘ్రాణమేల

అనుచు విజృంభించినాడు. కృష్ణుడు వాని దౌడలుపట్టి, దుర్విషానలము గ్రక్కునట్లుగ చిఱచిఱద్రిప్పివైవ, వాడును, రెట్టించిన సంభ్రమంబున విజృంభించెను. కృష్ణుడును కాళియఫణిఫణామండపమున నక్షీణోద్ధతి కేళిగతితో పదప్రక్షేపంబులు సేయగా ప్రాణావశేషుడైన కాళియుడు బెండువడి, ముఖంబుల రక్తమాంసంబులుమియుచు, కన్నుల విషంబుగ్రక్కుచు, తుదకు తన్ను హింసించునది సేవాప్రీతుడగు శ్రీహరియగు ననితలంచి, శరణునొందినాడు. సలిగిన తలలు సవరించుకొనుచు 'మేముపావజాతుల మతికోపనులము కాని

క. నాపుణ్యమేమి చెప్పను
నీపాదరజంబుఁ గంటి నే సనకాదుల్
నీపాదరజముఁ గోరుదు
రేపదమం దున్ననైన నీకమేలు హరీ!'

— ఆం. భాగ. దశమ పూ. భా. 691,

అని విన్నవించిన ఇఁకపై యిందుండవలదని సర్వేశుడు శాసించెను. ఫణీంద్రుడును భగవానునకనేక దివ్యాంబరాభరణాదుల సమర్పించి, బహువారంబులు కైవారంబులు చేసి, వీడ్కొని, రత్నాకరద్వీపమునకు వెడలెను. అప్పావజాతి యిప్పటికి కృష్ణపాదములు శిరమున ధరించుట వాని దాస్యభక్తికి ప్రబల నిదర్శనము. పాదరజమునందిన విశేషము పోతనచేత మాత్రమే చెప్పబడినది. కావున అనువాదమునందలి కాళియుని దాస్య భావముపరిపుష్టమైనట్లయినది. ఆపదనొంది 'సర్వము నీయధీనము, మనిచిన నిగ్రహించిన నీవే' యని భగవానుని పాదముల నాశ్రయించిన దాసుడుగాన కాళియుడాశ్రితదాసభక్తి కుదాహరణప్రాయుడాయెను.

శ్రుతిదేవుడు పారిషదదాసులలో పేర్కొనదగినవాడు. ఈతడు శ్రీహరిపాద కంజాత భక్తుడు. గళితరాగాదివికారుడు. శాంతుడు. నిగమార్థకోవిదుడు. గృహస్థ ధర్మమందుండిన సముచిత కర్ముడు అట్టి యమలచరితుని ఇంటికి శ్రీకృష్ణుడు మునిగణసమేతుడై వెడలగానాదేవదేవుని చరణారవిందంబుల నా పరమభాగవతుడు యథావిధినర్చించి, భగవదాజ్ఞనప్పు నిజనంబులను పూజించెను. ఇందు శ్రీకృష్ణపద దాసుడైన శ్రుతిదేవుడు నిజగృహస్థాశ్రమకర్మానుష్ఠాననిరతుడయ్యును భగవంతు నానతిపై మునిగణములకు పూజలుసలుపుట నాతనిని పారిషదదాసునిగా తెలియజేయు చున్నది. తమతమ విధ్యుక్తకర్మలయందుండియు భగవానునిపాదములను సేవించుచు, ఆతనియాజ్ఞలను పాటించుచుండవలెనని దీనిచే ప్రతిపాదింపబడినది.

త్మక చిత్తములుగలవారుగా చిత్రించి యనుగతదాసులుగా ప్రకటించియున్నటుల గాన నగుచున్నది.

శ్రీకృష్ణునిచే పంపబడిన గోపబాలురు మునిపత్నులనన్నమడుగగా వారు తమ భర్తలు వలదన్నను గణుతింపక గోవిందసందర్శన కుతూహలలై సంభ్రమానందంబులు డెందంబుల సందడింప భక్ష్య,భోజ్య,లేహ్య,చోష్య,పానీయభేదంబులంగలిగి సంస్కార సంపన్నంబులైన అన్నంబుల గుంభంబులనిడుకొనిరాగా శ్రీకృష్ణుడు, మీపతులు మిమ్ముగూడి క్రతువుపరిసమాప్తి సేసెదరు మీరు యాగవాటంబునకుంజనుండనిన వారును

మ. తగునే మాధవ! యిట్టివాడిపలుకుల్ ధర్మంబులే యియ్యెడన్
మగలున్ బిడ్డలు సోదరుల్ జనకులున్ మమ్మున్ నివారింప మ
చ్చిగ నీయంఘ్రులు చేరినార మట పోఁజేకొందురే వారలా
పగిదే మెల్లము కింకరీజనులఁగా భావించి రక్షింపవే.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 865.

అనిన జగదీశ్వరుండును 'నాయందు మనసులు మరుగజేసి మీరు నన్నుఁజేరెదర'ని పలికి వారలుదెచ్చిన భక్ష్యాదులాప్తవర్గముతోడ నారగించెను. ఇట్లు పరమేశ్వరు పాదాబ్జంబులఁగోరిన మునికాంతలు దాస్యభక్తులనుటకు పరమేశ్వరుడు వారిని కరుణించిన విధమే తార్కాణము. మూలమునందలి మునికాంతలును

శ్లో. గృహ్ణంతి నో న పతయః పితరౌ సుతా వా
న భ్రాతృ బంధుసుహృదః కుత ఏవ చాన్యే
తస్మాత్ భవత్ప్రపదయోః పతితాత్మనాం నో
నాన్యా భవేద్గతిరరిందమ తద్విధేహి॥

- సం. భాగ. 10-23-30.

అనుచు దాస్యభక్తినే ప్రకటించిరి.

శ్రీకృష్ణునకత్యంతప్రియులగు గోపికలయందును దాస్య భక్తికానవచ్చును. అంత మాత్రమేగాక వీరిదాస్యమనన్యసామాన్యమైన రసస్థాయికి జేరినది. వస్త్రాపహరణ ఘట్టమున గోపికలు 'నీచెంతన్ దాసులమై చరించెదము మాచేలంబులిప్పింపవే' అని వేడుకొనుచు-

క. వచ్చెదము నీవు పిల్చిన
నిచ్చెద మేమైన గాని యెటు వోరుమనినం
జొచ్చెదము నేడు వస్త్రము
లిచ్చి మముం గరుణతోడ నేలుము కృష్ణా!
— ఆం. భాగ. దశమ. పూ. భా. 828.

ఇట్లు ప్రార్థించుటచేత వీరి దాస్యభక్తి వెల్లడియగుచున్నది. పిలిచినవచ్చుట, అన్నియు నిచ్చుట, పొమ్మనినచోటునకుపోవుటమున్నగునవన్నియు, దాసీలక్షణములేగదా! అన్నిం టినిమించి యిచ్చెదమేమైన అనుచు వీరిసర్వస్వము భగవానునకర్పింపసిద్ధమైన దాస్యతత్పరత యనన్య సామాన్యమైనది. మూలమునందు

శ్లో. శ్యామసుందర తే దాస్యః కరవామ తవోదితమ్।
దేహి వాసాంసి ధర్మజ్ఞ నోచేద్రాజ్ఞే బ్రువామహే॥
— సం. భాగ. 10-22-15.

అనిగోపికలు పలుకుటనుబట్టియు, రెండుచేతులనమస్కరింపక మొదటనొంటిచేత నమస్క రించుటయు, ఆదియధర్మమనిచెప్పగానపుడు రెండుచేతులతో నమస్కరించుటయు గాంచినపుడు వీరి దాస్యభక్తి అంతగా పరిపక్వతనొందినట్లు కనిపించదు. ఇట్లేక హస్తమున వందనమాచరించుట యనువాదమున గానరాదు. ఇట్లాలోచింప నీ ఘట్టమున పోతన గోపికలలో కానవగు పరిపూర్ణదాస్యభక్తిలక్షణములు, పరవశత్వము, వ్యాసుని గోపికలలో కానరావనుటలో నెట్టి విప్రతిపత్తియు కాన్పించదు.

బృందావనమున మురళీగానమువిని పరతంత్రలై వచ్చిన గోపికలను మరలి పొండని కృష్ణుడు పలుకగా వారు

చ. సిరికి నుదారచిహ్నములు సేయు భవచ్చరణారవిందముల్
సరసిజనేత్ర మాతపముసంపదఁ జేరితి మెట్టకేలకున్
మరలగ లేము మా మగలమాటల నొల్లము పద్మగంధముల్
మరగినతేటు లన్యకుసుమంబులకుం జన నిచ్చగించునే.
— ఆం. భాగ. దశమ. పూ.భా. 989.

అనియును, 'పొత్తులనొల్లమో పురుషభూషణ ! దాస్యములిచ్చికావవే' యనుచునెన్నో విధముల దీనాలాపములాడగా నతండు నాత్మారాముడై రమించెను. మూలము

నందును గోపికలీవిధముగనే 'త్వత్సుందరస్మితనిరీక్షణతీవ్రకామతప్తాత్మనాం పురు షభూషణ దేహి దాస్యమ్' అనుచు పరమాత్మ్మదాస్యమును కోరిరి.
అట్లే శ్రీకృష్ణుడంత ప్రీతుడుకాగా_

క. శారదకమలోదరరుచి
చోరక మగు చూపువలన సుందర! మమ్మున్
గోరి వెలయిూని దాసుల
ధీరత నొప్పించు టిది వధించుట గాదే.

- ఆం. భాగ. దశమ. పూ.భా. 1036.

ఆ. చరణసేవకులకు సంసారభయమును
బాపి శ్రీకరంబు పట్టు గలిగి
కామదాయి యైన కరసరోజంబు మా
మస్తకముల నునిచి మనుపు మీశ.

- ఆం. భాగ. దశమ. పూ.భా. 1039.

ఆ. ఘోషభూమి వెడలి గోవుల మేపంగ
నీరజాభమైన నీపదములు
కసవు శిలలు దాఁకి కడునొచ్చునో యని
కలుగు మామనములు కమలనయన !

- ఆం. భాగ. దశమ. పూ.భా. 1045.

ఆ. భక్తకామదంబు బ్రహ్మసేవిత మిలా
మండనంబు దుఃఖమర్దనంబు
భద్రకరమునైన భవదంఘ్రియుగము మా
యురములందు రమణ! యునుపఁ దగదె.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1047.

అనుచు గోపికలంచితస్వరముతో వేడుప నదివిని యప్పరంధాముడు వారిని కరుణించి సంతృప్తిపరచెను. ఇట్లీఘట్టమందలిదాస్యభావము రసస్థాయినందిగోపికలనేగాక పోతనను, పాఠకులను, శ్రోతలను సహితము దాస్యరసాబ్ధిలోనోలలాడించినది. ఇట్లే మూలము నందును వ్యాసుడు గోపికలయొక్క దాస్యభక్తిని చక్కగా నీ ఘట్టమున అభివ్యక్తము చేసినాడు.

శ్లో. శరదుదాశయే సాధుజాతసత్
సరసిజోదరశ్రీముషా దృశా ।
సురతనాథ తేఽశుల్కదాసికా
వరద నిఘ్నతో నేహ కిం వధః ॥
- సం. భాగ. 10-31-2

శ్లో. విరచితాభయం వృష్ణిధుర్య తే
చరణమీయుషాం సంసృతేర్భయాత్ ।
కరసరోరుహం కాంతకామదం
శిరసి దేహి నః శ్రీకరగ్రహమ్ ॥
- సం. భాగ. 10-31-5

శ్లో. చలసి యద్వ్రజాచ్చారయన్ పశూన్
నళినసుందరం నాథ తే పదమ్
శిలతృణాంకురైస్సీదతీతి నః
కలిలతాం మనః కాంత గచ్ఛతి ॥
- సం భాగ. 10-31-11

శ్లో. ప్రణతకామదం పద్మజార్చితం
ధరణిమండనం ధ్యేయమాపది !
చరణపంకజం శంతమం చ తే
రమణ న స్తనేష్వర్పయాధిహన్ ॥
- సం. భాగ. 10-31-13

పరమాత్మునియందలి దాస్యభక్తితో సమానమైనది భాగవత దాస్యమనుటకు ఆయాఘట్టములలో పురుషోత్తముని పాదములనుతాకిన రజముయొక్కయు, బృందావన మందలి భూములయొక్కయు, గో, గోప, గోపీజనముయొక్కయు ధన్యతనుటంకించి, తద్దాసత్వమంగీకరించుటయే ప్రబలోదాహరణము కాగలదు. దీనివలన భగవద్భక్తుల దాస్యమును భాగవతము ప్రతిపాదించుచున్నదని విశదమగుచున్నది.

ఇట్లు సంస్కృతాంధ్రభాగవతదశమస్కంధముల దాస్యరసము వెల్లివిరిసి యా రసప్రవాహమున పాఠకులను, శ్రోతలను భగవత్పాదపద్మములపై బడవేయుచున్న

వనుట యథార్థము. కాని సేవ్యసేవకభావముచేనిందు భగవానునకుభక్తునకుమధ్యనంతర మధికమనుట స్పష్టము. నిరంతరదాస్యభావమున భగవానుని సేవించుచున్నచో భగవంతునకత్యంతసన్నిహితమైన సఖ్యముత్పన్నముకాగలదు. కావున దాస్యభక్తి యెల్లరకు నెల్లవేళలననుసరింపదగినదని భాగవతము స్పష్టమొనరించుచున్నది.

## సఖ్య భక్తి

పరమాత్ముని స్నేహితునిగాభావించి సేవించుటయే సఖ్యభక్తి యనబడును. 'భగవంతుని ప్రభావ, తత్త్వ, రహస్య, మహిమల గ్రహించి విశ్వాస పూర్వకముగా సఖ్యభావముతో నాతని రుచికనుగుణముగా రూపొందుట, అతనిననన్యముగా ప్రేమించుట, ఆతని గుణరూపలీలాదుల యందు ముగ్ధుడై నిరంతరము ప్రసన్నముగా నుండుట సఖ్యభక్తి.[41] అని తెలికేపల్లి లక్ష్మినారాయణశాస్త్రిగారు వక్కాణించియున్నారు.

నవవిధ భక్తిమార్గములలో నాత్మనివేదనముతరువాత ప్రధానముగా చెప్పదగినది సఖ్యభక్తియే. దాస్యముయొక్క పరిపక్వస్థితియే సఖ్యము. దాస్యభక్తియందు ప్రేమ, సాన్నిధ్యముండునే గాని భగవానునియందు చనవుండదు. ప్రేమ, సాన్నిధ్యము, సన్నిహితత్వము గల భక్తి సఖ్యము. భక్తిరసామృతసింధువు దీనినే ప్రేయోరసమని పేర్కొనెను. ఇందు భగవానునకత్యంతసన్నిహితముగానుండుటచే భగవానుని గుణరూపాదులుకొన్ని యప్రియత్నముగనే భక్తునకు లభించగలవు.

శ్లో. స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః।
భక్తోసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్ ॥
- భగవద్గీత. 4-3.

పరమగుహ్యమును, పురాతనమునగునిది నీవు నాకు సఖుడవగుటచే చెప్పబడినదను భగవద్గీతావాక్యమునుబట్టి సఖ్యభక్తియొక్క ప్రాముఖ్యమెట్టిదో విశదమగుచున్నది. ఇట్టిభక్తికి ప్రతీకలుగా చెప్పకొనదగినవారు గోపబాలురు, ఉద్ధవుడు, కుచేలుడు.

శ్రీకృష్ణుండొక్కనాడేకాంతంబున సిద్ధవిచారుడు, గభీరుడు, వృద్ధవచోవర్ణనీయ వృష్ణిప్రవరుడు, బుద్ధినిధినమరగురుసముడునగు నుద్ధవునితో

శా. రమ్మా యుద్ధవ! గోపకామినులు నా రాకన్ నిరీక్షింపుచున్
సమ్మోహంబున నమ్మియున్ మఱచి యే చందంబునన్ గుందిరో

తమ్మున్ నమ్మినవారి డిగ్గ విడువన్ ధర్మంబుగాదండ్రు వే
పొమ్మా! ప్రాణము లేక్రియన్ నిలిపిరో ప్రోద్యద్వియోగాగ్నులన్.
— ఆం. భాగ. దశమ. పూ. భా. 1433

అని మందహాససుందరవదనారవిందుడై, కరంబు కరంబుననవలంబించి సరస వచనంబులాడుచు గోపవనితల నోదార్చుటకై వ్రేపల్లెకీతనిని పంపుటవలన వీరిరువురి సఖ్యమెట్టిదో తెలియుచున్నది. తన మందిరము బ్రవేశించిన యుద్ధవుని కృష్ణునిగా భావించి నందుడు పూజించుటనుబట్టియు,

శా. రాజీవాక్షుఁడు సుందరాస్యుఁడు మహోరస్కుండు పీతాంబరుం
డాజానుస్థితబాహుఁ డంబురుహమాలాలంకృతుం డుల్లసత్
రాజత్కుండలుఁ డొక్కవీరుఁ డిచటన్ రాజిల్లుచున్నాడు మా
రాజీవాక్షునిభంగి నంచుఁ గనిరా రాజాన్వయున్ గోపికల్.
— ఆం. భాగ. దశమ. పూ. భా. 1448

కని లజ్జాసహితహాసవిలోకనంబులు ముఖంబులకుం జెలువొసంగ

చ. ఎఱుఁగుదు మేము నిన్ను వనజేక్షణు మిత్రుడ వీవు కూరిమిన్
మెఱయుచుఁ దల్లిదండ్రులకు మేలెఱిగింపఁ బ్రియుండు పంపగా
వఱలెడు భక్తి వచ్చితివి వారలనైన మనంబులోపలన్
మఱవడు శౌరి మేలు మఱి మాన్యులు రాజున కెవ్వరిచ్చటన్
— ఆం. భాగ. దశమ పూ. భా. 1450

అని పలుకుటనుబట్టియు శ్రీకృష్ణునకత్యంతప్రియసఖుడుద్ధవుడను విషయము స్పష్టమగుచున్నది. అత్యంతసన్నిహితత్వముచే నుద్ధవునకు శ్రీకృష్ణుని రూపరేఖావిలాసము లప్రయత్నముగా లభించినవనుటకు గోపికలకీతడు వారి రాజీవాక్షునిభంగి రాజిల్లుచున్నట్లు కనంబడుటయే ప్రబలనిదర్శనము. ఇందువలననుద్ధవుని సఖ్యభక్తి తెల్లమగుచున్నది. అంతియేగాక శ్రీకృష్ణునిసందేశమును విని గోపికలుద్ధవునితో-

శా. నీతో నర్మగృహంబులం బలుకునే నేమెల్ల వంశోల్లస
ద్గీతభ్రాంతలమై కళిందతనయాతీరంబునన్ జేరినన్
జేతోజాతసుఖంబులం దనిపి మా చిత్తస్థితుల్ సూడ లీ
లాతంత్రజ్ఞత డాగి మెల్లన మదాలాపంబు లాలించుటల్.

శా. ఏకాంతంబున నీదుపై నొరగి తానేమేని భాషించుచో
మాకాంతుండు వచించునే రవిసుతామధ్యప్రదేశంబునన్
రాకాచంద్రమయూఖముల్ మెఱయగా రాసంబు మాతోడ నం
గీకారం బొనరించి బంధనియతిం గ్రీడించు విన్నాణముల్
— ఆం భాగ. దశమ పూ భా. 1475, 77

అనుచు బ్రశ్నించుటనుబట్టియు నుద్ధవుడు శ్రీకృష్ణున కెంతటి యాంతరంగికుడో, సన్నిహితుడో స్పష్టమగుచున్నది. లేనిచో నర్మగృహంబులందలి, ఏకాంతములందలి తమ రాసక్రీడలవిషయములుద్ధవునితో శ్రీకృష్ణుడు చెప్పియుండునని గోపికలూహింప లేరుగదా !

కృష్ణలీలావర్ణనములుజేయుచు నుద్ధవుడు వ్రేపల్లెయందు కొన్నినెలలపాటు గడపినందువ నాతని కృష్ణభక్తవై శిష్యమును, కుబ్జను రతిక్రీడలందనుప నామెగృహంబునకేగునపుడు శ్రీకృష్ణుడాతనిని వెంటనిడుకొనిపోవుటవలన వారి సఖ్యమందలి సన్నిహితత్వమును వ్యక్తమై యొండొరులమధ్యగల యనురాగము స్పష్టమగుచున్నది.

సఖ్యభక్తులలో కుచేలుడు ప్రముఖుడు. మూలమున నితడు శ్రీదాముడని 80వ అధ్యాయాంతమున గానవచ్చుచుండగా ననువాదమున ఆపేరు కానరాదు. ఇతడు గోవిందసఖుడు; మానధనుడు; విజ్ఞానరాగాదివిరహితస్వాంతుడు; శాంతుడు; ధర్మవత్సలుడు; విజితేంద్రియుడు; బ్రహ్మవేత్త. దారిద్ర్యము బాధించుచున్ననొరుల నడుగబోవక తనకుతానుగా లభించిన కాసును పదివేలుగా దలంచి యాత్మలో సంతోషించి పుత్రదారాభిరక్షణ గావించుచుండెడివాడు. ఒకనాడు కుచేలునిభార్య అతనితో— 'భక్తుడుకాకపోయినను ఆపదలందు తన్ను దలంచినవానికి సర్వమునొసగు ఆ భగవానుడు నిరంతరము నిశ్చలభక్తితో దనను భజియించు మీకు సంపదలనొసగక పోవునా' అని పలుకనాతండును కృష్ణునిగననేగుట ఇహపరసాధనమగుననియు, రాజీవాక్షునిపాదపద్మంబులనాశ్రయింపగ(జనుట పరమశోభనమనియు దలచి శిథిలవస్త్రమున పృథుకతండులములు కొన్ని మూటగట్టికొని బయలుదేరుటయు, బాల్యమిత్రుని దర్శించుటయు జరిగినది. మార్గమధ్యమున 'ద్వారకావగరంబునేరీతి బ్రవేశింతును? అప్పుండరీకాక్షునేరీతి దర్శింపగలను? ఆతని దయార్ద్ర దృష్టిగాక నాభాగ్యమొండు గలదె? ఆతడేల నన్నుపేక్షించు?' అని తలంచుటను బట్టి యాతనికి శ్రీకృష్ణునిపైగల సఖ్యభక్తియు, వారిరువురిమధ్యగల సన్నిహితత్వమును వ్యక్తమగుచున్నవి.

కుచేలునల్లంతనె చూచి కృష్ణుడు తల్పముదిగి యెదురేగి, పరిరంభణమాచరించి బంధుస్నేహస్ఫురణన్ దోడ్తెచ్చి, తనతల్పమున గూర్చుండబెట్టి, నెయ్యమునఁగనక కలశసలిలంబుచే గాళ్ళు గడిగి, తజ్జలంబు మస్తకమునదాల్చి, తాళవృంతములవిసరి, ధూపంబులొసగి, దీపంబులు నివాళించి, తాంబూలాదులనొసగి, సాదరంబుగా స్వాగతం బడుగుటనుబట్టియు, రుక్మిణి వింజామరలువీయుటను బట్టియు, కుచేలునకు, కృష్ణునకు మధ్యగల సఖ్యమెట్టిదియో, సఖ్యభక్తులందు కుచేలుడెంతటిప్రముఖుడో విశదమగు చున్నది. కావుననే శుద్ధాంతకాంతాజనంబులద్భుతంబంది -

ఉ. ఏమితపంబు చేసెనొకో యీ ధరణీదివిజోత్తముండు దొల్
బాముల యోగివిస్ఫురదుపాస్యకుఁడై తనరారు నీజగత్
స్వామి రమాధినాథునిజతల్పమునన్ వసియించి యున్నవాఁ
డీమహనీయమూర్తి కెనయే మునిపుంగవు లెంతవారలున్.

చ. తనమృదుతల్పమందు వనితామణి యైన రమాలలామ పొం
దును నెడగాఁ దలంపక యదుప్రవరుం డెదు రేగి మోదమున్
దనుకఁగఁ గౌగిలించి యుచితక్రియలన్ బరితుష్టుఁ జేయుచున్
వినయమునన్ భజించె ధరణీసురుఁ డెంతటి భాగ్యవంతుడో.

- ఆం. భాగ. దశమ. ఉ. భా. 981, 983.

అని భావించుటజరిగినది. ఇందు సఖ్యభక్తుని భగవానుడాదరించుతీరు సుస్పష్టమగు చున్నది. అట్లే తామిరువురును గురుమందిరంబున గావించిన పనులను తలంచుచు మాధవుడాడిన మాటలు విని

క. గురుమతిఁ దలపగఁ ద్విజగ
ద్గురుఁడ వనం దగిననీకు గురుఁ డనగా నొం
డొరుఁ డెవ్వఁ డింతయును నీ
కరయంగ విడంబనంబ యగుఁ గాదె హరీ.

- ఆం. భాగ. దశమ ఉ. భా. 1004.

అని సాభిప్రాయముగా పలికిన కుచేలుని పలుకులనుబట్టి యాతని భక్తిభావ మెట్టిదో తేటతెల్లమగుచున్నది. కావుననే సమస్తభావాభివ్యక్తుడైన పుండరీకాక్షుండు మందస్మితవదనారవిందుడగుటయు, అతడు భక్తితోతెచ్చిన యటుకులుకొన్ని

పుచ్చుకొని యతనినను గ్రహించుటయు జరిగినది. అనంతరము కుచేలుడు సంపదగల వాడైనను పుండరీకాక్షునియందు పూర్వమువలెనే భక్తితాత్పర్యములచే రాగాది విరహితుడై, నిర్వికారుడై, అఖిలక్రియలందుననంతుని అనంతధ్యాన సుధారసంబునం జొక్కుచు, విగతబంధనుడై యపవర్గప్రాప్తినొందెను. ఇట్లు కుచేలునిపై శ్రీకృష్ణునకు కలిగిన అపారమైనయనురాగమునకు అతని నిష్కల్మషమైన సఖ్యమే కారణము.

ఈఘట్టమును మూలముతో పోల్చిచూడ భార్యచే ప్రేరితుడైన కుచేలుడు 'అయం హి పరమో లాభ ఉత్తమశ్లోక దర్శనమ్' అనిమాత్రమే మనమున చింతించినట్లుండ అనువాదమున కృష్ణునిగననేగుట యిహపరసాధనమగుననితలచి, "రాజీవనేత్రుపాదపద్మంబులాశ్రయింపగజనుట పరమశోభనము"ని భార్యతోపలుకుట వలన మూలమునందలి కుచేలునికంటె పోతనగారికుచేలుడు శ్రీకృష్ణదర్శనమువలన పరమప్రయోజనమును చక్కగానెరింగినవాడని సుస్పష్టమగుచున్నది.

అట్లే ద్వారకానగరమునకేగుసమయమున మూలమున 'కృష్ణసందర్శనం మహ్యం కథంస్యాదితి చింతయన్' అని మాత్రమేయుండగానువాదమున కుచేలుడు కృష్ణదర్శనాభిలాషగలవాడేగాక యేవిధముగానైనను దర్శించవలెననియు, నాతడు తన్నుపేక్షింపడని భావించుటయు గలదు. వ్యాసునికుచేలునిలో కానరాని ధైర్యము, నమ్మకము, తపన పోతనకుచేలునిలో కనిపించును. ఆతడేల నన్నుపేక్షించుననుచు ద్వారకాపురముసొచ్చిన కుచేలుడు మహనీయమణిమయగోపురప్రాసాదసౌధహర్మ్యముల జూచి మనము బ్రహ్మానందమునుపొంది సంతోషబాష్పములు జడిగొనుసమయంబున

సీ. ఇందీవరశ్యాము వందితసుత్రాముఁ
గరుణాలవాలు భాసురకపోలుఁ
గౌస్తుభాలంకారుఁ గామితమందారు
సురుచిరలావణ్యు సురశరణ్యు
హర్యక్షనిభమధ్యు నఖిలలోకారాధ్యు
ఘనచక్రహస్తు జగత్ప్రశస్తు
ఖగకులాధిపయానుఁ గౌశేయపరిధానుఁ
బన్నగశయను నబ్జాతనయను

తే. మకరకుండలసద్భూషు మంజుభాషు
నిరుపమాకారు దుగ్ధసాగరవిహారు

భూరిగుణసాంద్రు యదుకులాంభోధిచంద్రు
విష్ణు రోచిష్ణు జిష్ణు సహిష్ణుఁ గృష్ణు.

— ఆం. భాగ. దశమ. ఉ. భా. 975.

సందర్శనభాగ్యమునందినది పోతనసృజించిన కుచేలుడే. పోతనయందలి భక్తివిశేషమే మూలమునకంటె అనువాదమున కుచేలునిసఖ్యభక్తి గాఢమగుటకు కారణము.

ఆ తరువాత శ్రీకృష్ణునితోనత్యంత సన్నిహితముగ సఖ్యమునెరపి వానితో క్రీడించి యానందించిన సఖ్యభక్తులు గోపకులు. 'సహఖేలతీతిసఖా' అను నిర్వచనమును బట్టి చెంతచేరి యాడుకొనువాడే సఖుడు. ఇట్టిసఖ్యమునకు గోపబాలుర ప్రతీకలు. వీరితోగలసి శ్రీకృష్ణుడు గావించిన క్రీడావిశేషములత్యంతమనోహరములై దనరారినవి.

బృందావనమున గోవులమేపుచు తోడిగోపబాలురతో శ్రీకృష్ణుడు

సీ. గోవల్లభుఁడ నేను గోవులు మీ రని
వడి అంకెవైచుచు వంగి యాడు
రాజు నే భటులు మీరలు రండు రండని
ప్రాభవంబునఁ బెక్కుపనులు పనుచు
నేఁ దస్కరుండ మీ రింటివా రని నిద్ర
పుచ్చి సొమ్ములు గొనిపోయి డాఁగు
నే సూత్రధారి మీరిందఱు బహురూపు
లని చెలంగుచు నాటలాడఁ బెట్టు

తే. మూలలుఱుకును డాగిలిమూతలాడు
నుయ్యలల నూఁగుఁ జేబంతులొనర వైచు
జారచోరులజాడలఁ జాల నిగుడు
శౌరి బాలురతో నాడు సమయమందు

—ఆం. భాగ. దశమ. పూ. భా. 304

తాను జగన్నాటకసూత్రధారుడననియు, సృష్టియంతయు తన యధీనమేయనియు, జీవులన్నియు తానాడించినట్లాడుచుండుననియు పరమాత్మతత్త్వమును క్రీడలద్వారా వ్యక్తపఱచెను. వ్యాసునికృష్ణుడిట్లాడియుండలేదు. అట్లే రామకృష్ణులు తమ సమవయస్కులైన గోపబాలకులగూడి దూడలగాయుచు క్రీడించినవిధము క్రొంగ్రొత్తవిధముగానున్నది.

సీ. వేణువు లూదుచు వివిధరూపములతో
గంతులు వైతురు కౌతుకమున
గురుకంబళాదుల గోవృషంబులఁ బన్ని
పరవృషభములని ప్రతిభటింతు
రల్లులు దట్టించి యంఘ్రులగజ్జెలు
మొరయ దన్నుదు రోల ముమ్మరముగఁ
బన్నిదంబులు వైచి ఫలమంజరులఁ గూర్చి
వ్రేటు లాడుదురు ప్రావీణ్య మొప్ప

తే. వన్యజంతుచయంబుల వానివాని
పదురు పదురుచు వంచించి పట్టఁబోదు
రంబుజాకరములఁ జల్లులాడఁ జనుదు
రా కుమారులు బాల్యవిహారు లగుచు

క. పోరుదురు గికురు వొడుచుచు
దూఱుదురు భయంబు లేక తోరపుటిరువుల్
జారుదురు ఘనశిలాతటి
మీఱుదు రెన్నంగ రాని మెలకువల నృపా!

- ఆం. భాగ. దశమ. పూ. భా. 428, 429.

ఇప్పట్టున మూలమునందు

శ్లో. క్వచిద్వాదయతో వేణుం క్షేపణైః క్షిపతః క్వచిత్ ।
క్వచిత్పాదైః కింకిణీభిః క్వచిత్కృత్రిమగోవృషైః ॥

శ్లో. వృషాయమాణౌ నర్దంతౌ యుయుధాతే పరస్పరమ్ ।
అనుకృత్య రుతైర్జంతూంశ్చేరతుః ప్రాకృతౌ యథా ॥

- సం. భాగ. 10-11-40, 41.

అని మాత్రము కలదు. అట్లే యాటలవిషయమున

శ్లో. ఏవం విహారైః కౌమారైః కౌమారం జహతుర్వ్రజే ।
నిలాయనైః సేతుబంధైర్మర్కటోత్ప్లవనాదిభిః ॥

- సం. భాగ. 10-11-59.

అనిమాత్రమే మూలముననుండగ అనువాదమున

సీ. కపులమై జలరాశి కట్టుదమా యని
కట్టుదు రడ్డంబు కాలువలకు
మునులమై తపములు మొనయుదమా యని
మౌనులై యుందురు మాటలేక
గంధర్వవరులమై గానవిద్యలు మీఱఁ
బాడుదమా యని పాడఁ జొత్తు
రప్సరోజనులమై యాడుదమా యని
యాఁడురూపులు దాల్చి యాడఁ జనుదు

ఆ. రమర దైత్యవరులమై యబ్ధిఁ ద్రిత్తమా
యని సరోవరముల యందు హస్త
దండచయముఁ ద్రిప్పి తరుతురు తమయీడు
కొమరు లనుసరింపఁ గొమరుమిగుల.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 452.

మునులై తపములొనర్చుట, గానమొనర్చుట, అప్సరసలై ఆడుట, అబ్ధిమథించుట. ఇత్యాదిక్రీడలతో బాల్యమును గడిపినట్లు కలదు. ఇట్లు మూలాతిశయముగ పోతన కృష్ణునిచేత గోపకుమారులతో క్రీడలాడించి, వానియందు పాఠకులనత్యంతానురక్తులఁ గావించుటకు పోతనసహితము గోపబాలురలోనొకడై శ్రీకృష్ణునితో క్రీడలలో భాగస్వామి యగుటయే ప్రధానకారణము. దీనితో సఖ్యభక్తినెరపుటయందు పోతన కడునేర్పరి యని విశదమగుచున్నది. ఈనేర్పు శ్రీకృష్ణుడు గోపాలబాలురగూడి చల్దులారగించిన ఘట్టమున నింకను నధికముగ వ్యక్తమైనది.

ఒకనాడు కృష్ణుడు కాంతారంబున బంతిచల్దులుగుడువనుద్యోగించి, ప్రొద్దున లేచి, గద్దనందనయింటిలేగకదుపులం గదలించి, సురంగంబగు శృంగంబు పూరించిన విని, మేలుకొని సంతంభంబున గోపడింభకులు చల్దికావళ్లు మూపులవహించి, కొమ్ము లిమ్ముగఁ బూరింపుచు, వేణువులూదుచు, పికంబులంగలసి కూయుచు, శుకంబులంజేరి రొదలుసేయుచుఁ బులుగులనీడలం బాఱుచు, బొదరిండ్లు దూఱుచు, వాఁగులుగడచుచు, నదీజలంబులందోగుచు, తీగెయుయ్యాలలూఁగుచుఁ బల్లంబులందాఁగుచుఁ గపులసంగడీ, దరువులెక్కుచు, ఫలంబులుమెక్కుచు, రసంబులఁబంజొక్కుచు, నింగికిన్నిక్కుచుఁ

తయ్యంబులకుంగాలు ద్రవ్వుచుఁ జెలంగుచు, మెలంగుచు, వ్రాలుచు, సోలుచు, బహు ప్రకారంబుల శరీరవికారంబులు సేయుచు, నొకనొకని చల్దికావడినొకడొకడడకించి దాచుచు, దెచ్చియిచ్చుచు

క. వనజాక్షుడు మున్నరిగిన
మునుపడగా నతని మేము ముట్టెదమనుచున్
జని మును ముట్టనివానిన్
మును ముట్టినవాడు నవ్వు మొనసి నరేంద్రా!
- ఆం. భాగ. దశమ. పూ. భా. 457

అనుటలో గోపాలకులకు, కృష్ణునకుమధ్యగల సఖ్యము పూర్ణముగ వ్యక్తమగుచున్నది 'వనజాక్షుడు మున్నరిగిన...' అనుపద్యమున జీవుడు, బ్రహ్మ వీరిమధ్య జరుగు ఆట వ్యక్తీకరింపబడినది. ఇచట కృష్ణగోపాలురమధ్యకలయిక జీవబ్రహ్మైక్యముగా గుర్తించవలసియున్నది. ఇక చల్దులారగించుటచూడ

మ. జలజాంతస్స్థితకర్ణికం దిరిగి రా సంఘంబులై యున్న రే
కులచందంబునఁ గృష్ణునిం దిరిగిరాఁ గూర్చుండి వీక్షింపుచున్
శిలలుం బల్లవముల్ దృణంబులు లతల్ చిక్కంబులున్ బువ్వులా
కులు కంచంబులుగా భుజించి రచటన్ గోపార్భకుల్ భూవరా.

సీ. మాటిమాటికి వ్రేలుమడిచి యూరించుచు
నూరుఁగాయలు దినుచుండు నొక్కఁ
డొకని కంచములోని దొడిసి చయ్యన మ్రింగి
చూడు లేదని నోరు చూపు నొక్క
డేగురార్గురచల్దు లెలమిఁ బన్నిద మాడి
కూర్కొని కూర్కొని కుడుచు నొక్కఁ
డెన్నియుఁ దగఁబంచియిడుట నెచ్చెలితన
మనుచు బంతెనగుండు లాడు నొకఁడు

ఆ. కృష్ణుఁ జూడు మనుచుఁ గికురించి పరుమ్రోలి
మేలి భక్ష్యరాశి మెసగు నొకడు
నవ్వు నొకడు సఖులనవ్వించు నొక్కఁడు
ముచ్చటాడు నొకడు మురియు నొకఁడు

సీ. కడుపున దిండుగాఁ గట్టిన వలువలో
లాలిత వంశనాళంబుఁ జొనిపి
విమల శృంగంబును వేత్రదండంబును
జాఱి రానీక డాచంక నిఱికి
మీఁగడ పెరుగుతో మేళవించిన చల్ది
ముద్ద డాపలిచేత మొనయ నునిచి
చెలరేగి కొసరి తెచ్చిన యూరుఁగాయలు
వ్రేళ్ళసందులను దా వెలయ నిఱికి

ఆ. సంగడీల నడుమఁ జక్కనఁ గూర్చుండి
నర్మ భాషణముల నగవు నెఱపి
యాగభోక్త కృష్ణుఁ డమరులు వెఱఁగంద
శైశవంబు మెఱసి చల్దిగుడిచె.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 493, 94, 96.

ఈవిధముగ సఖులెల్లరు నవ్వుచు వినోదించుచు పరమానందకరముగా దేవతలకు నాశ్చర్యకరమైనరీతిగా చల్దులుగుడుచుటచే గోపకులసఖ్యభక్తి యీఘట్టమున పరమోన్నతస్థాయికి చేరినదని చెప్పవచ్చును. మూలముననీదృశ్యమింత మనోహరముగా వర్ణింపబడలేదు. పోతనభాగవతమందలి యీ ఘట్టమున నీదృశ్యమును తిలకించిన దేవతలువెఱగందుటకు తెలికేపల్లి లక్ష్మినారాయణశాస్త్రిగారూహించిన హేతువిచట ప్రస్తావింపవలసియున్నది.

"యాగభోక్త కృష్ణుడు సఖులతో చల్దులారగించుచుండగా నమరులు వెరగొందిరట. యజ్ఞయాగములందు యాగభోక్తయైనను చెలికాండ్రతో నెకసక్కెములాడుచు నారగించు నానందమెట్లు కలుగును! పరమేశ్వరుడు స్వీకరింపగా మిగిలిన యాగభుక్తమును యజమాని మహాప్రసాదమని యాస్వాదించును. కాని యిందు నెచ్చెలులు భుజించినదానినే పరమేశ్వరుడాప్యాయముగా నారగించును. అమరులతోపాటు అవధూత శిఖామణికూడ వెఱగందియుండును."[24]

యాగభోక్తకుసైతము తమ భుక్తశేషమునీయగలిగినంతటి సఖ్యభక్తులగుటచేతనే వల్లవకుమారులు బ్రహ్మేంద్రాదిదేవతావర్గముచేతను, యోగివరేణ్యులచేతను నమస్కరింపదగినవారగుటయేగాక పరమాత్మసములై యలరారుచున్నారు. కావుననే శుకమహర్షి—

ఉ. ఎన్నడునైన యోగివిభు లెవ్వని పాదపరాగ మింతయున్
గన్నులఁ గాన రట్టి హరిఁ గౌఁగిటఁ జేర్చుచుఁ జెట్టఁ బట్టుచున్
దన్నుచు గ్రుద్దుచు న్నగుచుఁ దద్దయుఁ బైపడి కూడి యాడుచున్
మన్ననసేయు వల్లవ కుమారుల భాగ్యము లింత యొప్పునే.

—ఆం. భాగ. దశమ. పూ. భా. 459

అని వారి సఖ్యభక్తిని, వారిని కీర్తించియున్నాడు. మూలమునందును 'పెక్కుజన్మములందు మనస్సునిగ్రహించి యుపాసించు యోగులు కనీసము విష్ణుపాదధూళినైన పొందలేకపోవుచుండగా విష్ణువే గోపకులయెదుట స్వయముగా సాక్షాత్కరించియుండుట వారెంతయదృష్టవంతులో కదా'[43] అని కీర్తించియుండెను.

భక్త్యతిశయమున భక్తులు భగవానుని సారూప్యమునందుట సాధారణము. కాని భగవానుడే భక్తుల సారూప్యమునందుట విశేషము. ఇట్టిఘనత గో గోపబృందమునకుమాత్రమే దక్కినది. బ్రహ్మ గో, గోపబాలురను గుహయందు దాచిన సమయమున కృష్ణుడే స్వయముగా వారివారిరూపములదాల్చి సంవత్సరకాలము గోవ్రజమున చరించిన విషయము విదితమే. వారు త్రికరణశుద్ధితో గోవిందునిసఖ్యమొనరించుటయే గోగోపబాలురావిశేషస్థితినందుటకు కారణము. వారు శ్రీకృష్ణునిపై పరిపూర్ణవిశ్వాసముంచుట, అతడును వారినెప్పటికప్పుడు పరిరక్షించుటయు 'మిత్రమాపత్సుజానీయాత్' అనునార్యోక్తికి కారణమైనట్లు గోచరించును.

కావున మనోవాక్కాయకర్మలద్వారమున పరమాత్ముని సఖునిగా పరిపూర్ణవిశ్వాసముతో సేవించుటయే సఖ్యభక్తియనియు, అట్టి సఖ్యభక్తుని రక్షణబాధ్యత పరమాత్ముడే వహించుననియు భాగవతము బోధించుచున్నట్లు తెలియుచున్నది.

## ఆత్మనివేదన భక్తి

'ఆత్మ దేహః తస్యనివేదనం భగవతి సమర్పణం యద్వా ఆత్మనః ఆత్మీయస్య దేహదారాదేః[44] అనుశ్రీధరవ్యాఖ్యననుసరించి దేహదారాదులను భగవదర్పణమొనర్చుటయాత్మనివేదనమనబడును.

'అనన్యభావముతో పరమారాధ్యుని ప్రార్థించుట, శరణాగతుడగుటయు ఆత్మ నివేదనమనబడును[45]' అను డా. రాములుగారియభిప్రాయమునుబట్టి, అనన్యభావముతో మనోవాక్కాయకర్మలద్వారమున భగవానుని శరణువేడుట ఆత్మనివేదనమని తెలియు చున్నది.

శ్లో. అజాతపక్షా ఇవ మాతరం ఖగాః
స్తన్యం యథా వత్సతరాః క్షుధార్తాః ।
ప్రియం ప్రియేవ వ్యుషితం విషణ్ణా
మనోరవిందాక్ష దిదృక్షతే త్వామ్ ॥
— సం. భాగ. 6-11-26.

అని భాగవత నిర్వచనము. భక్తుడు భగవంతునిదర్శనమునకై పరితపించుచు పరమాత్మతత్త్వాదులను గ్రహించి యనన్యభావముతో మనోవాక్కాయకర్మలను, భార్యాపుత్రగృహక్షేత్రాది సర్వస్వమును పరమాత్మకు సమర్పించుటయే ఆత్మనివేదనము

శ్లో. ప్రాణబుద్ధిమనఃస్వాత్మ దారాపత్య ధనాదయః ।
యత్సంపర్కాత్ప్రియా ఆసం స్తతః కోన్వపరః ప్రియః ॥
— సం. భాగ. 10-23-27.

ఏ యాత్మసంపర్కమున ప్రాణమనోబుద్ధులు; దేహేంద్రియములు, బంధువులు, భార్యాపుత్రులు, ధనాదులభీష్టములగుచున్నవో యట్టి ప్రియాతిప్రియమైన యాత్మను పరమాత్మకర్పించుటయే యాత్మనివేదనమని భాగవతము ప్రతిపాదించుచున్నది.

జీవాత్మ పరమాత్మస్వరూపమని భావించుటయే ఆత్మజ్ఞానము. ఇట్టి యహంకార విరహితమై యభేదదృష్టితోకూడిన యాత్మలోనెఱుకయే ఆత్మనివేదనమని పోతన మతము.

ఆత్మనివేదనమునకు ప్రపత్తి. శరణాగతి, ప్రపదనము, ఆత్మనిక్షేపము, న్యాసము అను పలునామాంతరములు కలవు. దీనికి నవవిధభక్తిమార్గములలో పరమోత్కృష్టమైనస్థానము కలదు. భక్తిసోపానములలో చిట్టచివరిసోపానమిదియే. నారదప్రతిపాదిత ఆసక్తిభక్తిభేదములలోను, ఆత్మనివేదనాసక్తియే ప్రముఖ మైనది. సఖ్యభక్తిలో భగవానునితో భక్తునకు మిక్కిలి చనవుండునేగాని, యిరువురిమధ్య అభేదము కానరాదు. ప్రేమ, సాన్నిధ్యము, సన్నిహితత్వములేగాక యభేదమును ప్రతిపాదించునది యాత్మనివేదనాభక్తిమార్గమే. శ్రవణాదులన్నియు

నిందు పర్యవసించునని చెప్పవచ్చును. ఏలయన సమగ్రమగు శ్రవణముచే కీర్తనము, తత్పరిణతిని స్మరణము, స్మరణపరిపాకముచే భగవత్పాదసేవయు, పాదసేవనాఫలితముగానర్చనము, అర్చనాపారవశ్యమున వందనము, సంతతవందనానురక్తిచే దాస్యమును, దాస్యలోలత్వమున సన్నిహితత్వమేర్పడి సఖ్యమంకురించును. సఖ్యముయొక్క పరాకాష్ఠరూపమే ఈ యాత్మనివేదనము.

శ్లో. మర్త్యో యదా త్యక్తసమస్తకర్మా
నివేదితాత్మా విచికీర్షితో మే ।
తదామృతత్వం ప్రతిపద్యమానో
మయాత్మభూయాయ చ కల్పతే వై ॥

- సం. భాగ. 11-29-34.

అను శ్లోకమునుబట్టి యాత్మనివేదకుడు సర్వాధికుడై యమృతత్వమునంది భగవత్సమానుడగునని భాగవతము బోధించుచున్నది. కావుననే సర్వస్వమునర్పించిన గోపికలు యోగిబృందారకవంద్యులైరి. భక్తలోకమూర్ధన్యులైరి. గోపికావస్త్రాపహరణ ఘట్టమున వారి యాత్మనివేదనమెట్టిదో గమనింపవచ్చును.

క. ఓ తల్లి మాకుఁ గృష్ణుఁడు
చేతోవిభుఁ డైననాఁడు చెలువల మెల్లన్
నేతివసంతము లాడుచు
జాతర చేసెదము భక్తి చాతురితోడన్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 807.

అనుచు గోపికలు కాత్యాయనీదేవినర్చించి ప్రార్థించునెడ కృష్ణుని చేతోవిభునిగా కోరుట వలన వారి హృదయములను పరమాత్మునకు అర్పించినారనువిషయము విదితము. మూలమున గోపికలు శ్రీకృష్ణుని పతినిచేయుమనిమాత్రమే కోరిరి.

ఒకనాడు గోపికలు వారిజలోచనుఁబాడుచు జగతినేవారికిలేని వారి విహారములు సలుపుచుండ శ్రీకృష్ణుండు తీరమునందలి వారివస్త్రములుగైకొని నీపవృక్షమునెక్కఁగా

క. కొంటివి మాహృదయంబులు
కొంటివి మా మనము లజ్జ గొంటివి వలువల్
గొంటి విఁక నెట్టు చేసెదొ
కొంటెవుగద నిన్ను నెఱిఁగికొంటిమి కృష్ణా !

- ఆం. భాగ. దశమ. పూ. భా. 820.

మొదలుగా వారు గావించిన ప్రార్థనలందు వారిహృదయము, లజ్జామానములు సమస్తము శ్రీకృష్ణార్పణమైనవనియు, వారు పరమాత్మతత్త్వమునెరిగినవారనియు విదిత మగుచున్నది. గోపికలు 'నిన్ను నెఱిగికొంటిమి'అని పల్కుటయందే పోతన ప్రతిపాదించిన "ఆత్మలోనెఱుక" గమ్యమానమగుచున్నది. గోపికల పై పల్కులేవియును మూలమునగానరావు.

ఆత్మనివేదనమునకు మానాభిమానములు, సిగ్గు, లజ్జ మున్నగునవి యభ్యంతరము కారాదు. కావుననే శ్రీకృష్ణుడు వారికి "శృంగారవతులారా! సిగ్గేల మిముఁగూడి పిన్ననాటనుగోలెఁ బెరిగినాఁడ, నెఱుఁగనే మీలోననెప్పుడు నున్నాఁడ నేను జూడని మర్మమెద్దిగలదు" అనుచు బోధించగా వారు ఫాలతటన్యస్తకరాబ్జలై సరసలీల మ్రొక్కిరి. ఇట్లు వారిసిగ్గులు విడిపించి చీరలనిచ్చి "ననుగొల్వ చింతించినారు. నాచేత మీనోము సఫలమగును, ననుకొల్చినవార్కి కామితార్థములేకాదు ముక్తియు నందవచ్చు" అని పలుకుటనుబట్టి గోపికలు ముక్తిగోరియే శ్రీకృష్ణుని చేతోవిభునిగా భావించి సర్వస్వార్పణముగావించినారనుట గమనింపవలసియున్నది. ఈపట్టున మూలమున

శ్లో. న మయ్యావేశితధియాం కామః కామాయ కల్పతే ।
భర్జితా క్వథితా ధానా ప్రాయో బీజాయ నేష్యతే॥

-సం. భాగ. 10-22-26.

వేయించినవియు నుడికించినవియునగు వ్రీహ్యాదిధాన్యములు విత్తనములై మొలకెత్తుట కెట్లు సమర్థములు కావో అట్లే భగవానునియందు చిత్తముంచినవారి కోరికలు కామార్థములుగా పరిగణనీయములు కావనుటనుబట్టియు గోపికలు నిష్కామభక్తిసమన్వితులని వ్యక్తమగుచున్నది. ఈ విధముగా వ్యాస, పోతనల భాగవతములందీపట్టున గోపికలతో ఆత్మనివేదనభక్తి సుస్పష్టమొనరింపబడినది.

"సాపరానురక్తిరీశ్వరే" [46] అని శాండిల్యునిచే ప్రతిపాదింపబడిన పరమానురాగరూపమైన భక్తికిని, 'సాత్వస్మిన్ పరమప్రేమరూపా'[47] అని నారదమహర్షి ప్రతిపాదితమైన భగవంతునియందు మిక్కిలి ప్రేమకలిగియుండుటయే భక్తియను నిర్వచనమునకు, ఆత్మనివేదనాతత్పరులైన గోపికలే లక్ష్యములు. నారదుడు భక్తి ప్రేమరూపమని నిర్వచించుచు సమస్తకర్మలు భగవానునకర్పించుటయు, భగవానుని యెడబాటును క్షణకాలమేనియు సహింపలేక వ్యాకులపడుటయు భక్తియని చెప్పియుండెను ఇట్టి లక్షణము పూర్తిగా గోపికలలో కానవచ్చుచున్నది. కావుననే

ప్రేమభక్తికి వ్రజగోపికలనుదాహరణముగా నారదుడొసంగినాడు. ఇట్టిభక్తులే భగవానున కత్యంతప్రీతిపాత్రులు.

గోపికలలోగల యలౌకికమైన, మోక్షసంబంధియైన, ప్రేమభక్తినే ఉజ్జ్వల నీలమణిగ్రంథకర్తయగు రూపగోస్వామియు, భక్తిరసాయన గ్రంథకర్తయగు మధుసూదన సరస్వతియును 'మధుర భక్తి'యనివర్ణించియున్నారు. మధురభక్తికి రసత్వమును ప్రతిపాదించియున్నారు. పరమేశ్వరుని మాధుర్యభావముతో నారాధించుటచే నిది మధురభక్తియని పిలువబడుచున్నది. ఇందు శృంగారము కానవచ్చినను, అది తుచ్ఛమైనది, లౌకికమైనది, ఇంద్రియసంబంధమైనదికాక యలౌకికము, పరమేశ్వర సంబంధి, మోక్షకామియునగుటచేత దీనిని యుజ్జ్వలశృంగారమనియు పేర్కొనవచ్చును. కావునఁనాత్మనివేదనారూపకమైన మధురభక్తి భక్తిభావములందన్నింటను శ్రేష్ఠమై యలరారుచున్నది. గోపకాంతలలోనీమధుర భక్తి పరాకాష్ఠనందినది. ఏలయన భక్తులైనవీరు పరమాత్ముని ప్రియునిగాభావించి సర్వస్వమర్పణము గావించి జీవులైన వీరి యాత్మలను పరమాత్మతోనైక్యము గావించిరి.

మహత్సేవ, మహద్దయాపాత్రత, మహద్ధర్మశ్రద్ధ, హరిగుణశ్రుతి, రత్యంకురోత్పత్తి, స్వరూపాధిగతి, ప్రేమవృద్ధి, ప్రేమస్ఫూర్తి, భగవద్ధర్మనిష్ఠ, తద్గుణశాలిత, ప్రేమపరాకాష్ఠ యను పదునొకండుభక్తిభూమికలు గలవని మధుసూదనసరస్వతి వివరించియున్నారు.[48] గోపికలు వీటినన్నిటిని వరుసగాననుభవించి ప్రేమపరాకాష్ఠ నందిరనుట విదితము. వీరిప్రేమపరాకాష్ఠ రాసపంచాధ్యాయిలో మిక్కిలి స్పష్టమైనది.

ఒకానొక శారదపూర్ణిమానిశాకాలమున యమునాతటవనమున పుండరీక నయనుండు వేణుగానమొనర్చఁగా విని, గోపికలు పరాయత్తచిత్తలై యాయాయెడల నిలువంబడక యెక్కడిపనులక్కడ వదలి, సహోదరులు, మగలు, మామలు. బిడ్డలు నడ్డంబుచని నివారించినందలారింపకయు, సంచలించి, పంచభల్లునిభల్లంబుల మొల్లంపు జల్లుల పెల్లునందల్లడిల్లి, డిల్లపడి, యమందగమనంబుల మందలు వెలువడి గోవింద సందర్శనంబునకుంజనిరి. ఆసమయంబున కొందరుస్త్రీలు వారివారి గేహంబులనుండి రారాక తద్విరహాగ్నిచే పరితాపమొందుచు మాధవుని మనోవీథిని పరిరంభంబులుసేసి గుణదేహములువిడిచి బంధనిర్ముక్తలై ముక్తినిపొందిరని భాగవతమున వర్ణితము.[49] దీనినిబట్టి గోపికలు మోక్షమునుకోరి హరిపరాయత్తచిత్తలై లౌకికబంధంబులనన్నింటిని పరిత్యజించి యలౌకికమైన కామోత్కంఠనొందిరనుట స్పష్టమగుచున్నది. కావుననే మూలగేహములనున్నవారును ముక్తినొందిరి.

... ... ... ... ... ... మాయిండ్లలో
సకలవ్యాప్తులు డించి నీపదసరోజాతంబు లర్చింపఁ జి
క్కఁక యే తెంచితి మీశుఁ డాఢ్యుఁడు ముముక్షాసక్తులం గాచుపో
లికఁ గావందగుఁ గావవే విడువ మేలే కాంతలన్, భ్రాంతలన్.[50]
పతి పుత్రాదికనామమూర్తి వగుచున్ భాసిల్లు నీయందుఁ ద
త్పతి పుత్రాదికవాంఛలన్ సలిపి సంభావించు టన్యాయమే[51]
మరలగ లేము మా మగలమాటల నొల్లము పద్మగంధముల్
మరగిన తేటు లన్యకుసుమంబుల చెంతలఁ జేర నేర్చునే[52]
ఏ పొత్తుల నొల్లమో పరమభూషణ! దాస్యము లిచ్చి కావవే[53]

అనుచు బహువిధంబులపలికిన గోపికలదీనాలాపంబులు విని,నవ్వి యోగీశ్వరేశ్వరుండైన కృష్ణుండాత్మారాముడై వారలతో రమించెను. ఇచట గోపికలు ముముక్షాసక్తితో శ్రీకృష్ణునిపొందుగోరిరనియు, ఆ పరమాత్ముడు పతిపుత్రాదిక నామమూర్తియై యలరారునను తత్త్వము నెఱింగిరనియు, కావున నాతనియందు పరాయత్తచిత్తలై యనన్యాయత్తచిత్తలై నారనియు విదితమగుచున్నది. వీరిభక్తి ప్రేమభరితమై, మధురమై, నిర్మలమై, యలౌకికమై, మోక్షకామియై పరాకాష్ఠనందినందుననే ఎవరికిని చిక్కని యెదిరిఁజిక్కులవెట్టెడి మాయలానికిచిక్కి కృతార్థలైరి. ఆత్మారామునితో రమించు భాగ్యమునొందిరి.

ఈపట్టున మూలమున గోపికలలోనింతటి తన్మయత్వము కానరాదు పోతన పల్కించిన అతిదీనాలాపనలవలన, ప్రేమాతిశయపువాక్కులవలన గోపికలలోని మధురభక్తి మూలమునకంటె ననువాదమున మరింత పెంపువహించినదని చెప్పవచ్చును. భక్తుడైన పోతన స్వయముగాననుభవించిన మధురభక్తిభావములే యిచట గోపికలముఖమున ప్రకటింపబడినవనుట యథార్థము.

శ్రీహరి గోపికలకు నిరంతరధ్యానమొసగి ప్రసన్నుడగుటకు తిరోహితుడుకాగా వల్లవకాంతలు తదీయగమనహాసవిలాసవీక్షణ విహారవచనరచనానురాగంబులం జిత్తంబులు గోల్పడి. వివిధచేష్టలకుంబాల్పడి, తదాత్మకత్వంబున నేన నేన గృష్ణుండనని, కృష్ణగుణావేశంబులం జరియించుచు కాళిందీవనాంతరమునగల తరులతాదులనన్నిటిని కృష్ణునిజాడ తెలుపుడని యన్యాత్తచిత్తలై వేడుకొనిరి.[54] ఈసందర్భమున పోతన గోపికలలో వ్యక్తమైనభక్త్యావేశము మూలమున కన్నట్టిదనుటకు, వ్యాసునిగోపికలు

తరులతాదుల ప్రార్థించినతీరు గమనించిన స్పష్టము కాగలదు.[55] మూలమున గోపికలు తరులతాదుల సామూహికముగా ప్రశ్నింపగాననువాదమున పేరుపేరున పిలచి ప్రశ్నించినవిధానమే పోతనగోపికల భక్త్యావేశమును వ్యక్తమొనరించుచున్నది.

ఉ. నీ వడవిన్ బవల్ దిరుగ నీ కుటిలాలకలాలితాస్య మి
చ్ఛానిధిఁ జూడకున్న నిమిషంబులు మాకు యుగంబులై చనుం
గావున రాత్రులైన నినుఁ గన్నుల నెప్పుడుఁ జూడకుండ ల
క్ష్మీశ్వర! ఱెప్పలడ్డముగఁ జేసె నిదేల విధాత క్రూరుఁడై.

– ఆం. భాగ. దశమ. పూ. భా. 1049

శ్లో. అటతి యద్భవానహ్ని కాననం
త్రుటిర్యుగాయతే త్వామపశ్యతామ్ ।
కుటిలకుంతలం శ్రీముఖం చ తే
జడ ఉదీక్షతాం పక్ష్మకృద్దృశామ్ ॥

– సం. భాగ. 10-31-15

శ్రీకృష్ణుని క్షణకాలపుయెడబాటునుసహితము సహింపలేకుండుట, కన్నులకు ఱెప్పల నడ్డముగానుంచి మనోవల్లభుసమ్యగ్దర్శనమునకు భంగమునుకలిగించిన విధాతను పైవిధముగా దూఱుట వారి విరహతీవ్రతను స్పష్టముచేయుచున్నది. వీరి విరహము పరమాత్మవియోగమునకు తల్లడిల్లు జీవాత్మవిరహమని చెప్పవచ్చునని దివాకర్ల వేంకటావధానిగారు వక్కాణించియున్నారు.[56]

తన్మయత్వమున గోపసుందరులు బృందావనంబునంగల తరులతాదులనడుగుచు, నిరర్గళంబులయిన విపినమార్గంబుల సరోజాతకేతనహలకులిశాంకుశాదిలక్షితంబులైన హరిచరణంబులచొప్పుగని పల్కిన పలుకులను పరికింపుడు.

సీ. ఈ చరణంబులే యిందునిభానన!
సనకాదిమునియోగ సరణి నొప్పు
నీ పాదతలములే యెలనాగ! శ్రుతివధూ
సీమంతవీథులఁ జెన్ను మిగులు
నీ పదాబ్జంబులే యిభకులోత్తమ యాన!
పాలేటిరాచూలిపట్టుకొమ్మ

లీ సుందరాంఘ్రులే యిందీవరేక్షణ!
ముక్తికాంతామనోమోహనంబు

ఆ. లీయడుగులరజమె యింతి! బ్రహ్మేశాది
దివిజవరులు మౌళిదిశలఁ దాల్తు
రనుచుఁ గొంద అబల లజ్జాబ్ధుఁ డేగిన
క్రమముఁ గనియు నతనిఁ గానరైరి.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1029.

ఇందు గోపికలకామము ఇంద్రియసంబంధిగాక, పరమాత్మతత్త్వమెఱింగిన మోక్షకామమనియు, అలౌకికశృంగారమనియు, ఏకాగ్రచిత్తముతో పరమపురుషపదారవిందములకు నాత్మార్పణముగావింపనెంచిన మధురభక్తిపరాయణమనియు, ప్రేమభక్తితత్పరమనియు విదితమగుచున్నది. మూలముననీపట్టున నింతటి భక్తితన్మయత్వము కానరాదనుటకు పాదధూళికంతటి మహత్త్వమును కలిగించిన పరమాత్మపాదపద్మములు స్తుతింపబడక

శ్లో. ధన్యా అహో అమీ ఆళ్యో గోవిందాఙ్ఘ్ర్యబ్జరేణవః।
యాన్ బ్రహ్మేశో రమా దేవీ దధుర్మూర్ధ్న్యఘనుత్తయే॥

- సం. భాగ. 10-30-29

అని గోవిందుపదాబ్జరేణువుల ధన్యత్వముమాత్రము స్తుతింపబడుటయే నిదర్శనము.

భక్త్యావేశము పరాకాష్ఠనందినపుడు సారూప్యత సిద్ధించుటయు, భక్తునకు భగవానునకు అభేదముకానవచ్చుటయు జరుగును. జీవాత్మలైన గోపికలు పరమాత్మయందైక్యస్థితినందుట 'పూతనయై యొక్క పొలతి చరింపగ శౌరియై యొకకాంత చన్నుఁగుడుచు.' ఇత్యాదివర్ణనల[57] బట్టి వారున్మత్తచిత్తలై తదాత్మకత్వంబున గృష్ణులీలల ననుకరించుటవలన వ్యక్తమగుచున్నది. ఇట్టి లీలానుకరణము మూలమునందును 'కస్యాశ్చిత్పూతనాయంత్యాఃకృష్ణాయంత్యపిబత్ స్తనమ్' యిత్యాదిగాకలదు[58]

వనజాక్షుగానక పల్లవభామినులు సంత్యక్తగేహేచ్ఛలై విరహమునోపజాలక విహ్వలచిత్తముతో గావించిన విన్నపములు, వేదన, గోపికాగీతలరూపమున వ్యక్తమైనవి. ఇందు వీరు త్రికరణశుద్ధిగా హరిపరాయత్తలై యితరేచ్ఛలనన్నిటిని విడిచి తద్విరహమును సహింపలేని యాత్మనివేదనాభక్తిలక్షణలక్షితులని సుస్పష్టమగుచున్నది.

ఇదియే 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' అను భగవద్గీతా ప్రతిపాదిత శరణాగతి.

సార్వభౌమత్వము మొదలు బ్రహ్మపదవివఱకుగల యానందములన్నియు గోపాలుని యధరామృతపానమునగలుగు నానందముకన్న మిన్నకాదనియు, అట్టి యధరామృతపానము లభింపకపోయినయెడల కథామృతపానమొనర్చియైన ప్రాణములు నిలుపుకొనవలెననునదియే గోపికలభావన. అట్లంచితస్వరమున హృదయమువిప్పి విలపించిరిగనుకనే జగత్త్రాణుడును, త్రైలోక్యమోహనుండునైన శ్రీహరి వారిముందు ప్రత్యక్షముకాగా ప్రాణమువచ్చిన నిలుచుండు అవయవంబులభంగి నిలుచుండిరి. విప్రయోగముచే పరిపుష్టమైన ప్రేమభక్తిచే నవజీవనమునందిన గోపికలు భగవత్సాక్షాత్కారమునకర్హులైనారని భావింపవచ్చును. పోతనగోపికలలో కన్పట్టునంతటి హృదయవిహ్వలత వ్యాసునిగోపికలలో కానరాదు.

గోపికలిట్లు నిష్కల్మషమైన ప్రేమభక్తిసమన్వితులగుటచేతనే జ్ఞానకాండంబున నీశ్వరుంగని శ్రుతులు ప్రమోదంబునఁ గామానుబంధంబులు విడిచినవిధంబున విరహవేదనలువిడిచి పరిపూర్ణమనోరథలై పరమోత్సవంబునలిపిరి. ఆ సమయంబున కృష్ణుడు చిత్రమూర్తియై మండలభ్రమణశీల పరస్పరబద్ధబాహుకాంతాసువిలాసమును, కృతవియచ్చర మనోవికాసమును, బహువిధస్ఫురితాననహస్తపాదవిన్యాసమునైన రాసముసలిపెను. అతండాత్మారాముండయ్యును గోపసతులెందఱందఱకునంతయై నిజ ప్రతిబింబంబుతోడఁ గ్రీడించు బాలురపోలిక రాసకేళిసల్పెను.

ఈసందర్భమున మహాభక్తుడైన పోతన తానే యొకగోపికయై గోపాలునితో రాసక్రీడలాడి రసపారవశ్యమందినాడని భావింపవచ్చును. ఆ తన్మయత్వమున పోతనరాసక్రీడయు, జలక్రీడయునతివిస్తృతమై మధురతర రసోపప్లావితమై వ్యాసుని మించినది తద్ద్వారమున మరెందును గానరానివిధమున మధురభక్తివాహిని తెలుగు భాగవతకేదారముల పరవళ్లుత్రొక్కుచు ప్రవహించినది. పోతనముఖసుధాద్రవమున మొనసిన భాగవతపురాణఫలము మధురాతిమధురమై భక్తిభావవిదుల మధురభక్తి రసాస్వాదనతత్పరులగావించి భాగవతోత్తములగావించుచున్నది.

మూలానువాదములందలి రాసక్రీడా వర్ణనమును గూర్చి తెలికేపల్లి లక్ష్మీనారాయణశాస్త్రిగారి పలుకులిట యుటంకింపదగియున్నవి.

"మూలమందలి రాసక్రీడను రసలోలుడు భక్తకవిపోతన విస్తృతమొనర్చెను. ఇందు పోతన తన నాట్యశాస్త్ర వైశారద్యము

ప్రకటించెను. నృత్యము, నృత్తము, కరణములు, అంగహారములు, ముద్రాలంకారములును మున్నగు నాట్యశాస్త్రబహువిశేషములతో భక్తకవి రాసక్రీడను రససముల్లసితమొనర్చెను. ఈ నాట్యశాస్త్ర పరిభాష సంస్కృతభాగవతమునందు కానరాదు. సరసమని తలచి కవియోగియే యీ సందర్భమున విజృంభించెను.'' [59]

రాసక్రీడానంతరము పోతన వ్యాసాతిశయముగ వివిధరీతుల జలక్రీడలాడి తాను బ్రహ్మానందపదవినందుటయేగాక తెలుగుపాఠకలోకమునలౌకికానందరసడోలికలనూగు లాడించినాడు.

రాసలీలను పఠించినపుడు మన్మథబాధ, సురతము, కుచాలింగనచుంబనాదులు కానవచ్చుచుండుటచే నవి బాహ్యదృష్టికి ప్రాకృతమైన కామవికారసంబంధులుగా కనిపించు అవకాశముకలదు. కావున కొందరువ్యక్తులు రాసలీలకును, కామక్రీడలకును ముడివేయుచున్నారు. గోపికలు కామసుఖమననుభవించుటకే భర్తలనువదలి శ్రీకృష్ణుని చెంత చేరినారనియు నతడును వారందరిని తన శక్తిమేరకు సంతృప్తిపరుపవలెనని తలంచి గోపికలతో కామకేళికుపక్రమించినాడని[60] రేగులపాటి కిషన్‌రావుగారువ్రాసిరి. సూక్ష్మపరిశీలనారహితముగను, అనాలోచితముగను, నాస్తికత్వమును విస్తృతముగా ప్రచారమొనరించుటయే లక్ష్యముగను వెలువడినభావనగా దీనినితలంపవచ్చును. సూక్ష్మ పరిశీలనచే గోపికాకృష్ణులసంబంధములోని అమలినశృంగారము, ఆధ్యాత్మిక తత్త్వము మధురభక్తిభావన, ప్రతీయమానము కాగలవు. రాసలీలకు కామవికాసమునకు సంబంధముకలుపుట పొరపాటని శ్రీమతిఅనిబిసెంట్ భావించినట్లు డా. కొత్తపల్లి వీరభద్రరావుగారొకచోనుటంకించిన క్రింది పల్కులు స్పష్టపఱచుచున్నవి.

"What but unclean mind can sea ougnt that is impure in the child dancing as lover and beloved ? Let us turn from this, remembering that till the ninteenth century this story provoked only devotion and not rebaldry and it is only with the coming of the grosser type of western thought that you have these ideas put into the Bhagavat Puran."[61]

కామాదివిధ్వంసకమైన మోక్షకాములు గోపికలనియు, శ్రీకృష్ణునియందు వారికి గల ప్రేమ కామదూషితముకాదనియు భాగవతము స్పష్టము చేసియున్నది. శ్రీకృష్ణ డాత్మారాముడై వారలతో రమించెననియు, గోపసతులెందఱో తానునందఱై నిజ

ప్రతిబింబములతోడం గ్రీడించు బాలు పోలిక రాసకేళి సలిపెనని మూలానువాదముల రెండింటను గలదు. రాసలీల లౌకికసంబంధియైనచో శ్రీకృష్ణుడిట్లు గోపికలకందఱకు నందఱై క్రీడించుటయసంభవముకదా! అతడు నిజప్రతిబింబములతోనాడు బాలుపోలిక గోపికలతో రాసలీలసలిపెననుటయునది కామవిరహితమైనదని సుస్పష్టమొనరించు చున్నది. ఒక్కడైన యోగీశ్వరేశ్వరుండు గోపికలందఱదగ్గరనందఱై తానుండియు గోపికల పతులదగ్గర గోపికల రూపములోనుండినట్లువర్ణింపబడుటచేతనే శ్రీకృష్ణుని పూర్ణావతారతత్త్వము బహిర్వ్యక్తమగుచున్నది.

"ఇట్లు శరత్కాలంబున వెన్నుండింద్రియ సలనంబు సేయక గోపికలతోడ రమించె"

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1100

శ్లో. ఏవం శశాంకాంశువిరాజితా నిశాః
స సత్యకామోఽనురతా బలాగణః।
సిషేవ ఆత్మన్యవరుద్ధసౌరతః
సర్వాః శరత్కావ్య కథారసాశ్రయాః॥

— సం. భాగ. 10-33-26.

అనుచు అనువాదమునందును, మూలమునందును చెప్పబడినది. మూలమునందలి "ఆత్మన్యవరుద్ధసౌరతః" అనుదానికి ఆత్మని = తనుతనయందే, అవరుద్ధసౌరతః = అరికట్టబడిన సురతరసముకలవాడై అనగానతడు గోపకాంతలతోడి సంగమమందు వీర్యమును స్ఖలించలేదను అర్థము వ్యక్తమగుచున్నది. కావుననే శ్రీధరస్వామి రాస పంచాధ్యాయికి వ్యాఖ్యవ్రాయుచు రాసపంచాధ్యాయి సర్వథా నివృత్తిపరమని, కామ దేవునిపై విజయముసాధించుట రాసక్రీడ ప్రధానోద్దేశమని క్రిందివిధముగా వివరించి యున్నారు.

శ్లో. బ్రహ్మాది జయ సంరూఢ దర్పకం దర్పదర్పహా।
జయతి శ్రీపతిర్గోపీ రాసమండలమండనః॥

నను విపరీతమిదం పరదారాది వినోదేన కందర్పజితత్వ ప్రతీతేః మైవం యోగమాయాముపాశ్రితః 'ఆత్మారామోప్యరీరమత్, సాక్షాన్మన్మథ మన్మథః, ఆత్మన్యవరుద్ధసౌరత' ఇత్యాదిషు స్వాతంత్ర్యాభిధానాత్. తస్మాద్రాసక్రీడావిడంబనం కామవిజయఖ్యాపనాయేత్యేవ తత్త్వం.

కిం చ శృంగారకథాపదేశేన విషయతో నివృత్తిపరేయం పంచాధ్యాయ్యాం వ్యక్తీకరిష్యామః।

కనుక యిచట రాసకేళియందు కామభావన చేయుట యధర్మము, హాస్యాస్పదము, అవిచారితాభిధానమనుట స్పష్టము.

మ. ధర్మకర్తయు ధర్మభర్తయు ధర్మమూర్తియు నైన స
త్కర్ముఁ డీశుడు ధర్మశిక్షయు ధర్మరక్షయుఁ జేయఁగా
నర్మిలిన్ ధరమీఁదఁ బుట్టి పరాంగనాజనసంగ మే
ధర్మ మంచుఁ దలంచి చేసె నుదాత్తమానస చెప్పవే!

— ఆం. భాగ. దశమ. పూ. భా. 1101.

శ్లో. సంస్థాపనాయ ధర్మస్య ప్రశమనాయేతరస్య చ।
అవతీర్ణో హి భగవానంశేన జగదీశ్వరః॥

శ్లో. స కథం ధర్మసేతూనాం వక్తా కర్తాభిరక్షితా।
ప్రతీపమాచరద్బ్రహ్మన్ పరదారాభిమర్శనమ్॥

శ్లో. ఆప్తకామో యదుపతిః కృతవాన్ వై జుగుప్సితమ్।
కిమభిప్రాయ ఏతం నః సంశయం ఛింది సువ్రత॥

— సం. భాగ. 10-33-27, 28, 29.

అని పరీక్షిన్మహారాజుకూడ నిట్టియనుమానమునే వ్యక్తపఱచెను. అందులకు వ్యాసపోతనలు సమాధానముగా-

శ్లో. గోపీనాం తత్పతీనాం చ సర్వేషామేవ దేహినాం।
యోఽన్తశ్చరతి సోఽధ్యక్షః క్రీడనేనేహ దేహభాక్॥

— సం. భాగ. 10-33-36

ఆ. గోపజనములందు గోపికలందును
సకలజంతులందు సంచరించు
నామహాత్మునకుఁ బరాంగన లెవ్వరు
సర్వమయుఁడు లీల సలిపెఁగాక

— ఆం. భాగ. దశమ. పూ. భా. 1107

శ్రీకృష్ణుడు సామాన్యుడుకాడనియు, అగ్నికివలెనే వానికిని దోషములంటవనియు, గోపికల యాత్మనివేదనాతత్పరతకు కరగి వారియందలి దోషముల హరింపగోరియే ఆ సర్వమయుడు లీలసలిపెననియుచెప్పిరి. అంతియేగాకకంసునిపంపునవచ్చినఅక్రూరుడు బలరామకృష్ణులను మథురకు గొంపోసున్నాడని యెఱింగిన వ్రేతలు హరిని విడిచియుండలేక "మేటిగృహస్థు బ్రహ్మ యని మిక్కిలి నమ్మితిమమ్మ! చూడనేపాడియు లేదు మాకుఁ బరిపాలకుఁడైన సరోజనేత్రునిచ్చోటవసింపనీక నొకచోటికిఁబో విధియించి పిన్నబిడ్డాటలు చేసె నీసుఖములక్కట!" అని బ్రహ్మను నిందించుటయు, 'అక్రూరుండట క్రూరుఁడీతడు నిజంబక్రూరుఁడౌనేని నిర్వక్రత్వంబునఁ గృష్ణుఁబెట్టి తనక్రోవంబో విచారింపడే' అని అక్రూరుని దూఱుటయు, ఎడబాటునుతలంచి బహు విధంబుల కలంగుటయు, వారికి శ్రీకృష్ణునితో జీవించుటయందెంతటి మక్కువ గలదో, ఎంతటి ప్రేమభక్తితత్పరతగలదో, విశదమొనరించుచున్నవి. కావుననే శ్రీకృష్ణుడొకానొకదినంబునేకాంతమున "నాపైఁ జిత్తము లెప్పుడున్నిలుపుచున్ నారాక కాంక్షిపుచున్ నాపేరాత్మల నావహించుచు వగన్ నానాప్రకారంబులన్ గోపాలాంగనలెంత జాలిపడిరో కోపించిరో దూఱిరో..." యనుచు చింతించి యుద్ధవునిచే సందేశమంపుట జరిగినది. అటులనే భ్రమరగీతలలోనన్యాపదేశమున గోపికలు తమ మనోవేదననంతటిని బహిర్వ్యక్తమొనరించిరి. వారంతటి విరహాసక్తులు, కృష్ణ లీలాగానానురక్తులునగుటచే యోగీశ్వరులుసైతము మనసులో నిలుపలేని పరమాత్మని నిరంతరధ్యానముచే తమ మనములందిడుకొని బ్రహ్మానందమునొందిన ధన్యులైరి. అట్టి వారి ధన్యత్వము భాగవతమున పలుపాత్రలచే నుతింపబడినది.

మ. జపదానవ్రతహోమసంయమతపస్స్వాధ్యాయ ముఖ్యంబులన్
నిపుణుల్ గోరియు నే విభున్ మనములో నిల్పంగ లేరట్టి స
ద్విపులాకారునిపై మహామహిముపై విశ్వేశుపై మీ కజ
స్రపటుధ్యానము లిట్లు నిల్చెనె భవచ్చారిత్రముల్ చిత్రముల్
- ఆం. భాగ. దశమ. పూ. భా. 1465

శ్లో. అహో యూయం స్మ పూర్ణార్థా భవత్యో లోకపూజితాః।
వాసుదేవే భగవతి యాసామిత్యర్పితం మనః॥

శ్లో. భగవత్యుత్తమశ్లోకే భవతీభిరనుత్తమా।
భక్తిః ప్రవర్తితా దిష్ట్యా మునీనామపి దుర్లభా॥
- సం. భాగ. 10-47-23,25

మొదలుగాగల యుద్ధవునిపలుకులును

ఉ. పాపపుబ్రహ్మ గోపికల పల్లెల లోన సృజింపరాదె మ
న్నీపురిలోపలన్ మనల నేల సృజించె నసైన నిచ్చలున్
జేపడుఁగాదె యీ సుభగుఁ జెందెడి భాగ్యము సంతసంబు నీ
గోపకుమారుఁ బొందమును గోపకుమారిక లేమి నోచిరో!

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1353.

శ్లో. గోప్య స్తపః కిమచరన్ యదముష్య రూపం
లావణ్యసారమసమోర్ధ్వ మనన్యసిద్ధమ్।
దృగ్భిః పిబ న్త్యనుసవాభినవం దురాప
మేకాంతధామ యశసః శ్రియ ఐశ్వరస్య॥

శ్లో. ధన్యా వ్రజస్త్రియ ఉరుక్రమచిత్తయానాః॥

- సం. భాగ. 10-44-14,15.

అను మధురాపురకాంతలు పలికిన పలుకులును అందులకు తార్కాణములు. సనకాదు లందును కానరాని భక్త్యతిశయము గోపికలందు గమనించినట్లు సాక్షాత్తు శ్రీకృష్ణుడే ప్రశంసించియుండెను —

సీ. తరళాక్షులార! మద్భక్తి చేతనులకూ
దనరు మోక్షానంద దాయకంబు
జపతపోవ్రతదాన సత్కర్మముల ముక్తి
గలుగంగ నేరదు గానఁ దలఁప
విధి శివసనకాది విమల చిత్తంబులఁ
బొడమని భక్తి మీ బుద్ధులందు
జనియించె మీ పూర్వసంచిత సౌభాగ్య
మెట్టిదో యని తుదముట్ట నింక

తే. నటమటము గాదు మీకు నెన్నటికి నైనఁ
గలుగ నేరవు నిరయసంగతము లైన

జన్మ కర్మము లిటమీఁద మన్మనీష
సుమహితధ్యానలార ఘోరమణులార!

— ఆం. భాగ. దశమ. ఉ. భా. 1067

కావున భగవదర్పితములైన సర్వేంద్రియములచే భక్తిరసపానమొనర్చుచు నాత్మ నివేదనచేత నద్వైతస్థితినందినవారు గోపికలు. పోతనలోని ఆత్మనివేదనభక్త్యతి శయమే వానిగోపికలయందలి వైశిష్ట్యమునకు కారణమనితలంపవచ్చును. అందువలననే 'భగవద్రతిని వ్యాసాతిశయముగ ఏకోన్ముఖమొనర్చిన రసికశిఖామణి పోతన కవీంద్రుడు.' [63] అని పలువురు భావించియున్నారు.

ఈవిధముగా భాగవతప్రతిపాదిత నవవిధభక్తులకు దశమస్కంధము వ్యాఖ్యా గ్రంథమై, లక్ష్యలక్షణగ్రంథమై యలరారుచున్నది. అందున నతివిస్తృతముగప్రతి పాదింపబడిన దాస్య, సఖ్య, ఆత్మనివేదనములను మనోసంబంధభక్తులచే భాగవత దశమస్కంధము భక్తికి ప్రతిరూపమైనది. అనువాదమున పోతనభక్తి పారవశ్యమున వ్యాసాతిశయముగ వెలువడిన దశమస్కంధము పఠితలనందఱిని భౌతికబంధంబుల నుండి మరల్చి యనంతభక్తిరసవాహినినోలలాడించుచు బ్రహ్మానందమునుకలిగించుచు నిత్యపారాయణగ్రంథమై యలరారుచున్నది.

# ఏకాదశ భక్తి రీతులు

భాగవతమున కంఠోక్తిగాచెప్పబడిన నవవిధభక్తిరీతులేగాక నారదమహర్షిచే ప్రతిపాదింపబడిన ఏకాదశవిధములైన భక్తియు భాగవతమున ప్రపంచీకరింపబడి నదని భక్తిభేదములను చర్చించు సందర్భమున సుడువబడినది. ప్రేమరూపమైనభక్తి యొకటేయైనను ఆసక్తిభేదములచే పదునొకంతువిధములుగనుండునని నారదమహర్షి క్రిందివిధముగా వక్కాణించియున్నారు.

సూ. గుణమాహాత్మ్యాసక్తి రూపాసక్తి పూజాసక్తి స్మరణాసక్తి
దాస్యాసక్తి సఖ్యాసక్తి కాంతాసక్తి వాత్సల్యాసక్త్యాత్మ
నివేదనాసక్తి తన్మయతాసక్తి పరమవిరహాసక్తి రూపా
ఏకధాప్యేకాదశధాభవతి' [64]

ఇందనేకము ప్రత్యక్షముగనో పరోక్షముగనో నవవిధభక్తిరీతులలో అంతర్భవించునవియే. అట్లంతర్భవించినట్లు కానరానివియు భాగవతమున సుప్రతిష్ఠితములు. ఆప్రతిపాదనము భాగవతదశమస్కంధముననెట్లు జరిగినదో పరికింతము.

## గుణమాహాత్మ్యాసక్తి

భగవంతుని కల్యాణగుణములయందాసక్తిరూపమైనభక్తియే గుణమాహాత్మ్యాసక్తి. అట్టిభక్తుడు భగవానుని దివ్యగుణములను శ్రవణముచేయుచు భగవంతుని మహామహిమలను నిరంతరము కీర్తించుచు భగవానుని లీలలను స్మరించుచుండును. ఇది ప్రధానముగా నవవిధభక్తిమార్గములలో శ్రవణభక్తియందును, కీర్తనభక్తియందును, అంతర్భవించునని చెప్పవచ్చును. నారద, వేదవ్యాస, శుక, సూత శౌనక, పరీక్షిత్ ప్రభృతులీగుణమాహాత్మ్యాసక్తిగలవారని చెప్పవచ్చును. భగవద్గుణకీర్తనముచే నారద, వ్యాస, శుక, సూతాదులలోను, భగవల్లీలా శ్రవణముచేపరీక్షిత్తు, శౌనకాదులయందును నీవిధమైనయాసక్తి కన్పట్టుచున్నది. అందువలన నవవిధభక్తులయందలి శ్రవణ, కీర్తనభక్తులీగుణమాహాత్మ్యాసక్తిభక్తులే యగుదురని తెలియుచున్నది.

## రూపాసక్తి

భగవానుని దివ్యమంగళరూపమునందాసక్తికలిగి తద్దర్శనాభిలాషులను రూపాసక్తిభక్తులుగా పరిగణింపవచ్చును. వీరు భగవానునిపాదసేవకులుగాను అర్చనాపరులుగానునుందురు. అన్నముతెసికొనివచ్చి కృష్ణునకారగింపుచేసి భువనమోహననటవేషభూతివానిని కన్నులకఱవుతీర గాంచిన మునిభార్యలును, గోవిందసందర్శనకుతూహలంబున పరస్పరాహూయమానలై, భుంజానలై, భోజనభాజనంబులుడిగంగిం ద్రోచియు, శయానలై లేచియు, నభ్యజ్యమానలై జలంబులాడకయు, గురుజనశిక్ష్యమాణలై యోడకయు, గృహకార్యప్రవర్తమానలై పరిభ్రమింపకయు, రమణరమమాణలై రమింపకయు, శిశుజనబిభ్రాణలై డించియు, నలంకుర్వాణలై యన్యోన్యవస్త్రాభరణమాల్యానులేపనంబులు వీడ్వడధరించియు నరిగి హర్మ్యాగ్రములనుండి వీక్షించి హరిరూపు నేత్రములవెంటలోగొని హృదయములదాల్చి ప్రమోదమునందిన మధురాపురకాంతలును, రూపాసక్తిపరులైన భక్తులని చెప్పవచ్చును. ఈ రూపాసక్తి కొంతవరకు స్మరణమునందునంతర్భవించును.

## పూజాసక్తి

'గౌరవితప్రీతిహేతుక్రియాపూజా' [65] అని నిర్వచనముపట్టి

గౌరవింపబడువారికి ప్రీతికలిగించుటకై యొనర్పబడు సర్వకర్మలను పూజయందురు. కాని భగవత్ప్రీతి కొఱకు చేయుకర్మలను పూజయనుట లోకప్రసిద్ధి. దీనినే అర్చనమనియునందురు. భగవానునర్చించుటయందాసక్తిగల్గి యుండుటయే పూజాసక్తి. దీనిస్వరూపోదాహరణములు వివరముగానర్చనభక్తియందు వివరింపబడినవి.

## స్మరణాసక్తి

పరమేశ్వరుని దివ్యగుణములను, లీలావైభవములను స్మరించుటయందాసక్తి చూపుటయే స్మరణాసక్తిభక్తి. ఈస్మరణభక్తి నవవిధభక్తిరీతులలో లోగడ విశ్లేషింపబడినది.

## దాస్యాసక్తి

భగవంతునకు సేవకభావముననను దినము సేవసేయుటయందాసక్తికలిగి యుండుటయే దాస్యాసక్తిభక్తి. ఇది నవవిధభక్తిమార్గములను వివరించునపుడు సోదాహరణముగా ప్రపంచీకరింపబడినది.

## సఖ్యాసక్తి

పరమాత్ముని సఖునిగాభావించి సేవించుటలోనాసక్తిచూపుటయే సఖ్యాసక్తిభక్తి. ఈసఖ్యాసక్తియే నవవిధభక్తిరీతులలోని సఖ్యభక్తి. ఇది యింతకుపూర్వమే పూర్తిగా వివరింపబడినది.

## కాంతాసక్తి

భగవానుని కాంతునిగాభావించి ప్రేమనుచూపుటయే కాంతాసక్తిభక్తిగా నిర్వచింపవచ్చును. శ్రీకృష్ణుని అష్టభార్యలను కాంతాసక్తిభక్తులుగానుదహరించుచున్నారు. యథార్థమునకీకాంతాసక్తి నవవిధభక్తిమార్గములలోనెందును అంతర్భూతమైనట్లు కానరాదు. అష్టభార్యలను యిష్టదాసీలుగాపరిగణించి దాస్యభక్తియందు వారిని లెక్కించినను వారియందు దాస్యాసక్తికలుగుటకీకాంతాసక్తియే కారణము. శ్రీకృష్ణుని పతిగా పొందినందుననే వారిలో పతిసేవాభావమభివ్యక్తమైనది. ఈ సేవాభక్తినే దాస్యభక్తి యనుచున్నాము. కాని యిచట యీయెనమండుగురుభార్యలను కాంతాసక్తులుగా పరిగణించుటయే సమంజసము. రుక్మిణీసతియందలి యీకాంతాసక్తియే ఆత్మనివేదనగా పరిణమించినది. రుక్మిణీకృష్ణులమధ్యయేర్పడిన కాంతాసక్తికి అంకురార్పణ మెట్టిదనిన -

క. తన తండ్రిగేహమునకుం
జనుదెంచుచు నున్న యతిథిజనుల వలనఁ గృ
ష్ణుని రూపబలగుణాదులు
విని కృష్ణుఁడు దనకుఁ దగినవిభుఁడని తలఁచెన్

క. ఆ లలన రూపు బుద్ధియు
శీలము లక్షణము గుణముఁ జింతించి తగన్
బాలారత్నముఁ దనకి
ల్లాలుగఁ జేకొందు ననుచు హరియుం దలచెన్
— ఆం. భాగ. దశమ. పూ. భా. 1691,92

మూలమునందును వీరిట్లుపరస్పరకాంతాసక్తిని పొందియున్నారనుటకు క్రిందిపల్కులే సాక్షులు.

శ్లో. సోపశ్రుత్య ముకుందస్య రూపవీర్యగుణశ్రియః।
గృహాగతైర్గీయమానా స్తం మేనే సదృశం పతిమ్॥

శ్లో. తాం బుద్ధిలక్షణౌదార్యరూపశీలగుణాశ్రయామ్।
కృష్ణశ్చ సదృశీం భార్యాం సముద్వోఢుం మనోదధే॥
- సం. భాగ. 10-52-23,24.

రుక్మిణి శ్రీకృష్ణుని రూపవీర్యగుణసంపదలయొక్క శ్రవణ, స్మరణ, కీర్తనాదులచే పరిపూర్ణయైనందున చైద్యుని భర్తగావింపనెంచిన సోదరుని తలంపు విని సహజములగు లజ్జాదుల బరిత్యజించి తన మనోనాథునకు బ్రాహ్మణునిద్వారమున పంపిన సందేశమున ఆమెలోని యాత్మనివేదనాసక్తి సువ్యక్తమైనది.

సీ. ఏ నీగుణములు కర్ణేంద్రియంబులు సోఁక
దేహతాపంబులు దీఱిపోవు
నే నీ శుభాకార మీక్షింపఁ గన్నుల
కఖిలార్థ లాభంబు గలుగుచుండు
నే నీచరణసేవ లేప్రొద్దు చేసిన
భువనోన్నతత్వంబుఁ బొందఁగలుగు

నే నీలసన్నామ మేప్రొద్దుభక్తితోఁ
దడవిన బంధ సంతతులు వాయు

తే. నట్టి నీయందు నాచిత్తమనవరతము
నచ్చి యున్నది నీ యాన నానలేదు
కరుణఁ జూడుము కంసారి! ఖలవిదారి!
శ్రీయుతాకార! మానినీచిత్తచోర!

సీ. ప్రాణేశ! నీమంజుభాషలు వినలేని
కర్ణరంధ్రంబుల కలిమి యేల
పురుషరత్నమ! నీవు భోగింపగా లేని
తనులతవలని సౌందర్య మేల
భువనమోహన! నిన్నుఁ బొడగానఁగా లేని
చక్షురింద్రియముల సత్త్వ మేల
దయిత! నీయధరామృతం బానఁగాలేని
జిహ్వకు ఫలరససిద్ధి యేల

ఆ. నీరజాతనయన! నీవనమాలికా
గంధ మబ్బలేని ఘ్రాణమేల
ధన్యచరిత! నీకు దాస్యంబు సేయని
జన్మ మేల యెన్ని జన్మములకు

— ఆం. భాగ. దశమ. పూ. భా. 1701,1708.

ఈయాత్మనివేదనమే జీవాత్మ పరమాత్మతోనైక్యముచెందుటకు పొందు వేదనము. మూలమునఁనీపట్టునసింతటి మాధుర్యభావసంభరితముకాకున్నను రుక్మిణిలో కానఁనగు నాత్మార్పణము వాచ్యముకాకపోలేదు.

శ్లో. తన్మేభవాన్ ఖలు వృతః పతి రఙ్గ జాయా
మాత్మార్పితశ్చ భవతోఽత్ర విభో విధేహి।

— సం. భాగ. 10-52-39.

ఇట్లు అష్టపత్నులు కాంతాసక్తులే అయినను రుక్మిణియందలి కాంతాసక్తిని ఆత్మనివేదనా భయందును, తక్కుంగలవారిభక్తిని దాస్యమందుసునంతర్భవింపజేయవచ్చును

కాని స్థూలదృష్టితో పరికించినచో కాంతాసక్తి నవవిధభక్తిరీతులలోనెందును అంత ర్భూతమగునదికాదు. కావుననిది నారదమహర్షిచే ప్రత్యేకముగా చెప్పబడినదని చెప్ప వచ్చును.

గోపికలయందును కాంతాసక్తి కనిపించును. వారు కాత్యాయనీవ్రతమాచరించుచు

క. ఓ కాత్యాయని! భగవతి!
నీకును మ్రొక్కెదము మేము నేఁడనుకంపన్
మా కిందఱకును వైళమ
శ్రీకృష్ణుడు మగఁడు గాఁగఁ జేయుము తల్లీ!

\- ఆం. భాగ. దశమ. పూ. భా. 806.

భద్రకాళీం సమానర్చుర్భూయాన్నందసుతః పతిః।

\- సం. భాగ. 10-22-5

అని ప్రార్థించిరి. ఇట్లు కాంతాసక్తిభక్తికిని భాగవతదశమస్కంధము లక్ష్యగ్రంథమై యలరారుచున్నది.

## వాత్సల్యాసక్తి

ఇది నవవిధభక్తిమార్గములకంటె నధికముగా నారదునిచే ప్రతిపాదింపబడిన భక్తిభేదము. భగవంతునివత్సగభావించి తను మాతృమూర్తియయి ప్రేమనెఱపుట వాత్సల్యభక్తి[66] యని లక్ష్మీనారాయణశాస్త్రిగారు నిర్వచించిరి. పరమాత్ముని వత్సగాభావించి మాతాపితలుగా ప్రేమాభిషేక మొనరించుటయే వాత్సల్యభక్తి.

ఇది తక్కిన భక్తిభేదములకంటె విభిన్నమైనది. ఏలయనగా భగవానుని పాలించుచు, అవసరమైనపుడు మందలించునధికారము వాత్సల్యభక్తునకుమాత్రమే లభ్యము. పుత్రునికొఱకు తను, ధన, మాన, ప్రాణముల నేనిని లెక్కచేయక, కేవలము పుత్రుని అభివృద్ధినిమాత్రమే దృష్టిలోనిడుకొని ప్రవర్తించుట, ఇందలి ప్రత్యేకత. దేవకీవసుదేవులు, యశోదానందులు వాత్సల్యాసక్తికి ఉదాహరణములు. దేవకీ యశోదలలో నిది పరాకాష్ఠనందినది. కృష్ణావతారఘట్టమున

తే. బాలుఁ బూర్ణేందురుచిజాలు భక్తలోక
పాలు సుగుణాలవాలుఁ గృపావిశాలుఁ

జూచి తిలకించి పులకించి చోద్యమంది
యుబ్బి చెలరేగి వసుదేవుఁ డుత్సహించె

- ఆం. భాగ. దశమ. పూ. భా. 111

ఇట్లుత్సహించిన వసుదేవుడానందరసాబ్ధిమగ్నుడై పదివేలధేనువులను విప్రులకు మానసమున ధారవోయుటయు; నీపాపడు నలుమొగములపాపనిగనిన మేటియగునని భక్తితో చాఁగిమ్రొక్కి, లేచి నొసలిపైగేలుదమ్మిదోయిఁగీలుకొలిపి, యాపాపని మొదలింటిపోకలెల్లఁదలచి ఆ మాయాదూరుని సూనునిగాఁగన్నందులకు తనయదృష్ట మును తలపోసి మురిసిపోవుటయు నాతనివాత్సల్యభక్తిపారవశ్యమును వ్యక్తమొనరించు చున్నవి. ఇప్పట్టున వ్యాసుని వసుదేవుడు కృష్ణావతారోత్సవసంభ్రమమున విస్మ యోత్ఫుల్లవిలోచనుడు మాత్రమాయెను.[67]

ఆ. విలయకాలమందు విశ్వంబు నీపెద్ద
కడుపులోనఁ దాఁచు కడిమి మేటి
నటుఁడ వీవు నేఁడు నాగర్భజుడ వౌట
పరమపురుష! వేడబంబు గాదె!

- ఆం. భాగ. దశమ. పూ. భా. 128

శ్లో. విశ్వం యదేతత్ స్వతనౌ నిశాన్తే
యథావకాశం పురుషః పరో భవాన్।
బిభర్తి సోఽయం మమ గర్భగోఽభూ
దహో నృలోకస్య విడంబనం హి తత్॥

- సం. భాగ. 10-3-31

అనుచు మహాపురుషలక్షణుండును, సుకుమారుండునునైన కుమారునింగని పలుకు దేవకిలో వాత్సల్యభక్తి చక్కగా విశదమగుచున్నది. శ్రీమహావిష్ణుని లాలనాదులు జరుపుట సాధ్యముకాదను వాత్సల్యాతిశయముచేతనే యాదివ్యరూపమును తొలగ బెట్టుమని యామె పరమాత్మని వేడుకొనినది. కావుననే భగవానుడు కరుణించి

క. నందనుఁ డనియుం బరమా
నందంబగు బ్రహ్మమనియు ననుఁ దలఁచుచు నా
పెందెరువు నొందెదరు నా
యందలి ప్రేమమున భవము నందరు మీరున్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 133

శ్లో. యువాం మాం పుత్రభావేన బ్రహ్మభావేన చాసకృత్।
చిన్తయన్తౌ కృతస్నేహౌ యాస్యేథే మద్గతిం పరామ్॥
- సం. భాగ. 10-3-45

అనుచు నారూపంబువిడిచి యప్పుడటుగన్న పాపనియొప్పునకొప్పె. దేవకీవసుదేవుల పూర్వజన్మార్జితభక్తివిశేషముచేతనే యిట్టిమహద్భాగ్యమబ్బినది. భగవంతుడే స్వయముగా వారితోమాట్లాడుటనుబట్టి వారి వాత్సల్యభక్తి విశిష్టత సువ్యక్తమగుచున్నది. కప్పముకట్టుటకై మథురకేతెంచిన నందునిచూచి వసుదేవుడు ప్రాణముఁబొందిన బొందివలెఁబొలుపారుచు తనకొడుకువలన మోహంబుదీపింప సంతతిహీనునకు సౌఖ్య సంతతిలేదుగదాయని విచారించుచు

క. నీ కాంతయు నీవును
నీ కాంతయు గారవింప నినుఁ దండ్రిగ నా
లోకింపుచు నీమందను
నాకొడుకున్నాఁడె నంద! నందాన్వితుడై.
- ఆం. భాగ. దశమ. పూ. భా. 205

శ్లో. భ్రాతర్మమ సుతః కచ్చిన్మాత్రా సహ భవద్వ్రజే।
తాతం భవన్తం మన్వానో భవద్భ్యాముపలాలితః॥
- సం. భాగ. 10-51 27

అని పలుకుటనుబట్టి యాచిన్నవాని యెడబాటుచే నాతలిదండ్రులెంతగా విచారమగ్నులైనారో విశదమగుచున్నది. కావుననే కంసవధానంతరము బలరామకృష్ణులు తమ్ముజేరినపుడు వారిపలుకులకు పరవశించి, వారలనంకపీఠంబుననిడుకొని, కౌగిలించుకొని, కన్నీటందడుపుచుఁ బ్రేమపాశబద్ధులగుట సంభవించినది. మూలమునందును, అనువాదమునందును దేవకీవసుదేవుల వాత్సల్యభక్త్యతిశయవిశిష్టత చక్కగా విశదీకరింపబడినది.

నందుండు నందనుండుపుట్టుటయెఱింగి మహానందంబున నెఱవాదులగు వేదవిదులంబిలిపించి, జలంబులాడి, శుచియై, శృంగారించుకొని స్వస్తిపుణ్యాహవచనంబులు చదివించి, జాతకర్మంబులు సేయించి, పితృదేవతలనర్చించి, క్రేపులతోడం గూడఁ గైసేసిన పాడిమొదవుల రెండులక్షలను, కనకకలశములకొవసనవిశాలంబులైన తిలశైలంబులేడింటిని భూదేవతలకిచ్చిన వారాశీలుని దీవించిరి. నందనందనునిమాడ

నావాడయంతయు నానందతరంగితమైనది. ఇట్లు నందుడును, గో, గోప, గోపికా సమూహమును సంతోషాతిరేకమున వసంతోత్సవములు జరుపుకొనుటవలన నాబాలుని పై గల వాత్సల్యభావమెట్టిదో విశదమగుచున్నది.

పూతనవధానంతరము గోపికలు రమ్మనిమూఁపుజిమ్ముకొని సంస్పర్శించి యూఁరార్చుచు, గోలాంగూలముఁద్రిప్పి గోరజము గోమూత్రముఁజల్లి తద్బాలాంగంబుల పంౘ్రెండునామములచే గోమయంబలది యంతటఁబోవనీయక రక్షసేయుట వాత్సల్యాసక్తితోడనే. ఇచట వాత్సల్యాతిరేకముచే యశోదగావించిన పనులను తిలకింపుడు.

క. ఆ పెద్ద పేడబంబుల
పాపనికిని జన్నుఁ గుడిపి పానుపునై సం
స్థాపించి కప్పి కూరుకు
మో పాపఁడ యని యశోద యొయ్యనపాడెన్.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 236

మాతృత్వమునటించి పాలిచ్చినంతమాత్రముననే పూతనకు మోక్షమబ్బుటనుబట్టి వాత్సల్యాసక్తివిశిత వ్యక్తమగుచున్నది.

శకటాసురభంజనానంతరము యశోదలోకాన్పించు వాత్సల్యాసక్తి మూలమున కంటె అనువాదమున మిన్నగా వ్యక్తమైన తీరు పరికింతము.

ఆ. అలసితివిగదన్న! యాఁకొంటివి గదన్న!
మంచియన్న! యేడ్పు మానుమన్న!
చన్నుగుడువుమన్న! సంతసపడుమన్న!
యనుచుఁ జన్నుగుడిపె నర్భకునకు

— ఆం. భాగ. దశమ. పూ. భా. 258.

శ్లో. రుదంతం సుతమాదాయ యశోదా గ్రహశంకితా।
కృతస్వస్త్యయనం విప్రైః సూక్తైః స్తనమపాయయత్॥

— సం. భాగ. 10-7-11

తృణావర్తుడు కృష్ణునిగొనిపోయినపుడును పోతనయశోదపొందిన ఆవేదనము వ్యాసునియశోద పొందియుండ లేదనుట యథార్థమని మూలానువాదములందలి క్రింది భాగములను తిలకించిన స్పష్టముకాగలదు.

ఉ. పాపనిఁ జూడఁ గానక విపద్దశనొంది కలంగి తల్లి యో
పాపడ! బాలసూర్యనిభ! బాలశిరోమణి! నేఁడు గాలికిన్
జేపడి పోయితే యనుచుఁ జీరుచు దైవముఁ జాల దూఱుచున్
దాపము నొంది నెవ్వగల దయ్యుచుఁ గుందుచు బిట్టుఁ గూయుచున్

క. సుడిగాలి వచ్చి నిన్నున్
సుడిగొని కొనిపోవ మింట సుడి సుడిగొనుచున్
బెడఁ గడరెడి నా ముద్దుల
కొడుకా! యేమంటి వనుచు ఘోరం బనుచున్

ఉ. ఇక్కడఁ బెట్టితిం దనయుఁ డిక్కడ నాడుచునుండె గాలి దా
నెక్కడనుండి వచ్చె శిశు వెక్కడి మార్గము వట్టి పోయె నే
నెక్కడఁ జొత్తునంచుఁ గమలేక్షణ క్రేపుఁదొలంగి ఖిన్నయై
పొక్కుచు వ్రాలుగోవుక్రియ భూస్థలి వ్రాలె దురంతచింతయై.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 266, 67, 68.

శ్లో. ఇతి ఖరపవనచక్రపాంసువర్షే
సుతపదవీమబలావిలక్ష్య మాతా ।
అతికరుణమనుస్మరన్త్యశోచద్
భువి పతితా మృతవత్సకా యథా గౌః ॥

— సం. భాగ. 10.7.24.

ఒకనాడు తల్లియైనయశోద చన్నుచేపిన చిన్నికృష్ణుని చేరఁదిగిచియెత్తి పెందొడలపైనిడుకొని ముద్దాడి, చన్నిచ్చి, నెమ్మొము సక్కనిదీరిన బాలుడు నగవుతో ఆవులించిన నాతనివదనగహ్వరమందఖిలలోకములు; చరాచరములైన భూతగణము లన్నియు, చూచి చోద్యపడుట యామెలోని వాత్సల్యభక్తికి భగవానుతనుగ్రహించుటయే. ఇది మూలానువాదముల రెండింటియందును సమముగా గానవచ్చుచున్నది.

మఱొకనాడు బాలకృష్ణుని దుడుకుచేష్టలను గోపికలు యశోదకు విన్నవించగా

క. చన్నుఁ విడిచి చనఁ డిట్టటు
నెన్నఁడుఁ బొరుగిండ్ల త్రోవ తెఱుఁగఁడు నేఁడున్

గన్నులు తెఱవని మా యీ
చిన్నికుమారకుని అవ్వ సేయందగునే.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 330.

అని యశోదపలుకుటతో ఆమెమాతృహృదయము వ్యక్తమగుచున్నది తనకుమారుడు నిజముగా తప్పుచేసినను ఇతరులముందు దానినొప్పుకొనక సమర్థించు మాతృమూర్తి తత్త్వమిచట కన్పట్టుచున్నది. మూలముననిట్లుగాక యశోద నవ్వినమొగముగలదై కుమారుని బెదిరింపనిచ్ఛగింపనిదయ్యెను. ( ప్రహసితముఖీ వహ్యాపాలభ్య మైచ్ఛత్ )

బలభద్రప్రముఖులైన గోపకుమారులు కృష్ణుడు మన్నుతినెనని చెప్పగా

క. మన్నేటికి భక్షించెదు
మన్నియమము లేల నీవు మన్నింపవు మీ
యన్నయు సఖులును జెప్పెద
రన్నా యిదియేల మఱి పదార్థము లేదే

- ఆం భాగ. దశమ. పూ. భా. 337.

అని మందలించి తద్ద్వారమున విశ్వరూపసందర్శనయోగమును, పరమార్థ తత్త్వమునెఱుంగునదృష్టమును యశోదకుమాత్రమే దక్కినది. అట్లే పాలివ్వలేదను కోపమున పాలకుండలుపగులగొట్టి, ఉట్టిమీదివెన్నను కోతిపాలుచేయుచున్న తనయుని

మ. కనిచేతన్ సెలగోల వట్టికొనుచున్ గానిమ్ము కానిమ్ము రా
తనయా! యెవ్వరియందుఁ జిక్కవడ నే దండంబునుం గాన నే
వినివారంబునుబొంద నే వెఱవు నే విభ్రాంతియుం జెంద ము
న్ననియో నీవిటు నన్నుఁ గైకొనవు నేఁ డా రీతి సిద్ధించునే

— ఆం. భాగ. దశమ. పూ. భా. 361.

అని యశోద ఆదలించుచు, పరుగిడి యెట్టకేలకుపట్టుకొని రోలగట్టగలుగుట; జ్ఞానులచే గాని, మౌనులచేగాని, దాసులచేగాని, యోగసంవిధానముచేగాని పట్టువడని శ్రీనాథుడట్లు కట్టుబడుట యశోదలోని పరిపక్వతచెందిన వాత్సల్యభక్తిచేతనే సాధ్యమైనది. అట్లే శ్రీకృష్ణుడు కాళియుని చేజిక్కిన సమయంబున యశోదానందులు శోకాధిక్యంబున

క. పన్నగము మమ్ముఁ గఱవక
నిన్నేటికిఁ గఱచెఁ గుఱ్ఱ ! నెమ్మి గలిగి నీ

వున్నను మము రక్షింతువు
నిన్నున్ రక్షింప నేము నేరము తండ్రీ.

– ఆం. భాగ. దశమ. పూ. భా. 654

అనియు, 'నీవు సర్పదష్టుండవైయున్న నిచట మాకుఁ బ్రతుకులెవ్వ'రనియు, అతడు లేని లోకమేలననియు విలపించుచు కృష్ణునితోడ మడుగుజొత్తము, చత్తమనుచు నందు డొరబాఱుటకు ప్రయత్నించుటయు వారి వాత్సల్యభక్తివిశేషమును స్పష్టమొనర్చుటయే.

సంతానమెంతటి గొప్పవారైనను, వయోవృద్ధులైనను, జ్ఞానసంపన్నులైనను తలిదండ్రులు వారిని చిఱుతప్రాయమునందుపలెనే యభిమానించుట వాత్సల్యమునందు గన్పట్టు విశేషలక్షణము. శ్రీకృష్ణుడు సకుటుంబముగా గ్రహణస్నానమునకేగిన సందర్భమున బలరామకృష్ణులు నందయశోదలకు వినయమున మ్రొక్కినపుడు యశోదాదేవి రామకృష్ణుల నిజాంకపీఠంబుననునిచి, యక్కునం గదియం దిగిచి, చెక్కులు ముద్దుగొని శిరంబులు మూర్కొని, చుబుకంబులు పుణుకుచు, పునః పునరాలింగనంబులుగావించి పరమానందంబును బొందెను. ఈఘట్టమున వ్యాసుని యశోదయందింతటి వాత్సల్యాతిరేకము కానరాదనుటకు క్రిందిశ్లోకమే సాక్షి

శ్లో. తావాత్మాసనమారోప్య బాహుభ్యాం పరిరభ్య చ ।
యశోదాచ మహాభాగా సుతౌ విజహతుః శుచః ॥

– సం. భాగ. 10-82-36.

యశోదానందుల పెంపకమున బలరామకృష్ణులు వారి స్వంతతల్లిదండ్రులను కూడ మరచిపోయిరి. అంతటి వాత్సల్యభక్తినెఱపిన యశోదతోనొకనాడు రోహిణియు, దేవకియు తమకృతజ్ఞతలనిట్లు తెలిపిరి.

క. జననం బందిన మొదలుగ
ఘనమోహముతోడఁ బెంచు కతమునఁ దమకున్
జననీజనకులు వీరని
మనములఁ దలపోయ లేదు మము నీ తనయుల్

క. అంటిన ప్రేమను వీరిం
గంటికి ఱెప్పడ్డమైనగతిఁ బెంపఁగ మా
కంటెన్ నెన రౌటను మీ
యింటన్ వసియించి యుండి రిన్ని దినంబుల్.

– ఆం భాగ. దశమ. ఉ. భా. 1061, 1062.

శ్లో. ఏతావదృష్టపితరౌ యువయోః స్మ పిత్రోః
సంప్రీణనాభ్యుదయపోషణపాలనాని।
ప్రాప్యోషతుర్భవతి పక్ష్మ హ యద్వదక్ష్ణో
ర్న్యస్తావకుత్రచభయౌ న సతాం పరః స్వః ॥
- సం. భాగ. 10-82-39

ఇట్లు పరమాత్మని లాలించి, పాలించి, పాలిచ్చి, మందలించి, యదలించి, శిక్షించ గలిగిన యధికారము, అదృష్టము యశోదానందులకుమాత్రమే దక్కినది. కావుననే వారు

శ్లో. పూతనా లోకబాలఘ్నీ రాక్షసీ రుధిరాశనా।
జిఘాంసయాపి హరయే స్తనం దత్త్వాఽఽపసద్గతిమ్ ॥

శ్లో. కిం పునః శ్రద్ధయా భక్త్యా కృష్ణాయ పరమాత్మనే।
యచ్ఛన్ ప్రియతమం కిం ను రక్తాస్తన్మాతరో యథా॥
- సం. భాగ. 10-6-35, 36.

క. వెన్నుని కొకపతి విషమగు
చన్నిచ్చిన బాలహంత్రి చనెనట దివికిన్
వెన్నునిఁ గని పెంచుచుఁ దన
చన్నిచ్చిన సతికి మఱియు జన్మముఁ గలదే.
- ఆం. భాగ. దశమ. పూ. భా. 240.

అనియును,

శ్లో. నందః కిమకరోద్బ్రహ్మన్ శ్రేయ ఏవం మహోదయమ్।
యశోదా చ మహాభాగా పపౌ యస్యాః స్తనం హరిః ॥
- సం. భాగ. 10-8-46.

ఆ. జగదధీశ్వరునకుఁ జన్నిచ్చు తల్లిగా
నేమి నోమునోచె నీ యశోద
పుత్రుడనుచు నతనిఁ బోషించుతండ్రిగా
నందుఁ డేమిచేసె నందితాత్మ

క. ప్రబ్బినభక్తిని హరిపైఁ
గబ్బంబులు సెప్పి కవులు కైవల్యశ్రీ
కబ్బుదురట హరిపోషణ
మబ్బిన తలిదండ్రు లెచటి కబ్బుదురో తుదిన్.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 349,350.

అనియును కీర్తింపబడిరి.

ఈవిధముగా పర్యాలోచనచేయగా నారదప్రతిపాదితమైన వాత్సల్యభక్తి భాగవతమునందు పరాకాష్ఠనందినదని చెప్పుటలోనతిశయోక్తి లేదు. ఆంధ్రభాగవతమున పోతనయే యశోదయై మరింత వాత్సల్యాసక్తిని ప్రదర్శించినాడనుట సత్యదూరము కానేరదు.

## ఆత్మనివేదనాసక్తి

ఈ యాత్మనివేదనాసక్తినే వ్యాసభగవానుడు తన భాగవతరచనమున ఆత్మనివేదనమను భక్తిరూపముననను, భక్తకవి పోతనామాత్యుడు 'ఆత్మలోనెఱుక' యను పేరున ప్రత్యేకపద్ధతిగను పేర్కొనియున్నారు. ఈరెండింటి స్వరూపస్వభావములను, భాగవతరచనమున నీభక్తివైశిష్ట్యమును నవవిధభక్తిరీతులలో వివరింపబడినది.

## తన్మయాసక్తి

చరాచరజగత్తంతయు పరమేశ్వరమయమని తలంచి, పరమాత్మకంటె భిన్నమైన వస్తువు లేదనుభావనతో పైమరచి యుండుటయే తన్మయత్వము. శ్రవణాది భక్తిరీతులన్నింటియందును ఈతన్మయత్వము కానవచ్చును. ఇట్టి తన్మయతలేనివాడు భక్తుడుకాలేడు. కావుననీభక్తి నవవిధమార్గములనన్నింటను, అంతర్భూతము కాగలదు. దాస్య, సఖ్య, వాత్సల్యములందీ తన్మయత్వమధికముగాను, ఆత్మనివేదనమునందత్యధికముగాను కానవచ్చును.

కృష్ణుడంతర్హితుడుకాగా గోపికలు భూతములలోన, వెలిఁబ్రఖ్యాతుఁడగునట్టి వానిని కాళిందితీరవనాంతరముల వెదకుచు నాతనిగూర్చి స్థావరజంగమములనన్నిటిని పేరుపేరున పరిశ్నించుటజూడ తన్మయాసక్తిపలననే గదా !

## పరమవిరహాసక్తి

'న వినా విప్రలంభేన శృంగారః పుష్టిమశ్నుతే' అనికదా యాలంకారికోక్తి అట్లే భగవత్సంయోగమునకంటె వియోగమున నిరంతరధ్యానముచే భక్తిపారవశ్యము గలుగుననుట యథార్థము. 'ఎట్టి యాపదలందు భగవానునిదర్శనము లభించునో యట్టి యాపదలు మాటిమాటికి సంభవించుచుండుగాక' యని భక్తవరేణ్యులు తలంచుచుందు రనుట సత్యదూరముకాదు. తనయెడబాటును సహింపలేని భక్తులలో భక్తిభావము నధికమొనర్చుటకు భగవానుడే వారికి విరహము కలిగించుచుండును. ఆవిరహమును క్షణకాలమేని సహింపలేకపోవుట యాత్మనివేదనాపరుల ప్రధానలక్షణమనునది విదితము. కావుననే శ్రీకృష్ణుడు గోపికలను పరమవిరహాసక్తలగావించి భక్తిపారవశ్యమును కలిగించినాడు.

మ. నను సేవింపుచు నున్న వారలకు నే నారూపమును జూపఁ జూ
 చినఁ జాలించి మదించి వారు మది నన్ సేవింపరో యంచు ని
 ర్ధనికుం డాత్మధనంబు చెడ్డ నెపుడున్ దత్పారవశ్యంబుఁ దా
 ల్చినభంగిన్ ననుఁ బాసి మత్ప్రియుడు దాఁ జింతించు నారూపమున్

- ఆం. భాగ. దశమ పూ. భా. 1076.

శ్లో. నాహం తు సఖ్యో భజతోఽపి జంతూన్
 భజామ్యమీషామనువృత్తివృత్తయే ।
 యథాధనో లబ్ధధనే వినష్టే
 తచ్చింతయాన్యన్నిభృతో న వేద ॥

- సం. భాగ. 10-32-20.

అనుచు పరమాత్ముడే స్వయముగా పలికియున్నాడు. అట్టి పరమవిరహాసక్తి నొందిన గోపికలు జపతపోవ్రతదానసత్కర్మముల గలుగని ముక్తియు, శివసనకాది విమల చిత్తంబులఁబొందని భక్తియు, జన్మకర్మరాహిత్యప్రాప్తియునందిరి.

ఈవిధముగా పర్యాలోచనచేయగా భాగవతోక్త నవవిధభక్తులకేగాక యాసక్తి భేదములచేనేకాదశవిధములుగా నారదమహర్షిచే పరిగణింపబడిన భక్తికిని దశమ స్కంధముదాహరణగ్రంథమై, వ్యాఖ్యానమై యలరారుచున్నదని తెలియుచున్నది. పోతనయాత్మసమర్పణాసక్తిచే ఆతనిదశమస్కంధమున ఈభక్తిమార్గములు మరింత సుగమములై ముక్తిప్రదములగుచున్నవి.

# వైరభక్తి

భగవద్గీతచేగాని, నారదశాండిల్యభక్తిసూత్రములచేగాని ప్రతిపాదింపబడనిదియు శ్రవణాది నవవిధభక్తులలో కంఠోక్తిగా చెప్పబడకపోయినను భాగవతముచే ప్రతిపాదింపబడినదియు ఈవైరభక్తియే. భగవానునివిరోధిగా భావించి ద్వేషభావముతో నాతనికిఁబరతంత్రమైయుండుటయేవైరభక్తి. భగవానుని శత్రుభావముతో నిరంతరము తెగనాడుచుండుటవలన భగవద్భావతీవ్రత యినుమడించి ముక్తికలుగునని యిందలి ప్రధానసందేశము. ఏమార్గముననైనను హరికి పరతంత్రులైయుండుటయే ప్రధానమని భాగవతప్రబోధము. కావుననే

శ్లో. కామం క్రోధం భయం స్నేహమైక్యం సౌహృదమేవ చ।
నిత్యం హరౌ విదధతో యాన్తి తన్మయతాం హి తే॥
- సం. భాగ. 10-29-15.

ఆ. బాంధవమున నైనఁ బగనైన వగనైనఁ
బ్రీతినైనఁ బ్రాణ భీతి నయిన
భక్తినైన హరికి పరతంత్రులై యుండు
జనులు మోక్షమునకుఁ జనుదు రధిప.
- ఆం. భాగ. దశమ. పూ. భా. 971

అని పలుకబడినది.

వైరభక్తిచే ముక్తినందినవారిలో శిశుపాలుడు ముఖ్యుడని శుకమహర్షి పరీక్షిన్మహారాజునకిట్లు చెప్పియున్నాడు.

'చక్రికిం బగతుఁడై మూఢుండు చైద్యుండు పెంపునఁ గైవల్యంబు నొందె'[68]

శ్లో. ఉక్తం పురస్తాదేతత్తే చైద్యః సిద్ధిం యథా గతః ।
ద్విషన్నపి హృషీకేశం కిముతాధోక్షజప్రియాః॥[69]

ధర్మజుడు రాజసూయయాగమును గావించు సందర్భమునందగ్రపూజార్హులెవ్వరని యడిగిన, వివేకశీలుండగు సహదేవుండు భగవంతుడైన శ్రీకృష్ణునిపూజించిన భువనంబు లన్నియుఁబరితుష్టినందునని చెప్పగా ధర్మజుండును గోపాలుని పూజించి యానంద బాష్పజలబిందుసందోహకందళితనయనారవిందుండయ్యె. అయ్యవసరమున చైద్యుడు సభాసదులంజూచియిట్లుపల్కెను—

శ్లో. సదస్పతీనతిక్రమ్య గోపాలః కులపాంసనః ।
యథా కాకః పురోడాశం సపర్యాం కథమర్హతి ॥
శ్లో. వర్ణాశ్రమకులాపేతః సర్వధర్మబహిష్కృతః ।
స్వైరవర్తీ గుణైర్హీనః సపర్యాం కథమర్హతి ॥
శ్లో. యయాతినైషాం హి కులం శప్తం సద్భిర్బహిష్కృతమ్ ।
వృథాపానరతం శశ్వత్ సపర్యాం కథమర్హతి ॥
శ్లో. బ్రహ్మర్షిసేవితాన్ దేశాన్ హిత్వైతేఽబ్రహ్మవర్చసమ్।
సముద్రం దుర్గమాశ్రిత్య బాధంతే దస్యవః ప్రజాః ॥

-సం.భాగ. 10-74-34 నుండి 37.

ఇందలి యంతరార్థమును గ్రహించిన చైద్యుడెంతటి భక్తితత్పరుడో విశదముకాగలదు శ్రీధరస్వామి భావార్థదీపికావ్యాఖ్యను పరికించిన అది తెల్లమగును.

'గోపః వేదపృథివ్యాది పాలక ఇత్యర్థః. కుత్సితం వేదవిపరీతం లపంతీతి కులపాః పాషండాః, తాన్ అసతే-ఘాతయతీతి కులపాంసనః. అకాకః కంచ అకంచ కాకే సుఖదుఃఖే, తేన విద్యతే యస్యసః అకాకః. ఆప్తకామ ఇత్యర్థః. స యథా ఆప్తకామో దేవయోగ్యం కేవలం పురోడాశాదిమాత్రం నార్హతి. అపితు సర్వస్వమపి. తథాయం శ్రీకృష్ణోఽపి బ్రహ్మర్షియోగ్యం సపర్యామాత్రం కథమర్హతి కింతు స్వాత్మ సమర్పణమప్యర్హతీత్యర్థః. వర్ణాశ్రమకులేభ్యః అపేతః బ్రహ్మత్వాత్ 'అనామగోత్ర' మితిశ్రుతేః. అత ఏవానధికారిత్వాత్సర్వైర్ధర్మైర్బహిష్కృతః. స్వైరవర్తీ పరమేశ్వర త్వాత్. అత ఏవ నిర్గుణః తమ ఆది రహితః. ఏవం భూతో జీవానాం యోగ్యం తుచ్ఛం సపర్యామాత్రం కథమర్హతీత్యర్థః. అపిచ కథం వర్ణనీయో మాదృశైరేషాం యదూనాం మహిమా. యస్మాదేషాం కులం యయాతినాశప్తమపి కిం సద్భి ర్బహిష్కృతం. అపితు శిరసాధృతం. కించ అస్మదాది కులవత్ వృథాపానరతం కిం, అపితు అతినియతాచారమిత్యర్థః. అహో యదూనామేవ తావదీదృశం మాహాత్మ్యం యదుకులవృద్ధస్య యయాతేః శాపో న ప్రాదుర్భూయాదిత్యాది. అయం తు సాక్షా దీశ్వరః. అతః సపర్యామాత్రం కథమర్హతీత్యర్థః. యే రాజనో దుష్టానుచ్చాటయంతి. తే తదర్థం కీకటాదిదేశానప్యాశ్రయంతి. ఏతేతు బ్రహ్మర్షిసేవితానేవ దేశానాశ్రిత్య అబ్రహ్మవర్చసం సముద్రం దుర్గమపి హిత్వా హాపయిత్వేత్యర్థః. బాధంతే తథా. యాః దస్యవః ప్రజాస్తాశ్చ అయమర్థః. వేదతదర్థాభియోగో బ్రహ్మవర్చసం, తద్విరుద్ధమబ్రహ్మవర్చసం, సముద్రం. ముద్రా లింగం తత్సహితం సముద్రం, వేద

విరుద్ధ లింగధారిణం పాషండమిత్యర్థః. తల్లింగం త్యాజయిత్వా బాధంతే దండయంతి. కథం భూతం దుర్గం. ధర్మవత్ప్రతీతేరధర్మతయా దుర్జ్ఞేయమిత్యర్థః. తథా దస్యవః దస్యూనపి ప్రజావేషేణ వర్తమానాన్ దండయంతి. అతో యదుభ్యోఽన్యః కోనామ ధార్మికోఽస్తీతి పారుష్యం తత్త్వార్థమేవ.'70

పోతన శిశుపాలుడును నిందావ్యాజమున శ్రీకృష్ణుని స్తుతించినాడు.

సీ. గురుదేవ శూన్యుండు కులగోత్రరహితుండుఁ
దలిదండ్రు లెవ్వరో తడవఁ గాన
మప్పాలఁ బోరలేడు నాదిమధ్యావసా
నంబులందరయ మానంబు లేదు
బహురూపి యై పెక్కు భంగుల వర్తించు
వావివర్తనములు వరుస లేవు
పరికింప విగతసంబంధుండు దలపోయ
మానిమిత్తంబున మాని సయ్యెఁ

తే. బరఁగ మున్ను యయాతి శాపమునఁ జేసి
వాసి కెక్కఁడు యాదవ వంశమెల్ల
బ్రహ్మతేజంబునెల్లఁ గోల్పడినయితఁడు
బ్రహ్మఋషి సేవ్యుఁడగునె గోపాలకుండు

క. జారుఁడు జన్మావధియును
జోరుఁడు ముప్పోకలాఁడు సుమహిత పూజా
చారక్రియలకు నర్హుఁడె
వారక యితఁడనుచు నశుభవాక్య స్ఫూర్తిన్.

— ఆం. భాగ. దశమ. ఉ. భా. 786, 87

ఇందు శిశుపాలుడు విరోధమున హరికి పరతంత్రుడైనవిధము సుస్పష్టమగుచున్నది. కావున దనతో శత్రుత్వముగానైక్యముగాదగినవాడీతడని భగవానుడు భావించి యాక్షణంబ తన్మస్తకంబు నిశితధారాకరాళంబైన చక్రంబున నవక్రపరాక్రముండయి దునుమ, చైద్యగాత్రమునందుండి యనుపమతేజము వెలువడి వనజోదరు దేహమందు వేగముగా ప్రవేశించెను. అతడీవిధమున పరమాత్మైక్యమందుటకు ఉన్మత్తయోజిత వైర సంబంధముచే నిరంతరధ్యానపారీణుడగుటయే కారణమని మకయోగీంద్రుప్రవచనము—

శ్లో. జన్మత్రియానుగుణీతవైరసంరబ్ధయా ధియా ।
ధ్యాయం స్తన్మయతాం యాతో భావో హి భవకారణమ్ ॥
- సం. భాగ. 10-74-46.

మ. మధుదైత్యాంతకుమీఁదిమత్సరమునన్ మత్తిల్లి జన్మత్రయా
వధి నేప్రొద్దుఁ దదీయరూపగుణదివ్యధ్యానపారీణధీ
నిధి యౌటన్ శిశుపాలభూవిభుఁడు దానిర్ధూతసర్వాఘుఁడై
విధిరుద్రాదుల కందరానిపదవిన్ వే పొందె నుర్వీశ్వరా!
- ఆం భాగ. దశమ. ఉ. భా. 795.

అట్లే వైరానుబంధంబున నన్యానుసంధానంబు మఱచి తిరుగుచు, కుడుచుచు, త్రావుచు, అరుగుచు, కూర్చుండిలేచుచు ననవరతము హరిఁదలచి తలఁచి, జగమా హరిమయమని చూచినవాఁడగుటచే కంసుడు

సీ. శ్రవణరంధ్రముల నే శబ్దంబు వినఁబడు
నది హరిపలుకని యాలకించు
నక్షిమార్గమున నెయ్యది చూడఁబడు నది
హరిమూర్తిగానోపు నంచుఁ జూచు
దిరుగుచో దేహంబుఁ దృణమైన సోకిన
హరికరాఘాతమో యనుచుఁ గలఁగు
గంధంబు లేమైన ఘ్రాణంబు సోఁకిన
హరిమాలికాగంధ మనుచు నదరుఁ

ఆ. బలుకు లెవ్వియైనఁ బలుకుచో హరిపేరు
పలుకఁ బడియె ననుచు బ్రమసి పలుకుఁ
దలపు లెట్టివైనఁ దలఁచి యా తలఁపులు
హరి తలంపు లనుచు నలుగఁ దలఁచు.
- ఆం. భాగ. దశమ. పూ. భా. 87

శ్లో. ఆసీనః సంవిశం స్తిష్ఠన్ భుంజానః పర్యటన్ మహీమ్ ।
చిన్తయానో హృషీకేశమపశ్యత్ తన్మయం జగత్ ॥
- సం. భాగ. 10-2-24.

కావుననే యాతడు విశేషగతిం బరమాత్ముని రూపమునే పొందినాడు. (తదేవరూపం దురవాపమాప)

చైద్యునిలో కానరాని భయము కంసునిలో కనిపించుచున్నది. కాబట్టి భగవద్విరోధమున జనించు భయాతిరేకముచేతను విష్ణుసాయుజ్యముకలుగునని భాగవతము ప్రతిపాదించినట్లయినది.

మాతృత్వమును నటించి విషపూరితక్షీరముస్రాపి శ్రీకృష్ణుని చంపనెంచిన పూతన మోక్షమునందుటనుబట్టియు భాగవతము వైరభక్తిని సుప్రతిష్ఠితమొనరించుచున్నదని చెప్పవచ్చును.

ఇట్లు భక్తియొక్క స్వరూపము దశమస్కంధమున సమగ్రముగ చిత్రింపబడినది. ఇతరస్కంధములందింతగా కానరాదు. కావున భక్తితత్త్వమునరయుటకు భాగవతదశమస్కంధము పరమప్రమాణగ్రంథమైనది. భక్తివాఙ్మయమున నింతకు మించినగ్రంథము కానరాదనుట అతిశయోక్తికానేరదు.

భాగవతదశమస్కంధమిట్లు భక్తికి లక్ష్యలక్షణవ్యాఖ్యాగ్రంథముకాగా పోతనయాంధ్రీకరణమునవెలసిన దశమస్కంధము మూలాతిశయమైన ప్రశస్తినంది భాగవతోత్తములకును, పండితపామరులకును, నిత్యపారాయణగ్రంథమై యలరారుచున్నది. అందులకు పోతనసహజభక్తితన్మయతయే కారణము.

నిగమములువేయుఁజదివిన సుగమముగాని ముక్తినివసనము పోతనదశమస్కంధమను భక్తికావ్యమునుఁబఠింప సుగమము కాగలదు.

## అధస్సూచికలు

1 భక్తితత్త్వదర్శనము; పుట: 81, 82

2 'వాగ్భూషల' అని పాఠాంతరము

3 'సత్కీర్తియున్' అని పాఠాంతరము

4 ఆంధ్రమహాభాగవతము-భక్తితత్త్వోన్మీలనము; పుట: 294,

5 ఆంధ్రమహాభాగవతము-భక్తితత్త్వోన్మీలనము; పుట: 294

6 భారతీయతత్త్వశాస్త్రము; ద్వి. సం; పుట: 410

7 ఆంధ్రమహాభాగవతము–భక్తితత్త్వోన్మీలనము; పుట : 75
8 భక్తిరసామృత సింధువు; 2-43
9 'వదలు' అనునది పాఠాంతరము
10 సం. భాగ. 10-1-13
11 'నిన్నెఱుంగంగ' అనునది పాఠాంతరము.
12 ఆం. భాగ. దశమ. పూ. భా. 988
13 సంకీర్తనమీమాంస; 1–1, 3
14 ఆంధ్రమహాభాగవతము - భక్తితత్త్వోన్మీలనము; పుట : 328
15 ఆం. భాగ. షష్ఠ. 192
16 సం. భాగ. 10-38–12.
17 ఆం. భాగ. దశమ. పూ. భా. 1232
18 సం. భాగ. 10-40-1 నుండి 30 వఱకు
19 సం. భాగ. 10-22–4; ఆం. భాగ. దశమ. పూ. భా. 806, 807
20 భక్తిప్రకాశమ్; పుట : 61
21 నారదభక్తిసూత్రములు; సూ : 19
22 సం. భాగ. 10-30-15 నుండి 23 వఱకు
23 సం. భాగ. 10-44-13
24 భక్తిప్రకాశమ్; పుట : 65
25 ఆంధ్రమహాభాగవతము - భక్తితత్త్వోన్మీలనము; పుట : 295, 296
26 సం. భాగ. 10-63-41
27 సం. భాగ. 10–86-13 నుండి 59 వఱకు
28 ఆం. భాగ. దశమ. పూ. భా. 543, 544
29 భక్తిప్రకాశమ్; పుట : 90
30 దేవపూజారహస్యము; పుట : 33
31 ఆంధ్రమహాభాగవతము - భక్తితత్త్వోన్మీలనము; పుట : 426

32 ఆం. భాగ. దశమ. ఉ భా. 1005, 1006

33 ఆం. భాగ. దశమ పూ. భా. 805 నుండి 808 వఱకు

34 సం. భాగ. 10_74_19 నుండి 26 వఱకు

35 ఆం. భాగ. దశమ. ఉ. భా. 75, 76, 77

36 ఆంధ్రమహాభాగవతము – భక్తితత్త్వోన్మీలనము; పుట : 478

37 ఆంధ్రమహాభాగవతము – భక్తితత్త్వోన్మీలనము; పుట : 494

38 భక్తిరసామృతసింధువు 1-183

39 ఆంధ్రమహాభాగవతము – భక్తితత్త్వోన్మీలనము; పుట : 613, 614

40 సం. భాగ. 10-83-6 నుండి 42 వఱకు

41 ఆంధ్రమహాభాగవతము – భక్తితత్త్వోన్మీలనము; పుట : 639

42 ఆంధ్రమహాభాగవతము – భక్తితత్త్వోన్మీలనము; పుట : 654

43 సం. భాగ. 10_12_12

44 సం. భాగ. 7-5-23 శ్రీధరవ్యాఖ్య

45 సూర్ ఔర్ పోతనా కే కావ్యమే భక్తితత్త్వ; పుట : 193

46 శాండిల్యభక్తిసూత్రములు; సూ: 2

47 నారదభక్తిసూత్రములు; సూ: 2

48 భక్తిరసాయనము; 1-32, 33, 34

49 ఆం. భాగ. దశమ. పూ. భా. 966

50 ఆం. భాగ. దశమ. పూ భా. 985

51 ఆం. భాగ. దశమ. పూ. భా. 986

52 ఆం. భాగ. దశమ. పూ. భా. 989

53 ఆం. భాగ. దశమ. పూ. భా. 991

54 ఆం. భాగ. దశమ. పూ. భా. 1008; 1010 నుండి 1015 వఱకు

55 సం. భాగ. 10 30_5 నుండి 9 వఱకు

56 పోతన; పుట : 52

57 ఆం. భాగ దశమ. పూ. భా. 1019 నుండి 1024 వఱకు

58 సం. భాగ. 10-30-15 నుండి 23 వఱకు

59 ఆంధ్రమహాభాగవతము - భక్తితత్త్వోన్మీలనము; పుట : 758

60 భాగవతవిషసర్పం; పుట : 253 నుండి 257 వఱకు

61 రాసపంచాధ్యాయి అను కృష్ణలీలాదర్శనము, 'రసికప్రియ' భూమిక; పుట : xxiv

62 సం. భాగ. 10-29-1 శ్రీధరవ్యాఖ్య

63 ఆంధ్రమహాభాగవతము - భక్తితత్త్వోన్మీలనము; పుట : 800

64 నారదభక్తిసూత్రములు; సూ : 82

65 దేవపూజారహస్యము; పుట : 33

66 ఆంధ్రమహాభాగవతము - భక్తితత్త్వోన్మీలనము; పుట : 668.

67 సం. భాగ. 10-3-11

68 ఆం. భాగ. దశమ. పూ. భా. 970

69 సం. భాగ. 10-29-13

70 సం భాగ. 10-74-34 నుండి 37 వఱకు; శ్రీధరవ్యాఖ్య.

—

## పంచమాధ్యాయము

# కవిత్వ తత్త్వము

భిన్నమైన అభిరుచులు, దృక్పథములు, స్తోమతలు కలిగిన సుప్రతిష్ఠితులైన యిరువురికవుల కృతులను తులనాత్మకముగ పరిశీలించునపుడు కావ్యాంగములగు ఏయే యంశములందెవరెవరెట్టి ప్రతిభాపాటవములను ప్రదర్శించిరో విశ్లేషించిచూపుట సమంజసము గాని, ఎల్లయెడల నొకనిని హెచ్చుగను మరొకనిని క్రిందుగను నిర్ణయించి చూపవలయుననుకొనుట పొరపాటు భిన్నజాతులకుచెందిన రెండు స్వాదు ఫలముల రసమునాస్వాదించిన వ్యక్తి వాటి వాటి రుచిభేదములనుగూర్చి చెప్పగలడేగాని ప్రథమ ద్వితీయ స్థాన నిర్ణయము చేయుటకు పూనుకొనడుగదా. కావ్యహేతువులైన ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములిరువురిలో సమానముగావు. అందుచే ఇతివృత్తము సమానమైనను వారివారి యభిరుచులనుబట్టియు, లక్ష్యములనుబట్టియురచనాపథకములనుబట్టియు, కవిత్వతత్త్వము కవితాచిత్రణము విభిన్నముగానుండుటయు, తదనుగుణముగ వారి సామర్థ్యమభివ్యక్తమగుటయు సంభవించుచుండును. కావున సంస్కృతాంధ్రభాగవత కర్తలైన వ్యాస, పోతనల కవిత్వతత్త్వమును పరిశీలించునపుడు వ్యాసుడు పోతనకంటె సమర్థుడనిగాని, పోతన వ్యాసునిమించిన మహాకవియనిగాని వ్యక్తీకరించుట యిందలి ప్రధానోద్దేశ్యముగాదు. వ్యాస, పోతనల యభిరుచి, లక్ష్యము, ప్రణాళికలలోని సామ్యభేదములను పరిశీలించి తదనుగుణముగా ఇరువురి కవిత్వతత్త్వమును పాఠకుల ముందుంచుటకిందు ప్రయత్నము గావింపబడినది. వీరిరువురును తమ హృద్గతభావముల నతిస్పష్టముగ చక్కగ, వారి కవితాఝరణిలో పాఠకులముందుంచగలిగిన సామర్థ్యము, నేర్పు గలవారనుటలోనెట్టి విప్రతిపత్తియులేదు.

వ్యాసుడు పౌరాణికుడు. పోతన కవి, పౌరాణికుడు. వ్యాసునిరచన పురాణరచన, పోతనరచన ప్రబంధచ్ఛాయలో సాగిన పురాణరచన ఈతని రచనపై ప్రబంధ లక్షణములు ప్రభావము చూపుటకీతడు పురాణ ప్రబంధయుగములకు మధ్యకాలమునకు చెందినవాడగుట కారణము కావచ్చును, ప్రధానముగా పురాణములు మిత్రసమ్మితముగా నీతి ధర్మములను ప్రతిష్ఠించుచుండును. కావ్యములు, కాంతాసమ్మితములై రసాత్మకముగా నీతిధర్మములనభివ్యక్తమొనర్చును. కావున కేవల పురాణమునకంటె కావ్యలక్షణలక్షితమైన పురాణమున రసముపరిపుష్టమై యుండును. పురాణమున వర్ణనల

కంతగా ప్రాధాన్యముండదు. ప్రబంధమున అష్టాదశవర్ణనలన్నియు కానరాకున్నను వీనికధిక ప్రాధాన్యము కలదు. కావున పురాణములకంటె ప్రబంధధోరణిలో సాగిన పురాణములు వర్ణనాబహుళములనుట సత్యదూరముకాదు, పురాణమున ధర్మమును సుబోధకమొనర్చుటకే అలంకారముల కూర్పు. ప్రబంధముల రసాభివ్యంజకమైన ఆలంకారికరచన అనివార్యము. ముఖ్యముగా కావ్యకర్త రసానుభూతి, చమత్కృతి ప్రయోజనముగా రచన సాగించుచుండును. వక్తవ్యాంశము స్ఫుటముగా పాఠకునకు, శ్రోతకునవగాహనమొనర్చుటయే పురాణరచనలోని ప్రధానోద్దేశ్యము. పర్యాలోచన చేయగా కేవలపురాణమునకును, ప్రబంధచ్ఛాయలో సాగిన పురాణమునకును కవితాపరమైన భేదములనేకములు గలవనుట స్పష్టము. ఈ లక్షణములాధారముగా పురాణరచనాచతురుడైన వ్యాసునకు, కావ్యకళావైభవసంపన్నుడై పురాణానువాదకుడైన పోతనకు, కవిత్వతత్త్వమునగల సామ్యభేదములెట్టివో విశదము కాగలవు.

వ్యాసుడు ప్రధానముగా జ్ఞానయోగి, పోతన భక్తియోగియని చెప్పవచ్చును. వ్యాసుని రచనలో తత్త్వము ముందుగాను, దానివెనుక భక్తియు కవితావిలువలును వ్యక్తీకరింపబడుచుండును. పోతన రచనలో మున్ముందుభక్తియు కావ్యకళావిలువలును, తదనంతరము తత్త్వప్రబోధము స్ఫుటమగుచుండును. వీరిరువురి రచనలలోనిట్టి స్థూలమైన అభిరుచి, లక్ష్యముల భేదమువలన వ్యాసుని దశమస్కంధము పోతన చేతిలోనేవిధముగా విస్తృతినందెనో, మార్పునొందెనో, రెండవయధ్యాయములో సోదాహరణముగా చర్చింపబడినది.

రచనా పథకమునందును, లక్ష్యమునందును, తదితరములందును, వ్యాస పోతనలలో భిన్నత్వము కానవచ్చుటనుబట్టి యిరువురి కవితాశిల్పమునణువణువున సరి పోల్చిచూచుటయు, ఒకనిని మహాశిల్పిగాను, ఇతరుని సామాన్యునిగాను పరిగణించుటయు సమంజసముగాదు. వీరిరువురును మహాశిల్పులనుట యథార్థము. భిన్నదృక్పథములతో వీరిరువురు వెలయించిన కవితాశిల్పములందలి రమణీయత స్థూలముగానిందు చర్చింప బడును.

## కథాకథన శిల్పము

భగవత్కథాగానలోలుడగు పోతనదృష్టిలో మూలమునందలి కథలన్నియు ప్రధానమైనవైనందున మూలానువాదముల రెండింటనితివృత్తము కొంచెమించుమించు సమానముగానున్నదని చెప్పవచ్చును. మూల మునందలి ८१వ యధ్యాయములో

బలరామకృష్ణులకు వసుదేవుడు బ్రహ్మతత్త్వమును వివరించుట మాత్రమనువాదమున కానరావున్నదనియు, విడువబడుటకూహింపబడిన కారణములు పరిత్యక్తాంశములను ఉపవిభాగమున చర్చించుటజరిగినది. మూలాతిరిక్తముగ క్రొత్తయుపాఖ్యానములు చేరకున్నను, ఆయాకథలలోని భక్త్యంశములు భక్తకవియైనపోతనయొక్క పారవశ్యముచే మూలాతిశయముగ విస్తృతినందినవి. కావున నాయా భక్తులకథలు మూలాతిరిక్తముగ ననువాదమున పెరుగుటయు, సర్వజనామోదమునందుటయు, సంభవించినది. అనువాదమునందలి విస్తృతిపరకములైన యమూలకములనుగూర్చియు లోగడ వివరించుట జరిగినది.

దశమస్కంధేతివృత్తమును పూర్వోత్తరభాగములుగా విభజించుటలోను, అధ్యాయములుగా విభజించుటలోను, వీరిరువురి భిన్నమార్గములనుగూర్చి గడచిన యధ్యాయములలో చర్చింపబడెను. దీనివలన వ్యాస పోతనలు తీర్చిదిద్దిన కథాకథన శిల్పముల స్వరూపము వ్యక్తమగుచున్నది. వ్యాసుడు పురాణప్రవచనమునకనువుగా అధ్యాయవిభజనము గావించుటయు, కావ్యకథాకథనపద్ధతిననుసరించి పోతన దీనిని విడచుటయు, వారెన్నుకొనిన ప్రక్రియాభేదమువలననే. పూర్వోత్తరభాగ విభజనములో కాననగు భేదమువలన పురాణకథను ప్రబంధచ్ఛాయకనుగుణముగా విభజించుకొనుటలో పోతన ప్రదర్శించిన నేర్పు స్పష్టమగుచున్నది.

మూలముననాయా కథలను పాఠకులముందుంచునపుడు 'రాజోవాచ' 'శ్రీశుక ఉవాచ' ఇత్యాదిగా పరీక్షిత్తు ప్రశ్నించుచున్నట్లును శుకుడు సమాధానము చెప్పుచున్నట్లును పలుమారులు నడుమ నడుమ పేర్కొనుటజరిగినది. ప్రశ్నోత్తరరూపమైన కథాకథనము మూలానువాదముల రెండింటను సమానమైనను ఇట్టి ప్రశ్నోత్తరములడుగడుగున కానవచ్చిన కథాగతికి, రసాస్వాదనకు అంతరాయము కల్పగలదను తలంపుతో పోతన కొన్ని తావులందీ పృచ్ఛకుని, సమాధానకర్తనునుటంకింపకయే కథను నడుపుట కన్పట్టుచున్నది. పురాణము ప్రబంధచ్ఛాయలలో సాగుటవలనవచ్చిన మార్పుగా దీనిని తలంపవచ్చును.

దశమస్కంధమునందేగాక సంపూర్ణభాగవతమునందలి కథలలో ముఖ్యాతిముఖ్యమైనది రుక్మిణీకల్యాణము. దీనికి మూలమునుమించిన సర్వజనీనత కలుగుటకు, నిత్యపారాయణఘట్టమై యలరారుటకు, దీనిని పఠించిన యవివాహితలకు వివాహము కాగలదను ప్రశస్తి యేర్పడుటకు, ఇందలి కథాకథనశిల్పరామణీయకము కారణమనుట అతిశయోక్తికాదు. డా. ధూళిపాళ శ్రీరామమూర్తిగారుకూడ. ఇట్టి యభిప్రాయమునే వ్యక్తీకరించినారు.

వధూవరులందు బాహిరమగు అనురూప్యమేగాక ఆంతరమైన అనురూప్యము సహితము అత్యంతావశ్యకమనియు, అట్టి వివాహబంధమెల్లరకు నానందదాయకము కాగలదనియు ఈకథయందలి రహస్యము. పోతన రుక్మిణీకల్యాణకథలో ఈ రహస్యమంతట వ్యక్తమగుచుండును. రుక్మిణీకృష్ణుల అనురూప్యమును పలుతావులందు పలుపాత్రలచే సుస్పష్టముగా పోతన చెప్పించినాడు. మూలమునవింతస్పష్టముగా వ్యక్తీకరింపబడలేదు. "ఈకథలోని రహస్య మేమి? ఇది యిట్లు జరుగుటకు హేతువేమి? ఈ ప్రశ్నలకు సమాధానము కథాకథనమందున్నచో నది శిల్పలక్షణమగును."[2] అను సిద్ధాంతమునుబట్టి పరిశీలించినచో పోతన రుక్మిణీకల్యాణఘట్టము సంపూర్ణమైన కథాకథనశిల్పలక్షణముతో నలరారుచున్నదని విదితమగుచున్నది.

బాహిరరూపలక్షణములను చూచి యన్యోన్యాకర్షితులై యదియే వివాహమునకు కావలసిన ప్రేమలక్షణమని భావించు నేటి యువతీయువకులకు రుక్మిణీకల్యాణకథా రహస్యము చక్కని కనువిప్పు కలిగించగలదు.

రుక్మిణి తన మనములోగల శ్రీకృష్ణగతానురక్తి తనతండ్రికి విన్నవించవచ్చునుగదా! తండ్రికి విన్నవించక బ్రాహ్మణుని కృష్ణునిచెంతకు పంపనేల? అను ప్రశ్నకు మూలమున సమాధానము కానరాదు. అనువాదమున

క. అయ్యా! కొడుకువిచారము
లయ్యయు వారింపఁజాలఁ డటు కాకుండన్
నెయ్యం మెఱిఁగించి చీరుము
చయ్యన నిజసేవకానుసారిన్ శౌరిన్.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 1696

అను సమాధానము కన్పట్టుచున్నది. దీనివలన కథను పఠించునపుడు సాధారణముగా పాఠకునకెట్టి ప్రశ్నలుదయించుచుండునో యూహించి వానికి సమాధానములు పొందుపరుచుచు కథను ప్రశాంతనదీప్రవాహమువలె సాగించుట పోతనప్రత్యేకత.

బ్రాహ్మణుడు శ్రీకృష్ణునకు రుక్మిణీసందేశమును వినిపించినపిమ్మట మూలమున కానరాని రుక్మిణీరూపవిలాసవర్ణనమనువాదమున గావించినాడు.[3] ఇది కథకు మరింత పుష్టిని కలిగించినది. రుక్మిణిని లోగడ శ్రీకృష్ణుడు చూచియుండనికారణమున ఆమె సందేశముచే మనోభావమవగతమైనను రూపురేఖలనుగూర్చి తెలుసుకొనవలెననుతలంపు

కలుగుట సహజము. శ్రీకృష్ణుడు ప్రశ్నింపకయే బ్రాహ్మణుడు తనకుతానుగా రుక్మిణిని వర్ణించుటచే నాతనికీమెపైగల యనురాగమునకుద్దీప్తిని కలిగించుటకు, వెంటనే ప్రయాణమునకు సన్నద్ధుడగుటకును, సహకరించినది. అంతియేగాక వివాహసంధాన కర్తగా వచ్చినవాడు వధువు రూపురేఖావిలాసములనుగూర్చి వివరించవలసిన అవసరమెంతేని కలదుగదా! బ్రాహ్మణుడు రుక్మిణినొక దేవతగాభావించి పాదములనుండి తలవఱకు వర్ణించెనేగాని మానవవర్ణనమువలె తలనుండి పాదములవఱకు వర్ణించలేదు. కావున వరునియెదుట నితరునిచే వధువుయొక్క అంగప్రత్యంగవర్ణన చేయించుట అనౌచిత్యముగా భావింపనవసరములేదు. రుక్మిణిలోని యాత్మనివేదనాసక్తి మూలమునుమించి యనువాదమున సువ్యక్తమొనరింపబడినది. రుక్మిణీకల్యాణకథను పోతనగారు రమణీయ శిల్పాభిరామమైన భాగవతహారతరళమువలె తీర్చిదిద్దినారు.

మిక్కిలిప్రశస్తమై ప్రధానముగా పాఠకులదృష్టినాకర్షించు దశమస్కంధాంతర్గత ఘట్టములలో మరియొకటి కుచేలోపాఖ్యానము. 'తస్య భార్యా కుచైలస్య క్షుత్క్షామా చ తథా విధా' అని మూలమున నొకానొక బ్రాహ్మణునకు కుచేలత్వము విశేషణముకాగా అనువాదమున నాతనినామము కుచేలుడైనది. మూలమునందలి యధ్యాయాంతగద్యలలో 'శ్రీదామచరితేఽశీతితమోఽధ్యాయః' 'పృథుకోపాఖ్యానం నామైకాశీతితమోఽధ్యాయః' అని కన్పట్టుచుండగా అనువాదమున కుచేలోపాఖ్యానమగుట గమనించవలసియున్నది.

క్షుత్క్షామములచేకూడియు తనకుతానబ్బనట్టి కాసుతోనే కాలక్షేపముచేయు తత్త్వముగలవాడు కుచేలుడు. అతని భార్యయునట్టిదియే. తమ దారిద్ర్యనిర్మూలనమునకు శ్రీకృష్ణునివద్దకు వెళ్ళవలసినదిగా నామె యేల ప్రోత్సహించెను? కుచేలుడేల పయనమయ్యెను? అను ప్రశ్నలకు మూలమున సమాధానము మృగ్యము. శిశువులాకటి చిచ్చుచేఁ గృశించి మలమలమాడుచు మానసంబెరియంగఁ బట్టెఁడోరెము మాకుఁబెట్టుమనుచుఁ బ్రతఖాజనధృతపాణులై కుచేలుని పత్నిని చేరి వేడుట[4] అనువాదమున కానవచ్చుచున్నది. బిడ్డలదైన్యము ఆమెను కదలించగా ఆమెదైన్యముతోబాటు, దానికి హేతుభూతమైన బిడ్డలదైన్యముకూడ తోడగుటచే నాభావత్రివతచే నామెకుచేలుని కదలించినది.కావుననామె శ్రీకృష్ణునిచెంతకు వెళ్ళవలసినదిగా కుచేలుని ప్రోత్సహించుటయునాతడు ప్రయాణమగుటయు సంభవించినది.వ్యాసుడు పురాణధోరణిలో మిత్రసమ్మితముగను, పోతన కావ్యధోరణిలో కాంతాసమ్మితముగను, రసపుష్టిగను కథను నడిపినారనుటకీ ఘట్టముదాహరణము కాగలదు.

బహుసంతానమువలన బాధలు కలుగుననియు, సంతానభారమధికమైన వ్యధ

భరింపలేమనియు ప్రస్తుతఘట్టమునందు వెల్లడియగుచున్నది. ఇది భారతజనులకెల్ల ప్రబోధాత్మకమైన, సందేశాత్మకమైన ఘట్టమనుట నిర్వివాదము. సఖ్యమునకు సంపదలడ్డుగోడలు కావనుట ఈ కథయందలి రహస్యము. ఇది మూలమునకంటె అనువాదమున చక్కగా వ్యక్తీకరింపబడినది. మూలమున కుచేలుడు శ్రీకృష్ణుని దర్శింప బోవుచు "కృష్ణసందర్శనం మహ్యం కథం స్యాదితి చిన్తయన్"అని సందేహాస్పదుడు కాగా, అనువాదమున కుచేలుడు 'అతడేలనన్నునుపేక్షించు నేటిమాటలనుచు నాద్వారకా పురమపుడు సొచ్చి' అని మిత్రునిపై సంపూర్ణవిశ్వాసమును చూపినాడు. సంపదలు వారిరువురకుమధ్య దూరమును పెంచునను తలంపుతో శ్రీకృష్ణుడు సంపదలనొసగి యుండడని కుచేలుడు తన పురంబునకరుగుచు తలంచుటయు, సంపదలనొందినను పూర్వమువలెనే కృష్ణునియందు సఖ్యభక్తిభావముతోనుండుటయు, పై రహస్యమునే సువ్యక్తమొనరించుచున్నవి. అతిథినెట్లు సత్కరింపవలెనో, బాల్యసఖునెట్లు సంభావింప వలెనో లోకమునకు వ్యాస ,పోతనలు తమ కథాకథనసామర్థ్యమున వివరించిరి, దారిద్ర్యమున మనోనిగ్రహమవసరమనుటయు విశదపఱుపబడినది.

పర్యాలోచనచేయగా వ్యాస, పోతనలిరువురును తమ ప్రణాళికలననుసరించి కథాకథననిపుణులైనను కథారహస్యములను మరింత స్పష్టపఱచుటలోను, పాఠకుల కుదయించు ప్రశ్నలకు ముందుగనే సమాధానములొసగుచు ప్రశాంతగంభీరముగా రసవంతముగా నుపాఖ్యానములను నడుపుటలోను, పోతన మరింత నేర్పును ప్రదర్శించి నాడనుటలో సందేహములేదు. కావున "తెలుగు దేశములో బమ్మెర పోతన గారి ఆంధ్రమహాభాగవతమవతరించిన తరువాత మూలమునందలి యుపాఖ్యానములకు సార్వజనీనమైనవ్యాప్తి చేకూరినదనుట అతి శయోక్తికాదు "[5] అను శ్రీమధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి పల్కులు సమర్థనీయములగుచున్నవి.

## వర్ణనాశిల్పము

'వస్తుస్వరూపస్వభావములను రెంటిని సూక్తిసుందరముగా ప్రపంచించుటయే వర్ణనలక్షణము'[6] అను సిద్ధాంతమునుబట్టి పరిశీలించినచో స్తుస్వరూపస్వభావములను ప్రపంచించుటలోను సహజసుందరముగా పాఠకుల ముందుంచుటలోను వ్యాస, పోతనలు తమతమ ప్రజ్ఞాపాటవములను ప్రదర్శించుటచే వర్ణనాశిల్పమునకు రూపుదిద్దుటలోనిరువురును సిద్ధహస్తులనియే చెప్పవచ్చును. కాని

మహాకావ్యధోరణిలో భాగవతపురాణరచనసాగించిన పోతనకును, మహాపురాణరచనా కౌతూహలుడగు వ్యాసునకును ఆయావర్ణనలు పొందుపఱచుటలో చాలభేదముండుననుట స్పష్టము. 'నగరార్ణవశైలర్తుం చంద్రార్కోదయవర్ణన' మిత్యాద్యష్టాదశ వర్ణనా బాహుళ్యముతో విలసిల్లునది మహాకావ్యమని యాలంకారికుల తలంపు. మహాపురాణ రచనకిట్టి వర్ణనాపరమైన నియమములు కన్పట్టవుగదా! కావున నాయా సందర్భానుగుణ ముగా మూలమునకానరాని వర్ణనలుకొన్ని యనువాదమున ప్రవేశించియు, కొన్ని విస్తృతములయ్యు, రసపుష్టికి మిక్కిలి దోహదకారులగుచున్నవి. పెంపుదలపొందిన తావులు విచక్షణారహితముగను, వ్యామోహముతోను, పెరిగినవికావనియు, ఆపెంపుదల సందర్భోచితముగను, కథానుగుణముగను, సాగినదనియు నిష్కర్షగా చెప్పవచ్చును.

## నగరవర్ణనము

కంసునిపంపునక్రూరుడు తీసుకొనిరాగా బలరామకృష్ణులు మథురానగరమున ప్రవేశించుసందర్భమున మూలానువాదముల రెండింటను మథురానగరవర్ణన కానవచ్చు చున్నది. ఈపట్టున మూలమున

శ్లో. దదర్శ తాం స్ఫాటికతుంగగోపుర
ద్వారాం బృహద్ధేమకపాటతోరణామ్ ।
తామ్రారకోష్ఠాం పరిఖాదురాసదా
ముద్యానరమ్యోపవనోపశోభితామ్॥

— సం. భాగ. 10-41-20

ఇత్యాదిగా నాల్గుశ్లోకములలో నుండగా అనువాదమున

మ. పరిఘల్ కోటలు కొమ్మలున్ బడగలున్ ప్రాసాదముల్ వీథులున్
హరులున్ దేరులువీరులున్ గజములున్ హర్మ్యంబులున్ వాద్యముల్
తరుణుల్ ధాన్యములున్ ధనంబులు మహోద్యానంబులున్ దీర్ఘికల్
కర మాశ్చర్యరుచిం దనర్చు మథురన్ గాంచెన్ విభుండంతటన్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1243.

అను నొక్కపద్యములో కన్పట్టుచున్నది.

జరాసంధుడు మథురానగరమును ముట్టడించునపుడు మూలమున 'యదు రాజధానీం మథురాంన్యరుణత్సర్వతోదిశమ్' అనిమాత్రమే యుండగా అనువాదమున "నిరంతరకిసలయపత్రకోరకకుసుమఫలభార వినమిత

వృక్షవిలసితమహోద్యానంబును; ఉద్యానవనభాగవలమాన జలో న్నయనదారుయంత్రలతానిబద్ధకలశవిముక్తసలిలధారాశీకరపరంపరా. సంపాదిత వర్షాకాలంబును ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... పరులకు నలక్షితంబైన మధురానగరంబు"

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1528.

అని శత్రుదుర్భేద్యమైన మధురానగర వైభవవర్ణనము కానవచ్చుచున్నది. వారి వారి చిత్తవృత్తులనుబట్టి భిన్నరీతిలో నొకేనగరము వర్ణింపబడుట యందు గమనింపదగియున్నది.

కృష్ణనియోగమున సముద్రములో విశ్వకర్మ ద్వారకానగరమును నిర్మించినపు డొకమారును, శ్రీకృష్ణమహిమనరయుటకు నారదుడేతెంచిన సందర్భమునందు మరియొక పర్యాయమును, మూలానువాదములందు ద్వారకానగరవర్ణనము కానవచ్చుచున్నది. మూలమునందలి తొలివర్ణనము

శ్లో. ఇతి సమ్మన్త్ర్య భగవాన్ దుర్గం ద్వాదశయోజనమ్ ।
అంతఃసముద్రే నగరం కృత్స్నాద్భుతమచీకరత్ ॥

- సం. భాగ. 10-50-50

ఇత్యాదిగా ఎనిమిదిశ్లోకములలోనుండగా అనువాదముననతివిస్తృతముగ.

వ. సముద్రునడిగి సముద్రమధ్యంబునఁ బండ్రెండు యోజనంబుల నిడుపు నంతియ వెడల్పుం గల దుర్గమప్రదేశంబు సంపాదించి తన్మధ్యంబునం గృష్ణుండు సర్వాశ్చర్యకరంబుగ నొక్కనగరంబు నిర్మింపుమని విశ్వకర్మంబంచిన

ఆ. వరుణపురముకంటె వాసవుపురికంటె
ధనదుపీటికంటె దండధరుని
నగరికంటె బ్రహ్మనగరంబుకంటెఁ బ్ర
స్ఫుటముగాఁగ నొక్కపురముఁ జేసె.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1589నుండి1611

మొదలుగా సుమారు 22గద్యపద్యలలో అమూలకభావసంపదతో కానవచ్చుట ప్రశం సార్హము. మలివర్ణనముసహితమతివిస్తృతమైనది. పోతనగారి యానగరవర్ణనములు

అనంతరప్రబంధకవులకు మార్గదర్శకములైనవనవచ్చును. ఇందునతిశయోక్తులు, నుత్ప్రేక్షలు నధికముగానుండుట వీరి నగరవర్ణనలలోని విశేషలక్షణముగా నిర్ధారింపవచ్చును.

సీ. నరనాథ! విను భువనప్రసిద్ధంబుగ
దీపించునట్టి విదేహదేశ
మందు భూకాంతకు నాననదర్పణం
బనఁ దనర్చిన మిథిలనుపురమునఁ

— ఆం. భాగ. దశమ. ఉ. భా. 1173

అనురీతిని మిథిలానగరమనువాదమున దర్శనమీయగా మూలమున

'స ఉవాస విదేహేషు మిథిలాయాం గృహాశ్రమీ'

- సం. భాగ. 10-86-14.

అనిమాత్రము కలదు. ఈ చిన్న వర్ణనమునసహితముత్ప్రేక్షను కూర్చుటను గాంచినచో పై యభిప్రాయమును మఱింత దృఢపఱచుచున్నది.

పురవర్ణనములేగాక గ్రామప్రాంతములును సహజసుందరరీతిలో వర్ణింపబడిన వనుటకు దశమస్కంధమందంతటను కన్పట్టు ఘోషసౌందర్యవర్ణనమే చక్కని తార్కాణముకాగలదు. పూర్వభాగములోనత్యధికభాగమీ నందగోకులము, గోవత్సములు, గోవులు, గోధూళి, పచ్చికబయళ్ళు మున్నగునవియేగదా దర్శనమిచ్చునవి. ఈ వ్రజవర్ణన మూలమున వర్ణింపబడినను, అనువాదమున పూర్తిగా తెలుగుపలుకుబడితో వర్ణింపబడుటచే పోతనవర్ణనాశిల్పము పూర్తిగా దేశీయమైనదని చెప్పవచ్చును. నాటినుండి నేటివఱకు వెలసిన పల్లెపట్టుల వర్ణనలపై కొలదిపాటిగానైనను పోతన దశమస్కంధములోని ఘోషవర్ణనయొక్క ప్రభావముండుననుటలో అతిశయోక్తిలేదు. పరమభక్తుడగు పోతన పరమాత్మసంచరించిన ప్రాంతమును వర్ణించునవకాశము లభించినంతనే తన్మయుడై వర్ణించుచుండుననుటకక్రూరుడు కంసునిపంపున నంద గోకులమునకుపోవు సందర్భమునందలి యమూలకమైన ఘోషవర్ణనమే ప్రబలోదాహరణము. ఈవిధముగా పల్లీజీవితమును, నగరప్రాంతములను అత్యంతసహజరీతిలో వర్ణించి పోతన యనంతరకవులకు మార్గదర్శకుడైనాడు.

## చంద్రార్కోదయాస్తమయవర్ణనములు

అక్రూరునితో మథురకేతెంచిన రామకృష్ణులు మథురాపురంబున విహరించి విడిదలకుంజనిన యనంతరము

మ. గగనారణ్యచరాంధకారగజమున్ గాలాహ్వయవ్యాఘ్రముఁ డ
చ్చ్యుగఁ బట్టం గమకించి మచ్చిడుటన్నై చూతాంకురశ్రేణిచే
నొగిఁ గల్పించిన కందుకం బనఁగ సూర్యుం డంత వీక్షింపఁగాఁ
దగె మందప్రభతోడఁ బశ్చిమమహాధాత్రీధరేంద్రంబునన్.

- ఆం భాగ. దశమ. పూ. భా. 1287 నుండి 1294 వఱకు.

ఇత్యాదిగా ఎనిమిదిపద్యములలో సూర్యాస్తమయకాలము వర్ణితమైనది. అనంతరము,

సీ. ప్రాచీదిశాంగనాఫాలతలంబున
దీపించుసిందూరతిలక మనఁగ

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1295.

మొదలుగాగల సీసపద్యమునందును, ఒక కందపద్యమునందును, చంద్రోదయము వర్ణితమైనది. భావికథార్థసూచకములై కథకు పరిపుష్టికలిగించు నీవర్ణనలకు మూలము కానరాదు. మూలముననీపట్టున 'ఆదిత్యోఽస్తముపేయివాన్' అనిమాత్రము కలదు.

నిజానుచరులను రామకృష్ణులు చంపుటవిని కంసుడు మరణహేతుకభీతిచే చింతాక్రాంతుడై నిద్రచెందక వేగించుచున్నసమయమున

క. అరుణహరినఖరవిదళిత
గురుతిమిరేభేంద్రకుంభకూటవినిర్ము
క్తరుధిరముక్తికములక్రియ
సురపతిదిశఁ గెంపుతోడఁ జుక్కలు మెఱసెన్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1302 నుండి 1305

ఇత్యాదిగా పోతన నాల్గుపద్యములలో సూర్యోదయవర్ణనము గావించినాడు. దీనికి "సూర్యేచాద్భ్యః సముత్థితే" అనిమాత్రమే మూలమున కలదు. ఇట్లు మూలమున కానరాని చంద్రార్కోదయాస్తమయాదులనువాదమున పోతన విశిష్టభావుకతచే ప్రవేశించి మూలముకుమించిన సొగసులను సంతరింపజేయుచున్నవి.

రాసక్రీడాప్రారంభఘట్టమున శరత్కాలమునందలి యొకానొక పూర్ణిమనాటి చంద్రోదయవర్ణనము

శ్లో. తదోడురాజః కకుభః కరైర్ముఖం
ప్రాచ్యా విలింపన్నరుణేన శంతమైః ।
స చర్షణీనాముదగాచ్ఛుచో మృజన్
ప్రియః ప్రియాయా ఇవ దీర్ఘదర్శనః ॥

శ్లో. దృష్ట్వా కుముద్వన్తమఖండమండలం
రమాననాభం నవకుంకుమారుణమ్।
వనం చ తత్కోమలగోభిరంజితం
జగౌ కలం వామదృశాం మనోహరమ్॥

– సం. భాగ. 10-29-2,3.

అని మూలమునను

చ. కలువలమేలికందువలు కాముని కయ్యపుఁ బాళెముల్ విర
క్తులు తలడించువేళలు చకోరకపంక్తుల భోగకాలముల్
చెలువలు సైరణల్ విడిచి చిక్కుతఱుల్ ఘనచంద్రచంద్రికా
జ్వలితదిశల్ శరన్నిశలు జారకదుర్దశలయ్యె నయ్యెడన్.

– ఆం. భాగ. దశమ. పూ. భా. 961

ఇత్యాదిగా నాల్గుపద్యములలో నఖండంబైన చంద్రమండలంబుదయించిన విధమనువాదమునను కానవచ్చుచున్నది.

"పోతన నైదారు పద్యములలో మూలభావమునకుఁ దోడు స్వతంత్రకల్పనలను జేర్చి యీ వర్ణనమును బెంచినను మూలమునందలి శోభ రాలేదు. 'వనంచ తత్కోమలగోభిరంజిత'మ్మను మాటయందలి సొగసును తెనుగున నింతవర్ణించినను రాలేదు. ఈభావమునే పోతన వదిలినాడు"[7] అని పై చంద్రవర్ణనమును గూర్చి శ్రీరామమూర్తిగారి యభిప్రాయము కాని యనువాదమునందలి చంద్రోదయము రాబోవు కథకనుగుణముగ పలువిధముల మన్మథోద్దీపకమైనవిధము గమనించవలసియున్నది. మూలమునందలి చంద్రోదయవర్ణనమున నీయుద్దీపకత కానరాదు. కావున మూలానువాదములు రెండును ప్రశంసార్హములని భావించుట సమంజసము కాగలదు. "ఈ ప్రకృతి వర్ణనము లాలంకారికములును, గుణసమయానుగుణములును సహజములునై

మిక్కిలి ప్రౌఢములుగా నున్నవి''[8] అను అకాడమీ భాగవతప్రతి సంపాదక వర్గమువారి పల్కులిట నుటంకింపదగియున్నవి.

## వనవర్ణనము

గోపికలతో శ్రీకృష్ణుడుసలిపిన రాసలీలాసందర్భమునను, గోపికలరణ్యమున శ్రీకృష్ణునివెదకు సందర్భమునందును, యమునానదీజలసమేధిత పాదపపల్లవప్రసూన దళవిరాజితంబగు వనముకు పాతకులమనంబులు మేరదప్పునట్లు ప్రదర్శించెననుటలో నాశ్చర్యములేదు. ఈవర్ణన మూలానువాదముల రెండింటను కానవచ్చుచున్నను పోతన చూపిన శోభ మూలాతిశయముగ నానందాతిశయమును కలిగించుచున్నది. శ్రీకృష్ణుడు గో, గోప, గోవత్సములతో వనప్రాంతముల సంచరించుసందర్భమునను, గోపబాలురతో కలసి చల్దులారగించుసమయమునను, వత్సాసురాద్యనేకులను సంహరించునపుడును, గో, గోప సంఘమును కార్చిచ్చు చుట్టుముట్టినపుడును, తదితర సందర్భములందును కథామిశితమైన వనవర్ణన గానవచ్చుచున్నది. ప్రకృతివర్ణనానిపుణుడగు పోతన వన సౌందర్యమును ప్రదర్శించుటలో మూలమునకు మెరుగులుదిద్దినాడనుట సత్యదూరము గాదు భక్తకవులకు పరమాత్మ రూపవర్ణనమేగాక ప్రకృతివర్ణనముసహితము ప్రీతి పాత్రము కాగలదు. కావుననే పోతనయనువాదమున ప్రకృతి యత్యంతసహజముగా దర్శనమిచ్చినది.

## ఋతువర్ణనము

వర్ణనలకు తనరచనలో పుష్కలముగా తావిచ్చిన పోతన మూలమునందాధార మాత్రముగా చూపట్టిన ఋతువర్ణనప్రసంగములను నర్తించుచున్న నెమలిపించమునువలె విస్తరించి వర్ణించియున్నాడు.

బలరామకృష్ణులతోగూడియున్న బృందావనమున గ్రీష్మఋతువుసహితము వసంతఋతు లక్షణములతోనొప్పారుచున్నదని వర్ణించుచు మూలమున గ్రీష్మర్తువును గురించి

గ్రీష్మోనామ ర్తురభవన్నాతి ప్రేయాఞ్ఛరీరిణామ్ ।

-సం. భాగ. 10-18-2

ప్రాణులకు మిక్కిలి యిష్టముకాని గ్రీష్మర్తువు వచ్చెననిమాత్రము కలదు. దీని నాధారముగాగొని పోతన యీక్రిందివిధముగా వర్ణించియున్నాడు.

సీ. దినము లంతంతకు దీర్ఘంబులై చెతోఁ
దిననాథుఁ డుత్తరదిశఁ జరించె
నాఁడునాఁటికి నెండ నవ్యమై ఘన మయ్యె
వెచ్చనిగాడ్పులు విసరఁజొచ్చె
మేదినీ రేణువుల్ మింట సంకుల మయ్యె
నేఱులుఁ గొలఁకులు నిగిరిపోయెఁ
బానీయశాలలఁ బథికసంఘము నిల్చెఁ
జప్పరంబుల భోగిచయము డాఁగెఁ

ఆ. దరులు లతలుఁ గుసుమ దళములతో వాడె
మిథునకోటికి రతి మెండుఁ దోచె
నఖిలజంతుభీష్మమైన గ్రీష్మమురాకఁ
గీలి యడవులందుఁ గేలి సలిపె.

ఆ. వాడిరుచులు గలుగువానివేడిమి గ్రీష్మ
కాలమందు జగము గలయఁబడియె
బ్రహ్మ జనులకొఱకు బ్రహ్మాండఘటమున
నుష్ణరసముఁ దెచ్చి యునిచె ననఁగ.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 714, 715

ఇట్లు గ్రీష్మము జగముతో కలయబడిన సమయమున బృందావనమున వసంతమైన విధము వర్ణించుట, వాడిరుచులుగలుగువాని వేడిమికి గురియైనమానవుడు వాతానుకూలపుగృహము (A. c. room)లో ప్రవేశించుటవంటిది. అప్రియమైన గ్రీష్మమెందువలన నప్రియమో వర్ణింపబడకపోయినచో ప్రియమైన వసంతముతో దానిని పోల్చి చూచుకొనుటకుగాని, వసంతము ప్రియమగుటకుగల కారణముగాని, సువ్యక్తమగునవకాశమంతగా కానరాదు.

గోపికలు కాత్యాయనీవ్రతమాచరించినవిధమునువర్ణించుసందర్భమున మూలమున 'హేమంతే ప్రథమే మాసి' అని హేమంతశబ్దము కనబడినంతమాత్రమున పోతన తన యనువాదమున

క. శామంతికాప్రసగంచిత
సీమంతవతీకుచోష్ణజితశీతభయ
శ్రీమంతంబై గొబ్బున
హేమంతము దోఁచె మదనుఁ డేఁచె విరహులన్.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 796

మొదలగు లొమ్మిదిపద్యములలోని హేమంత ఋతుప్రభావముచే పాఠకులనెల్లనుహుహూ యని వణకించివేసెను. ఈ హేమంతమును మన్మథోద్దీపకముగా వర్ణించి గోపికావస్త్రాపహరణకథకు రసపుష్టిని కలిగించినాడు. హేమంత ఋతుప్రభావమిట్లు జనులనెల్ల వణకించుటచేతనే శ్రీకృష్ణుడెన్నివిధముల చెప్పినను గోపికలు నగ్గలంబైన చలినివలిగొని కంఠప్రమాణజలంబులందుండి బయల్వెడలుటకు డోలాయమానమానసలైరి.

ప్రకృతివర్ణనమును తాత్త్వికచింతనతో జోడించి గావించుట వ్యాసుని వర్ణనాశిల్పమునందలి ప్రత్యేకలక్షణము. కావుననే వ్యాసునిరచనలో తత్త్వము ముందుగాను, దానివెనుక భక్తియు, కవితావిలువలును, వ్యక్తీకరింపబడుచుండునని యితఃపూర్వము నుడువబడినది. ఇందులకు, తత్త్వశాస్త్రలక్షణములను సంతరించుకొనిన వీరి వర్ష, శరదృతువర్ణనములు ప్రబలోదాహరణములు కాగలవు.

శ్లో. తతః ప్రావర్తత ప్రావృట్ సర్వసత్త్వసముద్భవా ।
విద్యోతమానపరిధిర్విస్ఫూర్జితనభస్తలా ॥

శ్లో. సాంద్రనీలాంబుదైర్వ్యోమ సవిద్యుత్ స్తనయిత్నుభిః ।
అస్పష్టజ్యోతిరాచ్ఛన్నం బ్రహ్మేవ సగుణం బభౌ ॥

- సం. భాగ. 10-20-3నుండి25వఱకు.

మొదలగువిధముగా సాగిన వర్షర్తువర్ణనమును తిలకించిన వ్యాసుని తాత్త్వికదృష్టియెట్టిదో స్పష్టముకాగలదు. ఇందువర్షమును సగుణబ్రహ్మముతోను, అపక్వయోగిచిత్తముతోను, గుణహీనునితోను, భక్తుల మనస్సులతోను, సందిగ్ధస్థితిలోనున్న వేదములతోను, పోల్చుట గమనింపవలసియున్నది. ఈధోరణిలోనే వీరి శరదృతువర్ణనయు సాగినది. శరత్కాలమున నీరు స్తిమితముగానుండుటను భ్రష్టుడయినవాడు తిరిగి యోగమును సాధించి మనఃస్థిమితమును పొందుటతోను; శరన్మేఘములను మునుల నిర్మలమైన మనస్సులతోను; జలాశయములలోని నీరు క్రమముగా తగ్గుటను గ్రహింపలేని జలచరములను ఆయువు తగ్గుటను గ్రహింపలేని మూఢులైన సంసారులతోను పోల్చుట, వ్యాసుని అనన్యసాధారణవర్ణనానైపుణ్యమునకు తార్కాణము.

ఈపట్టులందు పోతనయనువాదమున తాత్త్వికదృష్టి కానరాకున్నను కళాత్మకదృష్టి కానవచ్చుచున్నది. పోతన వర్షఋతువర్ణనము సహజసుందరరీతిలో దర్శనమిచ్చుట ప్రశంసార్హము[10]

"వ. ..................చదలు గప్పిన నీలమేఘంబులును, మేఘవిముక్తంబులై జలదసమయవిటుండు సరసగతి ధరణిసతి యురమ్మున దర్పించి నేర్పున సమర్పించు కర్పూరఖండంబులవడువునఁ బుడమిం బడు కరకలును, గరకానుగతంబులై యసితభోగిభోగంబుల భాగున నీలమణిమాలికావిశేషంబుల విధంబున నెడపడక పడు సలిల ధారలును, ధారాధరవిగళిత విమలసలిలంబులం దోఁగు మదజలాభిషిక్తమాతంగంబులసొబగున నుండు కొండలును, కొండలతుదలనుండి గండశైలంబులపైబడి వికీర్యమాణంబులగు గిరినిర్ఝరంబుల శీకరంబులును, శీకరపరంపరలఁ జొదుగులు మదుగులుగొనఁ బిదపిద నగుచుఁ జిదుకుచిదుకు మను రొంపులును ..................."

— ఆం. భాగ. దశమ. పూ. భా. 754.

ఇత్యాదిగా ముక్తపదగ్రస్తాలంకారశోభిత కవితాధారతో నిరంతరసలిలధారలను వర్ణించుట పోతన వర్ణనానిపుణతకు నిదర్శనము. ఇందలి ముక్తపదగ్రస్తమే వాన ఎడతెఱపిలేక కురియుచున్నదను విషయమును వ్యక్తీకరించుచున్నది. వర్షాగమనమందలి యీతని వర్ణనలోని శబ్దములకూర్పుచే కలిగిన ధ్వని వర్షాగమన సమయమందలి ధ్వనియై పాఠకులకు వినబడుచున్నదనుటలో అతిశయోక్తిలేదు. ఈసందర్భముననే

సీ. విశ్వమోహనమైన వేణునినాదంబు
సరసగంభీరగర్జనము గాఁగ.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 759

అను సీసపద్యమున బృందావనమున సంచరించు శ్రీకృష్ణుని బృందావనాకాశవీధియందు చరించు మేఘముగా భావించి వర్ణించినతీరు పోతనభావుకతను వ్యక్తీకరించుచున్నది. ఈవిధముగా పోతనభావనాబలముచే అత్యంతసహజరీతిలో ఋతువర్ణనములనువాదమున ప్రవేశించుట గమనింపవలసియున్నది.

మూలానువాదములందలి ఋతువర్ణనములు వ్యాస, పోతనల యభిరుచుల కనుగుణముగా వెలువడి పరమమనోహరములై పాఠకులనలరించుచున్నవి.

## విరహవర్ణనము

విప్రలంభములేనిదే శృంగారము రాణించనట్లే భగవత్సంయోగమునకంటె వియోగమునందు భక్తిపారవశ్యమధికముగా కలుగుననియు, భక్తులలో భక్తిభావమధిక మొనర్చుటకు పరమాత్ముడే వారికి ఎడబాటును కలిగించుచుండుననియు, లోగడ వివరింపబడినది. గోపికలను పరమవిరహాసక్తలను గావించుటనుబట్టి విరహవర్ణన భాగవతమునందు గానవచ్చినట్లు తదితరములందు లేదనవచ్చును. పరమవిరహాసక్తుడగు పోతన మూలమునందలి గోపికల విరహముతోబాటు తనకు భగవానునితో కలిగిన ఎడబాటువలన కలిగిన దివ్యభావావేశముతో మూలముకంటె ప్రభావోత్పాదకమైనరీతిలో వర్ణించుట కాననగును. గోపికావిరహము పోతన పరిపుష్టముగా వర్ణించినతీరు నవవిధభక్తి మార్గములను వివరించుసందర్భమున స్పష్టపఱుపబడినది.

ఉషాకన్యపొందిన విరహవేదన మూలమున క్రిందివిధముగా ఒక్కశ్లోకముననుండెను.

శ్లో. సా తత్ర తమపశ్యన్తీ క్వాసి కాంతేతి వాదినీ ।
సఖీనాం మధ్య ఉత్తస్థౌ విహ్వలా వ్రీడితా భృశమ్ ॥

— సం. భాగ, 10-62-13.

ఈపట్టుననువాదమునందలి ఉషాకన్య

చ. కలఁ గని యంత మేలుకని కన్నుల బాష్పకణంబు లొల్కఁగాఁ
గలవఁటఁ గాక నిశ్చయముగాఁ గమనీయవిలాసవిభ్రమా
కలితతదీయరూపము ముఖంబున వ్రేలినయట్లు దోఁచినన్
గళవళ మందుచున్ బిగియఁ గౌఁగిటిచే బయ లప్పళించుచున్

- ఆం. భాగ. దశమ. ఉ. భా. 327 నుండి 330.

ఇత్యాదిగా విరహవేదనాదూయమానమానసయై యుండుటయు, నెచ్చెలులు డాయం జనుదెంచిన తన మనంబునబొడము మనోజవికారమును మఱుపెట్టుచు క్రిందవిధముగా నుండుటయు వర్ణింపబడినది.

తరులతాదుల బ్రార్థించినతీరు గమనించిన స్పష్టము కాగలదు.[55] మూలమున గోపికలు తరులతాదుల సామూహికముగా ప్రశ్నింపగాననువాదమున పేరుపేరున పిలచి ప్రశ్నించినవిధానమే పోతనగోపికల భక్త్యావేశమును వ్యక్తమొనరించుచున్నది.

ఉ. నీ వడవిన్ బవల్ దిరుగ నీ కుటిలాలకలాలితాస్య మి
చ్ఛానిధిఁ జూడకున్న నిమిషంబులు మాకు యుగంబులై చనుం
గావున రాత్రులైన నినుఁ గన్నుల నెప్పుడుఁ జూడకుండ ల
క్ష్మీనవర! ఱెప్పలడ్డముగఁ జేసె నిదేల విధాత క్రూరుఁడై.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 1049

శ్లో. అటతి యద్భవానహ్ని కాననం
త్రుటిర్యుగాయతే త్వామపశ్యతామ్ ।
కుటిలకుంతలం శ్రీముఖం చ తే
జడ ఉదీక్షతాం పక్ష్మకృద్దృశామ్ ॥

— సం. భాగ. 10-31-15

శ్రీకృష్ణుని క్షణకాలపు ఎడబాటునుసహితము సహింపలేకుండుట, కన్నులకు ఱెప్పల నడ్డముగానుంచి మనోవల్లభుసమ్యగ్దర్శనమునకు భంగమునుకలిగించిన విధాతను పైవిధముగా దూఱుట వారి విరహతీవ్రతను స్పష్టముచేయుచున్నది. వీరి విరహము పరమాత్మవియోగమునకు తల్లడిల్లు జీవాత్మవిరహమని చెప్పవచ్చునని దివాకర్ల వేంకటావధానిగారు వక్కాణించియున్నారు.[56]

తన్మయత్వమున గోపసుందరులు బృందావనంబునంగల తరులతాదులనడుగుచు, నిరర్గళంబులయిన విపినమార్గంబుల సరోజాతకేతనహలకులిశాంకుశాదిలక్షితంబులైన హరిచరణంబులచొప్పుగని పల్కిన పలుకులను పరికింపుడు.

సీ. ఈ చరణంబులే యిందునిభానన!
సనకాదిమునియోగ సరణి నొప్పు
నీ పాదతలములే యెలనాగ! శ్రుతివధూ
సీమంతవీథులఁ జెన్ను మిగులు
నీ పదాబ్జంబులే యిభకులోత్తమ యాన!
పాలేటిరాచూలిపట్టుకొమ్మ

యాత్రకు వెళ్లుటయు మూలానువాదముల రెండింటను సమానముగానున్నది. రామకృష్ణులు సకుటుంబముగా గ్రహణస్నానంబునకు స్యమంతకపంచకమునకు వెళ్ళినవిధమిట్లు వర్ణింపబడినది. "నిష్కర్ములైన రామకృష్ణులు లోకధర్మానుపాలనప్రవర్తనులై ద్వారకానగరరక్షణంబునకుఁ బ్రద్యుమ్న గదసాంబసుచంద్రశుకసారణానిరుద్ధకృతవర్మాదియోధవరులనియమించి, యక్రూరవసుదేవోగ్రసేనాదిసకలయాదవులుం గాంతాసమేతులయి, స్రక్చందనాభరణవస్త్రాదులు ధరియించి, శోభనాకారంబులతోడం బుష్పకవిమానంబులనం బోలుచు నరదంబులను, మేఘంబులనను కరించు గజంబులను, మనోవేగంబులయిన తురంగంబులను నెక్కి, వియచ్చరులం బురుణించు పురుషులు దమ్ము సేవింపం జని........"

- ఆం. భాగ. దశమ. ఉ. భా. 1035

ఈ వర్ణనము మూలమునందును ఈవిధముగానే కానవచ్చుచున్నది.

## యుద్ధవర్ణనము

దుష్టశిక్షణ శిష్టరక్షణకొఱకునవతరించిన శ్రీకృష్ణుడు దుర్మార్గనిర్మూలన సందర్భమునందనేక యుద్ధములు గావించవలసియుండును. దశమస్కంధమున పలుతావులందీయుద్ధవర్ణన కానవచ్చుచున్నది. వీనిలో శ్రీకృష్ణచాణూరుల మల్లయుద్ధము, సత్యభామ నరకాసురునితోజేసిన యుద్ధము, భీమజరాసంధుల ద్వంద్వయుద్ధము, పేర్కొనదగినవి. మూలమున బలరామకృష్ణులిరువురు ముష్టికునితోను, చాణూరునితోను ఒకేమారు యుద్ధముగావించినవిధము సుమారు ఏడుశ్లోకములలో కానవచ్చుచున్నది. కాని అనువాదమున శ్రీకృష్ణుడు చాణూరునితోగావించిన యుద్ధమొక సుదీర్ఘ వచనమునను, బలరామునకు ముష్టికునకు జరిగిన యుద్ధమొక కందపద్యమునను వర్ణితమైనది. ఇందనేక మల్లబంధవిశేషములు ప్రదర్శింపబడినవి. వీరశృంగారములొకేతావున నభివ్యక్తమగురీతిని సత్యభామ నరకాసురునితోగావించిన యుద్ధము వ్యాసునిచే వర్ణింపబడలేదు. తుల్యబలసంపన్నులగు భీమజరాసంధుల ద్వంద్వయుద్ధము ప్రేక్షకులకు కనువిందు గావించగలదు. ఈయంశమును వాచ్యముగా వ్యక్తీకరించిన మూలముకంటె ధ్వన్యాత్మకముగా వివరించిన పోతనయనువాదము ప్రశంసింపదగినది. మూలమును విస్తృతపఱచి, రసాభివ్యంజకముగా గావించిన యుద్ధవర్ణనములు పోతన దశమ

స్కంధమున లెక్కకుమిక్కిలిగా కలవు. రసస్ఫోరకములైన యుద్ధవర్ణనలు ప్రబంధ రచనకత్యంతావశ్యకములు.

ఈవిధముగా మూలమున కానవచ్చినను, కానరాకున్నను, అష్టాదశవర్ణనలను సందర్భోచితముగా, అత్యంతసహజమనోహరరీతిలో నిబద్ధించి తన దశమస్కంధమును మహాకావ్యలక్షణలక్షితమొనరించినాడు. ఏవస్తువునైనను సర్వాంగసుందరముగావర్ణించుటలో తాను సిద్ధహస్తుడై యర్వాచీన కవివతంసులకనేకులకు మార్గదర్శకుడైనాడు.

ఒకపదార్థమును తినుచున్నపుడు తినువానికెట్టి తృప్తికలుగునో అట్టే ఆయా గుణాగుణములనుగాని, స్వరూపమునుగాని, రసమునుగాని, పెంచిచెప్పుటలోనున్నతృప్తి యంతంతమాత్రముగా చెప్పుటలో కన్పట్టదు. ఆ మర్మమునెరింగియే పోతన విస్తృతి చేయుటయు, అందువలననే రాణించుటయు జరిగినది.

'దర్శనాద్వర్ణనాచ్చాథ రూఢా లోకే కవిశ్రుతిః' కవియను మహోన్నతమగు ఖ్యాతికి దర్శనము, వర్ణనము అను విశిష్టమగు ప్రతిభలే మూలస్తంభములు. ఇతర పురాణేతిహాసాంధ్రానువాదకులవలె తాను స్వేచ్ఛానువాదకుడగుటచే పైనచెప్పినరీతిని వర్ణనలయందు స్వాతంత్ర్యమునవలంబించి అనుపమమగు తన వర్ణనాప్రతిభయొక్క విశ్వరూపమును వెలయించిన పోతన పాఠకులకు మఱింత ప్రీతిపాత్రుడుకాగలిగినాడు.

## పాత్రచిత్రణము

వ్యాస, పోతనల రచనాప్రణాళికలలో కన్పట్టు భేదమువలన పాత్రచిత్రణము నందును మూలానువాదముల రెండింట కొలదిభేదము కానవచ్చుచున్నది. పురాణములు మిత్రసమ్మితములు గావునపాత్రచిత్రణమునకంత ప్రాధాన్యము కానరాదు. కావ్యములు కాంతాసమ్మితములు కావున నాయాపాత్రల సంభాషణాదులనుబట్టియే ప్రతిపాదిత విషయము పాఠకులకవగాహన కావలసియున్నది. కావున నిందు పాత్రచిత్రణమున కత్యంతప్రాధాన్యము కలదు. కావుననే పోతన తనయనువాదమున మూలాతిరిక్తమైన పాత్రచిత్రణానైపుణ్యమును ప్రదర్శించియున్నాడు. పోతన పాత్రచిత్రణమును గూర్చి డా. ధూళిపాళ శ్రీరామమూర్తిగారి యభిప్రాయమిట్లున్నది "పోతనగారు భాగవతమును దెనుగుసేయుటయందు మూలమునత్యంత సన్నిహిత ముగా ననుసరించినను, పాత్రచిత్రణమునందుఁ దక్కిన విషయము

లందువలనే తనన్నై పుణ్యమును జూపించెను. మూలభాగవతము పురాణముగావున దానియందుఁ బాత్రచిత్రణమునకంత ప్రాధాన్యము లేదు. ఇట్లని పాత్రచిత్రణమందు లేకపోలేదు. పాత్రలయొక్క మనః ప్రవృత్తులను విశదముగాఁ జిత్రించి వానిని జీవన్మూర్తులనుగా మన కండ్లయెదుట నిలుపుట కవిలక్ష్యము గాదు. పోతనగారికిఁగూడ నీలక్ష్యములేదు. కాని యాయన చిత్రించిన కొన్ని పాత్రలయందు మానవస్వభావముద్దీప్తమై కన్పించుచున్నది. మూలమునందలి పాత్ర చిత్రణములో బీజప్రాయములుగానున్న లక్ష్యములను బరిపుష్టము గావించి పోతనపాత్రలహృదయము నావిష్కరించినాడు."11 పాత్రలు సజీవములై కన్నెదుట నిలచునట్లు చేయుటయే కవియొక్క పాత్రచిత్రణానిపుణతకు నిదర్శనము. కావున పాత్రలయొక్క మనఃప్రవృత్తులను విశదముగా చర్చించి వానిని జీవన్మూర్తులనుగా మనకండ్లయెదుట నిలుపుట కవిలక్ష్యముగాదను శ్రీరామమూర్తిగారి యభిప్రాయమంగీకరింపదగినది కాదు. పోతన భాగవతమునందలి పాత్రలన్నింటి యందును తాను లీనమై, పాఠకులను లీనమొనరింపజేసి ఆయా పాత్రలను జీవన్మూర్తులనుగా తీర్చిదిద్దినాడనుటలో విప్రతిపత్తిలేదు. మూలమునందీతన్మయత్వము కానరాదు. పోతన ఆయా పాత్రల స్వరూప స్వభావములను స్పష్టముగా తీర్చిదిద్ది పాఠకులహృదయములలో శాశ్వతముగా నిలచునట్లొనరించును. ఎంతచిన్నపాత్రనైనను స్ఫుటముగా సజీవముగా చిత్రించుట పోతనలో కన్పట్టును. ఆయా పాత్రల రూపు రేఖలను విస్పష్టముగా తీర్చిదిద్దుటకుగాను శబ్దాలంకారములనుజోడించి ఆయా పాత్రల యాకృతినంతను ఒకేమారు చూపు నేర్పు పోతనపాత్రచిత్రణాశిల్పములోని ప్రత్యేక లక్షణము. నందకుమారులకు నామకరణాదులు జరిపించుటకు వసుదేవునిచేపంపబడి మందకు చనుదెంచిన గర్గునిపాత్రనిట నుదహరింపవచ్చును.

క. ........................

సారగుణాచారమార్గు సత్సంసర్గు
న్నారాధితభర్గున్ మతి
దూరితషడ్వర్గుఁ గుజనదుర్గున్ గర్గున్.

- ఆం. భాగ. దశమ, పూ. భా. 281

ఇందు గర్గుని యాంతరప్రవృత్తియొక్క సమగ్రస్వరూపము ప్రత్యక్షమైనది. మూలమునసిపట్టున

శ్లో. గర్గః పురోహితో రాజన్ యదూనాం సుమహాతపాః ।
వ్రజం జగామ నందస్య వాసుదేవప్రచోదితః ॥
- సం. భాగ. 10-8-1

అనిమాత్రమే కలదు. ఇందు గర్గునిస్వరూపము రేఖామాత్రముగానేని చిత్రింపబడలేదు.

మూలమున బీజప్రాయముగానున్న నాయా పాత్రల లక్షణములనువాదమున పూర్తిగానున్మీలింపచేయుటయు కాననగును. చాణూరుని పాత్రచిత్రణలో మూలానువాదములను పోల్చిచూచిన పైవిషయము స్పష్టపడగలదు.

చాణూరుడు 'ఓబలరామకృష్ణులారా ! వనములందు గోవులను మేపుచు గోపబాలురను మీరు మల్లయుద్ధముతో నాడుకొనుచు సంతోషించుచుందురుగదా ! మీరిద్దరు గొప్పబలముగలవారనియు మల్లయుద్ధములో దిట్టలనియు విని మారాజు మిమ్ములను పిలిపించెను. కావున మాతో పోరుము' అని యాహ్వానించగా కృష్ణుడు 'ఓయీ ! మేము బాలురము. మాతో సాటివచ్చు బల్లిదులతో క్రీడింపగలము. మీతో మాకు మల్లయుద్ధము సంభవించునేని యది యధర్మమగును' అని చాణూరునితో పలుకగానాతడిట్లుపల్కెను.

శ్లో. న బాలో న కిశోర స్త్వం బలశ్చ బలినాం వరః ।
లీలయేభో హతో యేన సహస్రద్విపసత్త్వభృత్ ॥
- సం. భాగ. 10-43-39

ఈవిధముగాజరిగిన సంభాషణనుబట్టి గోపబాలురతో మల్లయుద్ధముచేయుటగాదు మల్లయుద్ధవిశారదుడనైన నాతో యుద్ధమొనరించుము చూచెదనను గరువతనము, ఔద్ధత్యభావము చాణూరునిలో బీజమాత్రముగా వ్యక్తీకరింపబడుచున్నవి. 'న బాలో న కిశోర స్త్వం' అనుటయు 'లీలయేభో హతః' అనుటనుబట్టియు శ్రీకృష్ణుడు బాలుడు గాడనియు సహస్రద్విపసత్త్వాధికసంపన్నుడైన లీలారూపధారియనియు చాణూరుడు గ్రహించినట్లును రేఖామాత్రముగ ద్యోతకమగుచున్నది.

అనువాదమున పోతన చాణూరునిచే 'నాతోబోరంగ నెంతవాడవిసిరో ......' ఇత్యాది దంభోక్తులనధికముగా పలికించి మూలమున బీజప్రాయముగానున్న పై భావములనన్నింటని పూర్తిగా నావిష్కరించినాడు. ఇందు చాణూరుని యౌద్ధత్యము

స్పష్టముగా వ్యక్తీకరింపబడుటయేగాక శ్రీకృష్ణుడు సాక్షాద్విష్ణువనియు, దశావతారము లతనిలీలలనియు వ్యక్తీకరింపబడెను. ఇట్లు చాణూరుని యాంతరరూపమును పూర్తిగా చిత్రించుటయే గాక మూలమునకానరాని యాక్రిందివర్ణనను తిలకించినచో చాణూరుని పాత్రను పాఠకులముందుంచుటలో అనువాదము మూలమునుమించినదని స్పష్టము కాగలదు.

సీ. రోషాగ్ని ధూమ్రప్రరోహంబులై వడి
శిరమున సన్నపుసిగ వెలుంగ
నాశామదేభేంద్రహస్తసన్నిభములై
బాహుదండములు భయదములుగ
లయసమయాంతకోల్లసితదంష్ట్రిలభంగిఁ
జాగిన కోఱమీసములు మెఱయ
నల్లని తెగగల నడగొండచాడ్పున
నాభీలనీలదేహంబు మెఱయ

ఆ. చరణహతుల ధరణి సంచలింపఁగ నభో
మండలంబు నిండ మల్ల సఱచి
శౌరిదెసకు నడచెఁ జాణూరమల్లుండు
పౌరలోకహృదయభల్లుఁ డగుచు.

— ఆం. భాగ. దశమ. పూ.భా. 1344

రుక్మిణీ కల్యాణఘట్టమునందలి సందేశహారియగు బ్రాహ్మణుని పాత్రను పరిశీలించినచో పోతన పాత్రచిత్రణానైపుణ్యము విశదము కాగలదు. రుక్మిణీకృష్ణులలో అంతర్లీనముగానున్న ప్రేమాగ్నిని ప్రకాశింపచేయుటలోను, రుక్మిణిలోని విరహమును ఔచితీయుక్తముగా కృష్ణునకందించుటలోను, కృష్ణుని మనోభావనను రుక్మిణికందించుటలోను, ఉపాయముతో సమర్థవంతముగా రుక్మిణీ కృష్ణుల వివాహమును జరిపించుటలోను, ఇతని నేర్పరితనమును చక్కగా చిత్రించి యితనికి అగ్నిద్యోతనుడనుపేరు సార్థకమగునట్లుచేసెను. ఈబ్రాహ్మణుడు స్వభావముచే నగ్నివంటివాడను భావము పాఠకులలో కలుగునట్లు పాత్రను చిత్రించియు అగ్నిద్యోతనుడను నామసార్థక్యము కలిగించినాడు.

రుక్మిణీసందేశమును గైకొని ద్వారకానగరమున ప్రవేశించిన బ్రాహ్మణుడు పురుషోత్తమునిగాంచి 'పెండ్లికొడుకవుగమ్మని' దీవించుటయు, సందేశమును సవిస్తరముగా విన్నవించుటయేగాక

సీ. పల్లవవైభవాస్పదములు పదములు
కనకరంభాతిరస్కారు లూరు
లరుణప్రభామనోహరములు కరములు

ఇత్యాదిగా రుక్మిణిరూపసౌందర్యాదివిశేషంబులను విన్నవించుటయు గాంచినచో నీతనిలోని లోకజ్ఞత, కార్యసాధకత్వము, చతురవచోనిధిత్వము వెల్లడియగుచున్నవి.

శ్లో. ఇత్యేతే గుహ్యసందేశా యదుదేవ మయాఽహృతాః ।
విమృశ్య కర్తుం యచ్చాత్ర క్రియతాం తదనంతరమ్ ॥
- సం భాగ. 10-52-44

అని మూలమునందలి విప్రుడు పలుకగా అనువాదమునందీతడు

ఉ. ఆ యెలనాగ నీకుఁ దగు నంగనకుం దగు దీవు మాయుపా
ధ్యాయుల యాన పెండ్లియగుఁ దప్పదు జాడ్యము లేల నీవు నీ
తోయమువారిఁ గూడుకొని తోయరుహాననఁ దెత్తు గాని వి
చ్ఛేయుము శత్రులన్ నుఱుము సేయుము సేయుము శోభనం బిలన్
- ఆం. భాగ. దశమ పూ భా. 1711

అని పలుకుటనుబట్టి మూలమునందలి బ్రాహ్మణుడు కేవలము సందేశహారివలె కన్పట్టుచుండగా అనువాదమునందలి విప్రుడు కార్యసాధకునిగా రుక్మిణీకృష్ణులు లక్ష్మీనారాయణులని యెఱింగినవానిగా, వారిరువురికల్యాణము లోకకల్యాణకారకమని భావించినవానిగా దర్శనమిచ్చుచున్నాడు. ఈపట్టున రుక్మిణీసందేశమునుగైకొని శ్రీకృష్ణునిచెంతకేగినవాడు పోతనయేగాని యగ్నిద్యోతనుడుకాదనవచ్చును.

శ్రీకృష్ణావతారతత్త్వము సామాన్యపాఠకులకు సహితము అవగతమగు రీతిలో శ్రీకృష్ణపాత్రచిత్రణమిందు కానవచ్చుచున్నది. లీలారూపధారియగు పరమాత్మని లీలలు సమగ్రముగా పోతన కృష్ణునిలో కానవచ్చినంతగామూలమునను కానరాకుండుటచే నీతనికృష్ణపాత్ర తెలుగులో కృష్ణకథాసాహిత్యమునకు మూలభూతమైనదని చెప్పవచ్చును.

రుక్మిణిని ప్రేమస్వరూపిణిగా, వివేకవతిగా, ఆత్మనివేదనాసక్తురాలుగా, అపూర్వ సౌందర్యమూర్తిగాచిత్రించినతీరు మూలమునకు మెరుగులుదిద్దుచు స్త్రీపాత్రచిత్రణమున పోతననైపుణికుదాహరణప్రాయమగుచున్నది.

యశోదానందులను, దేవకీవసుదేవులను వాత్సల్యమూర్తులుగా, గోపాలురను, కుచేలుని మూర్తీభవించిన సఖ్యస్వరూపులుగా, గోపికలను మధురభక్తితత్పరలుగా చిత్రించుటలో అనన్యసాధారణమైన ప్రతిభను, భక్తిభావమును ప్రదర్శించెను.

శిశుపాలునియౌద్ధత్యమును, రుక్మిమూర్ఖతను, తదితరపాత్రలను కడుంగడు కౌశలముతో వర్ణించెను శిశుపాలుడు రుక్మి మున్నగువారు మదాంధులై కృష్ణుని ప్రాకృతమానవునిగ భావించి ఆయా సందర్భములందు నిందించుచుందురు. ఆ కథా సందర్భములో పోతన వ్యాజస్తుతినాశ్రయించి దుష్టులైన యాపాత్రలు భగవంతుని నిందించుచున్నట్లును తానుమ్నాతమాంతరంగమున స్తుతించుచున్నట్లును కడుసమర్థత చూపును. ఇట్టి నేర్పు నాన్యతోదర్శనీయము. ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారును ఇట్టి యభిప్రాయమునే వ్యక్తీకరించియున్నారు.[12] మూలాతిరిక్తమగురీతిని పాత్రలను మరింత స్పష్టరేఖలతో, ప్రభావవంతముగా కడుంగడునేర్పుతో చిత్రించుట పోతనలోని విశేషము. ఇట్టి నాన్యతోదర్శనీయమగు పాత్రచిత్రణాకౌశలము వలననే యీతనిపాత్రలు పండిత పామర హృదయాలలో ఈనాటికిని నిలచియున్నవి. పోతనయనువాదము స్వతంత్రగ్రంథమువలె భాసిల్లుటకీపాత్రచిత్రణానైపుణియు కారణమనవచ్చును.

# అలంకారయోజనము

'అలంక్రియతే అనేనేత్యలంకారః' అను వ్యుత్పత్తినిబట్టి సౌందర్యమును కలిగించునవి అలంకారములని యర్థము. అర్థభావరసములలంకార్యములు. వాని నలంకరించునవియే అలంకారములు. శబ్దార్థముల చిత్రవిచిత్రానుభవములలోని సూక్ష్మ, సూక్ష్మతర, సూక్ష్మతమ భేదములను గుర్తించి ఆలంకారశాస్త్రజ్ఞులు శబ్దార్థాలంకారములను విభజనమొనర్చిరి. ఇవి కావ్యరచనలో అనివార్యములు. పురాణ రచనలో ధర్మమును సుబోధకమొనర్చు సహకారులుమాత్రమే. కావున కేవలము పురాణమైన మూలభాగవతమునందలి యలంకారసంపదకంటె ప్రబంధచ్ఛాయతో సాగిన అనువాదమున అధికమనుట నిర్వివాదము. రసపుష్టిలేని యలంకారరచనకంటె అలంకారవిరహితమైన రచన శ్రేష్ఠము. రసస్పర్శలేని యలంకారయోజన వ్యర్థమగుట

యేగాక హాస్యాస్పదమును కాగలదు. రసభావబంధురములుకానివానికి యలంకారములను కూర్చినచో జీవములేని శవమునకాభరణములు తగిలించినట్లుండునేగాని సౌందర్యాపాదకములు కాజాలవు. రసభావబంధురమైన రచనకలంకారయోజన చేయుట మధురమైన పాయసాన్నమునకు ఏలకులపంటి పరిమళద్రవ్యములు చేర్చుటయే. మూలానువాదములకు అలంకారములు సౌందర్యాపాదకములైనవిధము పరికింతము.

ముందుగా శబ్దాలంకారవైచిత్రినిగుఱించి పరిశీలించినచో పోతనమహాకవిని వ్యాసునికంటెమిన్నగా తెలుగునాట పండితపామరరంజకుడైన ప్రజాకవినిచేసినఘనత శక్తితన్మయత్వముచే నప్రయత్నసిద్ధమైన అతని శబ్దాలంకారరచనకు దక్కగలదు. సాధారణముగా సాహిత్యలోకములో అర్థాలంకారయుక్తమైన రచనలు గావించువారిని నుత్తములుగను, శబ్దాలంకారయుక్త రచన గావించినవారిని మధ్యములు లేక అధములుగను, పరిగణించుట పరిపాటి. శబ్దముకంటె అర్థము రసమునకు సన్నిహితముగానుండుటచేతను, శబ్దాలంకారములవలన కలిగిన యానందముయొక్కవ్యాప్తి, స్థిరత్వములకంటె నర్థాలంకారములవలనకలిగిన వ్యాప్తి, స్థిరత్వమునధికమగుటచేతను, ఇట్లు పరిగణించుచున్నారు. కాని పోతన శబ్దాలంకారయుక్తమైన తన భాగవతరచన వలన ఉత్తమకవులకోవలో చేరినాడు. అంతియేగాక నీతని శబ్దాలంకారములర్థాలంకారములప్రతిభ నినుమడింపజేయుచు నాదసౌందర్యమును కలిగించుచున్నవి. సద్యఃపరనిర్వృతిని చూరగొనుటకు సాహితీప్రియంభావుకుల ఊహలకు రెక్కలు తొడుగునది నాదసౌందర్యము. తెలుగుకవితాగానమునకు ఛందస్సు, యతిప్రాసలు మనోహరమృదంగనాదతరంగప్రాయములనుట సర్వజనవిదితమే. ఈనాదసౌందర్యమునకు శబ్దాలంకారములు ప్రధానమైనవి. రసప్రవాహమున నోలలాడించునట్లుగా శబ్దాలంకారరచనచేయుటలో పోతనతో సమానమైన మరియొకకవి తెలుగుసాహిత్యమున లేదనవచ్చును.

వ్యాసుని దశమస్కంధమునందచ్చటచ్చట శబ్దాలంకారరచన కానవచ్చినను పోతనరచనతో వానిని పోల్చజాలము. మూలమునందలి శబ్దాలంకారరచనకు కొన్ని యుదాహరణములు క్రిందనీయబడుచున్నవి.

శ్లో. సత్యవ్రతం సత్యపరం త్రిసత్యం
సత్యస్య యోనిం నిహితం చ సత్యే।
సత్యస్య సత్యమృతసత్యనేత్రం
సత్యాత్మకం త్వాం శరణం ప్రపన్నాః॥

– సం. భాగ. 10-2-26

ఇందు భగవానుని సత్యస్వరూపునిగా చిత్రించుటలో వ్యాసుడు సత్యశబ్దమును పలుమార్లు ప్రయోగించి శాబ్దికముగాను, భగవానుని సత్యతను నిరూపించెను.

అట్లే శ్రీకృష్ణునిపదమునాశ్రయించినవారికి సంసారసాగరము వత్సపదమంత స్వల్పమగునని పదశబ్ద పునఃపునరావృత్తిచే స్పష్టపరచినవిధము గమనింపుడు.

శ్లో. సమాశ్రితా యే పదపల్లవప్లవం
మహత్పదం పుణ్యయశో మురారేః।
భవాంబుధిర్వత్సపదం పరంపదం
పదం పదం యద్విపదాం న తేషామ్॥

— సం. భాగ. 10–14–58

అనుప్రాసరచనమందందు మూలమునందును కానవచ్చుచున్నదనుటకు క్రింది శ్లోకము తార్కాణము కాగలదు.

శ్లో. నమః ప్రమాణమూలాయ కవయే శాస్త్రయోనయే।
ప్రవృత్తాయ నివృత్తాయ నిగమాయ నమో నమః॥

- సం. భాగ. 10–16–44

శ్లో. యాతాసు బాలిశా మైవం ప్రార్థ్యం యది జిజీవిషా।
బధ్నన్తి ఘ్నన్తి లుంపన్తి దృప్తం రాజకులాని వై॥

- సం. భాగ. 10–41–36

ఇందు 'బధ్నన్తి, ఘ్నన్తి, లుంపన్తి' అను శబ్దములపొందిక కట్టి కొట్టి కొల్లగొట్టుటను ధ్వనింపజేయుచున్నది.

శ్లో. న మాతా న పితా తస్య న భార్యా న సుతాదయః।
నాత్మీయో నాపరశ్చాపి న దేహో జన్మచైవ వా॥

- సం. భాగ. 10-46-38

ఇందలి 'న' కార వృత్త్యనుప్రాసము.

శ్లో. ఆత్మన్యేవాత్మనాఽఽత్మానం సృజే హన్మ్యనుపాలయే।
ఆత్మమాయానుభావేన భూతేంద్రియగుణాత్మనా॥

- సం. భాగ. 10–47–30

ఇందలి 'ఆత్మ' శబ్దముయొక్క ఛేకానుప్రాసము.

శ్లో. కించిత్సుచరితం యన్న స్తేన తుష్టస్త్రిలోకకృత్ ।
అనుగృహ్ణాతు గృహ్ణాతు వైదర్భ్యాః పాణిమచ్యుతః ॥
- సం. భాగ. 10-53-38

ఇందలి 'అనుగృహ్ణాతు' 'గృహ్ణాతు' అను అనుప్రాసమును, వ్యాసుని శబ్దాలంకార వైచిత్రిని స్పష్టమొనరించుచున్నవి.

మూలముననంతంతమాత్రముగా కానవచ్చుశబ్దాలంకారములనుపాదమున గావించిన విన్యాసములను పరికింతము. స్థూలముగా పోతనగారిరచనలో నిరలంకారమైన పద్యములు తక్కువ. భగీరథునివెంట గంగాప్రవాహమువలె పోతన కవితాప్రవాహమును శబ్దాలంకారములనుసరించినవి. అది ప్రతిభాసంపాద్యము. పోతన రచనయందు ప్రచురముగా కాన్పించు శబ్దాలంకారములలోననుప్రాసము, యమకము ముఖ్యమైనవి. అనుప్రాసనెన్నివిధముల హృదయంగమముగా వెలయింపవచ్చునో అన్నిరీతుల పోతనభాగవతమున వెలయించినాడు. అనుప్రాసముయొక్క విశ్వరూపము పోతనభాగవతమున ప్రత్యక్షమైనట్లాంధ్రసాహిత్యరంగమున మరియెచ్చటను కానము. ఈతడు ప్రయోగించిన అనుప్రాసభేదములలో నంత్యానుప్రాసము, వృత్త్యనుప్రాసము ప్రచురములు ఈ యనుప్రాసాదికములు అప్రయత్నసిద్ధమైనపుడు రసవ్యంజకము లనియు, ప్రయత్నకృతమైనపుడు రసభంజకములగుననియు పలువురాలంకారికులు నిర్ణయించిరి. పోతన రసావేశమున వ్రాసికొనిపోవుసమయమునందప్రయత్నముగనే యీయనుప్రాసాదులు కుదురుకొనునుగాని ప్రయత్నపూర్వకములుగావు. పోతన శబ్దాలంకారములు అయత్నసిద్ధమనుటకు క్రిందిపద్యమే ప్రబలోదాహరణము.

సీ. పల్లవవైభవాస్పదములు పదములు
కనకరంభాతిరస్కారు లూరు
లరుణప్రభామనోహరములు కరములు
కంబుసౌందర్యమంగళము గళము
మహితభావాభావమధ్యంబు మధ్యంబు
చక్షురుత్సవదాయి చన్నుదోయి
పరిహసితార్ధేందుపటలంబు నిటలంబు
జితమత్తమధుకరశ్రేణి వేణి

ఆ. భావజాశుగముల ప్రాపులు చూపులు
కుసుమశరునివింటికొమలు బొమలు
చిత్తతోషణములు చెలువభాషణములు
జలజనయనముఖము చంద్రసఖము.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1710.

ఇందు తొలిచరణ ప్రథమార్ధమున యమకము, ద్వితీయార్ధమున ఛేకము, ద్వితీయచరణ ప్రథమార్ధమున ఛేకము, ద్వితీయార్ధమున యమకము. తృతీయచరణ ప్రథమార్ధమున లాటము, ద్వితీయార్ధమున ఛేకము, చతుర్థచరణ ప్రథమార్ధమున ద్వితీయార్ధమున ఎత్తుగీతి నాల్గుపాదములందును ఛేకము, ఎత్తుగీతిలోనంత్యానుప్రాసము, దర్శనమిచ్చుచున్నవి.

సీ. మృగనాభి యలదదు మృగరాజమధ్యమ
జలముల నాడదు జలజగంధి
ముకురంబుఁ జూడదు ముకురసన్నిభముఖి
పువ్వులు దుఱుమదు పువ్వుఁబోణి
వనకేళిఁ గోరదు వనజాతలోచన
హంసంబుఁ బెంపదు హంసగమన
లతలఁ బోషింపదు లతికాలలితదేహ
తొడవులు దొడవదు తొడవుతొడవు

ఆ. తిలకమిడదు నుదుటఁ దిలకినీతిలకంబు,
కమలగృహముఁ జొరదు కమలహస్త
గారవించి తన్నుఁ గరుణ సైకొనవన
మాలి రాఁడు తగవు మాలి యనుచు.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1729.

ఇందు శబ్దాలంకారములిచ్చవచ్చినట్లు నర్తనమొనరించినవి. ఇందు కవికి దృష్టి యంతయు మూర్తిచిత్రణమునందే. మూర్తిసౌందర్యమునకర్థాలంకారములతోబాటు శబ్దాలంకారములును పుష్టిని కలిగించుచున్నవి. శబ్దాలంకారములు తీసివేసినచో మూర్తి నిర్మాణమునందు సౌందర్యము కొరవడును. ఆవిధమైన ఆకర్షణతోనందించుటలోని

స్పష్టత శబ్దాలంకారవిరహితమైనదానిలో కానరాదు. ఇట్టిసందర్భములందు శబ్దాలంకారములెంతేని సహకరించుచున్నవి.

పద్యమును క్రియాపదముతో ప్రారంభించి, ఆ క్రియతోనన్వయించు విశేష్యమున కనేకవిశేషణములను కూర్చి విశేష్యపదాంత్యాక్షరముతో విశేషణములకన్నిటికి అంత్యానుప్రాస ఘటించుట పోతనగారి యనుప్రాసవిన్యాసములలోనొకటి[13] దీని కుదాహరణములు లెక్కకు మిక్కిలి· మచ్చుతునకలుకొన్ని :

మ. కనియెం గృష్ణుఁడు సాధునీరము మహాగంభీరముం బద్మకో
కనదస్వాదువినోదమోదమదభృంగద్వంద్వఝుంకారమున్
ఘనకల్లోలలతావితానవిహరత్కాదంబకోలాహల
స్వనవిస్ఫారము మందవాయుజకణాసారంబుఁ గాసారమున్.

— ఆం భాగ. దశమ. పూ. భా. 489.

మ. కనియెన్ దానవుఁ డింద్రసేనుఁడు దళత్కంజాక్షులన్ దక్షులన్
ఘనసారాంబుదవర్ణులన్ నిఖిలలోకైకప్రభాపూర్ణులన్
దనరారన్ హలచక్రపాణులను భక్తత్రాణులన్ నిత్యశో
భనవర్ధిష్ణుల రామకృష్ణుల జయభ్రాజిష్ణులన్ జిష్ణులన్.

— ఆం. భాగ. దశమ. ఉ. భా. 1137.

విష్ణురూప సాక్షాత్కారమొనరించుటకై యంత్యానుప్రాసాలంకృతసీసము వెలువడిన విధము గమనింపుడు.

సీ. నీలజీమూతసన్నిభశరీరమువాఁడు
తామరసాభనేత్రములవాఁడు
పూర్ణేందుబింబంబుఁ బోలెడిమోమువాఁ
డున్నతదీర్ఘబాహువులవాఁడు
శ్రీవత్సలాంఛనాంచితమహోరమువాఁడు
కౌస్తుభమణిపతకంబువాఁడు
శ్రీకరపీతకౌశేయచేలమువాఁడు
మకరకుండలదీప్తిమలయువాఁడు

తే. రాజ! యింతంతవాఁ డనరానివాఁడు
మెఱసి దిక్కుల నెల్లను మెఱయువాఁడు
తెలిసి యే వేళలందైనఁ దిరుగువాఁడు
పట్టనేర్చినఁ గాని లోఁబడనివాఁడు

— ఆం. భాగ. దశమ పూ. భా. 1584.

నామాంత్యాక్షరముతో తద్విశేషణములకంత్యప్రాసను ఘటించుటకు క్రింది పద్యములుదాహరణములు

క. కోరి భజించెను నందుఁడు
సారగుణాచారమార్గు సత్సంసర్గు
న్నారాధితభర్గున్ మతి
దూరితషడ్వర్గుఁ గుజనదుర్గున్ గర్గున్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 281.

మ. ధ్రువకీర్తిన్ హరి పెండ్లియాడె నిజచేతోహారిణిన్ మానసై
భవగాంభీర్యవిహారిణిన్ నిఖిలసంపత్కారిణిన్ సాధుబాం
ధవసత్కారిణిఁ బుణ్యచారిణి మహాదారిద్ర్యసంహారిణిన్
సువిభూషాంబరధారిణిన్ గుణవతీచూడామణిన్ రుక్మిణిన్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1780

ఇందాయాపాత్రల రూపసాక్షాత్కారమునకు, బింబభావనకు శబ్దాలంకారములెంత సహకరించినవో చెప్పుటకంటె 'వాగర్థావివ సంపృక్తౌ వాగర్థః ప్రతిపత్తయే' అనుటయుక్తము.

సీ. ఇందీవరశ్యాము వందితసుత్రాముఁ
గరుణాలవాలు భాసురకపోలుఁ
గౌస్తుభాలంకారుఁ గామితమందారు
సురుచిరలావణ్యు సురశరణ్యు
హర్యక్షనిభమధ్యు నఖిలలోకారాధ్యు
ఘనచక్రహస్తు జగత్ప్రశస్తు
ఖగకులాధిపయానుఁ గౌశేయపరిధానుఁ
బన్నగశయను నబ్జాతనయను

తే. మకరకుండలసద్భూషు మంజుభాషు
నిరుపమాకారు దుగ్ధసాగరవిహారు
భూరిగుణసాంద్రు యదుకులాంభోధిచంద్రు
విష్ణు రోచిష్ణు జిష్ణు సహిష్ణుఁ గృష్ణు.

— ఆం. భాగ. దశమ. ఉ. భా. 975.

ఇందు సీసపద్యముయొక్క ప్రతిపాదమునందును పూర్వార్ధముననొక అనుప్రాసయు, ఉత్తరార్ధముననొక అనుప్రాసయు కూర్చుటయేగాక ఎత్తుగీతి మూడుపాదములందు ఛేకానుప్రాసమును, నాల్గవపాదమున వృత్త్యనుప్రాసమును కూర్చి మహావిష్ణువు రూపసాక్షాత్కారమొనరించుట ప్రశంసార్హము.

చ. హరి భజియించుహస్తములు హస్తము లచ్యుతుఁ గోరిమ్రొక్కు త
చ్ఛిరము శిరంబు చక్రధరుఁ జేరినచిత్తము చిత్త మిందిరా
వరుఁ గనుదృష్టి దృష్టి మురవైరి నుతించినవాణి వాణి య
క్షరుకథలాను కర్ణములు కర్ణములై విలసిల్లుఁ జో భువిన్

— ఆం. భాగ. దశమ. ఉ. భా. 959.

ఇత్యాదులుభక్తిరసస్ఫోరకలాటానుప్రాసాలంకార విన్యాసమునకుదాహరణములుకాగలవు

ఉ. అన్న! శమింపుమన్న! తగ దల్లుఁడు గాఁడిది! మేనగోడ లా
మన్నన సేయుమన్న! విను మానినిఁ జంపుట రాచపాడిగా
దన్న! సుకీర్తివై మనఁగదన్న! మహాత్ములు వోవుత్రోవఁ బో
వన్న! భవత్సహోదరిఁ గదన్న! నినున్ శరణంబు వేడెదన్.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 149.

ఇందలి 'అన్న' శబ్దముయొక్క పునఃపునరావృత్తి కరుణరసపోషకమై యలరారుచున్నది.

ఆ. అలసితివిగదన్న! యాఁకొంటివిగదన్న !
మంచియన్న! యేడ్పు మానుమన్న!
చన్నుగుడువుమన్న! సంతసపడుమన్న!
యనుచుఁ జన్నుగుడిపె నర్భకునకు.

— ఆం. భాగ. దశమ. పూ.భా. 258.

అను పద్యమునందలి 'అన్న' శబ్దానువృత్తి యశోదవాత్సల్యరసాభివ్యక్తి తరంగ రూపములో వెలువడుటకు సహకరించుచున్నది.

ఉ. నమ్మితి నామనంబున సనాతనులైన యుమామహేశులన్
మిమ్ముఁ బురాణదంపతుల మేలు భజింతుఁ గదమ్మ! మేటిపె
ద్దమ్మ! దయాంబురాశివి గదమ్మ! హరిం బతి సేయు మమ్మ! నిన్
నమ్మినవారి కెన్నఁటికి నాశము లేదు గదమ్మ! యీశ్వరీ.
- ఆం. భాగ. దశమ. పూ. భా. 1741.

ఇందలి'అమ్మ'పదానువృత్తి రుక్మిణియొక్క భక్త్యతిశయమును వ్యక్తీకరించుచున్నది.

ఇట్లీతని శబ్దాలంకారములు రూపసాక్షాత్కారమొనరించుటకు రసప్రవాహమున పాఠకులనోలలాడించుటకు మిక్కిలి దోహదకారులగుచున్నవి. తదంతర్లీనమైన భావనలో చేతనను, స్ఫూర్తిని నింపివేయుటకు సహకరించుచున్నవి.

సీ. కమనీయశుభగాత్రుఁ గంజాతదళనేత్రు
వసుధాకళత్రుఁ బావనచరిత్రుఁ
- ఆం భాగ. దశమ. ఉ. భా.358.

ఇత్యాదిగాగల సీసపద్యమునందొక్కొక్క పాదమందు నాల్గేసియనుప్రాసలుకూర్చుటయు కొన్ని సీసపద్యములందలి యొక్కొక్క దళమునకొకే యనుప్రాసకూర్చుటయు, కొన్ని పద్యములకు పాదాది ద్విత్రిచతుష్పంచప్రాసములు, సమాసాంత ద్విత్రిప్రాసములు కూర్చుటయు చూచినచో పోతన యనుప్రాసముతోగావించిన విన్యాసములు లెక్కకు మిక్కిలియనుటయేగాక ఇట్టి చతురుడాంధ్రసాహిత్యలోకమున లేడనుట యతిశయోక్తికాదు. ఇవియన్నియు నప్రయత్నసిద్ధ సహజధారావిలసితములగుటయు, రూప, రస, భావ పోషకములును, ఉద్దీపకములునగుటయు గమనించవలసియున్నది. అందచందము లుండుటయేగాక వానికెనలేని సార్థక్యము లభించుట పోతనశబ్దాలంకారములకుపట్టిన యదృష్టము.

క. ప్రియములు జితపవనమనో
రయములు కృతజయము లధికరమణీయగుణా
న్వయములు సవినయములు ని
ర్భయములు హతరిపుచయములు పట్టణహయముల్.
- ఆం. భాగ. దశమ. పూ. భా. 1606

ఇందు యమకముతోకూడిన త్రిప్రాసము,

క. శ్రీకరములు జనహృదయవ
శీకరములు మందపవనశీర్ణమహాంభః
శీకరములు హంసవిహం
గాకరములు నగరికువలయాబ్జాకరముల్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1599.

ఇందలి చతుష్ప్రాసము,

క. మామావలువలు ముట్టకు
మామా కొనిపోకు పోకు మన్నింపు తగన్
మామాన మేల కొనియెదు
మామానసహరణ మేల మానుము కృష్ణా!

- ఆం. భాగ. దశమ. పూ. భా. 818

ఇందలి పాదాది ద్విప్రాసముతోబాటు 'పోకు, పోకు' అను యమకము, మూడు నాల్గు పాదములందలి సపదభంగయమకము,

సీ. ఒకచోట నుచితసంధ్యోపాసనాసక్తు
నొకచోటఁ బౌరాణికోక్తికలితు
నొకచోటఁ బంచయజ్ఞోచితకర్మని
నొకచోట నమృతోపయోగలోలు
నొకచోట మజ్జనోద్యోగానుషక్తుని
నొకచోట దివ్యభూషోజ్జ్వలాంగు
నొకచోట ధేనుదానోత్కలితాత్ముని
నొకచోట నిజసుతప్రకరయుక్తు

తే. నొక్కచోటను గానవినోదచిత్తు
నొక్కచోటను జలకేళియుతవిహారు
నొక్కచోటను సన్మంచకోపయుక్తు
నొక్కచోటను బలభద్రయుక్తచరితు.

- ఆం. భాగ. దశమ. ఉ. భా. 615.

ఇందలి తొలినాల్గుపాదములలో పాదార్ధాది చతుష్ప్రాసము, ఎత్తుగీతిలో పాదాది పంచప్రాసము, పోతనశబ్దాలంకారవైచిత్రికి మచ్చుతునకలుమాత్రమే.

క. రాజీవాక్షునిచే నొక
రాజీవముభంగి శైలరాజము మెఱసెన్
రాజేంద్ర! మీఁద మధుకర
రాజిక్రియ మేఘరాజి రాజిల్లెఁ గడున్.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 921.

అను చిన్నపద్యమునందలి పాదాదిద్విప్రాసము, ఛేకానుప్రాసము, వృత్త్యనుప్రాసము, ఉపమాలంకారమునకు మరింతశోభాదాయకమై శ్రీకృష్ణుడు గోవర్ధనగిరినెత్తిసదృశ్యమును పరమమనోహరముగా సాక్షాత్కరింపజేయుచున్నవి.

ముక్తపదగ్రస్తాలంకారముతోకూడిన వచనరచనయు నందందు గావవచ్చుచున్నది.

క. హరి తిగ్మ గోశతంబుల
హరిదంతర మెల్లఁ గప్పునాకృతిఁ గడిమిన్
హరి తీగ్మ గోశతంబుల
హరిదంతర మెల్లఁ గప్పె నరిభీకరుఁడై.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1564.

ఇట్టి విషమపాదావృత్తియుతమైన రచనకితడే ఆద్యుడు. ఇందలి శ్లేషోపమాలంకారములకు శబ్దాలంకారము మరింత సౌందర్యాపాదకమగుచున్నది. ఇతని అడుగుజాడలలో చేమకూర వెంకటకవి తన సారంగధరచరిత్రలో ఇట్టి రచనను గావించినాడు.

క. చుంచెదుగుఁ బోలు ద్రావు ము
దంచితముగ ననుడు పాలుద్రావి జననితోఁ
జుం చెదుగ దంచు లీలా
చుంచుండై యతఁడు చుంచుఁ జూపె నరేంద్రా!

- ఆం. భాగ. దశమ. పూ. భా. 417.

'చుంచు' శబ్దగతమైన అర్థమునాధారముగాగొని గావించిన శబ్దచమత్కృతి మిక్కిలి యానందదాయకమగుచున్నది. ఇందు ధ్వనులయొక్క సామ్యము, అర్థముల

యొక్క భేదము, రంజకతనిచ్చినవి. భాషాప్రపంచమునందలి శబ్దములన్నియు వీతని కరతలామలకములు. ఇట్టి శబ్దాలంకారములతో అనేక చమత్కృతులొనరించునేర్పు పోతనకు వెన్నతోపెట్టినవిద్య. ఇతనికి పూర్వులలోగాని యర్వాచీనులలోగాని యిట్టి చమత్కారచణుడు లేడనుట అతిశయోక్తి కాదు.

ఈ అంత్యానుప్రాస భాస్కరరామాయణమునుండి పోతన అలవరచుకొనెననియు నాచనసోముడు మరికొన్ని శబ్దాలంకారముల మజాలు నేర్పినాడనియు, ఎఱ్ఱయ్యగారు అర్థాలంకారముల రహస్యములను బోధించినారనియు కొందరివిమర్శకుల తలంపు[14] ఇట్టిభావన సుప్రతిష్ఠితులైనవారి ప్రతిభకు అసంగతత్వముగా విలువలుకట్టుటయే. ప్రతి మానవుడుతత్పూర్వులనో, సమకాలీనులనో ప్రతిపనియందు ననుకరించుచుండుననుట యథార్థము. అంతమాత్రమున ఆయా వ్యక్తులలో వ్యక్తిత్వము లేదనలేముగదా! అట్లే పూర్వగ్రంథ పఠనవాసనలు ప్రతికవియొక్క అంతరంగమందున్నను వారివారి ప్రతిభాపాటవములనుబట్టి ఆయా విలువలున్మీలనములగుచుండును. తద్ద్వారమున అపూర్వమైన సాహిత్యావిర్భావము జరుగుచుండును. కీర్తిప్రతిష్ఠలు కలుగుచుండును. దీనికంతకు ఆ కవిలోని స్వీయ ప్రతిభాపాటవములే కారణమనుటలో భేదాభిప్రాయములుండరాదు.

అంతరంగమునందలి భక్తితీవ్రతవలన పెల్లుబికివచ్చు లయబద్ధమైన శబ్ద తరంగములను బలవంతముగా నడ్డుదమన్నను సాధ్యముకాదు భగవత్స్తుతి పూర్వకములైన దండకాదులు లయబద్ధమైన గతి, వడి కలిగి నాదసౌందర్యవిలసితము లగుటచే మనమునందొకవిధమైన ఉత్సాహమును జనింపజేయుచు, తన్మయత్వము కలిగించి, ఆతన్మయత్వములో పరమాత్మస్వరూపమును సాక్షాత్కారమొనరించుటకు దోహదములగుచున్నవి. అట్టి లయబద్ధములుకాని రచనలవలన భగవత్సాక్షాత్కారము నందలేము. కావున శబ్దాలంకారచన భక్తిచిత్రణమునకు ప్రధానమనవచ్చును.

భక్తిచిత్రణముకావించిన రచయితలు, రచనలు ననేకములున్నను పోతన భాగవతమునందలి భక్తిచిత్రణమింతగా జనాదరణము పొందుటలోను, మూలాతిశాయి సౌందర్యమును సంతరించుకొనుటలోను, దాని వెనుకగల శబ్దాలంకారవైభవము నిర్వహించినపాత్ర అనల్పమైనదని చెప్పకతప్పదు.

శబ్దార్థాలంకారములు రెండును రసభావములకు సంబంధించినవైనను, శబ్దాలంకారములు ప్రధానముగా భాషాపరమైనవగుటచే మూలమున శబ్దాలంకారయోజనలోనున్న ఘట్టములదేవిధముగా అనువాదమున ప్రవేశించినవా? లేవా? అని సరిపోల్చుట

పొసగదు. మూలానువాదములను సరిపోల్చి చూచునపుడు మూలకర్త యేయే తావులందు శబ్దాలంకారవైచిత్రిని ప్రదర్శించినాడో యనువాదకుడేయే ఘట్టములందెట్టి శబ్దాలంకారవిన్యాసములను చూపినాడో చూపగలమేగాని మూలానువాదముల రెంటి నొకదాని ప్రక్కనొకటి చేర్చి సరిపోల్చి చూచుటకవకాశముదులే. అర్థాలంకారముల విషయమునమాత్రమట్లుగాక మూలమునందలి ఆయా ఘట్టములలోని యుపమాద్యలంకారములు అనువాదమున ప్రవేశించినవా ? లేవా? అని చూడదలచినచో నవకాశమున్నది. మూలమున నిరలంకారమైన తావులననువాదకుడు సాలంకారమొనర్చవచ్చును. మూలానువాదములందొకే ఘట్టమున నొకే యర్థాలంకారము పొందుపఱుపబడినను, అలంకారయోజనలో భేదముండవచ్చును లేదా మార్పుగావింపవచ్చును. వీనివలన మూలానువాదములకు కలిగిన సౌందర్యమునందలి సామ్యభేదములను పరిశీలింపవలసియున్నది. అర్థాలంకారయోజనలో వ్యాస, పోతనల దశమస్కంధములందలి సామ్య భేదములను పరికింతము.

మూలము పురాణరచనయగుటచేతను, అనువాదము ప్రబంధచ్ఛాయలోసాగిన పురాణరచనయగుటచేతను, వర్ణనలు, పాత్రపోషణము మున్నగువానియందువలె అర్థాలంకారకల్పనమందును భేదముండుటకవకాశముకలదు. మూలమునందు భావములు స్పష్టముగా నవగాహనచేయుటకుమాత్రమే యర్థాలంకారరచన. అనువాదమునందట్లు గాక స్పష్టతతోబాటు రసభావములకు మరింత పుష్టిని, సౌందర్యమును కలిగించురీతిలో అలంకారరచనసాగినది.

మూలమున ప్రయోగింపబడిన ఉపమాద్యలంకారములను యథాతథముగ అనువాదమున పొందుపఱచుటయేగాక మూలమునందెట్టి యలంకారయోజన లేని తావులనేకములనువాదమున సాలంకారములైనవి. దీనివలన మూలమునుమించిన సొగసులతో అనువాదము పండితపామరహృదయానురంజకమై యలరారుచున్న విధము పరికింతము.

శ్లో. మునివ్రతమథ త్యక్త్వా నిశ్చక్రామాంబికాగృహాత్ ।
ప్రగృహ్య పాణినా భృత్యాం రత్నముద్రోపశోభినా ॥
- సం. భాగ. 10-53-50

మౌనవ్రతమునువీడి రుక్మిణి తనపరిచారికను రత్నపుటుంగరముచేమెఱయు హస్తముతోఁబట్టుకొని అంబికాలయమునుండి బయలువెడలి వచ్చెనని మూలముననుండగా అనువాదమున

"మేఘమధ్యంబు వెలువడి విలపించు క్రొక్కారుమెఱుంగు తెఱంగున, మృగధరమండలంబు నిర్గమించి చరించు మృగంబుచందంబునఁ, గమలభవనర్తకుండెత్తిన జవనికమఱుఁగు దెరలి పొడసూపిన మోహినీదేవతకైవడి, దేవదానవ సంఘాత కరతలసవ్యాపసవ్య సమాకృష్యమాణ పన్నగేంద్రపాశ పరివిలయితపర్యాయ పరిభ్రాంతమందరాచలమంథానమథ్యమానఘూర్ణిత ఘుమఘుమాయిత మహార్ణవ మధ్యంబుననుండి చనుదెంచు నిందిరాసుందరీవైభవంబున, బహువిధ ప్రభాభాసమానయై, యిందుధరసుందరీమందిరంబు వెడలి,"

– ఆం. భాగ. దశమ. పూ. భా. 1744.

అను ఉపమా మాలికతోనలంకరించుట ప్రశంసార్హము. ఇట్టి అమూలకాలంకార కల్పనచే రుక్మిణి భువనమోహనసౌందర్యమభివ్యక్తమగుటయేగాక, ఆమెసాక్షాత్తుగా లక్ష్మీదేవియే యని స్పష్టమొనరింపబడినది. రుక్మిణి (లక్ష్మి) రూపసాక్షాత్కారమొనరించుటకీ యలంకారములెంతేని సహకరించినవి. భావమునకు బలము, రసమున కుద్దీప్తి, రూపసాక్షాత్కారమునకు ప్రాణముపోయుటయు, కొన్నితావుల శైలికి ప్రవాహ గతినొసగుచు దాని సౌందర్యమునినుమడింపజేయుటకు నిది సహకరించుచున్నది.

శ్లో. ఇత్యుక్త్వైకేన హస్తేన కృత్వా గోవర్ధనాచలమ్।
దధార లీలయా కృష్ణశ్ఛత్రాకమివ బాలకః॥

– సం. భాగ. 10-25-19.

కృష్ణుడు గోవర్ధనపర్వతము నొక్కచేతితో పైకెత్తి పుట్టగొడుగువలె అనాయాసముగా పట్టెను. బాలుడైన కృష్ణునకు గోవర్ధనగిరినెత్తుట అంత సుకరమగుట అనువాదమున

క. దండిని బ్రహ్మాండంబులు
చెండులక్రియఁ బట్టి యెగురఁజిమ్మెడుహరికిన్
గొండఁ బెకలించి యెత్తుట
కొండొకపని గాక యెక్క కొండా తలఁపన్.

– ఆం. భాగ. దశమ. పూ. భా. 913.

అను శబ్దాలంకారానుప్రాణితమైన అర్థాంతరన్యాసముతో సమర్థించెను. ఈ యలంకార రచనవలన భక్తుడగుపోతన పరమాత్మని గుణగానము మఱియొకమారు గావించి నట్లయినది.

శ్రీకృష్ణుని వేణుగానమును విని గోపికలు వారి పనులనుమాని కృష్ణుని సమీపమునకు వచ్చిరి.[15] అని మూలముననుండగా అనువాదమునందలి గోపికలకు

"మొగిళ్ళగమి వెలువడి యుల్లసించు తటిల్లతల పోఁదున"

— ఆం. భాగ. దశమ. పూ. భా. 965.

అను ఉపమాలంకారము కూర్చబడినది. గోపికలు తటిల్లతలవంటివారనుటచే వారి సౌందర్యమభివ్యక్తమగుటయేగాక, మబ్బుల గుంపునుండి వెలువడి ప్రకాశించు తటిల్లతలని చెప్పుటచే సంసారబంధములనెడి మబ్బులవెనుకనుండు గోపికలు వానిని విడచిన ఆనందాతిరేకమునంది క్షణములో గోవిందసందర్శనమందిరసియు విశదమగు చున్నది. అమూలకమైన ఈయుపమాలంకారము గోపికల బహిఃసౌందర్యమునేగాక, ఆసమయమందలి మానసికస్థితినిసహితము రమణీయముగా అభివ్యక్తమొనరించు చున్నది. పోతన ఉపమాలంకారములనన్యసామాన్యమైనవనుటకిట్టివి యుదాహరణ ప్రాయములు.

మురళీగానమునువిని శ్రీకృష్ణునిచెంత చేరిన గోపికలకతడు హితబోధచేసి వారియిండ్లకు మరలిపొమ్మనగా వారు మరలలేమని సమాధానముచెప్పినసందర్భమున అనువాదమున వారట్లు మరలలేమనుటను

"మరలగ లేము మామగలమాటల నొల్లము పద్మగంధముల్
మరఁగినతేఁటు లన్యకుసుమంబుల చెంతలఁ జేర నేర్చునే."

- ఆం. భాగ. దశమ. పూ. భా. 989.

అని యమూలకమైన అర్థాలంకారముతో సమర్థించుచున్నాడు. ఈ యర్థాలంకారము సహితము శ్రీకృష్ణుని మహిమను, గోపికల భక్తిని, చక్కగా వ్యక్తీకరించుచున్నది.

చాణూరముష్టికులతో బలరామకృష్ణులు మల్లయుద్ధమొనరించుటకలంకరింపబడిన రంగమునకు మూలాతిరిక్తముగా

ఆ. నిర్మలంబు సమము నిష్కంటకంబునై
పుణ్యపురుషుమనముఁ బోలి ... ...
.... ... ... ... .... .... .... ...
... ... ... ... ...మల్లరంగ మొప్పె.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1307.

అను ఉపమాలంకారముకూర్చుట పోతన యర్థాలంకారకల్పనాచాతురికిమచ్చుతునక.

శ్రీకృష్ణుడు కంసునిమీదికి లంఘించినవిధము

శ్లో. ఏవం వికత్థమానే వై కంసే ప్రకుపితో ఽవ్యయః ।
లఘిమ్నోత్పత్య తరసా మంచముత్తుంగమారుహత్ ॥

- సం. భాగ. 10-44-34.

అని నిరలంకారముగా నీరసముగా మూలముననుండగా అనువాదమున

శా. జంఘాలత్వముతో నగోపరిచరత్సారంగహింసేచ్ఛ ను
ల్లంఘింపం గమకించు సింహముక్రియన్ లక్షించి పౌరప్రజా
సంఘాతంబులు తల్లడిల్ల హరి కంసప్రాణహింసార్థియై
లంఘించెన్ దమగంబుమీఁదికి రయోల్లాసంబు భాసిల్లఁగన్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1371.

అను రసపుష్టినికలిగించు ఉపమాలంకారము ప్రవేశించుట ప్రశంసార్హము.

పర్యాలోచనచేయగా మూలమున నిరలంకృతమైన తావులను చక్కని యర్థాలంకారాలంకృతులను గావించిన ఘట్టములనేకము లనువాదమున కన్పట్టుచున్నవి.

పోతనయనువాదమునందలి యమూలకములనుగూర్చి ద్వితీయాధ్యాయమున సోదాహరణముగా వివరించుట జరిగినది. అట్టి యమూలకమైన రసభావములకు పుష్టిని కలిగించుటకనేకములైన యర్థాలంకారములనువాదమున పోతనప్రతిభాపాటవమున ప్రవేశించుట ప్రశంసార్హము. ఇట్టితావులు లెక్కకు మిక్కిలిగా కలవు. ఉదాహరణము నకు కొన్ని మచ్చుతునకలు

క. ఆకసము తోడిచూలన
ప్రాకారము పొడువు గలదు పాతాళమహా
లోకముకంటెను లోఁ తెం
తో కలదాపరిఘ యెఱుఁగ ద్వారకదాకరికిన్

— ఆం. భాగ. దశమ. పూ. భా. 1592.

అను ద్వారకానగర వైభవము నినుమడింపజేయు నతిశయోక్తి.

క. వర్షాకాలభుజంగుఁడు
హర్షముతో నిడిన నవనఖాంకము లని యు
త్కర్షింప భూమిసతిపైఁ
గర్షకహలరేఖ లమరె గహనాంతములన్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 752

అనుసుత్ప్రేక్షయు,

సీ. దేవకీసుతుఁ డొక్క తీఁగెలు వీడంగ
వెలదికి మైదీగ వీడఁ దొణఁగెఁ
గమలనాభునిచిత్తకమలంబు వికసింపఁ
గాంతి నింతికి ముఖకమల మొప్పె

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1689.

ఇత్యాదిగా రుక్మిణీయౌవనప్రాదుర్భావమును స్పష్టపఱచు తుల్యయోగితయు,

క. హలిహలహ్రూతకరికుంభ
స్థలముక్తాఫలము లోలిఁ దనరెఁ గృషికలాం
గలమార్గకీర్ణ బీజా
వలికై వడి నద్భుతాహవ క్షేత్రమునన్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1562

ఇందలి యుపమయు,

క. హరి తిగ్మగోశతంబుల
హరిదంతర మెల్లఁ గప్పునాకృతిఁ గడిమిన్
హరి తిగ్మగోశతంబుల
హరిదంతర మెల్లఁ గప్పె నరిభీకరుఁడై.

— ఆం భాగ. దశమ. పూ. భా. 1564.

అను విషమపాదానువృత్తిపూర్వక, శ్లేషానుప్రాణిత యుపమయు,

సీ. ఖండితశుండాలగండముల్ నక్రముల్
భూరితుండంబులు భుజగసమితి
పదతలంబులు కచ్ఛపంబులు దంతముల్
శుక్తులు కుంభనిర్ముక్తహారి

కములు రత్నములు వాలములు జలూకముల్
మెడలు భేకంబులు మెదడురొంపి
ప్రేవులు పవడంపుదీవలు నరములు
నాచు మజ్జంబు ఫేనంబు లస్థి

ఆ. సైకతములు రక్తచయము తోయంబులు
నొరగునెడల నొరలు మొఱలు ఘనత
రంగరవముగా మతంగజాయోధన
స్థలము జలధిఁ బోల్పఁ దగె నరేంద్ర!

- ఆం. భాగ. దశమ. ఉ. భా. 881

ఇందలి ఏనుగుల యుద్ధస్థలమునకును జలధికిని అభేదమును నిరూపించుచు బీభత్స రసానుప్లావితమైన సాంగరూపకానుప్రాణితమైన ఉపమయు, పోతన యర్థాలంకార రచనానైపుణ్యమునకు ఉదాహరణ ప్రాయములు.

కొన్ని సందర్భములందు మూలానువాదములందలి యొకే ఘట్టమున నొకే యర్థాలంకారము కానవచ్చినను, ఆయా యలంకారముల యోజనలోని భేదమువలన అనువాదము మూలమునుమించిన సొగసులను సంతరించుకొనుటకు వీలయినది.

శ్లో. ఇత్యుక్త్వైకేన హస్తేన కృత్వా గోవర్ధనాచలమ్ ।
దధార లీలయా కృష్ణశ్ఛత్రాకమివ బాలకః ॥

- సం. భాగ. 10- 5-19.

'ఛత్రాకమివ బాలకః' అనునుపమతో పుట్టగొడుగునువలె గోవర్ధనశైలమును శ్రీకృష్ణుడొక్కచేతితో అనాయాసముగా పట్టెనని మూలమున కలదు.

క. కిరియై ధర యెత్తినహరి
కరి సరసిజముకుళ మెత్తుగతిఁ ద్రిభువనశం
కరకరుఁడై గోవర్ధన
గిరి యెత్తెం జక్క నొక్క కేలన్ లీలన్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 912

అనియు,

శా. బాలుం డాడఁచు నాతపత్ర మని సంభావించి పూగుత్తి కెం
గేలన్ దాల్చినలీల లేనగవుతోఁ గృష్ణుండు దా నమ్మహా
శైలంబున్ వలకేలఁ దాల్చి విపులచ్ఛత్రంబుగాఁ బట్టె నా
భీలాభ్రచ్యుతదుశ్శిలాచకిత గోపీగోప గోపంక్తికిన్.

— ఆం. భాగ. దశమ పూ. భా. 915

అనియు మూలమునందలి ఛత్రాకమును 'సరసిజముకుళముగను' 'బాలునిచేతిలోని పూగుత్తిగాను' సంభావించి యనువాదమున ఉపమాలంకారయోజన చేయబడుటయేగాక

క. రాజీవాక్షునిచే నొక
రాజీవముభంగి శైలరాజము మెఱసెన్
రాజేంద్ర! మీఁద మధుకర
రాజిక్రియ మేఘరాజి రాజిల్లెఁ గడున్.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 921

అని గోవర్ధనపర్వతముపైనున్న మేఘరాజిని మధుకరరాజిగానుపమించుటను గాంచినచో గోవర్ధనోద్ధరణఘట్టము మూలమునకంటె అనువాదమున మనోహరరీతిలో ప్రత్యక్షమగుచున్నదనుట అధికోక్తి గాదు. శబ్దార్థాలంకారములు మిక్కిలి సఖ్యముతో నొకదానినిమించి మఱియొకటి రసభావపుష్టిని, సౌందర్యమును, కలిగించుట పోతన కవిత్వములోని విశేషలక్షణమనుటకు పైపద్యమే ప్రబలోదాహరణము కాగలదు.

"కిమివహి మధురాణాం మండనం నాకృతీనామ్" అనినట్లు కవితాకన్య సుందరమైనదైనచో నిరలంకారయైనను పాఠకులనలరించుచునే యుండును. అంతియేగాక ఒక్కొక్కమారు సరళమైనవాక్యములు సాలంకారవాక్యములకంటె సొంపు నింపుచుండును. సహజస్థితివర్ణనము స్వభావోక్త్యలంకారమై రమ్యమైనట్లే సహజరీతిలో చెప్పిన సామాన్యవాక్యములును సౌందర్యహేతువులగుచుండుటయుగలదు. ఆలంకారికమైన మూలవాక్యములభావములను సరళసుందరమైన సామాన్యవాక్యములలో వివరించి పాఠకులకు సుబోధకమొనర్చిన ఘట్టములును పోతనయనువాదమున కలవు.

రుక్మిణీసందేశహారియగు బ్రాహ్మణుడు శ్రీకృష్ణునినుండి తిరిగివచ్చి రుక్మిణితో

శ్లో. తస్యా ఆవేదయత్ప్రాప్తం శశంస యదునందనమ్ ।
ఉక్తం చ సత్యవచనమాత్మోపనయనం ప్రతి ॥

— సం. భాగ. 10-53-30.

అనిపలికినట్లు మూలమున కలదు. ఇందు "ఆత్మోపనయనం" అనునది శ్లేషాలంకార గర్భితము. ఇందు తాను కృష్ణునికొనివచ్చుట, ప్రాణేశ్వరుని తీసుకొనివచ్చుట, రుక్మిణిని తీసుకొనిపోవుట అను భావములు గమ్యమానమగుచున్నవి. శ్లేషాలంకారమువలన వ్యక్తమైన ఈభావపరంపరను ఆసమయమున రుక్మిణియు గుర్తించగలదో లేదో యను తలంపుతో

ఉ. మెచ్చె భవద్గుణోన్నతి కమేయధనాదుల నిచ్చె నాకుఁ దా
వచ్చె సుదర్శనాయుధుఁడు వాఁడె సురాసురు లెల్ల నడ్డమై
వచ్చిన నైన రాక్షసవివాహమునన్ గొనిపోవు నిన్ను నీ
సచ్చరితంబు భాగ్యమును సర్వము నేఁడు ఫలించెఁ గన్యకా!
— ఆం. భాగ. దశమ. పూ. భా. 1783

అని నిరలంకారముగా, సరళసుందరరీతిలో మూలభావమునంతటిని వివరించినాడు.

పైనవివరించిన రీతులనేగాక మూలమునందలి యలంకారములు యథాతథముగ అనునాదమున చోటుచేసుకొనిన తావులనధికములే. ఉదాహరణమునకు పరికింపుడు

శ్లో. సర్వాస్తాః కేశవాలోకపరమోత్సవనిర్వృతాః ।
జహుర్విరహజం తాపం ప్రాజ్ఞం ప్రాప్య యథా జనాః ॥
- సం. భాగ. 10-32-9

ముముక్షువులు పరమాత్మనిపొంది విరహతాపమును వీడినట్లు గోపికలు శ్రీకృష్ణుని పొంది విరహతాపమును వీడిరను మూలమునకు

క. హరిసురుచిర లలితాకృతిఁ
దరుణులు గని ముక్తవిరహతాపజ్వరలై
పరమోత్సవంబు సలిపిరి
పరమేశ్వరుఁ గనిన ముక్తబంధులభంగిన్
-ఆం. భాగ దశమ పూ భా. 1067

అనునది చక్కని తెలుగుసేత. మూలానువాదములందు అలంకారచిత్రణలో భేదము లేకున్నను శైలీపరమైన భేదము కానవచ్చుచున్నది. మూలానువాదముల రెండింట గోపికలను ముక్తబంధులతోనుపమించుట వారి భక్త్యతిశయమును వ్యక్తీకరించుచున్నది.

శ్లో. మల్లానామశనిర్నృణాం నరవరః స్త్రీణాం స్మరో మూర్తిమాన్
గోపానాం స్వజనోఽసతాం క్షితిభుజాం శాస్తా స్వపిత్రోః శిశుః।
మృత్యుర్భోజపతేర్విరాడవిదుషాం తత్త్వం పరం యోగినామ్
వృష్ణీనాం పరదేవతేతి విదితో రంగం గతః సాగ్రజః ॥
— సం. భాగ. 10-43-17

ఇందలి నవరసములను వ్యంజింపజేయు ఉల్లేఖమునకు

సీ. మహితరౌద్రంబున మల్లుల కశనియై
నరుల కద్భుతముగ నాథుఁ డగుచు
శృంగారముగఁ బురస్త్రీలకుఁ గాముఁడై
నిజమృత్యువై కంసునికి భయముగ
మూఢులు బీభత్సమును బొంద వికటుఁడై
తండ్రికి దయరాగఁ దనయుఁ డగుచు
ఖలులకు విరసంబుగా దండియై గోప
కులకు హాస్యంబుగఁ గులజుఁ డగుచు

ఆ. బాంధవులకుఁ బ్రేమ భాసిల్ల వేల్పుపై
శాంత మొనర యోగిజనుల కెల్లఁ
బరమతత్త్వ మగుచు భాసిల్లె బలునితో
మాధవుండు రంగమధ్యమందు.
- ఆం. భాగ. దశమ. పూ. భా. 1322

అనునది వివరణాత్మకమైన తెలుగుసేత.

ఇట్లు మూలమునందలి యలంకారములను చాలవఱకు చక్కని తెలుగు పలుకుబడితో ననువదించి భావ, రసపుష్టిని కలిగించినను, మూలమునందలి యలంకారములు రస, భావములకలంకారములుగా లేని తావులననువాదమున విడచుటయు కన్పట్టుచున్నది. ఉదాహరణమునకు

కేశి యను రాక్షసుని నోటిలో శ్రీకృష్ణుడు తన యెడమచేతిని జొప్పించెను. అంతట

శ్లో. దంతా నిపేతుర్భగవద్భుజస్పృశ
స్తే కేశిన స్తప్తమయః స్పృశో యథా।
బాహుశ్చ తద్దేహగతో మహాత్మనో
యథాఽమయః సంవవృధే ఉపేక్షితః ॥

— సం. భాగ. 10-37-7

కాలిన ఇనుపకడ్డీని తాకినట్లు కృష్ణునిచేయితాకి ఆ కేశిరాక్షసుని దంతములన్నియునూడి క్రిందపడెను. చికిత్సచేయక నూరకున్నంత పెరుగు జలోదరరోగమట్లు మహాత్ముడగు కృష్ణునిచేయి వానిదేహములోజొచ్చి వృద్ధిపొందెనని మూలమునగలదు.

పరమాత్మునిచేయి వృద్ధిపొందుటను చికిత్సచేయకనూరకున్న జలోదరరోగముతో పోల్చుట సౌందర్యాపాదకమును, ఔచితీపోషకమునుగాదు. కావున అనువాదమున ఈ నీచోపమను తొలగించి

శా. దంభోళిప్రతిమానకర్కశమహోద్యద్బాహుదోః స్తంభమున్
శుంభల్లీల నఘారి వాని రదముల్ చూర్ణంబులై రాలఁగా
గంభీరంబుగఁ గుక్షిలోఁ జొనిపి వీఁకన్ వృద్ధి పొందింపుచున్
గుంభించెన్ బవనంబు పిక్కటిల దత్కుక్షిన్ నరేంద్రోత్తమా!

- ఆం. భాగ. దశమ. పూ. ధా 1171

అని రచించి యౌచితిని పాటించెను.

పర్యాలోచనచేయగా వ్యాసుని యర్థాలంకారములకంటె పోతన యర్థాలంకారములు అర్థభావరసములనలంకరించుటయేగాక తత్పోషకములగుటకును మిక్కిలి సహకరించుచున్నవని చెప్పవచ్చును.

అలంకారపరమైన ఏ సౌందర్యమును మనము కావ్యకన్యకకు నాపాదించుచున్నామో అది రసస్పర్శమాత్రముతోగాక రసప్రవాహములో తేలుచు నొకేతావున శబ్దార్థాలంకారసమ్మిశ్రితరూపమున బాహ్యాభ్యంతరసౌందర్యముల కూటమియై దర్శన మిచ్చుటయు పోతనరచనలో పలుతావుల పరిపాటియని చెప్పవచ్చును.

# ఛందః ప్రయోగ వైశిష్ట్యము

సంస్కృతమున లేని యతిప్రాసల నియమములు తెలుగుననుండుటవలన అదనపుసౌందర్యమాంధ్రఛందమునకు సహజసిద్ధముగా సంక్రమించినది సాధారణముగా సంస్కృతపురాణములన్నియు నొకేఛందమున వెలువడగా నాంధ్రమునవెలసిన పురాణములు మాత్రమొకటిరెండు దేశీయపురాణములుదక్క వివిధమైన ఛందోరీతుల సమ్మిశ్రితరూపములుగా కానవచ్చుచున్నవి. ఈవిధమైన తీరుతెన్నులనుబట్టి పరిశీలించినచో సంస్కృతాంధ్రముల పురాణరచనావిషయమై ఛందస్సులనెన్నికచేయుటలో మౌలికమలైన భేదములు కానవచ్చుచున్నవి అట్టితరిలోగడచెప్పిన విధముగా విభిన్నమైన యభిరుచులు లక్ష్యములు పథకములాధారముగా వెలసిన వ్యాసపోతనల భాగవతములలో పాత్రచిత్రణాదులందువలె ఛందఃపరమైన భేదములుండుటయు స్వాభావికము

సాధారణముగా పురాణకర్తలు వక్తవ్యాంశమును పాఠకులకందించు దృష్టితోనే తమ రచనలను సాగింతురుగాని వానికి కళాత్మకపువిలువలను సంతరింపజేయవలెనను వ్యామోహమును చెందరు. కావున మూలభాగవతమును తక్కిన పురాణములవలె అనుష్టుప్ఛందములోనే వెలసినది కాని వివిధమైన ఛందోరీతులలో వెలయునవకాశము దానికి లేకపోయినది. అచ్చటచ్చట ఇతరమైన ఛందములలో రచన కానవచ్చినను వాని సంఖ్య అతిస్వల్పము.

పోతనభాగవతరచనాపథకము మూలభిన్నమగుట రస, భావ, పాత్ర, సన్నివేశాద్యనుగుణముగా వివిధ ఛందోరీతులలో వెలయునవకాశము లభించినది. శైలి, ఛందస్సులు రసభావములకుద్దీప్తిని కలిగించుచుండును. రసభావానుగుణమైన ఛందములో సాగినరచన పాఠకులపై చూపునట్టి సశక్తమైన, ఆకర్షణీయమైన ప్రభావము తద్విరహితమైన రచనలయందంతగా కానరాదు. పోతనభాగవతము వ్యాసభాగవతముకంటె మిన్నగా జనాదరణమును పొందుటకు మిగిలిన కావ్యాంగములతో బాటు ఛందస్సుకూడ తన భూమికను నిర్వహించినదని నిస్సందేహముగా చెప్పవచ్చును. పోతన యంతరంగము భక్తిసంభరితమగుటచేతను, భగవత్స్తుతికి లయానుగుణమైన రచనప్రధానమగుటచేతను పోతనచంపకమాలాది ప్రసిద్ధవృత్తములనే గాక లయబద్ధమైన రచనకనువైన దండకాదులను, పంచచామర స్రగ్ధర మున్నగు వృత్తవిశేషములనుకూడ ప్రయోగించెను. శబ్దాలంకారబహుళమగు నీతని రచనలోని

మర్మముకూడనిదియే. పోతనకందపద్యములకొక ప్రత్యేకప్రతిపత్తి కలదు. వీరి కందములు భక్తిరసగుళికలవలె నుండుటయేగాక ద్విత్రిచతుష్పంచప్రాసాలంకృతమై ఏ భావమునైనను అందముగానందించు నేర్పు పోతనకందములలో కానవచ్చుచున్నది. పోతనఆటవెలది కవితారంగస్థలమున తన ఒయ్యారపునడకలను జూపుచు పాఠకుల నలరింపచేయుచుండును. వీరి యాటవెలదినిగూర్చి పుట్టపర్తి నారాయణాచార్యులవారి యభిప్రాయమును పరికించవలసియున్నది "దీనిలోని సౌందర్యమును 'చాలు చాలు' ననునంత వరకు పోషించినవాడు వేమనయోగి. కాని తొలుత నొకవింత యొయ్యారముతో ఆంధ్రభాషలో నాటవెలది యడుగు పెట్టినదీ పోతన్నతోనే"[16] వీరుతనరచనలో కందములనధికముగాను, అనంతరము సీసములను, ప్రీతితో వాడినట్లు కానవచ్చుచున్నది. సంస్కృతమునందువలెనే విశ్రాంతి స్థానమునందు పదము పూర్తిచేసి, తెలుగుసంప్రదాయమునననుసరించి యక్షరమైత్రిని కూర్చుట వీరియతిలో కానసగు విశేషము. శబ్దాలంకారపరమైనశైలి యితనికి సహజసిద్ధమైనదగుటచే నందంతర్భూతముగనే ప్రాసలో నీతడుచూపిన వైచిత్రినీఅవగాహన చేసుకొనవలసియున్నది. నర్తకి సాధారణముగా నృత్యముచేసినపుడుకూడ సౌందర్యమున్నను, కాళ్ళకుమువ్వలుకట్టుకొనునప్పటి యదనపుసౌందర్యమువలె, రసానుగుణమైన భావానుగుణమైన ఛందస్సుల ఎన్నికతోబాటు వానితో పొత్తుగల మోతాదులోని శబ్దాలంకారయోజనయున్నట్లే యదనపుసౌందర్యమును, ఆయాఛందములకు తత్పరిపుష్టములగు రసభావములకు విశేషోత్కర్షణమును పుష్టిని, చేకూర్పజాలియుండును. ఇట్టి ఛందఃప్రయోగ వైశిష్ట్యము కలిగియుండుటచే మూలాతిరిక్తమైన నాదసౌందర్యము నందించుచు, రసభావములలో రంగరించుకొనుటచేనవి సార్థకములై సాధారణపాఠకులను సహితమలరించుచున్నవి.

శైలీపరముగా శ్రీనాథునిసీసములు వింతసొబగులను సంతరించుకొనినవని చెప్పుచుందుము. భావమును, సన్నివేశమును, విస్తృతముగా అఖండముగాచిత్రించుటకు అలవాటుపడినవాడు పోతన. ఈశిల్పమువలన తత్తచ్చిత్రణమున తమదైర్ఘ్యమునుబట్టి, నడకనుబట్టి, తుదిని గీతిరూపమగు పరిణతినిబట్టి, అనువుపడి, వీరిసీసములు తమ మనుగడను సార్థకముచేసికొనినవని చెప్పవచ్చును. మచ్చుతునకలను కొన్నిటిని పరికింపుడు

**సీ.** సత్యవ్రతుని నిత్యసంప్రాప్తసాధనుఁ
గాలత్రయమునందుఁ గలుగువాని

భూతంబులైదును పుట్టుచోటగువాని
నైదుభూతంబులం దమరువాని
నైదుభూతంబులు నణఁగినపిమ్మటఁ
బరగువానిని సత్యభాషణంబు
సమదర్శనంబును జరిపెడువానిని
నిన్నాశ్రయింతుము నీ యధీన

ఆ. మాయచేత నెఱుకమాలినవారలు
పెక్కుగతుల నిన్నుఁ బేరుకొందు
రెఱుఁగనేర్చు విబుధు లేకచిత్తంబున
నిఖిలమూర్తులెల్ల నీవ యండ్రు.

-ఆం. భాగ. దశమ. పూ. భా. 89.

శ్లో. సత్యవ్రతం సత్యపరం త్రిసత్యం
సత్యస్య యోనిం నిహితం చ సత్యే ।
సత్యస్య సత్యమృతసత్యనేత్రం
సత్యాత్మకం త్వాం శరణం ప్రపన్నాః ॥

– సం. భాగ. 10 2-26.

అను శబ్దాలంకారయుతమైన మూలమునుమించిన సమగ్రత పై యనువాదమునకు కలుగుటలో సీసపద్యము మిక్కిలి సహకరించినది.

మహావిష్ణువు దశావతారవర్ణనమంతర్భూతముగా నతనిబాల్యలీలలను సమగ్రముగా, అఖండముగా వర్ణించుటకు సీసముపకరించినట్లు తక్కినవి అంతగానుపకరించ వనవచ్చును

సీ. తోయంబు లివి యని తొలఁగక చొచ్చెదు
తలఁచెదు గట్టినఁ దరలనెత్త
మంటితో నాటలు మానవు కోరాడె
దున్నతస్తంభంబు లూపఁబోయె

దన్యుల నల్పంబు లడుగంగఁ బాడెదు
రాచవేటలఁ జాల అవ్వ దెచ్చె
దలయవు నీళ్ళకు నష్టంబు గట్టెదు
ముసలివై హరివృత్తి మొనయఁజూచె

ఆ. దంబరంబు మొలకు నడుగవు తిరిగెద
వింకఁ గలికి సేత లేల పుత్ర!
నిన్ను వంప వ్రాల్చ నే నేర ననియొ నీ
విట్టు క్రింద మీఁదు నెఱుగకునికి

— ఆం. భాగ. దశమ. పూ. భా. 375

రౌద్రవీరాది రసపుష్టికి, ఉద్దీప్తికి శార్దూలమత్తేభములు, శబ్దాలంకారానుప్రాణిత సుదీర్ఘ వచనములు సహకారులనవచ్చును.

శా. అంహఃకర్మ్ములు దల్లడిల్ల భయదాహంకారుఁడై సీరి దో
ర్రంహం బొప్ప హలాహతిన్ రథధనూరథ్యంబులం గూల్చి తత్
సంహారస్పృహఁ జొచ్చి పట్టెను జరాసంధున్ మదాంధున్ మహా
సింహంబున్ బలిసింహముఖ్యము బలశ్రీఁ బట్టు నేర్పేర్పడన్.

— ఆం. భాగ. దశమ పూ. భా. 1572.

శ్లో. జగ్రాహ విరథం రామో జరాసంధం మహాబలమ్ ।
హతానీకావశిష్టాసుం సింహః సింహమివౌజసా ॥

— సం. భాగ. 10–50–31.

అను మూలానువాదములందలి బలరాముడు జరాసంధుని పట్టిన విధమును గాంచినచో అనువాదమునందు రసానుగుణమైనరీతిలో ఛందమును సాగినదని విస్పష్టముగా చెప్పవచ్చును.

మ. హరిరింఖారథనేమిసద్భటపదవ్యాఘట్టనోద్ధూతదు
స్తరధూళీపటలప్రభూతనిబిడధ్వాంసప్రవిధ్వంసకృ
త్కరశాతాసిగదాదిహేతిరుచు లాకాశంబు నిండన్ వియ
చ్చరదృక్షుల్ మిఱుమిట్లు గొల్ప సమరోత్సాహంబు సంధిల్లగన్

— ఆం. భాగ. దశమ. ఉ. భా. 844.

పాఠకులలో సమరోత్సాహము సంధిల్లు కు ఇంపలి దీర్ఘసమాసరచనతోకూడిన మత్తేభ వృత్తము కొంత ప్రోద్బలకమనుటలో అతిశయోక్తి లేదు.

"మాగధమాధవ వాహినులు రెండు నొండొంటిం దాకి రౌద్రంబున, సంవర్తనమయసముద్రంబు భంగి నింగికిం బొంగి, చెలంగి, చలంబునం దలపడి, పోరునెడ, మసరు కలిసి, మహారణ్యంబులు వెలువడి మార్కొను మదగజంబులమాడ్కిని, మహోత్కంఠంబులగు కంఠీరవంబుల గద్దన, దుర్లభంబులగు శరభంబులచాడ్పునం, ప్రచండంబులగు గండభేరుండంబుల గమనికం, దమ తమ మొనలకుం దలకడచి, వీరరసంబులు వివిధరూపంబులైన విధంబునం బదుగురు నూర్వురు గములై కులకుధరగుహాంతరాళంబులు నిండ, సింహనాదంబు లొనర్చుచు, నార్చుచు, నట్టహాసంబులు సేయుచు, నరివీరుల రోయుచు, పటహకాహళభేరీశంఖశబ్దంబులకు నుబ్బుచు, గర్వంబులం బ్రబ్బుచు, గదల వేయుచుం, గాండంబుల నేయుచు ముద్గరంబుల నొత్తుచు, ముసలంబుల మొత్తుచు...............................

- ఆం. భాగ దశమ. పూ. భా. 1554.

ఇత్యాదిగా రసవాహిని సాగుటకు లయానుగుణమైద సుదీర్ఘవచనము సహకరించుచున్నది

భక్తిరసప్రవాహము భక్తుడైన పోతన అంతరంగమునుండి పెల్లుబికివచ్చునపుడు లయబద్ధమైన గతి వడి కలిగి నాదసౌందర్యవిలసితములైన దండకాదులయత్నముగా అనువాదమున ప్రవేశించి భక్తితన్మయత్వమును కలిగించి భగవత్సాక్షాత్కారమొనరించుచున్నవి. ఉదాహరణమునకు క్రూరకృత శ్రీకృష్ణస్తుతి పూర్వకమైన

"దండకము. శ్రీమానినీమానచోరా! శుభాకార! వీరా! జగద్ధేతుహేతుప్రకారా! సమస్తంబునస్తంగతంబై, మహాలోలకల్లోల మాలాకులాభీల పాథోనిధింగూలగా బాలకేళీగతిం దేలి, నారాయణాఖ్యం బటుఖ్యాతిశోభిల్లు నీ నాభికంజంబులో లోకపుంజంబులం బన్న విన్నాణియై మన్నయా బమ్మ యుత్పన్నుఁ డయ్యెంగదా, పావకాకాశవాతావనీవార్యహంకార మాయామహామానసాదుల్ హృషీ

కాదులున్ లోకముల్ లోకబీజంబులన్ నిత్యసందోహమై, నీ మహా దేహమం దుల్లసించున్ వసించున్ నశించున్ జడత్వంబు లేకాత్మమై యొప్పు నీ యొప్పిదం బెల్లనో చెల్ల! చెల్లన్ విచారింప వా రెంతవా రెంతవారైన ..........................................

కల్కిమూర్తిం బ్రవర్తించు నిన్నెన్న నే నెవ్వడన్, నన్ను మాయా విపన్నున్, విషణ్ణుం, బ్రపన్నుం, బ్రసన్నుండవై, ఖిన్నతం బాపి, మన్నింపవే, పన్నగాధీశతల్పా! కృపాకల్ప! వందారుకల్పా! నమస్తే, నమస్తే, నమస్తే, నమః."

— ఆం భాగ. దశమ. పూ. భా. 1232.

అనుదండకమును పేర్కొనవచ్చును. మూలమును మించిన భక్తితన్మయత పోతన యక్రూరునిలో సుద్దీప్తమైనట్లు కన్పట్టుటకు ఈస్తోత్రము దండకరూపమునునుండుటయే కారణము. భక్తులెల్లరు నీ దండకమును పారాయణమొనరించుచున్నారేగాని మూలమునందలి స్తోత్రమునుగాదనుట సర్వజనవిదితము లయబద్ధమైనగతి, వడి కలిగిన తగణదండకమగుటచే నాదసౌందర్య విలసితమై మనమునందొకవిధమైన ఉత్సాహమును జనింపజేసి తన్మయత్వమును కలిగించుటయే దీనికి కారణము దండకరూపమగు రచనమున నభివ్యక్తమగు భక్తిభావము ఒడ్డొరసిపారు వర్షర్తునదీప్రవాహమువలె అనుభవగమ్యము కాగలదు.

నీతివాక్యములు సూత్రప్రాయములుగానుండిన ప్రభావవంతములుగానుండును గాని విస్తరించి వ్రాయుటలో కాదు. కావుననిట్టివానికి కందపద్యము మిక్కిలి సహకరించ గలదని తిక్కనాదులుగ్రహించిన మర్మమునితడును ఆకళింపుజేసుకొనినాడు. కావున ఆయా నీతులను, హితవులను ఉపదేశించుటకందములైన కందములను వాడుట గమనించవలసియున్నది. ఈతనిచేతిలో కందములు భక్తిరసగుళికలవలెనలరారుచుండును మచ్చునకు కొన్ని పరికింపుడు

క. ఎందును గాలము నిజమని
మందతనంబునను బుద్ధిఁబాయక ఘనులై
యెందాక బుద్ధి నెగడెడి
నందాకఁ జరింపవలయు నాత్మబలమునన్.

— ఆం. భాగ దశమ. పూ. భా. 48.

క. వావి నెఱుంగని క్రూరుని
జీవన్మృతుఁ డనుచు నింద సేయుదు రతఁడున్
బోవును నరకమునకు దు
ర్భావముతోఁ బ్రతుకు టొక్క బ్రతుకే తలపన్.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 81.

క. కాలము ప్రబలులకును బలి
కాలాత్మం డీశ్వరుం డగణ్యుఁడు జనులన్
గాలవశులుగాఁ జేయును
గాలము గడవంగ లేరు ఘను లెవ్వారున్.

— ఆం. భాగ. దశమ. పూ. భా. 1641.

క. సర్వము నీలోనిదిగా
సర్వాత్ముఁడ వాదివస్తుసంపన్నుఁడవై
సర్వమయుడవగు నీకును
సర్వేశ్వర ! లేవు లోను సంధులు వెలియున్.

— ఆం. భాగ. దశమ పూ. భా. 119.

క. గురుమతిఁ దలఁపగఁ బ్రదిజగ
ద్గురుఁడ వనంత దగినీకు గురుఁ డనగా నొం
డొరుఁ డెవ్వఁ డింతయును నీ
కరయంగ విడంబనంబ యగుఁ గాదె హరీ !

— ఆం. భాగ. దశమ. ఉ. భా. 1004.

గోపికలు యశోదకడకు వచ్చి బాలగోపాలునిపై చాడీలుచెప్పు సందర్భమున సుమారు 20 కందపద్యములు కానవచ్చుచున్నవి. బాలగోపాలుడు లీలారూపధారియని యెఱింగినగోపికలాతని దుడుకుచేష్టలను భరింపలేని తప్పనిసరిపరిస్థితిలో నాతనితల్లితో నొక్కొక్కరు పల్కుమాటలివి. ఇట్టి సమయములందంతంతమాత్రముగా పలుకవలెనేగాని యధికముగా వారిచే పలికింపరాదు. పోతన యీ విషయము నెఱింగినవాడుగావున నిట్టి ఘట్టములందంతంతమాత్రముగా వారి వారి బాధను వెడలు గ్రక్కుటకు కందపద్యము లనువుగానుండునను విషయమునితడు గుర్తించినట్లు దీనినిబట్టి తెలియుచున్నది.

యశోద చిన్నిమగవానిగనెనని తెలుసుకొనిన గోపకాంతలు సంతోషాతిరేకమున తడబడుచు నందునిగృహమునకేగు సందర్భమునందలి క్రిందిపద్యమున వారి గమనము ధ్వనింపబడుచున్నతీరు గమనింపుడు.

క. జడగొనులును బలుపిఱుఁదులుఁ
బిడికెడు నడుములును వలుదబిగి చనుగవలున్
వెడదనయనములు సిరిదడఁ
బడు మోములు భ్రమరచికురభరములు నమరన్.

ఆం భాగ. దశమ. పూ. భా. 185.

హృద్గతభావముయొక్క గతివిశేషమును పద్యముయొక్కనడక తెలియజేయుట ప్రశంసార్హము.

క. ఇచ్చోఁ బచ్చిక మేసిన
విచ్చోఁ ద్రావినవి తోయ మేగిన విచ్చో
నిచ్చోట మంద గొన్నవి
యిచ్చో బాసినవి జాడ యిదె యిదె యనుచున్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 502.

గోవులనువెదకు గోపాలబాలుని మానసికస్థితి యెట్లున్నదో యీపద్యముయొక్కనడక ధ్వనింపజేయుచున్నది.

గతివిశేషమునుబట్టిగాక కొన్నికొన్ని వృత్తముల పేళ్ళకనుగుణముగానున్న సన్నివేశములందాయా వృత్తములను వాడుటయు పోతనలో కన్పట్టు విశేషలక్షణము.

గోపికలతో జలక్రీడను చాలించిన శ్రీకృష్ణుడు, మత్తేభము కరేణుయూధంబుతో క్రీడించు చందంబున వనమునందు క్రీడించినవిధము

మ. సతులుం దానును నీటిలో వెడలి భూషాగంధచేలాద్యలం
కృతుఁడై కుంభి కరేణుయూధములతోఁ గ్రీడించుచందంబునన్
లతలందుం దరులందుఁ బుష్పమయలీలాశయ్యలందున్ సుఖో
న్నతుఁడై కృష్ణుఁడు క్రీడలం దనిపె నా నారీలలామంబులన్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1099.

అని మత్తేభవృత్తమున వర్ణించుట యిందులకు తార్కాణము.

పరిమితిని, గుణమును ఆధారముగాగొని ఏభావమును, ఏరూపమును, ఏఛందములో చెప్పవలెనను మర్మమును, తనకభిమతమగు రసభావములను తనకభిమతమైన తీరున వ్యక్తముచేయగల్గునట్లాయా ఛందములను మలచుకొనిన తీరును పోతనఛందః ప్రయోగవైచిత్రిని తెలియజేయుచున్నది. తంత్రుల యమరికలోని మర్మమునెరిగినవా డమర్చిన వీణమున్నగు వాద్యవిశేషములు హృద్యమైన సంగీతమును ధ్వనించును. పోతన ఆయా ఛందముల మర్మమునెరిగిన కళామర్మజ్ఞుడు. కావున ఇతనిచే ప్రయోగింపబడిన ఛందములు తమ గుణవిశేషములను సార్థకమొనర్చుకొనుటయేగాక క్రొత్తమెఱుగులను సంతరించుకొనుట జరిగినదనవచ్చును.

# శైలీ విన్యాసము

వ్యాస, పోతనల రచనలు భిన్నరీతులలో సాగుటచే శైలికంగభూతములైన అలంకారయోజనలోను ఛందఃప్రయోగములోను మూలానువాదములు భిన్నములైనట్లే శైలివిషయమునను భేదముండుటలో వింతలేదు. వక్తవ్యాంశముపై ప్రధానముగా దృష్టినిలుపు పౌరాణికునకును, కళాత్మకపువిలువలు భావుకతలతో వక్తవ్యాంశము నందించు స్వభావముగల కవియైనపురాణకర్తకు, శైలీపరమైన భేదముండుటసహజము.

శైలిని మొట్టమొదట పద్యశైలి, గద్యశైలి యని రెండువిధములుగ విభజింప వచ్చును. ఈవిభాగమునుబట్టి చూచినచో మూలమునందధ్యాయాంతగద్యలును, 'శ్రీశుక ఉవాచ, రాజోవాచ' అనురెండు వచనములును దక్క మిగిలిన రచనయంతయు శ్లోకములరూపముననే కానవచ్చుటనుబట్టి వ్యాసదశమస్కంధమును పద్యశైలితోకూడిన గ్రంథముగా పేర్కొనవలసియున్నది. అనువాదమునమాత్రమట్లుగాక పద్యగద్యో భయమైన చంపూపద్ధతిలో రచనసాగుటచే ఇందుపద్యశైలియు, గద్యశైలియు కానవచ్చు చున్నది. ఇందలి గద్యశైలికి పద్యశైలికున్నంతటి ప్రాముఖ్యమును గలదు. గతములో చెప్పినవిధముగ రసప్రవాహములో తేలియాడించు శబ్దార్థాలంకారసమ్మిశ్రరూపమున ఇతని వచనరచనయు సాగుట గమనించవలసియున్నది. ఇతని వచనరచనలోనను ప్రాస విన్యాసములు, రూపకోపమాద్యర్థాలంకారములు, దీర్ఘసమాసములును, అధికముగా నుండుటనుబట్టి యితడు సంస్కృతమునందలి బాణమహాకవితో పోల్చదగినవాడనియు చెప్పవచ్చును. ప్రకృతివర్ణనములందును, యుద్ధవర్ణనములందును, తదితరఘట్టములం దచ్చటచ్చట సుదీర్ఘములై సహజధారావిలసితములైన వచనరచనలు గానవచ్చు చున్నవి. అంతియేగాక ఆయా భావములను, రూపమును సుంత విస్తృతముగా, నఖండ

ముగా చెప్పిననేగాని తృప్తిచెందని పోతనకు కొన్నితావులందు వచనరచనమనివార్యము, నప్రయత్నకృతముననుటకు ఇందుధరసుందరీ మందిరమునుండి రుక్మిణి వెలువడిన విధమును వర్ణించుటకు వెలువడిన వచనము[17] ప్రబలోదాహరణము కాగలదు.

పరిమాణములోనొక మితి కలిగిన పద్యముకంటె, తృప్తికలుగునంతవరకు కొనసాగించుటకువీలగు గద్యము, విస్తృతముగను అఖండముగను ఒకసన్నివేశమును గాని, భావమునుగాని చిత్రించుటలో మిక్కిలిసమర్థవంతము కాగలదనుటకు పోతన గద్యములు చక్కని దృష్టాంతములు. పెక్కుతావుల తత్సమసమాస బహుళములగు వచనములు కనవట్టినను, కొన్నితావులందలతియలతి తెలుగుపదములతో వెలుగొందు వచనములును కాననగును.

కావ్యాంగములపరముగా శైలిని విభజింపదలచినచో 1. అలంకారప్రధానాత్మక శైలి. 2. అలంకారప్రచురభావాత్మకశైలి 3. ప్రసాదపూర్ణ, అనలంకృత భావాత్మకశైలి 4. ఇతివృత్తాత్మకశైలి యని ప్రధానముగా నాల్గువిధములుగా విభజింపవచ్చును. డా. హరవంశలాల్‌శర్మగారును ఇట్టివిభాగమే కావించియున్నారు.[18] ఈదృష్టితో చూచినచో సాధారణముగా పురాణములన్నియు నితివృత్తాత్మకశైలిలోనే సాగినవని చెప్పవచ్చును. వ్యాసదశమస్కంధము (భాగవతము) కూడ ఇతివృత్తాత్మకశైలిలోనే సాగినను, అది తాత్త్వికగ్రంథమగుటచేతను, వ్యాసుడు ప్రధానముగా తాత్త్వికుడగుటచేతను తదను గుణముగ నందందు కొంత క్లిష్టత కానవచ్చుచున్నది. అందలి క్లేశము కేవలము శబ్దపరమైనదిగాగాక తత్ప్రతిపాదిత విషయపరముగానుండుట గమనింపదగియుండును. అవి తాత్త్వికఘట్టములగుటచే నందలి పదములలతియలతి పదములవలె కనవట్టినను, ఆయాపదములందలి పరమార్థమును గ్రహించుటకు వ్యాఖ్యల నాశ్రయించవలసివచ్చు చున్నది. కావుననే 'విద్యావతాం భాగవతే పరీక్షా' అనునభియుక్తోక్తియు వచ్చి యుండును.

అనువాదము ప్రధానముగా అలంకారప్రచుర భావాత్మకశైలిలో సాగినదని చెప్పవచ్చును. పోతన శబ్దార్థాలంకారముల సమ్మిశ్రితరూపమగు రచన రసభావపుష్టికి సౌందర్యమునకు ప్రోద్బలకమైనవిధము లోగడ అలంకారములనుగురించి వివరించు సందర్భమున ప్రసక్తము. కొందఱు లోకోక్తులను జాతీయములను నైపుణితో ప్రదర్శించి తమశైలికి దీప్తిని కలిగింపగా సహజపాండిత్యప్రతిభాసంపన్నుడైనపోతన రచనలోని ఉక్తులే లోకోక్తులుగా జనాదరణమునుపొంది స్థిరపడుట శైలీపరమైన పోతనప్రతిభకు విజయపతాకగాపేర్కొనవచ్చును. దీనికి ఊరక రారుమహాత్ములు (ఆం. భాగ. దశమ. పూ. భా. 283), రాచబిడ్డడయిన అవ్వాడే లె

( ఆం. భాగ. దశమ. పూ భా. 321 ) పంచియిడుట నెచ్చెలితనము (ఆం. భాగ. దశమ. పూ. భా. 494) ఏమి కనుమాయయోగాని యెఱుగ మధిప (ఆం. భాగ. దశమ. ఉ భా. 377), ఇత్యాదులు పెక్కింటిని ఉదాహరింప వచ్చును.

పర్యాలోచనచేయగా మూలమునందాలంకారికమైనరచన క్వాచిత్కము ప్రాసంగికముకాగా, అనువాదమునందు ప్రచురము, అనుపదమునై, యలరారుచున్నదని చెప్పవచ్చును. రోచకమై, స్పష్టత సారళ్యముకల్గిన శైలియు పోతనరచనలోకానవచ్చు చున్నది. దీనినిబట్టి పోతన సాలంకృతమైన శైలిని ఆదరించువాడుగామాత్రమే గాక సరళమైనశైలినికూడ రోచకమగురీతిని ప్రయోగించినవాడుగనే యతని భాగవత శైలినిబట్టి గుర్తింపగలము.

క. కొందఱకుఁ దెనుఁగు గుణమగుఁ
కొందఱకును సంస్కృతంబు గుణమగు రెండుం
గొందఱకు గుణములగునే
నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్.

— ఆం. భాగ. ప్రథమ. పీఠిక. 18.

విసువుజనించురీతి నొకేవిధమగుశైలిని పాటించువాడుగాక ఇతడు శైలీవైవిధ్యము నాదరించినట్లు పై పద్యము స్పష్టము చేయుచున్నది. ఈపద్యమునవే అతడు వాచ్యముగా చెప్పనిది, మనముగ్రహింపక తప్పనిదియునగు విశేషమింకొకటి గలదు. ఎట్టి శైలీభేదమును వాడినను దాని బాహ్యసౌందర్యమును, రసభావములను వ్యక్తము చేయుటలో దాని సామర్థ్యమును, సుంతయు తగ్గనివిధమే పోతనశైలి కబ్బిన విశేష మనుట. ఒకచో తత్సమపదసమాసబహుళమైనశైలి, ఒకచోఅలతియలతి తెలుగుపదముల శైలియు నతని ప్రయత్నములేకయే చోటుచేసుకొని ఆయాసన్నివేశములకు మెరుగులు దిద్దినవి. అతనిరచనయందు ఏయొక్కశైలియు పేలవముగా నుండుటగాని, యీతనికి ఇందొకదానియందు మక్కువ, వేరొకదానియందు చిన్నచూపుననుటగాని సత్యదూరమే కాగలదు.

మ. హరిరింఖారథనేమి సద్ఘటపదవ్యాఘట్టనోద్ధూతదు
స్తరధూళీపటలప్రభూతనిబిడధ్వాంతప్రవిధ్వంస కృ

తక్కరశాతాసిగదాదిహేతిరుచు లాకాశంబు నిండన్ వియ
చ్చరదృక్కుల్ మిఱుమిట్లు గొల్పసమరోత్సాహంబుసంధిల్లగన్
— ఆం. భాగ. దశమ. ఉ. భా. 844.

ఇందలి ఓజోగుణము వీరరసమును పరిపుష్టినొందించుచున్నదనుట స్పష్టము. అట్లే భీమజరాసంధులు ముష్టియుద్ధమొనరించు ఘట్టమునందలి క్రిందిపద్యములను చూచినచో తెలుగుపదములు రసానుప్లావితముగా సాగినవిధము విశదముకాగలదు.

ఉ. ప్రక్కలు చెక్కలున్ మెడలు ఫాలతలంబులచేఁ బగుల్చుచున్
ముక్కులు నక్కులున్ జెవులు ముష్టిహతిన్ నలియంగ గ్రుద్దుచున్
డొక్కలు బిక్కలున్ ఘనకఠోరపదాహతి నొంచుచున్ నెఱుల్
దక్కక స్రుక్క కొండొరులఁ దార్కొని పేర్కొని పోరి రుగ్రతన్.

ఉ. హుమ్మని మ్రోగుచున్ బెలుచ హుంకృతు లిచ్చుచుఁబాసి డాసికో
కొమ్మనుచు న్నొడ శ్శృగిలి గుల్లలతిత్తులుగాఁ బదంబులన్
గ్రుమ్మచు ముష్టిఘట్టనల స్రుక్కుచు నూర్పులు సందడింపఁగా
సొమ్మలువోవుచున్ దెలియుచున్ మదిఁ జేవయు లావుఁజూపుచున్
- ఆం. భాగ. దశమ. ఉ. భా. 736, 737.

మ. పరిఘల్ కోటలుకొమ్మలున్ బడగలున్ ప్రాసాదముల్ వీథులున్
హరులున్ దేరులువీసులున్ గజములున్ హర్మ్యంబులున్ వాద్యముల్
తరుణుల్ ధాన్యములున్ ధనంబులుమహోద్యానంబులున్ దీర్ఘికల్
కరమాశ్చర్యరుచిందనర్చు మధురన్ గాంచెన్ విభుండంతటన్.
- ఆం. భాగ. దశమ పూ. భా. 1243.

అని బలరామకృష్ణులుజూచిన మధురాపురీవర్ణనమునందలి విడివిడి పదములు పాఠకుల నలరించినట్లే శ్రీకృష్ణునికొఱకు నిర్మింపబడిన ద్వారకానగరము దీర్ఘసమాసముతో వర్ణింపబడియు నలరించుచున్నది. పరికింపుడు.

శా. సాధుద్వారకవాటకుడ్యవలభీస్తంభార్గళాసౌధాళీ
వీథీవేదిగవాక్ష చత్వర సభా వేశ్మ ప్రఘాణ ప్రపా

సౌధాట్టాలక సాలహర్మ్య విశిఖాసోపాన సంస్థానముల్
శ్రీధుర్యస్థితి నొప్పెఁ గాంచనమణిస్నిగ్ధంబులై యప్పురిన్.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1594.

అలతియలతి తెలుగుపదములతో మాధుర్యగుణోజ్జ్వలమైన ఈక్రింది సీసమువ శ్రీకృష్ణునికొఱకు వెదకు గోపికల మనోభావమును చిత్రించినవిధము తిలకింపుడు.

సీ. కొమ్మకుఁ బువ్వులు కోసినాఁ డిక్కడ
మొనసి పాదాగ్రంబు మోపినాఁడు
సతి నెత్తుకొని పేడ్కఁ జరిగినాఁ డిక్కడ
దృణములో లేదిదె తెలియవచ్చు
ప్రియకు ధమ్మిల్లంబు పెట్టినాఁ డిక్కడ
గూర్చున్నచొప్పిదె కొమరుమిగులు
నింతికిఁ గెమ్మోవి యిచ్చినాఁ డిక్కడ
వెలది నిక్కినగతి విశదమయ్యె

ఆ. సుదతితోడ నీరుఁ జొచ్చినాఁ డిక్కడఁ
జొచ్చి తా వెడలిన చోటు లమరెఁ
దరుణిఁ గామకేళిఁ దనిపినాఁ డిక్కడ
ననఁగి పెనగి యున్న యంద మొప్పె.

- ఆం. భాగ. దశమ. పూ. భా. 1026.

క. పట్టినఁ బట్టుపడని నినుఁ
బట్టెద మని చలముకొనినఁ బట్టుట బెట్టే
పట్టువడ వింద్రుడు పట్టే
పట్టుకొనన్ నాకుఁ గాక పరులకు వశమే

క. ఎక్కడ నైనను దిరిగెదు
వొక్కయెడన్ గుణము గలిగియుండవు నియమం
బెక్కడిది నీకు మఱచినఁ
జక్కనఁ బోయెదవు పెక్కుజాడలఁ బుత్రా!

- ఆం. భాగ. దశమ. పూ. భా. 373, 374

అను యశోదపలుకులు చిన్న చిన్న తెలుగుమాటలలో, పరమాత్మతత్త్వమునెఱిగించిన విధమును వ్యక్తీకరించుచున్నవి. పోతనభావనాత్మకశైలికివి మచ్చుతునకలు. ఇట్లుదాహరణములనిచ్చుచు బోయినచో భాగవతమునంతటిని యుదహరింపవలసివచ్చును. ఏల యన ప్రతిపద్యమునందును 'ఇదిపోతనశైలి' యనదగిన యొక ప్రత్యేకలక్షణముండును.

ఎక్కడ యే శైలి సరిపడునోతెలిసిన, కళామర్మజ్ఞులైన తక్కువమంది కవులలో పోతన యగ్రగణ్యుడు. పోతనయనువాదము మూలమునుమించిన ప్రజాదరణ పొందుటకీశైలియు తన భూమికను సమర్థవంతముగా నిర్వహించినదనవచ్చును.

# రసపోషణము

"పిబత భాగవతం రసమాలయం
ముహురహో రసికా భువి భావుకాః"అని వ్యాసోక్తి.

సంస్కృతాంధ్రభాగవతములు భక్తిరసాలయములనుట నిర్వివాదము భక్తి రసమగునా ? కాదా ? అనునదియే వివాదగ్రస్తమైనది. ఆలంకారికులంగీకరించినను అంగీకరింపకున్నను భక్తిని రసముగానంగీకరించుట సహృదయసమ్మతము కాగలదని చతుర్థాధ్యాయమున చెప్పబడినది. భక్తితత్త్వమునుగుఱించియు సోదాహరణముగా ఆ యధ్యాయమునందే విపులముగా చర్చించుటజరిగినది. మూలమునకానరాని తన్మయత యనువాదములోకానవచ్చుటయు ప్రదర్శింపబడినది. మూలభాగవతము నాంధ్రీకరించుచు పోతన భక్తిరసచిత్రణమున చూపిన ప్రత్యేకతనరసినట్లే ఆయా ఘట్టములలో ఇతర రసములను తన ఆంధ్రీకరణమున చిత్రించినతీరులోని వైశిష్ట్యమునుగూడ పరామర్శింప వలసియుండుటచే నిటనెన్నికచేసిన కొన్ని ఘట్టములందలి రసపోషణావిధానము సమీక్షింపబడుచున్నది

భక్తిరసమునకు ప్రధానమైన అంగరసము శృంగారము. భక్తి శృంగారములు పరస్పరవిరుద్ధములని ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు వక్కాణించియున్నారు.19 యథార్థమునరసినచో నివిరెండును విరుద్ధరసములుగావు. ఏలయన రెండింటి స్థాయి భావము 'రతి'యే. భగవత్సంబంధరతి విభావాదులచే రసస్థాయికిచేరి 'భక్తి' కాగా లౌకికసంబంధమైనరతి విభావాదులచే రసస్థితినిపొంది శృంగారమగుచున్నది. మధుర రతియే భక్తిరసము లేదా మధురరసమనియు రూపగోస్వామివారును చెప్పియున్నారు. అంతియేగాక 'రసోవైసః' రసస్వరూపుడు భగవంతుడేకదా ! కావ్యానందరూపమగు

రసముననుభవించుటకు లౌకికవాసనలకతీతముగా నుండవలెనుగదా ! లౌకికవాసనా రహితమై, అత్యంతస్వచ్ఛమై బ్రహ్మానందసహోదరమై యలరారు కావ్యానందమును మనవారు రసమనుచున్నారు. భగవత్పరమైన శృంగారమునందు లౌకికమైన కామవాసనలుద్భవించు నవకాశములేదు. కావుననే స్త్రీదేవతల యంగ ప్రత్యంగ వర్ణనము గావించిన స్తోత్రములు చదువునపుడు మనకు భక్త్యుద్దీప్తి కలుగుచున్నదేగాని లౌకికమైన వాసనలు కలుగకుండుట యనుభవములోని విషయము. ఇట్టి లౌకిక కామభావనా రహితమై, భగవత్పరమైన శృంగారమే భక్తి. అనగా శృంగారరసమందలి లౌకిక భావన తొలగి, భగవత్పరమైనచో భక్తియేగదా ! కావున భక్తి శృంగారరసములు, బ్రహ్మానంద, కావ్యానందములవంటివి అనగా సహోదరతుల్యములేగాని పరస్పర విరుద్ధములు కావు.

భక్తిరసమునకంగరసమగు శృంగారము భాగవతమున పోషింపబడినవిధము పరికింతము. భక్తిస్పర్శలేని శృంగారము భాగవతమున కానరాదు లౌకికదృష్టితో చూచు మనకు అది శృంగారమువలెగన్పట్టినను, భక్తియందంతర్భూతమగుట గమనింప వలసియున్నది. భక్తియందంతర్లీనముకానివానివలె కన్పడు ఘట్టములలో కుబ్జావృత్తాంత మొకటి.

లేపనాదులు శ్రీకృష్ణునకు సమర్పించి త్రివక్రత్వమును పోగొట్టుకొనిన కుబ్జ రతికేళినికోరగా నాతడామెకోరికను తీర్చెను ఈఘట్టమున శ్రీకృష్ణుడు కుబ్జాగృహమున కరిగినపుడు మూలమున గృహాదులుమాత్రమే వర్ణింపబడినవి. అనువాదమున నీ పట్టున శృంగారరసమునకాలంబనవిభావమైన నాయికానాయకులలో నాయికయైన కుబ్జను

ఆ. కాముశరముఁబోలె కమలారికళవోలె
మెలగి యాడ నేర్చు మెఱుఁగు వోలె
నిఖిలభువనమోహినీ దేవతయుఁబోలె
జెలువు మెఱసి యున్న చెలువఁ గనియె.

– ఆం. భాగ. దశమ. పూ. భా. 1486.

అని వర్ణించియున్నాడు. అనంతరము రతికేళిదేల్చినవిధమును మూలమునుమించి వర్ణింపబడినది. ఇందు సురతలక్షణములు సున్నితమైనరీతిలో వర్ణింపబడుట ప్రశంసార్హము.

ఉషానిరుద్ధుల శృంగారము మూలాతిరిక్తముగా వర్ణింపబడినది

శ్లో. తస్యోషా నామ దుహితా స్వప్నే ప్రాద్యుమ్నినా రతిమ్।
కన్యాలభత కాన్తేన ప్రాగదృష్టశ్రుతేన సా॥

- సం. భాగ. 10-62-12.

అని మూలమున ఉషాకన్య స్వప్నమునం దనిరుద్ధునితో రతినిపొందెననిమాత్రమే యుండగా అనువాదమున స్వప్నరతిని తలంచుచు విరహవేదనాదూయమానమానసయై యుండుట గమనింపుడు.

చ. సరసమృదూక్తులుం గుసుమసాయకు కేళియు శాటికాకచా
కరషణముల్ నఖక్రియలు గ్రమ్మఱగపోలలలాట మేఖలా
కర కుచ బాహుమూలములు గైకొనియుండుట లాదిగాఁదలో
దరిమది గాఢమై తగిలె దన్వకుఁ డచ్చున నొత్తినట్లుమై.

-ఆం. భాగ. దశను. ఉ. భా. 329.

ఇట్లు మూలాతిరిక్తముగా శృంగారరసపోషణమనువాదమున గావింపబడినది.

ఒకేసమయమున, ఒకేపాత్రయందు రసద్వయ సమ్మేళనమును, ఒక్కొక్కతఱి విరుద్ధరససమ్మేళనమును, ప్రదర్శించు నేర్పు పోతనలోని ప్రత్యేకత. దీనికి నరకాసురసంహారమునందలి సత్యభామపాత్ర ప్రబలోదాహరణము కాగలదు.

మ. పరుఁ జూచున్ వరుఁ జూచు నొంప నలరింపన్ రోషరాగోదయా
విరతభ్రూకుటి మందహాసములతో వీరంబు శృంగారమున్
జరగన్ గన్నులఁ గెంపు సొంపుబరఁగన్ జండాస్త్రసందోహమున్
సరసాలోకసమూహమున్ నెఱపుచున్ జంద్రాస్య హేలాగతిన్.

- ఆం భాగ. దశమ. ఉ. భా. 178

సీ. రాకేందుబింబమై రవిబింబమై యొప్పు
నీరజాతేక్షణ నెమ్మొగంబు
కందర్పకేతువై ఘనధూమకేతువై
యలరుఁ బూఁబోణిచేలాంచలంబు
భావజుపరిధియై ప్రళయార్కపరిధియై
మెఱయు నాకృష్టమై మెలతచాప
మమృతప్రవాహమై యనలసందోహమై
తనరారు నింతి సందర్శనంబు

ఆ. హర్షదాయియైన మహారోషదాయియై
పరగు ముద్దరాలి బాణవృష్టి
హరికి సరికిఁ జూడ నందంద శృంగార
వీరరసము లోలి విస్తరిల్ల - ఆం. భాగ. దశమ. ఉ. భా. 183

ఇత్యాదిగా వీరశృంగారములు సమ్మిశ్రితరూపమైనరీతిలో వర్ణించనేర్పు నాచనసోముని నుండి కొంతయలవడినను ఇంతటి రససమ్మేళనమునితరత్ర కానము.

తే. 'వీరశృంగార భయరౌద్ర విస్మయములు
గలసి భామిని యయ్యెనో కాక యనఁగ
— ఆం. భాగ. దశమ. ఉ. భా. 177

అనునట్లు సత్యభామ ఈసందర్భమున దర్శనమిచ్చుచున్నట్లు పోతన చెప్పుటనుబట్టియే ఈఘట్టమునందలి రసప్రవాహముల సమ్మేళనమెట్టిదో సువ్యక్తమగుచున్నది. మూలమున నీపట్టునసిట్టి రసనిర్భరత కానరాదు.

శ్లో. శూలం భౌమోఽచ్యుతం హన్తుమాదదే వితథోద్యమః।
తద్విసర్గాత్ పూర్వమేవ నరకస్య శిరోహరిః ।
అపాహరత్ గజస్థస్య చక్రేణ క్షురనేమినా॥ -సం. భాగ. 10-59-21

అని శ్రీకృష్ణుడే నరకాసురుని సంహరించినట్లు వర్ణింపబడినది. సత్యభామ యుద్ధ మొనరించినట్లు కానరాదు.

దుష్టశిక్షణకొఱకునవతరించిన శ్రీకృష్ణుడాయా రాక్షసాదులను, దుర్మార్గులను, నిర్మూలించు సందర్భమునందాయా ఘట్టములలో వీరరసము వర్ణితమగుచుండును. భాగవతమునందు వైరభక్తియు ప్రతిపాదింపబడినదనుట విదితము. ఇట్టి వైరభక్తిలో భక్తికి వీరమంగముగా కన్పించు ఘట్టములు పుష్కలముగానిందుగలవు. ఉదాహరణమునకు రోషప్రమోదనిద్రాభాషాశనపానగతులయందు దోషగతితో చక్రినిచూచు కంసుని సంహరించుటకు శ్రీకృష్ణుడతనిపై లంఘించినవిధము పరికింతము.

శా. జంఘాలత్వముతో నగోపరిచరత్సారంగహింసేచ్ఛ నుల్లంఘింపం గమకించు సింహము క్రియన్ లక్షించి పౌరప్రజా
సంఘాతంబులు తల్లడిల్ల హరి కంసప్రాణ హింసార్థియై
లంఘించెన్ ధమగంబుమీఁదికి రయోల్లాసంబు భాసిల్లగన్.
- ఆం. భాగ. దశమ. పూ. భా. 1371

అనువాదముననిట్లు వీరరసప్లావితముగా కన్పట్టుచుండ మూలమున

శ్లో. ఏవం వికత్థమానే వై కంసే ప్రకుపితోఽవ్యయః ।
లఘిమ్నోత్పత్య తరసా మంచముత్తుంగమారుహత్ ॥
- సం. భాగ. 10-44-34.

అని మాత్రము వర్ణింపబడినది. ఈపట్టున మూలమునకానరాని వీరరసమనువాదమున పోషింపబడుట స్పష్టము.

ఇట్లు వైరభక్తులకుసంబంధించిన ఘట్టములందుమాత్రమేగాక తదితరములైన తావులందును వీరరసము ఔచితీపోషకముగా సాగినది. కాళియమర్దనము, యమలార్జున భంజనము, కుచేలరక్షణమిత్యాదులందు దయావీరము; మృతుడైన గురుపుత్రునితెచ్చు ఘట్టమునందు ధర్మవీరము; జరాసంధ, ముష్టిక చాణూరాదులవధించు ఘట్టము లందును, తదితరములైన ఆయా యుద్ధఘట్టములందును, యుద్ధవీరము; మూలాతి శాయిగా పోషింపబడుట ప్రశంసింపదగియున్నది.

అస్ఫుటముగా, స్పష్టాస్పష్టముగా విడుచు తీరుగాక ప్రసంగముతో పొత్తుకుదిరి నంతవఱకు ఆయాఘట్టములందాయారసములను కొంతైన స్పష్టముగా చిత్రించి ముందుకుసాగుటయే పోతనరచనావైఖరిలోని లక్షణము.

రుక్మిపరాభవము మొదలగు తావులందు హాస్యము; యశోదకు విశ్వరూప ప్రదర్శనము, గోవర్ధనోద్ధరణమిత్యాదులందు అద్భుతము; శ్రీకృష్ణుడు దావాగ్నిని మ్రింగిన ఘట్టమునను, ఇంద్రుడు శిలావర్షమునుకురిపించుట మున్నగుఘట్టములలో, గోప, గోపికాపరమైన భయానకము; కృష్ణబాణాసుర యుద్ధరంగవర్ణనములో బీభత్సము; శ్రీకృష్ణునివెంట కాలయవనుడు గుహలో ప్రవేశించి అందు నిద్రించుచున్న నొకనినిజూచి కృష్ణుడని భావించిన సందర్భమునను, ఆయాయుద్ధవర్ణనములందును ప్రతినాయకాశ్రితముగ రౌద్రము; కంసుడు సంహరింపబడగా నతనిభార్యలు దుఃఖించు ఘట్టమునందును, బాలగోపాలుడు కాళియునిచే పట్టబడిన ఘట్టమునందును, తదితరము లగు ఘట్టములందును, కరుణరసమును; ప్రతీయమానమగుచుండును. సుదాముని ప్రార్థనలో శాంతరసము స్ఫురించుచు భక్తియందు పర్యవసించుచున్నది.

కరుణరసము పలుతావులందు మూలాతిశయముగా పోషింపబడుచుండును. భక్తి యొక్క ప్రధానాంగరసములలో ఇదియునొకటియగుటయే యిందులకుకారణము.

ఇట్లు రసపోషణము మూలమునకంటె భిన్నముగా అనువాదమున వెలయుటకు రచనాపరములైన భేదములేగాక ఆయా పాత్రలయందు పోతన తన్మయుడగుటయు

కారణము. అట్టి తన్మయత వ్యాసునిలో లేదు. కావుననే శైలియున్నగు రావ్యాంగము లాయారసానుగుణముగా నప్రియత్నముగా ప్రవేశించి యీరనిందనువాదమును రస మయమొనర్చి, పాఠకులను విగళితవేద్యాంతరస్థితికి తీసుకొనిపోయి మరల మరల భాగవతరసాస్వాదనమును చేయవలెనను కుతూహలమును కలిగించుచున్నవి.

పోతనభాగవతము అనూదితగ్రంథమైనను, స్వతంత్రగ్రంథమువలె ఖ్యాతి మూలమునుమించిన జనాదరణపొందుటకు ప్రధానకారణములలో రసనిర్భరతను మొట్ట మొదటగా పరిగణింపవచ్చును.

భక్తిరసమును పుష్కలముగాను, భక్తికి అంగభూతములుగానుండు శృంగార వీరకరుణములను తత్తదితరరసములను ఆయా ఘట్టములలో ప్రసంగోచితమగు మేలుకును, పోషించి పురాణరచయితయైన వ్యాసుని భాగవతమునందు తన అనువాద మున పోతన ఒకవిశిష్టమైన మార్గమును అవలంబించియున్నాడు.

## అధస్సూచికలు


1. శ్రీమద్భాగవతానుశీలనము; పుట : 282
2. శ్రీమద్భాగవతానుశీలనము; పుట : 283
3. ఆం. భాగ. దశమ. పూ. భా. 1710
4. ఆం. భాగ. దశమ. ఉ. భా 962
5. భాగవతవైజయంతిక; పుట : 100
6. ఆంధ్రభాగవతవిమర్శ; పుట : 408
7. శ్రీమద్భాగవతానుశీలనము; పుట : 801
8. ఆం. భాగ. (అకాడమీ ప్రతి) పీఠిక; పుట : 89
9. సం. భాగ. 10-20-88 నుండి 49 వరకు
10. ఆం. భాగ. దశమ. పూ. భా. 751 నుండి 761 వరకు
11. శ్రీమద్భాగవతానుశీలనము; పుట : 855
12. భాగవతవైజయంతిక; పుట : 125
13. వేంకటరావు, నిడుదవోలు; పోతన; పుట : 104
14. సమగ్ర ఆంధ్ర సాహిత్యం, అయిదవ సంపుటం; పు. : 243
15. సం. భాగ. 10-29-4 నుండి 7 వరకు
16. ఆంధ్రమహాభాగవతోపన్యాసములు; పుట : 197
17. ఆం. భాగ. దశమ. పూ. భా. 1744
18. భాగవత్-దర్శన్; పుట : 160
19. వేంకటావధాని, దివాకర్ల; పోతన; పుట : 60

# ఉపసంహారము

పోతన భాగవత దశమస్కంధమును సంస్కృతమున దానికి మూలమగు వ్యాసభాగవత దశమస్కంధముతో ప్రత్యేకముగ తులనాత్మక పరిశీలన జరిపి పోతన అనువాదము మౌలికముగ భాసిల్లుటయేగాక సొగసులలో మూలమును మించినదని సోపపత్తికముగనిందు నిరూపింపబడినది. ఈ ప్రయత్నము మూలముగ తెలుగులో ననూదితగ్రంథములు మౌలికగ్రంథములవలె భాసిల్లుచున్నవను కీర్తిని సుప్రతిష్ఠిత మొనరించుటకూడ జరిగినది.

వ్యాసుడు కేవలము పౌరాణికుడు. పోతన పౌరాణికుడేగాక భావుకుడు, కవి. వ్యాసుడు ప్రధానముగ తాత్త్వికుడు. పోతన భక్తుడు. వ్యాసునిది పురాణరచన. పోతనది ప్రబంధచ్ఛాయలో సాగిన పురాణరచన. వీరిరువురిలోని మౌలికములైన ఇట్టి భేదములవలన వీరి రచనలలో అన్నితావులందును వీని ప్రభావము గలదని సోపపత్తికముగ విశ్లేషింపబడినది.

భక్తికి ఆదిగ్రంథమనియు, ఆముష్మికధర్మమార్గమును బోధించి తరణోపాయమును చూపించు గ్రంథమనియు వ్యాసభాగవతము సంస్కృతవాఙ్మయమున కీర్తింపబడుచున్నది. పోతన భాగవతమునుమించిన భక్తిగ్రంథమాంధ్రవాఙ్మయమున లేదని ప్రశంసింపబడుటయేగాక కృష్ణభక్తి ప్రతిపాదకమైన భారతీయ భాషాసాహిత్యములలోనిది ప్రథమస్థానము నాక్రమించినది. ఇట్లు రెండును కీర్తింపబడుటకు కారణములై వానియందంతర్నిహితములైన గుణవిశేషములను విశ్లేషించి నిరూపించుట జరిగినది.

వ్యాసుడు భాగవతమును ఆత్మోపశాంతికొఱకు రచింపగ, పోతన శ్రీకైవల్య పదంబు చేరవలెనను తలంపుతో వ్రాసియున్నాడు. నారదునాజ్ఞానుసారము వ్యాసుడు భాగవతరచన చేయగా రామాజ్ఞానుసారమేగాక నాటి మత, సాంఘిక, రాజకీయ, సాహిత్యపరిస్థితులును ప్రేరేపించగ పోతన భాగవతరచనకుపక్రమించినాడని నిరూపింప బడినది.

పోతన మనస్తత్త్వము, భాగవతమునందలి కథాంశములను దృష్టిలో పెట్టుకొని చూచినచో తెలుగులో ఇతర అనువాదకులవలంబించిన స్వేచ్ఛకును, పోతన

అవలంబించిన స్వేచ్ఛకును కొంత భేదమున్నదని స్పష్టమగుచున్నది. భారతానువాదకులవలె సంక్షేపించుటయు, రామాయణానువాదకులవలె ఇతర కథాంశములను చేర్చుటయు ఈతని అనువాదములో నగణ్యమనవచ్చును. ఈ పరిశోధనవలన పై అంశమును సోపపత్తికముగ స్పష్టముచేయుటకు వీలైనది.

అమూలకత ఇతరరంగములలోకంటె భావములందును, తద్విస్తృతియందు నధికముగ కన్పట్టును. ఇట్టి అమూలకతయు మూలమునుమించిన సొగసులను సంతరింపచేయుటకు కారణమైనదని సోదాహరణముగ నిరూపింపబడినది.

అమూలకమను పదమునకర్థ వ్యాప్తి కలిగించి ఏయే యంశములు పోతన భావనాజనితములో, ఎంతవఱకుమాత్రమే వ్యాసుని భావములో సన్నిహితముగ పోల్చి స్పష్టముగ వివరించునవకాశము ప్రస్తుత పరిశోధన ద్వారమున కలిగినది.

మూలానువాదములాద్యంతము భిన్నములేయను భ్రాంతి కలుగకుండ యథామూలములుగ మూలప్రాయములుగ సాగిన అనువాదములు ప్రత్యేక అధ్యాయమున చర్చింపబడినవి. పోతన అనువాదములోని విశేషముల ప్రాశస్త్యముతోబాటు లోకోత్తరమైన అనువాదమునకు మూలగ్రంథమగు సంస్కృతభాగవతమునందును, తత్కర్తయగు వ్యాసునియందును గౌరవమును పెంపొందించుటకుకూడ ఈ సిద్ధాంత వ్యాసము సహకరించగలదని నా విశ్వాసము.

లక్ష్యపరముగ భక్తితత్త్వ ప్రతిపాదనములో మూలానువాదములు రెండును సమానమైనను, పోతన భక్తియోగి, భాగవతోత్తముడు నగుటచే నతని భాగవతములోని భక్తితన్మయత ఎట్లు పరాకాష్ఠ చెందినదో సోదాహరణముగ వివరింపబడినది. పోతన భాగవతము మూలమునుమించిన ప్రశస్తి పొందుటలోని మర్మమిదియే.

వారి వారి మనస్తత్త్వములు, రచనకై ఎన్నుకొనిన పథకములు భేదించుటచే వ్యాస - పోతనల భాగవతములను తులనాత్మకముగ పరిశీలించి చూచినపుడు కొన్ని తావుల విశేషముగు భిన్నత్వము కన్పట్టినచో దానికి నాశ్చర్యపడవలసిన అవసరము లేదు వ్యాసునికంటె పోతన అధికుడనిగాని పోతనకంటె వ్యాసుడు విశిష్టుడని గాని తలంపకుండుటకును, వారిలో నే యొక్కరి సవిశేషపు విలువలను నసంగతత్వము ఏర్పడకుండునట్లుగను చేయుటకిందు ప్రయత్నము గావింపబడినది.

వర్ణనలలోని అంగప్రత్యంగచిత్రణము, రూపసాక్షాత్కారవిధానము, అర్థాలంకార సౌందర్యముతోబాటు రసస్పర్శ మాత్రము కలిగియుండి గాక రస ప్రవాహమున మునిగితేలియాడు శబ్దాలంకారసౌందర్యమును తోడుచేసుకొనిన శైలీ విశేషము, పోతనతోబాటు పాఠకుడుకూడ భక్తిరసతన్మయత్వమున మైమరచు నట్టి స్థితివిశేషమునుపొందెడి తీరులో సాగిన రసపోషణవిధానము, పదములకూర్పు శబ్దాలంకారముల చేర్పులచే నదనపుసౌందర్యమునుపొంది ఉచితరీతిని వాడబడిన ఛందోవైవిధ్యము, పోతన భాగవతము మూలముకంటెనధికముగ జనాదరణ పొందుటకు తమ భూమికలను సమర్థవంతముగ నిర్వహించినతీరు మూలముతో సరిపోల్చుచు విశ్లేషించితిని.

సంస్కృతాంధ్ర వాఙ్మయములలో సుప్రతిష్ఠితులైన వ్యాస, పోతనల భాగవత దశమస్కంధములను తులనాత్మకముగపరిశీలించి విలువలనుకట్టుటలో నా శక్తికి కొలది ప్రయత్నించి పోతనఅనువాదము మూలమునుమించినదన్న ఉక్తిని, ప్రాసంగికముగ తెలుగు అనువాదములు మౌలికగ్రంథప్రాయములే అను ఉక్తిని సోపపత్తికముగ ధృవపరుపగలిగితినని విశ్వసించుచున్నాను. అయినను మహాకవి కాళిదాసు క్రింది పలుకులిట స్మరింపదగినవి.

"ఆపరితోషాద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్"



# ఉపయుక్త గ్రంథములు

## ఆంధ్ర గ్రంథములు :


1. అనంతరామశాస్త్రి, నేతి. - వ్యాసపూర్ణిమ. గుంటూరు - అరుణా పబ్లికేషన్స్. 1981-ప్ర.ము.

2. అప్పకవి, కాకునూరి. - అప్పకవీయము. మదరాసు - వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్. 1970.

3. అప్పన్ కృష్ణమాచార్యులు, శ్రీమాన్ కందాళై. - బమ్మెర పోతన భాగవతము. విశాఖపట్టణము - ఆంధ్రాయూనివర్సిటీపబ్లికేషన్స్. 1979.

4. ఆరుద్ర - సమగ్ర ఆంధ్ర సాహిత్యం 5వ సంపుటము. మద్రాసు, మచిలీ పట్టణము, సికింద్రాబాదు - యం. శేషాచలం అండ్ కంపెనీ. 1965 - ప్ర. ము.

5. కపుల, కె. - వ్యాససూత్రం. సికెందరాబాదు-యువభారతి. 1984-ప్ర.ము

6. కరుణశ్రీ. (సం) - భాగవత వైజయంతిక. హైదరాబాదు - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి. 1983-ప్ర. ము.

7. కేశవరావు, కేసులపాటి. - భాగవతవిమర్శనం. చింతల్‌పాడా - మమత పబ్లిషర్స్. 1980 - ప్ర. ము.

8. కులశేఖరరావు, యం. - తెలుగుపదవికాసము. హైదరాబాదు-ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమి. 1975 - ప్ర. ము.

9. కృష్ణమాచార్య, ఎక్కిరాల. - పురుషమేధము. విశాఖపట్టణము - ది వరల్డ్ టీచరు ట్రస్టు. 1979 - ప్ర. ము.

10. కృష్ణమాచార్య, ఎక్కిరాల. - శ్రీమద్భాగవత ప్రకాశము. 7 భాగములు. విశాఖపట్టణము - దివరల్డ్‌టీచర్స్‌ట్రస్టు. 1977 నుండి 1981.

11. గణపతిశాస్త్రి, చర్ల. (వ్యా) - భక్తితత్త్వదర్శనము (శాండిల్యనారదమహర్షులు) హైదరాబాదు-ఆర్షవిజ్ఞాన పరిషత్తు. 1972 - ప్ర. ము.

12. గురునాథరావు, అయినంపూడి. - ఎమెస్కో-వచన మహాభాగవతము. మొ. సం. మచిలీపట్నం, సికింద్రాబాద్ - యం. శేషాచలం అండ్ కంపెనీ 1984 - ప్ర. ము.

13 ,, ఎమెస్కో-వచన మహాభాగవతము. రెం. సం. మచిలీపట్నం, సికింద్రాబాద్-యం. శేషాచలం అండ్ కంపెనీ 1985-ప్ర.ము.

14. చంద్రమౌళిశాస్త్రి. నైషధము - శ్రీమద్భాగవత తత్త్వార్థమంజరి. వల్లభాపురము గ్రంథకర్త. 1935.

15. చంద్రమౌళిశాస్త్రి. బెల్లంకొండ. - శృంగారం - పోతన. హైదరాబాదు. ఆంధ్రసారస్వత పరిషత్తు. 1972 - ప్ర. ము.

16. జగన్నాథము, వి. - వేదాంతతత్త్వార్థ దర్పణము. వరంగల్ - వెంకట్రామ అండ్ కో. 1968.

17. తిమ్మన, కూచిమంచి.-లక్షణసారసంగ్రహము. హైదరాబాదు- ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి- 1971 ప్ర. ము.

18. ధర్మారావు, తాపీ. - సాహిత్య మొర్మొరాలు. విజయవాడ - విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్. 1982 - నాల్గవకూర్పు.

19. నరసింహారావు, వి.వి.యల్. - నన్నయ కవిత్వము-అక్షరరమ్యత. చేబ్రోలు. విశ్వర్షి గ్రంథమాల. 1977 - ప్ర. ము.

20. నాగసిద్ధారెడ్డి, డి. - శ్రీమద్భాగవతపురాణ పరిశీలనము. తిరుపతి - తిరుమల తిరుపతి దేవస్థానము. 1980 - ప్ర. ము.

21. నాగేశ్వరరావు, కాశీనాథుని. - ఆంధ్రవాఙ్మయచరిత్ర. మద్రాసు - ఆంధ్ర గ్రంథమాల. 1947.

22. నారాయణరెడ్డి, సి. (వ్యా) - మందారమకరందాలు. సికిందరాబాదు. యువభారతి. 1973 - ప్ర. ము.

23. నిర్వికల్పానందస్వామి. - భారతీయ తత్త్వశాస్త్రము. తెనాలి - సాధనగ్రంథ మండలి. 1960.

24. నిర్వికల్పానందస్వామి - శాండిల్య భక్తిసూత్రములు. వ్యాసాశ్రమము. 1952.

25. పిచ్చయ్యశాస్త్రి, దీపాల. – భాగవతపాఠపరిశోధనము. హైదరాబాదు. ఆంధ్రసారస్వత పరిషత్తు. 1968 - ప్ర. ము.

26. పోతన, బమ్మెర. - శ్రీమహాభాగవతం. రెండుసంపుటములు. హైదరాబాదు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి. 1968 - ద్వి. ము.

27. ,, – శ్రీమదాంధ్రభాగవతము. ద్వి. సం. చెన్నపురి - వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ 1952.

28. ,, - శ్రీమన్మహాభాగవతము. ప్రథమ భాగము. - వేలూరు కుప్పుస్వామి మొదలియారు ప్రచురణ.

29. ,, – శ్రీమదాంధ్రభాగవతము. 1, 2, 3, స్కంధములు. (శేషాద్రిరమణకవుల పీఠికతో). తెనాలి – శ్రీవాణీనికేతనము. 1938.

30. ,, - శ్రీమదాంధ్రభాగవతము దశమస్కంధము (జమ్మలమడక మాధవరామశర్మగారి పీఠికతో). తెనాలి - శ్రీవాణీ నికేతనము. 1938.

31. ప్రభాకరశాస్త్రి, వేటూరి.–మీగడతఱకలు. ముక్త్యాల (కృష్ణా) - మణిమంజరి. 1951 - ప్ర. ము.

32. ప్రసాదరాయ కులపతి. - ఆంధ్రభాగవత విమర్శ. గుంటూరు – గ్రంథకర్త. ప్రి. ము.

33. మల్లికార్జునం, కందుకూరి. (అను) – హిందూమతము. మద్రాసు - శ్రీరామ కృష్ణ మఠము. 1958.

34. యశోదారెడ్డి, పి. (వ్యా)- పోతన కవితాసుధ. హైదరాదాదు - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి. 1983 - ప్ర. ము.

35. ,, (కూర్పరి) - మహాభాగవతకల్పకుసుమమాల. హైదరాబాదు. ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమి. 1982 – ప్ర. ము.

36. రంగనాధాచార్యులు, కె. కె. (సం). - తెలుగు సాహిత్యం మరోచూపు. హైదరాబాదు- ఆంధ్రసారస్వతపరిషత్తు. 1981 – ప్ర. ము.

37. రాజేశ్వరి, సి - ఆంధ్రమున ప్రబంధరూపమునొందిన నాటకములు. బెంగుళూరు-రచయిత. 1981 – ప్ర. ము.

38. రాజేశ్వరశర్మ, అమరేశం. మఱియు సంపత్కుమారాచార్య, కోవెల. (సం). - పోతనభాగవత నీరాజనము (పంచశతి మహోత్సవ సంస్మారిక) తిరుపతి-తిరుమల తిరుపతి దేవస్థానము. 1982.

39. రాధాకృష్ణమూర్తి, పురాణపండ. (సం) – పరమార్థవాణి. (శ్రీమద్భాగవతోద్దేశ్య - మాహాత్మ్యాలు.) రాజమండ్రి. సంపాదకుడు. 1982

40. రామకోటిశాస్త్రి. కె. వి. (సం) - విమర్శిని (పరిశోధన పత్రిక 6&7.) వరంగల్లు-తెలుగు విభాగము, కాకతీయ విశ్వవిద్యాలయము. జనవరి 1981 & 1982.

41. ,, - పోతన్నగారి వైచిత్రి. విజయవాడ- క్వాలిటీ పబ్లిషర్స్. 1981-82.

42. రామమూర్తి, పురాణపండ. (వ్యా) – రాసపంచాధ్యాయి. రాజమండ్రి. పురాణపండ రాధాకృష్ణమూర్తి. 1981–ద్వి. ము.

43. ,, - శ్రీమద్భాగవతము. (దశమస్కంధము, పూర్వోత్తరభాగాలు) రాజమండ్రి-పి. రాధాకృష్ణమూర్తి 1980-ప్ర. ము.

44. రామలింగేశ్వరరావు, తుమ్మలపల్లి. – పోతన్నగారి సహజపాండిత్యము. మదరాసు. వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్. 1969.

45. ,, శ్రీపోతనామాత్యులు. మద్రాసు – శ్రీ శారదా గ్రంథమాల.

46. రామానుజరావు, దేవులపల్లి. - సారస్వత నవనీతము. హైదరాబాదు-ఆంధ్ర సారస్వత పరిషత్తు. 1955 – ప్ర. ము.

47. రామారావు, మారేమండ. – ఆంధ్రదేశ చరిత్ర. మద్రాసు – ది సదరన్ లాంగ్వేజస్ బుక్ ట్రస్ట్. 1959 – ప్రి. ము.

48. లక్ష్మీకాంతము, పింగళి. – ఆంధ్రసాహిత్య చరిత్ర. హైదరాబాదు – ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి. 1976 – ద్వి. ము.

49. లక్ష్మీకాంతశాస్త్రి, శిష్టా. – పోతన భాగవత రచన. విజయవాడ – నిర్మలా పబ్లిషర్సు.

50. లక్ష్మీరంజనం, ఖండవల్లి. – ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము. హైదరాబాదు – వేంకటరమణ పబ్లికేషన్సు. 1974.

51. ,, – ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి కర్నూలు. బాలసరస్వతీ బుక్ డిపో. 1974–చతుర్థ ముద్రణము.

52. లింగన సోమయాజి, రాయప్రోలు (అను). – బృహదారణ్యకోపనిషత్తు. గుంటూరు – అనువాదకుడు. 1955.

53. వరదాచార్యులు, వానమామలై – పోతన చరిత్రము. చెన్నూరు. రచయిత. 1966

54. విశ్వనాథశాస్త్రి. సరిపెల్ల. (అను) – ప్రాక్పశ్చిమ తత్త్వశాస్త్ర చరిత్ర. ప్ర. సం. హైదరాబాదు – ఆంధ్రసారస్వత పరిషత్తు. 1961 – ప్ర. ము.

55. వీరభద్రరావు, ఆర్. – శ్రీరాధాపరతత్త్వము. గుంటూరు – శ్రీబృందావన కృష్ణ సమాజము. 1965.

56. వేంకటనరసయ్య పాకయాజి, కుందుర్తి. – నవవిధ భక్తులు బుద్ధాం (గుంటూరుజిల్లా). శ్రీరామశరణమందిరము.

57. ,, – ప్రేమభక్తి బుద్ధాం (గుంటూరుజిల్లా) – శ్రీరామశరణ మందిరము.

58. ,, భక్తిసాధన. బుద్ధాం (గుంటూరుజిల్లా) – శ్రీరామశరణమందిరము.

59. ,, (అను) – భాగవతకథ. బుద్ధాం. (గుంటూరుజిల్లా) భాగవత కథాగ్రంథమాల.

60. ,, (అను) - రాసేశ్వరునిరాసేచ్ఛ.(రాసలీల).బుద్ధాం (గుంటూరు జిల్లా) -భాగవతకథా గ్రంథమాల. 1969.

61. వేంకటరంగశాస్త్రి, శతఘంటము. - శ్రీమదాంధ్రవచన భాగవతము. చెన్నపురి. వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్. 1911.

62. వేంకటరమణ నటరాజప్రభాకర్, దర్భా. సూర్యనారాయణ, దర్భా. సుబ్బలక్ష్మి, దర్భా. (సంకలనకర్తలు). - శ్రీమద్భాగవత మణిహారము ప్రథమ, ద్వితీయ, సంపుటములు. రాజమహేంద్రవరము- సంకలనకర్తలు. 1981- ప్ర. ము.

63. వేంకటరామనరసింహం, కాకర్ల. - సాహిత్య దర్శనము. విశాఖపట్టణము - కె. హరనాధ్ అండ్ బ్రదర్స్ 1973.

64. వేంకటరామరెడ్డి, దొడ్ల (అను). - నారదభక్తి సూత్రములు. మద్రాసు - శ్రీరామకృష్ణమఠము. 1983 - తృ. ము.

65. వేంకటరావు, నిడుదవోలు - పోతన ఢిల్లీ- నేషనల్‌బుక్ ట్రస్టు ప్రచురణ. 1962

66. వేంకటశివావధానులు, వావిలాల. - శ్రీమద్భాగవతసారము మద్రాసు- వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్. 1918.

67. వేంకటాచార్య, బోయనపల్లి.-శ్రీమద్భాగవత మాహాత్మ్యము నాగర్‌కర్నూలు. వాణీ ప్రచురణ. 1982.

68. వేంకటావధాని, దివాకర్ల-పోతన-న్యూఢిల్లీ-సాహిత్యఅకాడెమీ. 1982. ద్వి ము.

69. ,, - సాహిత్యసోపానములు లక్షణవిభాగము. హైదరాబాదు - ఆంధ్రసారస్వతపరిషత్తు. 1981 - పంచ. ము.

70. వేంకటేశ్వర్లు, పుల్లాభొట్ల. - భక్తకవిపుంగవులు. ఖమ్మం - విజ్ఞానస్రవంతి. 1981 - ప్ర. ము.

71. వేంకటేశ్వర్లు, బులుసు. (అను). - భారతీయతత్త్వశాస్త్రము. కాకినాడ. - బి. వి. అండ్‌సన్స్. 1957 - ద్వి.ము.

72. వేంకటేశ్వర్లు, వారణాసి. - ఆంధ్రసాహిత్యసంగ్రహచరిత్ర. నరసరావుపేట.
- స్టూడెంట్సుఫ్రెండ్సు, 1979 - ద్వి. ము.

73. వేదపల్లి తాయారమ్మ, మాణిక్యం. - తెలుగుసాహిత్యంలోహాస్యరసము.
రాజమండ్రి - ఆద్దేపల్లిఅండ్‌కో. 1968 - ప్ర. ము.

74. వేదవ్యాస, ఇ. - భగవాన్‌వేదవ్యాస. న్యూఢిల్లీ, బెంగళూరు, హైదరాబాదు.
- ది యునైటెడ్‌సోషియల్‌కల్చరల్ అండ్ ఎడ్యుకేషనల్
ఫౌండేషన్ ఆఫ్ ఇండియా 1979 - ప్ర. ము.

75. శేషయ్య,చాగంటి. - ఆంధ్రకవితరంగిణి, ఆఱవసంపుటము. కపిలేశ్వరపురం.
- హిందూధర్మశాస్త్ర గ్రంథనిలయం. 1961 - ద్వి. ము.

76. శేషాద్రిశర్మ, జనమంచి. - శ్రీకృష్ణావతారతత్త్వము. మూడవప్రకరణము.
చెన్నపురి - వావిళ్లరామస్వామిశాస్త్రులు అండ్‌సన్స్. 1926.

77. శ్రీరామమూర్తి, ధూళిపాళ. - శ్రీమద్భాగవతానుశీలనము.నల్గొండ-గ్రంథకర్త

78. శ్రీరామమూర్తికవి, మద్దూరి. - బమ్మెరపోతరాజచరిత్రము, రాజమండ్రి.
- కొండపల్లివీరవెంకయ్య అండ్‌సన్సు. 1953.

79. సంపాదకసమితి. - తెలుగువిజ్ఞానసర్వస్వము. మూడవసంపుటము మద్రాసు.
- తెలుగుభాషాసమితి. 1959.

80. సత్యనారాయణ, విశ్వనాథ. - సాహిత్యసురభి. విజయవాడ -
వి యన్. యన్. అండ్‌కో. 1969.

81. సాహిత్యవేత్తల ఉపన్యాసమంజరి. - వ్యాససాహితీసంహిత. సికిందరాబాదు.
- యువభారతి. 1985- ప్ర. ము.

82. సాహిత్యాచార్యులఉపన్యాసమంజరి. - వికాసలహరి. సికిందరాబాదు -
యువభారతి. 1973 - ప్ర. ము.

83. సింగన, మడికి. - ద్విపదభాగవతము. (దశమస్కంధము). తంజావూరు.
- సరస్వతీమహాల్ గ్రంథాలయనిర్వాహకసంఘము. 1950.

84. సుబ్బారావు, రాయప్రోలు. - రాసపంచాధ్యాయి. సికిందరాబాదు - రచయిత 1975.

85. సుబ్బారావు, వావిలికొలను. - శ్రీకృష్ణలీలామృతము (మధురలీల). అంగలకుదురు. - శ్రీకోదండరామసేవక ధర్మసమాజము. 1954.

86. సుబ్బారావు, వావిలికొలను. - శ్రీకృష్ణావతార తత్త్వము. అంగలకుదురు - శ్రీకోదండరామసేవకధర్మసమాజము. 1954.

87. సుబ్రహ్మణ్యం, జి. వి. - పురాణవాఙ్మయము (వాఙ్మయవాహిని-7) హైదరాబాదు - కళాస్రవంతి. 1974.

88. సుబ్రహ్మణ్యం, జి. వి. - ప్రథమాంధ్రమహాపురాణము. హైదరాబాదు. శ్రీవాణీప్రచురణము. 1973 - ప్ర. ము.

89. ,, - వీరరసము హైదరాబాదు. - రచయిత, 1981. - ప్ర. ము.

90. సుశీల, టి. - ఆంధ్రద్విపదసాహిత్యచరిత్ర. న్యూఢిల్లీ - రచయిత. 1979 - ప్ర. ము

91. సూర్యకాంతమ్మ, విష్ణుభట్ల (వ్యాఖ్యా) - శ్రుతిగీతలు. (వేదస్తుతి). మోదేకుర్రు, - రచయిత్రి. 1960.

92. సూర్యనారాయణశాస్త్రి. ఖండవిల్లి. భక్తపోతనమహాభాగవతరచన. ముంగండ - రచయిత, 1977 - ద్వి ము.

93. సూర్యనారాయణశాస్త్రి. మల్లాది. - సంస్కృతవాఙ్మయచరిత్ర. ప్రథమ సంపుటము. వాల్తేరు. - రచయిత. 1933 - ప్ర ము.

94. ,, - సంస్కృతవాఙ్మయచరిత్ర. ద్వితీయసంపుటము. వాల్తేరు. - రచయిత 1936 - ప్ర. ము.

95. సూర్యనారాయణశాస్త్రి. వెంపరాల. - పోతన. హైదరాబాదు. - ప్రపంచ తెలుగుమహాసభప్రచురణ. 1975 - ప్ర. ము.

96. సోమశేఖరశర్మ, మల్లంపల్లి. - ఆంధ్రదేశచరిత్రసంగ్రహము. హైదరాబాదు. - శ్రీపరమేశ్వరపబ్లికేషన్సు. 1967 - ప్ర ము.

97. హనుమంతరావు, పులిజాల. (సం). - ఆంధ్రమహాభాగవతోపన్యాసములు. హైదరాబాదు - ఆంధ్రసారస్వతపరిషత్తు. 1957-ప్ర. ము.

## సంస్కృత గ్రంథములు :

98. నారాయణతీర్థ. - శ్రీకృష్ణలీలాతరంగిణి. (ఆంధ్రవ్యాఖ్యానముతో). మద్రాసు. - వావిళ్లరామస్వామిశాస్త్రులు అండ్‌సన్స్. 1967.

99. మధుసూదనసరస్వతి. - భక్తిరసాయనమ్. (ఆంధ్రవివృతితో), తెనాలి - సాధనగ్రంథమండలి. 1953.

100 రమేశచంద్రశుక్లః. - ప్రబంధరత్నాకరః. వారాణసి - చౌఖంబావిద్యాభవన్. 1967 ప్ర ము.

101. లీలాశుకయోగిః. - శ్రీకృష్ణకర్ణామృతమ్. కాకినాడ. - ఆంధ్రసాహిత్యపరిషత్. 1965.

102. వీరమిత్రోదయః. - భక్తిప్రకాశమ్. వారాణసి. - చౌఖంబా సంస్కృత పుస్తకాలయ్.

103. వ్యాసమహర్షిః. - బ్రహ్మవైవర్తమహాపురాణమ్. (శ్రీకృష్ణజన్మఖండ పూర్వార్ధమ్.), (ఆంధ్రతాత్పర్యముతో). గుంటూరు. - శివా యింజనీరింగ్‌కంపెనీ. 1980.

104. వ్యాసమహర్షిః. - శ్రీమద్భాగవతమహాపురాణమ్ (మూలమాత్రమ్). గోరఖ్‌పూర్. - గీతాప్రెస్. - దశమసంస్కరణమ్.

105. ,, - శ్రీమద్భాగవతము, దశమస్కంధము. పూర్వభాగము, (చదలువాడజయరామశాస్త్రి విరచిత తత్త్వదర్శినీ వ్యాఖ్యా సమేతము, శ్రీబమ్మెర పోతరాజపద్యానువాదసహితము.) నెల్లూరు. -చదలువాడజయరామశాస్త్రిఅండ్‌సన్స్. 1971. ప్ర. ము

106. ,, -శ్రీమద్భాగవతమ్ (శ్రీధరాచార్యవ్యాఖ్యాసహితమ్). చెన్నపురి - వావిళ్లరామస్వామిశాస్త్రులు అండ్‌సన్స్. 1927.

107. శ్రీకృష్ణమణి, త్రిపాఠీ. -అష్టాదశపురాణపరిచయః (పౌరాణికప్రభాపరిశీలనమ్). వారాణసి. - చౌఖంబా సరస్వతీభవన్. 1980. ప్ర. ము,

హిందీ గ్రంథములు :

108. अखण्डानन्द सरस्वती – भागवत विचार दोहन. बम्बई - सत्साहित्य प्रकाशन ट्रस्ट. 1982 द्वि. सं.

109. अखण्डानन्द सरस्वती - भागवतामृत :· नईदिल्ली - श्री सीताराम भण्डार. 1981.

110. अखण्डानन्द सरस्वती - भागवत दर्शन I & II (श्रीमद्भागवत महापुराण) बम्बई - सत्साहित्य प्रकाशन ट्रस्ट. 1981.

111. अखण्डानन्द सरस्वती - श्रीमद्भागवतरहस्य. बम्बई - सत्साहित्य प्रकाशन ट्रस्ट. 1971.

112. गोविन्ददास 'विनीत' (टीकाकार) - श्रीमद्भागवत - महापुराण (बालबोधिनी भाषा टीका सहित) मथुरा-श्याम काशी प्रेस. प्रथम बार मुद्रण.

113. जय गोयन्दका - भक्तियोग का तत्त्व, गोरखपूर - गीताप्रेस, पाँचवाँ संस्करण.

114. बलदेव उपाध्याय - पुराण-विमर्श. वाराणसी - चौखम्बा विद्याभवन. 1978 – द्वि. सं.

115. बलदेव उपाध्याय - भागवत-सम्प्रदाय, काशी - नागरी प्रचारिणी सभा. प्र. सं.

116. बलदेव उपाध्याय - वैष्णव सम्प्रदायों का साहित्य और सिद्धान्त. वाराणसी - चौखम्बा अमर भारती प्रकाशन. 1978-प्र. सं.

117. बलदेव उपाध्याय - संस्कृत साहित्य का इतिहास. वाराणसी-शारदा निकेतन 1978-दशम संस्करण.

118. रामुलु सिएच - सूर और पोतना के काव्य में भक्ति-तत्व हैदराबाद-दक्षिणांचलीय साहित्य समिति. 1980 - प्र. सं.

119. शान्तनु विहारी द्विवेदी - प्रेमी भक्त उद्धव. गोरखपूर - गीताप्रेस. अट्ठारहवाँ संस्करण.

120. हनुमान प्रसाद प्रोद्धार - श्री राधामाधव चिंतन. गोरखपूर-गीताप्रेस.

121. हनुमान प्रसाद प्रोद्धार - नवधा भक्ति. गोरखपूर - गीताप्रेस

122. हरबंशलाल शर्मा - भागवत दर्शन. अलीगढ़ - भारत प्रकाशन मन्दिर.

ఆంగ్ల గ్రంథములు :

123. Aswani kumar Dath. - Bhakti yoga. Bombay - Bharatiya Bhavan, 1971.

124. Berriedale Keith. A. - A. History of Sanskrit Literature. Delhi - John Brown, 1973. First Edition.

125. Bharat kumar Goswami Sastry. - The Bhakticult in Ancient India - Varanasi - Chowkamba Sanskrit Office, 1965.

126. Bhakti Pragnana Yati Maharaj (Translation) - Srimad Bhagavatarka marichimala - Madras - Gaudiya math, 1978.

127. Bhakti Vedanta Swami Prabhupada A. C. - Srimad Bhagavatam - California - The International Society for Krishna's Consciousness.

128. ,, The Nictor of Devotion. - California - The Bhaktivedanta Book Trust, 1970.

129. Bhakti Vinode, Thakur. - The Bhagavat its philosophy, its Ethics & its Theology. - Calcutta - Sri Gaudiya Math.

130. Ganesh Vasudeo Tagare. - The Bhagavata purana Part IV. Skandha X. - Varanasi - Motilal Banarsidas, 1978; First Edition.

131. Kisori Sarana Tripathi. - A Cultural Study of the Srimad Bhagavata. - Varanasi - B. H. U. Research Publication, 1969.

132. Rukmini, T. S. - A Critical Study of the Bhagavata purana. (with special referencc to Bhakti)- Varanasi - The Chowkhamba Sanskrit Series Office, 1970. First Edition.

133. Satyanarayana, K. - A Study of the history and culture of the Andhras, Vol. I - New Delhi - people's publishing house, 1975.

134. Siddheswara Bhattacharya. - The philosophy of the Srimad Bhagavata, Vol. I. - Calcutta. - Visva Bharati, 1960.

135. ,, The philosophy of the Srimad Bhagavata, Vol. II. - Calcutta - Visva Bharati, 1962.

136. Srinivasa Rao, Susarla. - The Heart of Bhagavatham. Tirupati. - Tirumala Tirupati Devasthanams, 1980.

137. Swami Harshananda Prasaranga. - Sandilya Bhakii Sutra (with Swapneswara Bhashyam with English translation). - Mysore. - University of Mysore, 1976.

138. Swami Tapasyananda. - Bhakti Ratnavali. - Madras. Rama Krishna Math, 1979.

139. Vyasa. N. N. - The Bhagavata Bhakticult. - Delhi. - Nag Publishers, 1977.

## పరిశోధన వ్యాసములు (అముద్రితములు) :

140. రాజేశ్వరి, వి. - పోతనామాత్యుడు - అతనికృతులు. - పిహెచ్.డి. - ఆంధ్ర విశ్వవిద్యాలయము - 1960.

141. లక్ష్మీనారాయణశాస్త్రి, తెలికేపల్లి. - ఆంధ్ర మహాభాగవతము - భక్తితత్త్వ నిరూపణము. - పిహెచ్.డి. - నాగార్జున విశ్వవిద్యాలయము- 1981.

142. रवीन्द्रनाथ राय – हिन्दी भक्ति साहित्य में लोकतत्व – पिएच. डि. – काशी हिन्दू विश्वविद्यालय. 1959.

143. लक्ष्मी शंकर गुप्ता - कृष्णकथा की परम्परा और मध्य कालीन हिन्दी साहित्य में उसका स्वरूप पिएच.डि – काशी हिन्दू विश्व विद्यालय. 1966.

144. सत्यदेव ब्रह्मचारी - श्रीमद्भागवत में अद्वैत वेदान्त और सांख्यदर्शन का तुलनात्मक अध्ययन - पिएच.डि.- काशी हिन्दू विश्व विद्यालय–1979.

145. हौषीलाप्रसाद सिंह – कृष्णभक्ति शाखा में हिन्दी कवयित्रियों का योगदान – पिएच. डि - काशी हिन्दू विश्व विद्यालय-1068.

146. Premlata, Sharma - Studies in Bhakti Based on Sri Rupa-goswami. - ph.D. - Banaras Hindu University - 1954.

147. Ratnavali. B. - A eomparative Study of Mahabharata of pampa and Nannaya - ph.D. - Banaras Hindu University - 1980. (Written in Telugu)

148. Tirupati Rao. Ch. - A comparative Study of Telugu Parijatapaharanamu w:th Kannada Jaga-nnatha Vijaya. - ph.D. - Banglore University - 1973. (Written in Telugu)

వ్యాసములు :

149. అనంతపద్మనాభరావు, రేవూరు. - శ్రీనాథయుగపు సాహిత్యపరిశీలన. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. మాఘ ఫాల్గుణములు, కీలక.

150. ఈశ్వర్‌కుమార్, జోగా. - జానపదసాహిత్యము – శ్రీకృష్ణజననము. సమాలోచన (పక్షపత్రిక) - 1-1-1983.

151. కందర్ప - భక్తితో తరించిన భాగవతోత్తములు - ఆంధ్రప్రభ (ది) - 17-9-1983.

152. కరుణశ్రీ. - వెయ్యేండ్ల తెలుగుతోట - ఆంధ్రప్రభ (వార) - 22-12-1982.

153. గురుప్రసాదరావు, నాగళ్ళ. - ప్రాచీన సాహిత్యము - విమర్శ. – భారతి - మే 1967.

154. చిన్నికృష్ణయ్య, దేవళ్ళ. - గాసిపడిన గాడిలికోడలు – ఆంధ్రప్రభ (వార) 17-3-1982.

155. నరసింగరావు, గాది. - శ్రీకృష్ణుడు - ఆయన సందేశము - భారతి - ఫిబ్రవరి 1926.

156. నరసింహశాస్త్రి, చింతలపల్లి – భారత - భాగవతములు – ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక - జ్యేష్ఠమాసము, రాక్షస.

157. నరసింహారావు, వి. వి యల్. - నన్నయ కవిత్వము - అక్షర రమ్యత - ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక - మాఘ, ఫాల్గున మాసములు, ప్రమోదూత.

158. పురుషోత్తము, జటావల్లభుల. - ఆంధ్రము - అనువాదవాఙ్మయము. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక - మార్గశిర పుష్యమాసములు ఈశ్వర.

159. ప్రభాకర కృష్ణమూర్తి, డి. - మడికి సింగన బమ్మెర పోతనల భాగవత దశమస్కంధములు - ఒక తులనాత్మక పరిశీలన – నవభారతి - నవంబరు 1982.

160. ప్రభాకర కృష్ణమూర్తి, ధూళిపాళ. -పోతన భాగవతములో త్రివేణీసంగమము - తెలుగువాణి - ఫిబ్రవరి 1983.

161. ,, – పోతన భాగవతము నాదసౌందర్యము. - స్రవంతి. - జనవరి 1984.

162. బ్రహ్మయ్యశాస్త్రి, కాశీభట్ట - బమ్మెర పోతరాజ కవిశిరోమణి చారిత్రక విశేషములు - ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. - జ్యేష్ఠాషాఢమాసములు, ప్రమాది.

163. రమాపతిరావు, అక్కిరాజు. - ఆంధ్రుల జీవితాన్ని అల్లుకున్న భాగవతం. - ఆంధ్రప్రభ (వార). - 17-3-82.

164. రాజేశ్వరశర్మ, అమరేశం. - వాగ్గేయకారులకు వెలుగునిచ్చిన సాహిత్య జ్యోతి. - ఆంధ్రప్రభ (వార). - 17-3-82.

165. రామకృష్ణశాస్త్రి, శిష్టా. - ఆంధ్రకావ్యములు - హాస్యరసము - ఆంధ్ర సాహిత్యపరిషత్పత్రిక. - శ్రీజయంతి రామయ్యపంతులుగారి శతవార్షిక జన్మదినోత్సవ స్మారకసంచిక - 18-7-1960

166. రామభద్రచయనులు, యేలూరిపాటి. - పోతన - ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. - మాఘ ఫాల్గుణములు, హేవిలంబి; చైత్ర వైశాఖములు, విలంబి.

167. రామరాజు, బి. - ఓరుగల్లు సాహితీసౌరభాలు - ఆంధ్రప్రభ (వార). - 17-3-1982.

168. లక్ష్మీనరసయ్య, సేపూరి. భాగవత ప్రాశస్త్యము. - ఆంధ్రపత్రిక ఉగాది సంచిక - 1925.

169. విశ్వనాథం, తెన్నేటి. - పురాణములు - భారతి - అక్టోబరు, 1945.

170. ,, - పురాణములు - వాటి పరమార్థము. - భారతి. - నవంబరు 1945.

171. వీరేశలింగంపంతులు, కందుకూరి. - బమ్మెరపోతరాజు. - ఆంధ్రపత్రిక ఉగాది సంచిక. - 1919.

172. వెంకటశివరావు, దిగవల్లి. - శుభాధిక్యం - ఆంధ్రప్రభ (వార). - 17-3-82.

173. వేంకటరావు, నిడుదవోలు. ! పోతన భాగవతము ! ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. - చైత్రవైశాఖములు, విక్రమ.

174. ,, - బ్రౌన్ మెచ్చిన భాగవతం. - ఆంధ్రప్రభ (వార). ! 17-3-82.

175. వేంకటనారాయణరావు, కల్లూరు. - మహాకవి పోతన - ఆంధ్రపత్రిక ఉగాది సంచిక. - 1923.

176. వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి, మద్దులపల్లి. - ఆంధ్రవాఙ్మయ పరిణామము. ఆంధ్రపత్రిక ఉగాది సంచిక - 1925.

177. వేంకటావధాని, దివాకర్ల. - పోతన కవితావైభవం. - ఆంధ్రప్రభ. (ది.) 13-3 1982

178. శరభయ్య, మల్లంపల్లి. - హరివంశము - సంవృతిమాధురి. - భారతి. - ఏప్రిల్ 1959.

179. శివరామ కృష్ణప్రసాద్, చిరుమామిళ్ళ. - వ్యక్తిత్వము. - భారతి. - జనవరి 1955.

180. ,, - శృంగారకవి పోతన. - ప్రజ్ఞ. - సెప్టెంబర్ 1983.

181. శేషాద్రిశర్మ, జనమంచి. - పోతనభక్తి-భాగవత రచన - ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక. - మాఘ ఫాల్గుణములు, ప్రమోదూత.

182. సత్యనారాయణమూర్తి, డి వి - బమ్మెర పోతన. - భారతి. - మార్చి 1933.

183. సత్యసుబ్రహ్మణ్యం, కూచిమంచి. - భాగవతరచనతో పునీతమైన బమ్మెర - ఆంధ్రప్రభ (ది) - 13 మార్చి 1982.

184. సదాశివరావు, పాములపర్తి - దేశ సంస్కృతిని ప్రభావితంచేసిన భాగవత సంప్రదాయం. - ఆంధ్రప్రభ (వార) - 17-3-1982.

185 సుప్రసన్నాచార్య, కోవెల. - పోతన్నది ఏమతం - ఆంధ్రప్రభ (వార) - 17-3-1983.

186. సుబ్బయ్యశాస్త్రి, కాశీభట్ట. - పురాణపఠనావశ్యకత. - ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. - వైశాఖమాసము, పింగళి.

187. సుబ్బరామశాస్త్రి, పైడిపాటి. - పోతన పంచశత జయంతి – ఆంధ్రసచిత్ర వారపత్రిక - 19-3-1982.

188. సుబ్రహ్మణ్యం, జి. వి. - తరతరాల తెలుగుసాహితి. - ఆంధ్రప్రభ (వార) 22-12-1982.

189. సుబ్రహ్మణ్యశాస్త్రి. పెండ్యాల - బమ్మెర పోతన మహాకవి - సర్వజ్ఞసింగ భూపాలుడు - భారతి. - డిసెంబరు 1944.

190. సూర్యరావు, క్రొత్తపల్లి – ఆంధ్రభాగవత కర్తృత్వము - ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. - చైత్రవైశాఖ, జ్యేష్ఠాషాఢములు, సిద్ధార్థి.

191. సేలనయ్య - భాగవతములోని కొన్ని యప్రశస్తములు - భారతి. - జూలై 1925.

192. **वियोगी हरि – पोतन्ना और श्रीमद् आन्ध्र भागवत- पोतन्ना भागवत पंचशति महोत्सव समिति, वरंगल.**

193. Krishna Moorthy, K. - Impact of Bhagavatacult on Indian Aesthetics, - Seminar paper, Potana Bhagavata Panchasati Mahotsava. 16th March 1982.

194. Lakshminarayana Rao, B. - Tikkana Potana and Vemana as exponents of Socio cultural thought. - Teluguvani - November 1982.

195. Mahadevan, T. M. P. - Impact of the Bhagavata cult on the Spiritual life of India - Seminar paper, Potana Bhagavata panchasati Mahotsava.- 15th March '82.

196. Sivarama Murthi, C. - Impact of Bhagavata on the cultural life of India. - Seminar paper. Potana Bhagavata Panchasati Mahotsava- 17th March 1982.

